# సాహితీ రుద్రము

## (స్వీయ చరిత్ర)



తెలుగు విశ్వవిద్యాలయంవారు ఈ గ్రంథ ముద్రణకు
సౌజన్యముతో రు. 5000/- గ్రాంటుగా యిచ్చి
నందులకు కృతజ్ఞతావందనములు



డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

SAHITI RUDRAMA

(Sweeya Charitra)


ప్రథమ ముద్రణ :

ఫిబ్రవరి 1993





ప్రతులు : 1000





మూల్యం : 60-00

ప్రాప్తి స్థానము :

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

విజయలక్ష్మీపురం,

బాపట్ల.

# ఆంధ్ర భాషాయోష కంజలింతు

ఏ భాషనొకమాట హేలగా బల్కిన
    వాణిమంజీర నిక్వాణ మొలయు

ఏ వాణి గీతికా ఋతులంచిత శ్రుతి
    రమనీయమౌ మధుకచ్ఛవియగు

ఏ పల్కు శౌర్యరసేష్టియై, తన మాతృ
    దేవి రక్షణకు నాదేశమొసగు

ఏ కావ్యగీతికా లోకమ్ము, నన్నయ
    త్యాగయ కృతులకు రాగమొసగు

సర్వరసభావ సౌష్ఠవపర్వమగుచు
తెలుగు జనముల పున్నెమై వెలసెనేది
దేశ భాషల లెస్సయౌ భాష యేది ?
అట్టి ఆంధ్రభాషాయోషకంజలింతు.

— ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.

# కావ్యార్పణము

లోకరక్షణ ధర్మమోహన రూపవిభ్రమ తేజసా
యోఽకరోదిహ రాజ్యమాతత రామరాజ్యమనామయమ్
త్రం, పరం, జనరంజకం; ఖలరావణాసురభంజకమ్
జానకీ విభుమాశ్రయే, భువి, రామరాజ్యమనుస్మరన్





శ్రీహయగ్రీవ గుప్తాగారు, శ్రీమతి లక్ష్మీరాజ్యమ్మ దంపతులు
1938లో తీసిన చిత్రం



ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీనుండి
కళాప్రపూర్ణ బిరుదు అందుకుంటున్న శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు

# ముందుమాటలు

తెలిసిన పుస్తకం :-

తెలిసిన పొత్తంబిది
నా జీవితమందున
జరిగిన ఘటనల మొత్తంబిది
కాలమనంతము
ఈ పృథ్వియు బహువిపుల
ఇది యావత్సృష్టి యుదంతము
బుద్బుద ప్రాయము ఆయుర్దాయము
అయినను కలదుకదా
జీవికి వ్యక్తిగత సదుపాయము
అద్భుతమౌ అవకాశము లభించుట మాహాత్మ్యము
బ్రతుకునకొక పద్ధతియున్నది
ఆ నీతిని బ్రతికిన సత్ఫలమున్నది
హింసా దౌర్జన్యములును
కుహనోపాయంబులును
బ్రతుకునకైతే ఒరవడి
బ్రతుకే వ్యర్థంబని నానుడి
ఈశ్వర నిర్దేశమచింత్యము
ఏమైనను విధి ఆదేశము వశ్యకర్తవ్యము
విధి కరుణకు పాత్రత పొందిన
నా బ్రతుకిది ధన్యత పొందెను-
ఈశ్వర కృపకును కృతజ్ఞతాంజలి !
వినమతతో అర్పింతును ధన్యవాదములు !!

ఈ గేయం వ్రాసే సమయంలో, నా జీవితమంతా, నా కండ్లముందు, చిత్రసీమవలె గిర్రున తిరుగుతూ కనిపిస్తూ ఉన్నది.

నిజమే మరి! పన్నెండేండ్ల ప్రాయంలో, అప్పటి నా వర్తమానానికిగానీ, భవిష్యత్తునకు గానీ ఒక పథక రచనకు పూనుకోవాలనే తలంపు కలిగే అవకాశం లేని బాల్యదశ అది !

ఏదో మా కళాశాలలో సరదాగా ప్రసంగిస్తూండేదాన్ని ! అంతేకాని భవిష్యత్తులో నా ప్రసంగాలకు ఒక విలువ వస్తుందని కూడా ఊహించగల వయస్సు కాదది- 12వ ఏడంటే నాకింకా పెండ్లి కాలేదు. ఉభయ భాషాప్రవీణ పరీక్షకు ఇంకా ఓంకారం దిద్దలేదు. ముమ్మరంగా సత్యాగ్రహోద్యమం సాగే సమయమది ! ఎన్ని వేల మంది జనం శ్రోతలుగా ఉన్నా, వారందఱకూ, స్వాతంత్ర్య పోరాటానికి స్ఫూర్తినిస్తూ, హోరెత్తించే ఉపన్యాసాలు కావాలని, అట్లాంటి వక్తలకోసం, వెదకే నాయకులు, అట్లా ఉద్రేకపరచి, ఉత్తేజమిచ్చే ప్రసంగాలకోసం, అఱ్ఱులెత్తి చూస్తూ, యువరక్తాన్ని ఉడుకెత్తించే ఉపన్యాసకులు లభించగానే, చీమ చిటుక్కుమన్నా వినబడే నిశ్శబ్దాన్ని పాటిస్తూ నిద్రాహారాలు మాని, గంటల తరబడి, చెవులు రిక్కించి విని, ఉద్రిక్తులై, బలం పుంజుకొని, బ్రిటిషు వారి దాస్యం నుండి విముక్తి కొఱకై ప్రాణాలర్పించడానికైనా, సిద్ధపడి, బాపూజీ పూరించిన, శంఖారావం, వీనులకు సోకగానే, సత్యాగ్రహ సమరంలోకి ఉరకడానికి ఉరకలు వేసే, శాంతి సమర మహోద్వేగ సమయమది !

నా భాగ్యంకొద్దీ, కవులకూ, కళాకారులకు, ప్రాచీన సంస్కృతీ విలసనానికీ, కాణాచియైన రాజమహేంద్రవర నగరంలో నేను నివసిస్తూండడం వలన ఆనాడు అప్పటి ఆ నగర కాంగ్రెసు నాయకులైన శ్రీ పాలకోడేటి గురుమూర్తిగారు, తదితర పెద్దలు ఎక్కడ వున్నా నన్ను కార్లు పంపి, పిలిపించి, ఆ ఉద్రిక్త వాతావరణంలో, ఆ అసంఖ్యాక జనసాగర సందోహం మధ్య, బల్ల ఎక్కించి, నిలువబెట్టి, 'అమ్మాయి! చెప్పవే' అనేవారు! నాకు ఆ జనసముద్రాన్ని చూస్తూంటే, ఆవేశమూ, ఆనందమూ కల్గి, గళం విప్పి, ప్రసంగిస్తూ, మధ్యమధ్య సత్యాగ్రహం పాటలూ, భక్తి కీర్తనలూ, గొంతెత్తి పాడుతూ ఉపన్యసిస్తూంటే, జనం సంతోషంతో చప్పట్లుకొట్టూ, నినాదాలకు ప్రతిస్పందిస్తూ వినేవారు ! ఒక అరగంట చెప్తే, ఇంకొక అరగంట చెప్పమనేవారు. ఊపిరి సల్పని, సత్యాగ్రహ సమర సంరంభోద్రేక ప్రసంగాలతో నా సేవా జీవితం ప్రారంభమైనది. అప్పటినుండి, అవిశ్రాంతంగా ఆంధ్ర దేశంలో అన్ని రంగాల్లోనూ, ఉపన్యాసాలిస్తూ, వీణాకచేరీలు చేస్తూ గడిపిన జీవితం నాది!

ఈ జీవిత వ్యవసాయ కాలాన్ని సమీపిస్తూలెక్క కడ్తే నా సేవా జీవితానికే వజ్రోత్సవ కాలం దాటింది! ఇన్నేండ్లు ప్రజలతో మమైకంగా కలసిపోయి, ప్రజా సేవా రంగంలో గడపిన నా జీవితం; తెఱచిన పుస్తకం, కాక మఱేమౌతుంది!

తరువాత సాహిత్య ప్రసంగాలకు, మహిళాభ్యుదయ ప్రసంగాలకు ఆధ్యాత్మికోపన్యాసాలకు, ఆంధ్రదేశం అన్ని దిశల నుండీ, ఆహ్వానాలు వచ్చేవి ! ఒక సంస్థలో, ఒక ప్రసంగానికాహ్వానంమీద ఆ ఊరు వెళ్తే, అధమం రెండు రోజులైనా, ఆ ఊళ్ళో నిలిపేసి, కాలేజీల్లో, ఆర్యవైశ్య సంఘాల్లో ఉపన్యాసాలేర్పాటు చేసేవారు! సోదరి తురగా జానకీరాణి అమ్మమ్మగారు, శ్రీమతి దుర్గ్ల వెంకట రమణమ్మగారు, మచిలీపట్టణానికి తమ మహిళాసంఘ వార్షికోత్సవాలకాహ్వానిస్తే, అక్కడ ఇంకొక నాల్గు ఉపన్యాసాలు ఏర్పాటుచేసి, నిలిపేశారు. మా అన్నయ్యా, నేను వీణకచేరీ కూడా చేశాం. అక్కడే సాహిత్యోపన్యాసాలు కాలేజీల్లో ఏర్పాటు చేస్తే, విద్యార్థులు, నా ప్రసంగం జరిగినంతసేపూ, నోట్సు తీసుకొనేవారు ! గంటల తరబడి, నేను ప్రసంగిస్తూ వున్నా, ఆ ప్రదేశమంతా నిండిపోయి, నిలబడి వింటూన్నా, జనం నిశ్శబ్దం పాటించి వినేవారు !

ఆ తర్వాత 1952, 53 సంవత్సరాల్లో ఆంధ్ర కవయిత్రుల రచనతో, రచనారంగ ప్రవేశం కల్గింది. ఈ విధంగా రచనారంగ సేవా జీవితానికి కూడా. స్వర్ణోత్సవ కాలం; ఇది! అని చెప్పవచ్చును.

ఇట్లా నా జీవితం ఆంధ్ర ప్రజానీకం యొక్క సేవకంకితమైపోయినది అప్పట్లో నేను నా సేవను, ధనార్జన సాధనంగా కూడా సాగించలేదు. రైలు ఖర్చు లిస్తే వెళ్ళిపోయేదాన్ని. అంతేకాదు వెళ్ళినచోట ఆ సంస్థ స్వభావాన్నిబట్టి గృహలక్ష్మికో, భారతికో, బాలపత్రికకో ఒక సంవత్సరం చందా ఇచ్చి వచ్చేదాన్ని !

ఇట్లా నేను నిరంతర సేవలతో ఊళ్ళో ఉండకుండా వెళ్ళిపోతూ ఉన్నా శ్రీమా గుప్తగారు ఏమీ అనేవారు కారు! సౌభాగ్యవతి మా పెద్దమ్మాయి సుహాసిని, మా అత్తగారు శ్రీమహాలక్ష్మమ్మగారు, నా దగ్గర చదువుకున్న వర్ధనమ్మ; తరువాత, తరువాత మా పెద్దకోడలు, సౌ ఆదిలక్ష్మి, మా చిన్నమ్మాయి మైథిలీ బాలాజీ ఇంటి పని సర్వమూ దిద్దుకొనేవారు ! అతిథి అభ్యాగతులతో, చీరాల బంధువులతో, మా పొలం పనుల జీతగాళ్ళతో సలహా సంప్రదింపులకు వచ్చే వాళ్ళతో, కార్యక్రమాలకు ఆహ్వానించడానికి వచ్చే వాళ్ళతో, ఇల్లు నిండిపోయి,

కళకళలాడుతూ వుండేది ! అందరికూ టీ, టిఫిన్లూ, భోజన వసతులూ కల్పిస్తూ, నిరంతర గృహ కార్యక్రమంతో ఊపిరి సలిపేదికాదు; తరువాత APPగా మా ఊళ్ళో పనిచేసిన ఒంగోలు వాస్తవ్యులు శ్రీ నల్లమల్లి గోపాలకృష్ణగుప్త గారు, వారి సతీమణి సౌభాగ్యవతి రుక్మిణి, మా స్వజనంవలె ఆదుకొనేవారు రుక్మిణి నాకు చెల్లెలులేని కొఱత తీర్చింది

తరువాత నేను సాహిత్య ఎకాడమీ సభ్యురాలుగా ఉండే సమయంలో, ఉదారులు, నా సేవపై విశేషాదరము కల్గిన సోదరులు, మాన్యులు, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగార్ల ప్రోత్సాహంతో జరిగిన అఖిలభారత రచయిత్రుల సదస్సునకు తోడ్పడిన అప్పటి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు, వారి సతీమణి శ్రీమతి రాఘవమ్మగారు సోదరి నాయని కృష్ణకుమారి, శ్రీమతి భానుమతిగారు, సోదరి కె. రామలక్ష్మిగార్ల సహాయ సహకారాలు మఱువదగినవికావు.

ఈ సదస్సు తర్వాత, సాహిత్య ఎకాడమీకి అనుబంధశాఖగా నేర్పడిన, ప్రతిజిల్లా కేంద్రంలోను, హైదరాబాదులోను సంవత్సర సమావేశాలను, ఎకాడమీ సహాయంతో నేను నిర్వహించినప్పుడు తోడ్పడిన కృష్ణకుమారి, తురగా జానకీ రాణి, వాసిరెడ్డి సీతాదేవి, ఆనందారామం, కె. రామలక్ష్మి, ఎ. లక్ష్మిరమణ, యశోదారెడ్డి, అద్దేపల్లి వివేకానంద, మున్నగు సోదరీమణులయొక్క అత్యంతము విలువయైన సహాయసహకారములు, ఆయా జిల్లాలలోని సభలకు ఆహ్వానసంఘము లుగా ఏర్పడి, సహకరించిన, అద్దేపల్లి వివేకానందదేవి, ఏలూరు శనివారంపేట జమీందారిణి హేమలతాదేవి, తూర్పుగోదావరిజిల్లా కలెక్టరు శ్రీ మాలెకొండయ్య గారు, వారి సతీమణి సుజాతగారు, వరంగల్ యం. యల్. సి., శ్రీమతి కనకమ్మ గారు, గుడివాడ యం. యల్. ఏ. కనకరత్నంగారు, జిల్లాపరిషత్తు ఛైయిర్మను శ్రీ పిన్నమనేని వెంకటేశ్వరరావుగార్ల సహాయము కూడా నాకు మఱువరానిది. అట్లే విజయవాడ సభలకు సహకరించిన శ్రీ మాంటిసోరి కోటేశ్వరమ్మ, శ్రీమతి కె. యల్. యన్. ప్రసాదుగార్ల తరువాత ఆయా సభలకు అధ్యక్షురాండ్రుగా వచ్చిన శ్రీమతి లక్ష్మీరఘురాముగారు, శ్రీమతి శ్రీదేవిగారు, శ్రీమతి దుర్గాబాయమ్మ మొదలైనవారి, తహాయంకూడా మఱువరానిది ఎందరోమహానుభావురాండ్రు అందరకూ వందనములు. ఆ సభలలో ప్రముఖ రచయిత్రి, శ్రీమతి కనుపర్తి వర లక్ష్మమ్మగారికి సన్మానము కూడా చేసినాము.

ఈ విధంగా ఆంధ్రదేశంలో అనేక రంగాల్లో, సేవాకార్యక్రమాల్లో, పాల్గొనడం, మానవజన్మయెత్తినందుకు నావిధియని భావించానేకాని, ఈ సేవల వలన ఏదో ప్రఖ్యాతి వస్తుందని, నేను భావించలేదు. సరికదా ప్రతిఫలం కూడా ఆశించలేదు.

కానీ, 5, 6 సంవత్సరాలనుండి, నా పెద్దకుమార్తె సౌభాగ్యవతి పోతేపల్లి సుహాసిని, నన్ను నా జీవితచరిత్ర వ్రాయమని, కోరుతూ ఉన్నది. అంతేకాక కె. యస్. టి. సాయి. ఇంకా ఆప్తులు, నరసారావుపేట కాలేజీ లెక్చరరు చిట్టిప్రోలు సుబ్బారావు. మున్నగువారు, జీవితచరిత్ర వ్రాస్తేనేకాని, వీలులేదని, నన్ను ప్రోత్సహించడమేకాదు: నాపై ఎంతో ఒత్తిడితెచ్చారు. ఏమైనానరే వ్రాయాలి అనే నిర్ణయానికి వచ్చి, నేను 1991వ సంవత్సరం అక్టోబరులో విజయదశమినాడు వ్రాత మొదలుపెట్టాను. కానీ రచనంటే నాకు ఉండే సహజమైన బద్ధకంవలన, చాలా దినాలు ఈ రచనకై కలం పట్టలేదు. ఎట్లాగైతేనేం 1992 అక్టోబరు దసరాకు పూర్తిచేశాను.

తరువాత సాహితీమిత్రులు, సాహితీమూర్తులు, మాన్యసోదరులు, కవిరాజ హంస, డా. నారాయణరెడ్డిగారి సౌజన్యంతో తెలుగు విశ్వవిద్యాలయం వారి నుండి ముద్రణకు 5,000/ రూ.ల ఆర్థిక సహాయము లభించినది. ఎంతో గొప్ప హృదయముతో, సహాయమందించిన తెలుగు విశ్వవిద్యాలయం, వైస్‌ఛాన్సిలర్ శ్రీ సి. నారాయణరెడ్డిగారికి నా కృతజ్ఞతావందనములు.

ఈ నా స్వీయచరిత్రలేఖనము నందలి సంఘటనలన్నియు, యధార్థములు, ఆరువదేండ్ల చరిత్ర. చరిత్ర వ్రాయవలసి వచ్చుటచే గ్రంధము పెద్దదైపోయినది ముద్రణయందు స్ఖాలిత్యములు ఎక్కువగాదొరలినవి. ఎన్ని సందర్భములయందో నాకు ఎందరో సహాయమొనరించి యున్నారు. వందల సంఖ్యలో సన్మానములు జరిపియున్నారు. అందరనూ పేర్కొనుట. అసాధ్యము. ఎందరో మహానుభావులు అందరకూ వందనములు. ఇక, కొంతభాగము బాపట్లయందు ముద్రించిన శ్రీ ఆర్ కె. ప్రింటర్సు అధినేత శ్రీ వి. గోపాలరావుగారికి ప్రూఫులు దిద్దిన ఆర్ట్సుకాలేజీ తెలుగు లెక్చరరు, శ్రీ సీతారామయ్య యం. ఎ గారికి, విజయవాడ భువనవిజయం పబ్లికేషన్సు అధినేత శ్రీ జి, హరనాథ్‌గారికి, నా ధన్యవాదములు. తమ అభిప్రాయములను వ్రాసి, ఆశీస్సులొసగిన పెద్దలకు కైమోడ్పులు.

ఈ ముందుమాటలను వాసవీస్తవముతో ముగించెదను,

# వాసవీస్తవం

నిత్యంస్స్మరామి హృది• వాసవ కన్యకాంబామ్
జ్ఞానాంబుజాతమహితోదయసత్కటాక్షామ్
త్యాగప్రవర్ధితశుభాత్మకులప్రతిష్ఠామ్
చిత్కుండవహ్నిజనితామ్ జగతస్సవిత్రీమ్॥ 1

మహిశాజనపావనధర్మరతే
హరివర్ణిని, వాసవి, సౌమ్యమతే,
హరసుందరి, భారతి, భవ్యరమే,
విజయీభవ హే పెనుగొండహితే॥ 2

విధివాసవవిష్ణు ముఖాదినుతే
పరమేశ్వరి, శాంభవి, దీప్తగుణే
శ్రితసౌమ్యకృతే, నగరేశి హితే
పరిపాలయ మాం, పరిపూర్ణసుఖే॥ 3

భవమోచని, వైష్ణవి, భావగతే
శివకామిని, ధీలలితే, మహితే
త్రిపురాతిహితే, సులభే, సుఖదే
వరదా భవ దేవి, కృపాపరమే॥ 4

మణినూపురహారకిరీటశుభే
మునిమానసవందితపాదయుగే
నిగమాంతవిహారవిలాసపదే
వరదాభవ దేవి, కృపాపరమే॥ 5

మహిషాసురమర్దని, వాసవి, తే
తళలాత్రవిశేషమహఃకలితే
మురమర్దని, మాధవి, మంగళదే,
విజయోఽస్తు, జయోఽస్తు రమే, విజయే॥ 6

అమలే, కమలే, విమలే, నిఖిలే
గిరిరాట్తనయే, కరిరాడ్గమనే
వరనాదరతే వరతత్త్వహితే
పరిపాలయ మాం, కుసుమాత్మసుతే॥ 7

భవతాపహరాం, [illegible]హరకోపనుదాం
జగదేకనుతాం, ప్రణతార్తిహరాం
రవికోటిసమాంచితకాన్తితనూం
కుసుమాత్మసుతాం గిరిజాం చ భజే॥ 8

మహనీయకృపామహితాభరణాం
దురితాంజనశైలభిదాత్మవిఖం
నిజయోగబలాద్ధృతసర్వధువం
కుసుమాత్మసుతాం భజ రే సుదృఢం 9

జగదాత్మనమీహితరూపగుణే
పరమోన్నతసర్గవిభూతిపరే
భవపంకనిమజ్జనతాపహరే
కృపయా పరిపాలయ మాం లలితే॥ 10

శ్రీ కన్యా పరమేశ్వర్యై నమః

# ఆశీస్సు

సాహిత్య కల్పద్రుదుడు
ప్రముఖ పారిశ్రామికవేత్త
**కె. రాధాకృష్ణయ్య**

కల్లూరు,
అనంతపురంజిల్లా.

హరిః ఓమ్

కళాప్రపూర్ణ డా॥ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారికి నమస్కారములు.

అమ్మా ! సోదరీ, మీరు వాత్సల్యముతో మీ స్వీయచరిత్ర సాహితీరుద్రమ అను పేరుతో ప్రచురించిన గ్రంథమును పంపించినారు. కూలంకషముగా చదివి నాను - అమ్మా నీవు పూర్వజన్మలో అనంతము సుకృతయి చేసి, పొంది జన్మించిన అదృష్టశాలివి - "కృషితో నాస్తి దుర్భిక్షం" అనే సూక్తి ప్రకారముగాను జ్ఞానవాసిష్ఠంలో, వసిష్ఠుడు, విశ్వామిత్రునితో తనకు గల్గిన అనుభవముల వలన, పురుష ప్రయత్నముతో పొందరానిది ఉండదు గదా అని, నిరూపించినాడు. ఈ రెండు ఉదాహరణముల ప్రకారం, మీరు మీ జీవితములో చేసిన సేవ, జరిపిన పోరాటముల వలన గొప్ప ఖ్యాతి, చెదరకుండా సాధించి ఈనాటి వరకు నిలుపు కొన్నారు.

మీ జీవితగాథ ప్రారంభమునుంచి, మెల్ల మెల్లగా, ఉచ్ఛదశలోనికిపోతూ, తిరుగులేని విధముగా వృద్ధిచెందుట సంభవించినది.

మన ఆర్యవైశ్యకులమునకు ఖ్యాతి తెచ్చిన మహామనిషీ, నీవు పొందిన సన్మానములు గనుక చూస్తే, మనవాళ్లు, ఇంకా మీకు చేయదగినంత, గౌరవము, సన్మానము చేయలేదనే అంశం ధ్రువపడుతుంది - ఆం. ప్ర. ఆర్యవైశ్య మహాసభ శ్రీ రోశయ్యగారి ఆధ్వర్యములో 1974 నుండి స్థిరపడుట ప్రారంభించినా, మిమ్ములను గుర్తించలేదు. మీ ఆధ్వర్యమున మిమ్ములను నమ్మి, మహిళా విభాగము ఉన్నతిచెంది, చక్కగా మెరుగులు దిద్దుకొని, రాష్ట్రమంతా వ్యాపించ వలసి ఉండెను. కాని ఆ అవకాశమును జారవిడుచుకొన్నారు.

ఇదంతా ఈశ్వరేచ్ఛ. ఏది ఏ భాగ్యవంతులు జరుపవలెనని ఉన్నదో. అది జరుగుచుండును. కానీ జరిగినదానికి తృప్తిపడి, అతనికి కృతజ్ఞతలను అందించి, జీవితానందమును పొందడమే మీ భాగ్యమని భావించవలయును.

మీ జీవితౌన్నత్య గాథలో నేను ఒక సమిధగా పాత్ర కలిగి ఉండడం నా అదృష్టం అని, నా భాగ్యమని భావిస్తూ ఉన్నాను.

సోదరుడు
**కె. రాధాకృష్ణయ్య**

# కళాప్రపూర్ణ లక్ష్మీకాంతమ్మ

డా. బెజవాడ గోపాలరెడ్డి
ఆం. ప్ర. సాహిత్య అకాడమీ అధ్యక్షులు,
నెల్లూరు

లక్ష్మీకాంతమ్మ ఉభయ భాషా ప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణ, ఎం. ఏ. చదువలేదు, పి. హెచ్‌డి. చేయలేదు, అధ్యాపక వృత్తిని చేపట్టలేదు. అయినా తనదగు స్థానాన్ని సాహిత్యరంగంలో, ముఖ్యంగా ఉపన్యాస ప్రక్రియలో సంపాదించుకొన్నారు. కొండంత ఆత్మ విశ్వాసం, గోదావరంత వాక్చాతుర్యం ఆమెకు ఆ స్థానాన్ని సంపాదించిపెట్టాయి. విద్యార్థిలోకంలో, కాలేజీలలో, యూనివర్సిటీలలో ఎన్నెన్ని ఆహ్వానాలు! ఎన్ని స్వాగతాలు! నాకు తెల్సినంతవరకు ఆమెది అద్వితీయమైన స్థానం. ఎవరు అధిగమించలేదు, అనుసరించలేదు, అట్టి సుస్థిర స్థానాన్ని ఆమె సంపాదించుకొన్నది, నిలబెట్టుకొనకల్గినది.

మోతేవారు మాతామహులు, నాళంవారు పితామహులు. ఊటుకూరి వారు భర్త వంశమువారు. ఈవంశాల ప్రభావము ఆమె పెట్టుబడి. అదే ఆమెకు అండ. ఉపన్యాసాలలో ప్రచండయై, రుద్రయై, సాహితీరుద్రమగా ప్రస్ఫుటించినది.

గోదావరి పాండిత్యము, కృష్ణా నిర్మలత్వము, ఆమెకు అబ్బినవి. గుంటూరు పట్టుదల, ఆవేశము, ఆమెకు ఉత్సాహాన్ని ఇచ్చాయి. ఎన్నో పవనాలు ఆమె జీవనవనములో వీచాయి. ఆ పవనాలలో పూచిన పుండరీకమే లక్ష్మీకాంతమ్మ. ప్రభావాల సమ్మేళనమే ఈ సాహితీ త్రివేణి.

నాళం కృష్ణారావు తనయ. రాజమండ్రిలో గొప్పవ్యక్తి. గౌతమీ గ్రంథాలయ స్థాపకులు, వీరేశలింగం అనుచరుడైన బ్రహ్మమతావలంబి, ఆధునికతా నవీనతా సమీరాలలో తేలినవాడు. చిన్నతనాల పెళ్లిళ్ళ ఫలితము కాబోలు తండ్రి ఆధునికత ఈమెకు అబ్బలేదు. సనాతనము మీద మోజు. ఆంధ్రమాతాభిమానమే మెండు. విశ్వధర్మముకన్న విశ్వహిందూ పరిషత్తు ఆమెను వశము చేసికొన్నది. సనాతన వ్యసనాలే కప్పివేసాయి. ఆధునికతా ప్రమాణాలలోనే విదేశ విహారాలలోనే, మహిళాభ్యుదయమే ఆమె అభిమానరంగం. విజ్ఞానముకన్న సాహిత్య సంగీతములే ఆమె అభిమాన వేదికలు. కలియుగమునకన్న కృత, త్రేతా, ద్వాపరయుగాలే అభిమాన యుగాలు. సమకాలీన ఉద్దేశ్యాల దర్పణము. నేడులకన్న నిన్నలే ఆమె కన్న కలలు.

నేను చెప్పినది కొంత అప్రస్తుతమైనా ఆమె స్థానమును కదల్పలేదు. మరుగున పడిన ఆంధ్ర కవయిత్రులను వెలుగులోనికి తెచ్చింది. అక్షర నీరాజనములు అర్పించింది. చెరుకువాడ వేంకట నరసింహం, కల్లూరి సుబ్బారావు, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, జమ్మలమడక మాధవరాయశర్మ ఆంధ్ర భాషలో మంచి వక్తలని నా తలంపు. మహిళలలో అగ్రస్థానము ఊటుకూరి వారిదేనని నా భావన.

రోటరీ ఆహ్వానమున లక్ష్మీ కాంతమ్మ నెల్లూరు వచ్చినపుడు నేను తొలిసారిగా విన్నాను. ఆనందముతోనే ఉపన్యాసాన్ని విన్నాను. వైశ్య దేవాలయంలో కూర్చొని ఇష్టా గోష్ఠిగ రామాయణాన్ని గూర్చి మాట్లాడింది ఆశ్చర్యంతోనే విన్నాను. తర్వాత "ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి"లో చాలా కాలము పని చేశాము. రచయిత్రుల సంఘాన్ని ఏర్పాటు చేశాము. ఆమె ప్రేరణతోనే అఖిల భారత రచయిత్రుల సమావేశాలు జరిపాము. 'లీలావతీమున్షీ' అధ్యక్షతన, విజయలక్ష్మి పండిట్ ప్రారంభకులు. నేను ఉత్తరప్రదేశ్‌లో ఉండగా ఆమె లక్నో రావడం మేమంతా అయోధ్య వెళ్లడం, సరయూనదిస్నానము, రామాలయాల సందర్శనము జరిగింది.

'మగువ మాంచాల' పద్య కావ్యాన్ని నాకు అంకిత మిచ్చినది. నేను చాలా కాలముగ ఆదరాభిమానములతో చూస్తున్నాను. డా॥ ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ కళాప్రపూర్ణ తన జీవితం కథను వ్రాసి 'సాహితీ రుద్రమ' అని యొసగిన బిరుదు పతాకముతో వ్రాసి వెలువరించినందులకు చాల సంతోషము.

ఆమె సాహిత్య సేవలు, అక్షర జైత్రయాత్రలు. మన స్మృతి పథమున చిరంతనము గుబాళించుగాక ! ఆమెకు ఇదే నా కర్పూరహారతి.

9-5-93
నెల్లూరు.

బెజవాడ గోపాలరెడ్డి
శాంతినికేతన్, నెల్లూరు - 3.

# సంగీత విదుషీమణి - సాహితీ రుద్రమ

-డాక్టరు ఆరుద్ర
మద్రాసు

వైదూష్యంలోనూ, వ్యక్తిత్వంలోను - వైశిష్ట్యం విలక్షణత్వంకల సోదరి లక్ష్మీకాంతమ్మగారు తొమ్మిది మండువా లోగిలిగల నాళంవారి ఆడబడుచు. ఏలూరు లోని జమీందార్లు మోతేవారి దౌహిత్రి. చీరాలలో పేరు ప్రతిష్ఠలున్న ఊటుకూరు వారి కోడలు. ఒక తరం ఆంధ్ర రచయిత్రులందరికీ ఇష్టమైన 'అత్తగారు'.

సంస్కృతాంధ్ర భాషలలోనేకాక, సంగీత సాహిత్యాలలో ప్రవీణురాలు ఈమెకు తెలియని, ఈమెను తెలియని ఆంధ్ర రచయిత్రి ఎవరయినా ఉంటే-ఆమె దేశానికి తెలియని రచయిత్రి అని చెప్తే తప్పు లేదు. ఇటువంటి విదూషీమణి తన స్వీయ చరిత్రను రచించడం సంతోషించతగ్గ విషయం.

ఏడేళ్ళ వయస్సులో ఎవరూ నేర్పకుండానే ఏడు రోజుల వినికిడివల్ల పచ్చి మిరియం ఆదిమప్పగారి సుప్రసిద్ధమేకాక కష్టతరమైన భైరవి. అట తాళవర్ణం. విరిభోణి, సుస్వరంగా కాంప్లై కాలాలలో సునాయాసంగా గానం చేయకల్గిన ఈ సంగీత విద్రుమ. ఉత్తరోత్తంగా సాహితీ రుద్రమగా ఓరుదు పొందడంలో ఆశ్చర్యంలేదు. ఈమె మధుర కవి శ్రీనాళం కృష్ణారావుగారి కుమార్తె పెరిగినది సాహిత్య వాతావరణంలో. చదివింది ఉభయ భాషాప్రవీణ విద్య-అందులో సర్వ ప్రథమురాలిగా నెగ్గడం, దేశసేవ సంఘసేవలతో పాటు కర్రసాము, కత్తిసాము ఎంబ్రాయిడరీ కుట్టుపని, గోదావరిలో ఈత, ఆడపిల్లల జడ పట్టుకులాగే కుర్ర వాళ్ళను చెప్పుతీసి తన్నబోవడం ఏలూరులో గుర్రపు స్వారి, మగపిల్లలతో సమంగా కోతి కొమ్మచ్చులాడడం. చలికాలంలో సహితంతెల్లవారుజామున వీణపై గంటసేపు పై స్థాయిలో సాధన, సత్యాగ్రహోద్యమంలో పోలీసులను పాటలతో ఏడిపించడం. గాంధీజీ సమక్షంలో ఆయన హరిజన నిధికి బంగారు నగలు కుప్పలు పోగుచేయడం అందుకు బాపూజీ భుజం తట్టగా ఆయన చేతివ్రేళ్ళ స్పర్శను యిప్పటికీ మరువలేకపోవడం....ఒకటేమిటి! ఎన్నెన్నో విషయాలు ఈ స్వీయ చరిత్రలో వున్నాయి.

# సంగీత విద్రుమం - సాహితీ రుద్రమం

–డాక్టరు ఆరుద్ర
మద్రాసు

వైదూష్యంలోనూ, వ్యక్తిత్వంలోను – వైశిష్ట్యం విలక్షణత్వంకల సోదరి లక్ష్మీకాంతమ్మగారు తొమ్మిది మండువా లోగిలిగల నాళంవారి ఆడబడుచు. ఏలూరు లోని జమీందార్లు మోతేవారి దౌహిత్రి. చీరాలలో పేరు ప్రతిష్ఠలున్న ఊటుకూరు వారి కోడలు. ఒక తరం ఆంధ్ర రచయిత్రులందరికీ ఇష్టమైన 'అత్తగారు'.

సంస్కృతాంధ్ర భాషలలోనేకాక, సంగీత సాహిత్యాలలో ప్రవీణురాలు ఈమెకు తెలియని, ఈమెను తెలియని ఆంధ్ర రచయిత్రి ఎవరయినా ఉంటే–ఆమె దేశానికి తెలియని రచయిత్రి అని చెప్తే తప్పు లేదు. ఇటువంటి విదూషీమణి తన స్వీయ చరిత్రను రచించడం సంతోషించతగ్గ విషయం.

ఏడేళ్ళ వయస్సులో ఎవరూ నేర్పకుండానే ఏడు రోజుల వినికిడివల్ల వచ్చి మిరియం ఆదిమప్పగారి సుప్రసిద్ధమేకాక కష్టతరమైన భైరవి. అట తాళవర్ణం, విరిభోణి, సుస్వరంగా కాంపై కాలాలలో సునాయాసంగా గానం చేయకల్గిన ఈ సంగీత విద్రుమ. ఉత్తరోత్తంగా సాహితీ రుద్రమగా ఓరుదు పొందడంలో ఆశ్చర్యంలేదు. ఈమె మధుర కవి శ్రీనాళం కృష్ణారావుగారి కుమార్తె పెరిగినది సాహిత్య వాతావరణంలో. చదివింది ఉభయ భాషాప్రవీణ విద్య–అందులో సర్వ ప్రధమురాలిగా నెగ్గడం, దేశసేవ సంఘసేవలతో పాటు కర్రసాము, కత్తిసాము ఎంబ్రయిడరీ కుట్టుపని, గోదావరిలో ఈత, ఆడపిల్లల జడ పట్టుకులాగే కుర్ర వాళ్ళను చెప్పుతీసి తన్నబోవడం ఏలూరులో గుర్రపు స్వారి, మగపిల్లలతో సమంగా కోతి కొమ్మచ్చులాడడం. చలికాలంలో సహితంతెల్లవారుజామున వీణపై గంటసేపు పై స్థాయిలో సాధన, సత్యాగ్రహోద్యమంలో పోలీసులను పాటలతో ఏడిపించడం. గాంధీజీ సమక్షంలో ఆయన హరిజన నిధికి బంగారు నగలు కుప్పలు పోగుచేయడం అందుకు బాపూజీ భుజం తట్టగా ఆయన చేతివ్రేళ్ళ స్పర్శను యిప్పటికీ మరువలేకపోవడం....ఒకటేమిటి! ఎన్నెన్నో విషయాలు ఈ స్వీయ చరిత్రలో వున్నాయి.

పెళ్ళి కాగానే చదువుమానిపించమని తోడపుట్టిన పడుచులు ఎంత పోరినా భార్య విద్యకు అంతరాయం కల్గించక, పరీక్షల సమయానికి ఆమె మూడు నెలల గర్భవతిగా వున్నా, ధైర్యంగా రాయమని ప్రోత్సహించి పంపిన శ్రీహయగ్రీవ గుప్తగారు భర్తగా లభించడం లక్ష్మీకాంతమ్మగారి అదృష్టం. బాపట్లలో భార్యా భర్త ఇద్దరే పాపతో కాపురం పెట్టినప్పుడు, చిన్నతనంలో ఎన్నో నేర్చుకున్నా వంట నేర్చుకోనని లక్ష్మీకాంతమ్మగారు మొదట చెరగడం, విసరడం, దంచడం అనే పనులు చేయవలసి వచ్చినప్పుడు ఎంతో అవస్థపడ్డ అవి గృహకృత్యాలుగానే కాక సాహితీ శిల్పాలుగాకూడా నేర్చుకొన్నారు. అన్య సిద్ధాంతాలను చెరగండ ఛలోక్తులు విసరడం ప్రతిపక్షాల పిడివాదాన్ని దంచడం ఆమెకు కొట్టిన పిండి.

'నా జీవితమే ఒక తెరచిన పుస్తకం, ఈ తెరచిన పుస్తకంలో ఏ పుట తెరచి నవలోడకం చేసినా ఏదో ఒక అంశం ప్రత్యక్షం అవుతూనే వుంటుంది' అని ఒక పుటలో రాస్తూ ఇందులో అతిశయోక్తి కాదన్నారు. అవును. ఇది స్వభావోక్తి. ఈమెవల్ల బొడ్డుపల్లి పురుషోత్తం, భద్రాజు కృష్ణమూర్తిగారు ప్రభావితులయ్యారట. ఈమె వీణ వాయిస్తూ పాడితే పిలకా గణపతి శాస్త్రిగారు పరవశులై వీధిలో నిలబడి పోయారట. ఈమెకు 'సాహితీ రుద్రమ' బిరుదు దేవులపల్లి రామానుజరావుగారు ఇచ్చారట. ఎన్నెన్ని కొత్త సంగతులు-ఎన్నెన్ని విశేషాలు ఇప్పటివారికి యిందులో కొన్ని కొన్ని తెలిసినవే. రేపటివారికి అన్నీ తెలియాలనే ఈ స్వీయచరిత్ర రచన చేయడం జరిగింది.

చిన్నప్పుడే జాతీయోద్యమంలో పనిచేసిన ఈమె పంచములకు దేవాలయ ప్రవేశం కలగక పూర్వమే తన నామధేయంలో వర్గ పంచమ ప్రవేశాన్ని కలిగించారు. అందుకే మనమంతా "లక్ష్మీకాంతమ్మ" అని రాస్తే తను మాత్రం "లక్ష్మీకాన్తమ్మ" అని రాసుకుంటారు. ఇది గమనించదగ్గ విషయం.

మరొక సంగతికూడా చెప్పాలి. నేను రాసిన కూనలమ్మ పదాలు దేశంలో ప్రచారం పొందాయి. అనుకరించారు. లక్ష్మీకాంతమ్మగారుకూడా "ఓ కన్యకమ్మ" అనే మకుటంతో వ్యంగ్య పదాలు రచించారు. ఆ కూనలమ్మ పదాల ప్రభావం ఈ

పలుకాలమ్మమీద పడిందంటే సమకాలీన సాహిత్య ప్రక్రియల కీమె ఎలా స్పందిస్తారో విశదం అవుతుంది. ఎన్నో సత్కారాలను పొంది, యింకా పొందుతున్న లక్ష్మీకాంతమ్మగారు ఇలా నన్ను సత్కరించడం ఒక విశేషం.

ఈమె అమ్మమ్మగారు రోజూ వేడిఅన్నంపై బంగారు రేకులు వేసి కమ్మని నెయ్యివేసి దగ్గిరుండి తమచేతితో ఈమెకు తినిపించేవారట. రాత్రి కుంకుమపువ్వు పచ్చ కర్పూరం జీడి పలుకులతో వేడిపాలు స్వయంగా తాగించేవారట. ఆరాబులు తన స్వీయచరిత్రతో లక్ష్మీకాంతమ్మగారు పాఠకులకు రుచి చూపిస్తూ ఈ శతాబ్దపు తొలి దశకాలలో సంగీత సాహిత్యాభి రుచులతో జాతీయోద్యమపు చైతన్యంగల ఉన్నత వర్గాల లోగిళ్ళలో ఆడపిల్లలు ఎలా పెరిగి పెద్దవారై దేశసేవకు, సంఘసేవకు సాహితీసేవకు అంకితమయ్యారో విశదంచేస్తున్నాయి. ఈ చరిత్ర కాంశాలు రికార్డు చేయతగ్గవి. చేసినవారికి అవార్డు యివ్వవలసినదే.

ఈ సంగీత విద్రుమకు—సాహితీ రుద్రమకు నా అభినందనలు.

—ఆరుద్ర

త్యాగరాజనగరు
మద్రాసు
11-6-93

# ఓజో మూర్తి


జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్ కార్యాలయం : 242082

**డా॥ సి. నారాయణరెడ్డి** గృహం : 248451

ఎం.ఏ. పి.హెచ్.డి. డి.లిట్ కళాభవన్ హైదరాబాద్–500 004

రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక భాషావ్యవహారాల సలహాదారు


రణ పౌరుషానికీ–రాజ్యపాలన పాటవానికీ కాకతీయ రుద్రమాంబ గణుతికెక్కింది. పాండిత్య వీరానికీ– ప్రచండ వక్తృత్వ ప్రావీణ్యానికీ డా॥ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ కోటికెక్కింది ఆంధ్రవాఙ్మయరంగంలోచిరకాలంగాఓజో మూర్తిగా వెలుగొందుతున్న రచయిత్రి ఆమె.

మధురకవి నాళం కృష్ణారావుగారి పుత్రికగా సంక్రమించుకున్న కవిత్వ వారసత్వంతో–సమకాలీన ప్రముఖ కవి పండితుల సాహచర్యంతో పండించుకున్న వ్యుత్పత్తి సంభారంతో లక్ష్మీకాంతమ్మగారు తెలుగుభారతికి తులలేని ఆభరణాలు సమకూర్చారు. ఆమె వ్యక్తిత్వ సాహిత్యాలకు పట్టిక నిలువెత్తు అద్దం ఈ ఆత్మ చరిత్ర. సారస్వత రంగంలోనేగాక సంస్కరణాత్మక సాంఘిక రంగాల్లోఆమె వహించిన విశిష్ట భూమిక ఎంతో ఉజ్వలంగా అగుపిస్తుంది ఈ గ్రంథంలో.

పరమ రమణీయ శైలిలో సాగిన చక్కని గ్రంథం రచించిన డా॥ లక్ష్మీకాంతమ్మగారికి నా అభినందన.

# జీవిత చరితార్థం

డా॥ ఐ. పాండురంగారావు
ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్
భారతీయ జ్ఞానపీఠ్
18 ఇన్‌స్టిట్యూషనల్ ఏరియా
లోడి రోడ్ న్యూఢిల్లీ-3
ఫోన్ ; 698417 4626467

ప్రపంచంలోని ప్రతి జీవి జీవితం పారమార్థిక దృష్టితో చూస్తే ఒక రస వత్తరమైన కావ్యం. జీవితంలోని ప్రతిఘటన సాత్విక శివనాట్యంలో ఒకస్పందన. పంచేంద్రియాలకు గోచరించేది కేవలం ప్రపంచం. ఇంద్రియాతీతమయిన అంత రంగ వైభవాన్ని ఆత్మదృష్టితో చూస్తే అంతా ఆత్మీయంగా గోచరిస్తుంది. ఆ రంగంలో రంగులులేవు, శోక మోహాలకు తావులేదు. అహంకారానికిఆస్కారం లేదు. తావాభావ విభావభావనలతో ఆ భావనారాయణమూర్తికి సంబంధంలేదు. ఆ బ్రాహ్మీస్థితిని చేరుకుని తనను తాను తానుగాని తనువుతో తనివిదీర తిలకిస్తే జీవిత చరితార్థం బోధపడుతుంది. తాను చేసింది-చూచింది-సాధించింది- శోధించింది కేవలం నామరూపాలకు మాత్రమే పరిమితమయిందనే పరమార్థం భాసిస్తుంది. ఈ "భాతి"ని తన "అనుభూతి"గా మలచుకొని దానిలో చేరిపోవటమే జీవితపరమావధి. అదే కావ్య దృష్టికి రసశేవధిగా కనిపిస్తుంది.

సాహితీ రుద్రమ, సారస్వత స్వరూపిణి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మగారు ఈ రచనలో సాధించిన సాఫల్యం ఇదే. వాగ్దేవత వాత్సల్యం ఆమెకు పరిపూర్ణంగా లభించాలని కాంక్షిస్తూ-

ఇలపావులూరి పాండురంగారావు.

# కర్షక సాహిత్య పరిషత్

అధ్యక్షులు :　　　　　　　　　　　　చంద్రమౌళినగర్

దరువూరి వీరయ్య　　　　　　　　　గుంటూరు–522 007

ప్రముఖ రచయిత, కవి, పండితురాలు డాక్టర్ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారి స్వీయ చరిత్ర "సాహితీరుద్రము" నిన్ననే నా చేతికందింది. ఈ గ్రంథం ముద్రణకు ఆయమ్మ ఎంతగా శ్రమించిందో నాకు తెలుసు.

102 శీర్షికలు–200 పైగానే పేజీలు యాభయ్యేళ్ళ సుదీర్ఘ సాహిత్యోద్యమ చరిత్ర, రాజకీయాలు, సాంఘిక, సామాజిక, సేవాకార్యక్రమాలు, వేదాంత చర్చలు. వేలసంఖ్యతోనే ప్రసంగాలు, చర్చలు గోష్ఠులు, ఎందరెందరితోనో పరిచయాలు సంక్షిప్తంగానే అయినా వివరంగా మనముందించిదాయమ్మ.

కేంద్ర, సాహిత్య పరిషత్తులు, ఆంధ్రమహిళా రచయితల సంఘాలు, సభలు, గ్రంధరచనలు, ముద్రణలు–ఇవన్నీ ఒక ఎత్తుకాగా ఆంధ్ర నాలుగు చెరగులా విస్తృతంగా ఆమె సాగించిన సాహితి సభలు. అన్నింటిని సమగ్రంగానే మనముందుంచారామె. యాభయ్యేళ్ళ సుదీర్ఘ సాహితి యాత్రతో ఆమెకు తోడయిన ఆమెతో కలసి పనిచేసిన శందలాదిమంది కవులను, కవయిత్రులను కూడా ఆంధ్రులకు పరిచయం చేశారామె.

ఇంతటి బృహద్గ్రంథాన్ని. ఇంత త్వరలో చదవడం సాధ్యమా! అనుకుంటూనే–అయినా ప్రయత్నించి చూద్దామని–ప్రారంభించాను. ఇటీవల కాలంలో 200 పేజీల గ్రంథాన్ని ఏకబిగిన చదవడం అలవాటు తప్పింది. వయోభారం కూడా కారణం. మొదలు పెట్టినా, పుస్తకం మడతపెట్టి విశ్రాంతి పోకుండా వందపేజీలు చదివా–మరల నేటి తెల్లవారుజామున 4 గంటలకు ప్రారంభించి, పది గంటలకు పూర్తిచేశా. నా అనుభవంతో ఆసక్తితో, విసుగు కలగకుండా చదవడమే, చదివించినదే ఉత్తమ గ్రంథంగా భావన.

సోదరి శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ దశాబ్దంగా శ్రమించి యీ గ్రంధాన్ని ఆంధ్రుల కందించడం–అదృష్టంగా భావిస్తున్నాను. ఇందు ఆంధ్ర సాహిత్యోద్యమ చరిత్ర మనకందించినందుకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

సోదరుడు

దరువూరి వీరయ్య

స్వాతంత్ర్య సమరయోధుడు

# నా పలుకులు

సేవా వాచస్పతి
డా॥ ఎస్. వి. చలపతిరావు

మనిషి వ్యక్తిత్వాన్ని ప్రభావితంచేసే అనేక అంశాలలో స్వీయ చరిత్రలు కూడా ఒకటి. మహనీయుల ఆదర్శాలు - వారి జీవనవిధానాలు - చిన్ననాటి నుండి వన్నెకెక్కే రీతిలో వారు సాధించిన విజయాలు ఇవన్నీ పాఠకుడిని ప్రభావితం జేసి అతని మనస్సులో ఒక స్పందనను కలిగిస్తాయి. అలా స్పందింపజేస్తూ సమకాలీన సమాజానికి ముఖ్యంగా యువతరానికి చక్కటి స్ఫూర్తిని అందించే గ్రంధమే కనకాభిషిక్త - కళాప్రపూర్ణ - సోదరి డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి జీవిత చరిత్ర "సాహితీ రుద్రమ" ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రంగా చదివినప్పుడు డా॥ లక్ష్మీకాన్తమ్మగారు అతిచిన్నవయస్సునుండే ఎంతటి ప్రతిభను ప్రదర్శించారో - ఎంతటి సాహసోపేతమైన కార్యక్రమాలకు అడుగుముందుకు వేశారో - శ్రోతలను ఉర్రూతలూగించే ఉపన్యాస ధోరణితో - ఆంధ్రదేశంలో ఎంతటి మహిళా చైతన్యాన్ని - ఆవిష్కరింపజేసారో మనకు స్పష్టంగా అవగతమౌతుంది.

రచయిత్రిగా-కవయిత్రిగా-వక్తగా కేవలం తెలుగునాటనేగాక యావద్భారత దేశంలోనే ఒక విలక్షణమైన స్థానాన్ని సముపార్జించుకొన్న లక్ష్మీకాన్తమ్మగారి జీవితచరిత్ర నేటి విద్యార్ధినీ విద్యార్థులకు సాహితీ రంగంలో కృషిజేస్తున్నయువతీ యువకులకు చక్కని మార్గదర్శకత్వం వహిస్తుందనడంలో అతిశయోక్తిలేదు. "పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది" అనే నానుడి డా॥లక్ష్మీకాన్తమ్మగారి విషయంలో అక్షరసత్యంగా గోచరిస్తుంది. పది, పన్నెండు సంవత్సరాల వయస్సు నుండే చెళ్ళపిళ్ళ వేంకటకవి శ్రీపాదకృష్ణమూర్తి-ఆదిభట్ల నారాయణదాసు, హరీంద్ర నాధఛటోపాధ్యాయవంటి దిగ్గంతుల సన్నిధిలో ఆమె ప్రకటించిన ప్రతిభ సాహితీ రుద్రమ యశోవిశేషానికి చక్కటి నిదర్శనం. సంగీతంలోను - సంఘసంస్కరణ కార్యక్రమాలలోను ప్రత్యేకించి మహిళాభ్యుదయ కార్యక్రమాలలోను ఆమె నిర్వహించిన పాత్రకు సంబంధించిన సంఘటనలు పాఠకులకు ఎంతో ఉత్తేజాన్ని కలిగిస్తాయి.

ఈ స్వీయ చరిత్రలో కేవలం సాహిత్యానికి సంబంధించిన విశేషాలనే కాకుండా గృహిణిగా తాను నిర్వహించినా పాత్రను గురించికూడా ప్రస్తావించడం జరిగింది. ఇది మహిళలకు ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంది. తల్లిగా తన పిల్లల భవిష్యత్తును తీర్చి దిద్ది ఇల్లాలిగా తన విద్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తూ డా॥లక్ష్మీకాన్తమ్మగారు సాగించన సాహితీజైత్రయాత్ర అక్షర రూపంలో సాక్షాత్కరించటం భావితరాలవారి అదృష్టమనే చెప్పాల.

కేవలం సాహిత్య రంగానికేకాక ఆధ్యాత్మిక రంగానికి కూడా డా॥ లక్ష్మీకాన్తమ్మగారు అందించిన సేవలు ఈ పుస్తకంలో విపులంగా వివరించబడినవి. "ధర్మ ప్రచారభారతిగా" ఆమె భారతదేశంలోనేగాక విదేశాలలోకూడా చేసిన పర్యటనలు - ప్రసంగాలు పాఠకుల మనస్సుని ప్రభావితంజేసి - ఆవిద్యన్మణికి నమోవాకాల నర్పింపజేస్తాయి. ఇంతటి విలక్షణమైన వ్యక్తిత్వం కలిగిన సోదరి లక్ష్మీకాన్తమ్మగారి జీవిత విశేషాలు పుస్తక రూపంలో "సాహితీ రుద్రమ"గా ప్రచురింపబడటం సాహిత్యాభిమానులందరూ సంతోషించదగ్గ విషయం. ఈ జీవిత చరిత్ర భావితరాలవారికి స్ఫూర్తిదాయకంగా ఉంటుందనటంలో సందేహము ఏ మాత్రము లేదు.

నమస్సులతో

యస్.వి. చలపతిరావు

# వినమ్రతాంజలి!

అమ్మలగన్న యమ్మ ముపురమ్మల మూలపుటమ్మ పార్వతమ్మ అయితే సాహితీ పుత్రికలఁగని తద్వారా అగణిత కీర్తి పతాక నెగురవేసిన అమ్మ మా సాహితీ దుద్రమ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ!

కూరిమి సుమాలతో మమతల మాలికలల్లి ఆనందడెందమున అర్పించుకుంటి నీకిదె అందుకొనుము సోదరీ! నా వినమ్రతాంజలి!

దాదాపు పదమూడు సంవత్సరాలనుండి శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారితో నా పరిచయం. వీరి సాహిత్య చరిత్ర, సాహితీ సేవలగురించి విన్న నేను బాపట్ల లోని ఒక సాహిత్య సభలో ప్రసంగిస్తున్న లక్ష్మీకాన్తమ్మగార్ని తొలిసారిగాచూసి అంత గొప్పగా కొనియాడబడుతున్న సాహితీమూర్తి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ అంటే ఈవిడేనా! ఇంత సింపుల్‌గా సాధారణమైన పట్టంచు నేత చీరతో మామూలు వనితలా ఉన్నదేమి! అని నాలో నేనే అనుకొన్నాను. అటు తరువాత తెలుసుకొన్నాను ఉత్తమోత్తమ లక్షణాలు కలవారి అతః సౌందర్యమేగాని బాహాటమైన బాహ్య సౌందర్యంతో పనిలేదని-వారిని కలిపిన వేళా విశేషమేమోగాని అనతి కాలంలోనే మా ఇరువురి మధ్య సన్నిహిత స్నేహ బాంధవ్యం ఏర్పడింది.

బాపట్లలో సాంస్కృతీ సమాఖ్య పక్షాన నేను సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తున్న తరుణంలో సోదరి లక్ష్మీకాన్తమ్మగారు తమ అమూల్య సలహాసహకారాలనందిస్తూ నన్ను ప్రోత్సహించే వారు-తదుపరి ఇద్దరం కలిసి భావపురిలో నాళం కృష్ణరాయ పీఠం - కళాభారతి, సాంస్కృతీ సమాఖ్యల తరపున అనేక సాహిత్య కార్యక్రమాలు-కవి సమ్మేళనాలలో కలిసి పాల్గొనేవారము. లక్ష్మీకాన్తమ్మ గారింటిలో మేమిద్దరం కలిసినప్పుడు మామధ్య వివిధరకాల సాహిత్య చర్చలు దొర్లేవి. వారు తమ గత సాహిత్య చరిత్రను గుర్తుచేసుకొంటూ అంచెలంచెలుగా నాకు విస్తరిస్తుంటే- అమ్మా! మీ సాహిత్య చరిత్ర - గృహస్థాశ్రమ విధులు-వింటూ ఉంటే మీ జీవిత చరిత్ర వ్రాయాలని వుంది" అని అన్నాను. "అవును! అది నా చిరకాల వాంఛ! చిట్టిప్రోలు సుబ్బారావులాంటి సాహితీ మిత్రులు

కూడా కొంతమంది నా జీవిత చరిత్ర వ్రాసి అచ్చు వేయిస్తానన్నారు. ఎప్పటి కయినా నా జీవితచరిత్ర వ్రాయాలని అంటూనే అనతి కాలంలోనే రసరమ్య రమ ణీయ గ్రంధమగు తమ జీవిత చరిత్రను లిఖించి సాహిత్య విందుచేశారు సంస్కృ తాంధ్ర సరస్వతి-సాహితీ లోకాన ఆమెకు సాధ్యంకానిదేముంది!

కళాప్రపూర్ణ-ఉభయభాషాప్రవీణ-స్వర్ణ కలకణ గ్రహీత కనకాభిషిక్త- సోదరి లక్ష్మీకాంతమ్మగారి రచనలన్నీ చదివేను. ప్రతి కావ్యం దేనికదియేచెక్కిన వజ్రంవలె హృద్యాన వద్యంగా వుంది రచయిత్రులంటే ఎక్కువగా కథ, కావ్యం-పద్యం-గేయం-నవల-వ్యాసం. ఇలా ఒక్కొక్క ప్రక్రియలో ఒక్కొక్కరు ప్రసిద్ధి చెందడం విన్నాసుగాని, దాదాపు అన్ని ప్రక్రియల్లోరు రచనా వ్యాసంగం గావించి వినుతికెక్కిన విదుషీమణీ ఈమెయేనని ఘంటాపథంగా చెప్పవచ్చును. ప్రాచీనాధునికాంధ్ర సరస్వతి శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు సాహిత్యసేవలోనేగాక పదునారేండ్ల ప్రాయంలోనే స్వాతంత్ర్య సమరంలో పాల్గొని విదేశీ వస్త్రబహి ష్కరణకు కృషి సల్పుట, స్త్రీహితైషిణీ మండలులను స్థాపించి స్త్రీ అభ్యున్నతికి పాటుపడుట, సంఘసేవ, ఉదార దాతలుగా అనేక సేవా సంస్థలకు, దేవాలయాల స్థాపనకు విరివిగా విరాళముల నిచ్చెడివారు.

శాస్త్రీయ సంగీతం-వీణావాదనంలోకూడా మంచి ప్రావీణ్యం సంతరించు కొన్న గాన కళా తపస్వి మన సాహితీ రుద్రమ. ఆమె తన జీవిత చరిత్రపై స్నేహపూర్వకమైన నా అభిప్రాయాన్ని వ్రాయమని నన్నడిగినపుడు ఒక్క నిమిషం నేనప్రతిభురాలనయ్యాను. తమ గ్రంథానికి నా అభిప్రాయాన్ని అభిలషిస్తా రని నేనూహించలేదు. సి నారాయణరెడ్డిగారు - బెజవాడ గోపాలరెడ్డిగారు - శ్రీ ఆరుద్ర మున్నగు సాహితీవేత్తలు మహామహుల మధ్య నా అభిప్రాయాన్ని లక్ష్మీ కాంతమ్మగారు కోరడం నా మహద్భాగ్యంగా భావించి నాకు తెలిసిన సాహిత్తి మూర్తి గురించి నాలుగు స్నేహపూర్వక వాక్యాలు వ్రాద్దామనుకొని సాహితీ రుద్రమ గ్రంధమును తెరిచి చదవడం ప్రారంభించాను. కాని (నా) సాహితీ రుద్రమలో నాకు తెలియని వింతలు, విశేషాలు ఇన్ని ఉన్నాయా!అని నాలో నేను ఆశ్చర్యపోయాను. పుస్తకం తెరచినప్పటి నుండి ఆసాంతం అవి ఉత్సుకతో నన్ను చదివింపజేసింది సాహితీ రుద్రమ.

నిజంగా ఈ పుస్తకం చదువుతుంటే లక్ష్మీకాన్తమ్మగారి జీవితం ఇంత విశిష్టమైనదా! అనిపిస్తుంది.

ఆమె తండ్రి తాతముత్తాతల నుండి కూడా సాహిత్య సేవా కార్యక్రమాలు ఉద్యమాలలో పాల్గొనడం-దానధర్మాలు చేయడంవంటి ఉదార స్వభావులుగాను-సద్వంశీకులుగాను మనకు గోచరిస్తారు. శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు బాల్యదశలోనే గంటల తరబడి అనర్గళోపన్యాసాలు, సరస సంగీత గాన కచేరీల మధురిమలు-కురిపించేవారు. ఉద్యమాల ఉరవడిలో వివిధ ప్రదేశాల పర్యటనలు, జీవహింసా నిషేధంలో సాహసిపాత్ర మరువరానివి.

శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి దృఢసంకల్పం, కార్యదీక్షాదక్షత కొనయాడ దగినవి. ఆమెకు బాల్యంలోనే వివాహం జరిగినా ఆమె భర్త శ్రీహయగ్రీవగుప్త గారు సహనశీలురు, సహృదయులు-ఉదార స్వభావంకలవారు కనుకనే వారి సహకారంతో మన సోదరి సాహితీ రుద్రమ సమస్తరంగాలలోను లబ్ద ప్రతిష్ఠులు కాగలిగారు. ఆమె మెట్టినింట గృహస్థాశ్రమ విధులను పాటిస్తూ తమ భవిష్యద్భాటకు బంగారు కలల పంటలయిన గర్భస్థ శిశువులను సహితము లెక్కసేయక ఉద్యమాల ఉరవడిలో గ్రామాలకు సాగిపోయే నేపథ్యంలో ఒకటి, రెండు గర్భస్రావాలు జరిగినా భగవంతునిపై భారం వేశారేగాని బాధపడలేదు.

నిండు చూలాలిగా ఉన్నా ఆగక తన ఆశయ బాటలో అడుగుముందుకు వేస్తూ గమ్యాన్ని చేరుకొనేవారు. ఆమె తన జీవితంలో ఎన్నో ఒడిదుడుకులను కష్టనష్టాల నెదుర్కొంటూ భగవధ్యానంతో కార్యసాధన గావించేవారని సాహితీ రుద్రమ చదువుతుంటే మనకవగతమవుతుంది.

సోదరి లక్ష్మీకాంతమ్మగారికి దైవచింతన మెండు. ఆంధ్ర సరస్వతి ఆశయ నిర్వహణకు దైవజ్ఞుని ఏ విధంగా తోడ్పడినదో సాహితీ రుద్రమ ద్వారా అనేకానేక అద్భుతాలు విదితమవుతాయి.

లక్ష్మీకాన్తమ్మగారిల్లు ఓ సాహితీ నందనవనం. వారింట్లోనే ఓ పెద్ద గ్రంథా

లయం వుంది. బాపపురిలో సాహిత్య కార్యక్రమం జరిగిందంటె వారింట్లో ఆ రోజు మా అందరకు విందు భోజనాలే-వయసుపైబడి అప్పుడప్పుడు అనారోగ్యం ఆమెను వెంటాడుతున్నా ఇప్పటికి సాహిత్య కార్యక్రమం నిర్వహించాలన్నా, సాహిత్యోపన్యాసం చేయాలన్నా - లేని ఓపికను తెచ్చుకొని ఆత్మస్థైర్యంతో ముందుకు సాగుతారు.

సోదరి లక్ష్మీకాంతమ్మగారిపై నాకున్న భక్తిభావం -ఆత్మీయతా సంబంధం నా అయిదవ పుస్తకం పద్యకావ్యాన్ని ఆమెకు అంకితం ఇవ్వాలని నా ఆకాంక్ష!

అలాగే లక్ష్మీకాన్తమ్మగారి "సాహితీ రుద్రమ" ఆవిష్కరణ సభ ఆమె అద్భుతా రచన "సరస్వతీ సామ్రాజ్య వైభవం" ప్రదర్శన సాహితీ వేత్తలు-మహామహుల మధ్య వైభవోపేతంగా జరగాలని నా ఆకాంక్ష!

సహృదయిని-సకల కళారంజని-సాహితీ రుద్రమకు సర్వేశ్వరుడు సదా ఆయురారోగ్య-ఐశ్వర్యాలనందివ్వాలని- ప్రార్థిస్తూ-

వినమ్రతాంజలితో-

మీ సోదరి

-కోకా విమలకుమారి

21-5-93

# ఆశీస్సు

నాళం నాగేశ్వరరావు

బొంబాయి

12-6-93

నా కంటె రెండేండ్లు చిన్నదైన నా చెల్లెలు - శ్రీమతి ఊటుకూరి లక్ష్మీ కాన్తమ్మ సంగీత కళలను-నాతో పాటుగా అభ్యసించినది. వాగ్దేవి ఆమె యెడల అపార కరుణామృతమును చిలికించినది. ఆమె ఉభయ భాషా ప్రవీణురాలైనది. కవిత్వములోను-పాండిత్యములోను - ఉపన్యాసములోను అగ్రగణ్యురాలయినది. ఆమె ఆంధ్ర గీర్వాణ భాషలకు-చేసిన సేవ అపూర్వము సంఘ జీవితమునందును కుటుంబ జీవితమునందును ఆమె అత్యంత చొరవతోను-ఆసక్తితోను - ధైర్యము తోను-ముందంజ వేసి-ఆంధ్రప్రదేశ్‌లోనేగాక-ఇతర రాష్ట్రములలో కూడా ప్రఖ్యాతి గడించి-ఆదర్శప్రాయురాలైనది ఆమెకు లభించిన అనేక బిరుదులలో నొకటైన "సాహితీ రుద్రమ" అనే పేరుతో రచించిన ఈ స్వీయచరిత్ర - చక్కని శైలిలో ఆమెకు స్వకీయమైన భాషలో-విరాజిల్లుచున్నది ఈమె తన జీవితములో పొందిన సుఖదుఃఖములు-ఒడుదుడుకులు-ప్రాక్పశ్చిమ దేశములలో చేసిన పర్యటనలు-ఒనర్చిన సంఘ సేవలు-గ్రహించిన సత్కారములు-కావించిన ప్రజాహిత కార్య కలాపములు-అనుభవములు-అనుభూతులు-నిర్విరామముగా చేసిన సాహిత్యసేవలు, అన్నింటినీ ఈ పొత్తములో-యథావిధిగా-కల్లాకపటములు లేక - పేర్కొని తన వంటి ఇతర కళాసేవకులకు మహోన్నత మార్గదర్శకురాలైనది. ఈమెకు ప్రస్తుతము అస్వస్థత తటస్థించినది. దేవదేవుడామెకు ఆరోగ్యమును ప్రసాదించి - సంపూర్ణాయుర్దాయము నొసగి ఇంకను సంఘసేవ-కళాసేవ-ఆమె జీవితాంతమువరకు కొనసాగేటట్లు చేసి, ధన్యురాలినిగా చేయుగాకయని కోరుతూ, ప్రార్థిస్తూ - ఈ నా ముందు మాటలను ముగిస్తున్నాను.

ఇట్లు

నాళం నాగేశ్వరరావు

ఎం.ఎస్.సి.

బొంబాయి

# కస్తూరీ తిలకం

## నండూరి రామకృష్ణమాచార్య

### I

కళాప్రపూర్ణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, మధురకవి స్వర్గీయ శ్రీనాళం కృష్ణారావుగారి ఔరసదుహిత-మాత్రమేగాక మానస పుత్రిక గూడ. ఈమె రక్తనాళాలలో సాహితీ ప్రతిభ-అనువంశికంగా ప్రవహించుచున్నది. అనటా వికి నిర్వికల్ప నిదర్శనం-ఈమె పుత్రిక శ్రీమతి సుహాసిని-ఏలూరు మహిళా కళా శాలలో ఉపన్యాసకురాలు-సంగీత సాహిత్యాలు ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా జీవించే విదుషీ మణి. ఈమె కుమార రత్నాలు విదేశాలలో మేధావులలో మేలుబంతులుగా ప్రయోజకులై జీవించుచున్నారు. నాళంవారి ధర్మసత్రాలు ఆంధ్రదేశంలో రాజ మహేంద్రవరంలో పలుచోట్ల ఉన్నాయి. ఆంధ్రదేశంలో వణిక్ప్రభువులు పలు వురు దాన ధర్మదయాపారీణులు. పుట్టినిల్లేగాక-శ్రీమతి లక్ష్మీకాంతమ్మ మెట్టినిల్లు. ఊటుకూరి వారి వంశం గూడ సుప్రసిద్ధ వైశ్య శిఖామణుల వంగడం. ఈమె ఆభి జాత్యవతి. అదృష్టవంతురాలు.

### II

కవయిత్రుల చరిత్ర-ఈమెకు పేరు తెచ్చి పెట్టిన ఉద్గ్రంథం. ఈమె పుట్టి పెరిగిన వాతావరణం-రాజమహేంద్రవరంలోనే శ్రీ వీరేశలింగంగారి కవుల చరిత్ర వ్రాశారు-అందుకు దోహదం చేసింది. ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో ఈమెకు వీరేశలింగంగారి ప్రక్కసీటు లభించింది. ఆంధ్ర యావత్కళాశాల అంతేవాసినిగా శ్రీమతి లక్ష్మీకాంతమ్మ ఆంధ్ర రచయిత్రుల చరిత్ర వ్రాయటానికి ఉత్తమోత్తమ అధికారిణి.

### III

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారితో నాకు గల ప్రత్యక్ష పరిచయం పిక్కిలి తక్కువ. సంపన్న వైశ్య సహృదయుల ఆదరాభిమానాలు నాకు అనుభవామేడి

తారు. ఏలూరులో శ్రీకొత్తమాసు అయ్యన్న-శ్రీగుడిమెట్ల శేషగిరిరావు నా బాల్య మిత్రులు నాపై-నా యోగ్యతకు మించిన అదరాభిమానాలు వర్షించారు. పశ్చిమ గోదావరి పిప్పర వణిక్ప్రభువులు శ్రీతుమ్మలపల్లి వీరభద్రరావు -శ్రీతుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి నాకు ధన కనకవస్తువాహన సత్కారాలు సమకూర్చి— కస్తూరీ ప్రదానంచేసి సమ్మానించిన సహృదయ చక్రవర్తులు. శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారితో నాకు ప్రథమ పరిచయం తుమ్మలపల్లివారి ఇంటిలో జరిగిన పెండ్లి పందిరిలో. సనాతన భారతీయ సంస్కృతికి-తమహృదయాలలో వెన్నెల కోవెలలు కట్టుకుని ఆరాధించే సంపన్న వైశ్య కుటుంబాలలో జరిగే వివాహాలు-ప్రాయికంగా సాహితీ యజ్ఞవాటికలు. విదూషి మణిగ శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారికి ఆనాడు ఘనసన్మానం జరిగింది. నాకు కూడా జరిగిన సత్కారం - సహస్ర ప్రాయమైన అధిక పాతంగా ఆనాడు ఆమె భావించకుండా నన్ను ఆమె ఆదరించటం ఆమె ఔదార్య విశేషం. ఈనాడు తన జీవిత చరిత్రను తిలకం తీర్చిదిద్దమని ఆమె నన్ను కోరటం నాకు ఆనంద ప్రదమేగావి ఆశ్చర్యదాయకంకాదు.

"సాహితీరుద్రమ"- శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి స్వీయ జీవిత చరిత్ర మాత్రమేగాదు. ఎన్నో ఉత్తమ కావ్యాలు వ్రాసిన ఒక తెలుగుఆడపడుచు అంతరంగిక కుటుంబగాథ కాదు. అర్ధ శతాబ్దికి పైగా-ఆంధ్రదేశసామాజికచరిత్ర. సమకాలీన సాహితీ జగత్తులో చిరస్మరణీయమైన పాత్రలు ధరించిన మహా మణులు ఎందరో ఈ గ్రంథంలో కన్పిస్తారు. శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు-ఈ గ్రంథ రచనచేసి-ఆంధ్ర సాహిత్యానికేగాక ఆంధ్రదేశ చరిత్రకుకూడా ఎనలేని సేవచేశారు. "సాహితీ రుద్రమ" అనే బిరుదు ఈమెకుఅక్షరాల సార్థకం. కాకతీయ యుగంలోని రాణిరుద్రమ కత్తి - గాంధీ యుగంలో జన్మించిన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారి కలంగా పరిణమించినట్లు అభిజ్ఞులు భావించటం సమంజసం.

## IV

## దేశభక్తురాలు

సాహిత్యంలో బహుముఖ ప్రజ్ఞాశాలినిగా శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు పేరు తెచ్చుకోటం ఆశ్చర్యకరమైన అంశం కాదు. ఆమెతో పోటీపడేరచయిత్రులు

-యావదాంధ్రంలా పలువుడు ఉద్భవించవచ్చు. అయితే ఆమె వంటి ఉపన్యాసకు రాలు బహుశః కొన్ని తరాలు గడిస్తేగాని ఆంధ్రభూమిలో అవతరించకపోవచ్చు.

జలపాత సదృశమైన అనర్గళ వాగ్ధోరణితో ఆమె ప్రసంగించటం విన్నవారు ఆశ్చర్య చకితులు కావటం కద్దు. లలనాలావణ్యం మూర్తీభవించిన సుకుమార సుందర శిల్ప విగ్రహం ఆమెది. అయితే బ్రహ్మదేవుడు ఆమె కంఠంతో "దేవ దుందుభి" అమర్చినట్లు తోస్తుంది. ఈమె గళంలో ఒకపరి వాణి వేయితంత్రుల వీణ మ్రోగుతుంది. మరొకమారు లీలాతాండవలోలుడైనా నటరాజు చేతిలోని ఢక్కా నినాదం వినిపిస్తుంది. ఒకసారి "చారు పుంస్కోకిలాప సమ్మోదయగు" సాహిత్యోపన్యాసం వెలువడుతుంది. ఎక్కడనుండి వచ్చింది? ఈమెకు ఈ అత్యద్భుతమైన ఆ ప్రసంగశక్తి? ఈమె పుట్టి పెరిగింది గాంధీయుగంలో. మహాత్ముడు పూరించిన స్వాతంత్ర్య శంఖారావం భారతదేశంలో దశదిశల మారుమ్రోగిన సమయం అది. స్వాతంత్రోద్యమంలో హిమాలయాలనీడ కన్యాకుమారిపై పడింది సహజ కవచకుండలాలతో అలనాడు కర్ణుడు ఉదయించినట్లు-గాంధీయుగంలో దేశ భక్తులు సహజమైన కంఠాలతో అవతరించారు. ఆ దేశభక్తియుగం శ్రీమతి లక్ష్మీ కాంతమ్మగారి గొంతులో సరిగమపదనిసలు సమకూర్చుకున్నది.

> జంకు గొంకులేద-ఢంకా భజాయించి
>
> పాడగలదు-మాటలాడగలదు;
>
> పాల కడలి పొంగు-శ్రీలక్ష్మీకాంతమ్మ
>
> గొంతులోక దిగ్ దిగంత మెరసి.

## V

శ్రీమతి లక్ష్మీకాంతమ్మ - కవయిత్రుల చరిత్ర వ్రాసిన విదుషీమణి మాత్రమే గాదు. ఆమె నిలువెల్ల కవితయే. భర్త - శ్రీహయగ్రీవ గుప్త గారు మరణించినపుడు ఈమె వ్రాసిన కవిత - విన్నప్పుడు నా కన్నులు చెమ్మగిల్లినవి.

> "కవిత అనిన వేడి కన్నీటి బొట్టులే
>
> ఆ శ్లోకమయ్యె ఆమె శోక మెల్ల"

## VI

ఈమె ప్రపంచ పర్యటన చేసివచ్చిన సాహితీయాత్రికురాలు. ఇంగ్లీషు వచ్చి వుంటే ఈమె అమెరికా వాసులను వివేకానంద మహర్షినకే ఉర్రూత లూగించి యుండేది. ఈమె సనాతన భారతీయ సంస్కృతికి సజీవ ప్రతీక.

## VII

ఈ గ్రంథం - సాహితీ రుద్రమ ఆంధ్రదేశంలో అర్ధ శతబ్దానికి పైగా సాగిన సామాజిక - రాజకీయ - సాహితీ చరిత్ర - ప్రతిఫలించే అద్దాలమేడ.

# ధన్యవాదములు

సాహితీ కల్పద్రుమ బిరుదాంకితులు, ఆధ్యాత్మిక చింతనాపరులు, ధర్మాత్ములు, దానశీలురు అయిన ఆం. ప్ర ఆర్యవైశ్య మహాసభ, మాజీ అధ్యక్షులు, పెద్దలు కల్లూరు వాస్తవ్యులు, ప్రముఖ పారిశ్రామికవేత్త కాసంసెట్టిగారు నా గ్రంధ రచనను ఆశీర్వదించినారు మాన్యులు, సాహిత్యాలంకారమూర్తి, చాంద్రీ కృతమైన యశస్సంపన్నులు, ఆం. ప్ర. సాహిత్య ఎకాడమీ అధ్యక్షులు, శ్రీ డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, ఎనలేని సౌదర్యాభిమానముతో ఆశీస్సులంపినారు.

ఇరువదియవ శతాబ్దమున, ఎన్నదగిన, సాహితీవేత్త, ప్రముఖవిమర్శకులు సహృదయ, హృదయ వైభవ విరాజితులు, నిరాడంబరులు, విశేషించి నాయందు అతిశయమైన ఆదరాభిమానములు కలిగిన సోదరులు డా. ఆరుద్రగారు సంగీత విద్రుమ-సాహితీ రుద్రమగా నన్ను భావించి నా రచనకు ఆ భూషణమిడినారు.

ఓజస్సంపన్నమై, ఆధునిక సాహిత్య తేజస్సుశోభితమైన హృదయ సంస్కారంతో, తనకు నచ్చిన, తాను మెచ్చిన, ఎన్నికైన సాహిత్యమెవరిదైనా, అదంతా ఆంధ్ర భారతి కలంకారమేనను నిష్కళంకమైన, ఆదరాభిమానాలతో తన సహాయ సహకారాలందజేసే, ఉదారులు, సోదరులు, డా. సి. నారాయణరెడ్డిగారు "ఓజస్వి"ని అని నా రచనపట్ల, తన హర్షం వ్యక్తం చేసినారు.

ఇంక భారతీయ జ్ఞాన పీఠ సంచాలకులు ఆంధ్ర, హిందీ సాహిత్యపాండిత్య శోభతో, మనసు పండించుకొన్న సాహితేయ మూర్ధన్యులు, శ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారు.

ఆంధ్రదేశ సేవాతత్పరులై, ఆంధ్రకి తమ కార్యదీక్షతో కర్పూరహారతు లర్పించిన, ధన్యజీవనుల చరిత్రలు వ్రాసి, చరిత్ర చతురాననులై, మంచి ఎక్కడున్నా, ఆదిమాన్యమైనను సాధుభావనతో, సమారాధన సేయు, సహృదయమూర్తి సోదరులు దరువూరి వీరయ్యగారు, కవిశ్రేష్ఠులు, అధికారభాషాసంఘ పూర్వాధ్యక్షులునై ఈ కావ్యమునకు కస్తూరి తిలకము దిద్దిన సోదరులు నండూరి రామకృష్ణమాచార్యులుగారు సాహిత్యమంటె, వల్లమాలిన అభిమానంతో, నిరంతరసాహిత్య సేవాకార్యక్రమాలే, నిత్యకృత్యములుగా నిర్వహిస్తూ, గుంటూరుజిల్లా సాహితీ సమాఖ్య కార్యదర్శినిగా, పెక్కు సభలు నిర్వహించి, నా యందు ఎంతో అభిమానం కల్గిన సోదరి సౌభాగ్యవతి కోకా విమలకుమారిగారు.

వృత్తికి వైద్యులయినా, పవృత్తిలో సేవా వాచస్పతియై బాపట్ల పుర వాసులకెంతో సేవలు చేస్తూన్న, మా కుటుంబ వైద్యులు శ్రీ డా. సంకా చలపతి రావుగారు–

తండ్రిగారి సంస్కారాభిప్రాయములకు ఆకృతినిచ్చి, సంస్కార వివాహం చేసికొన్నవాడు, వీణావాదనము, కర్ణాటక హిందీ సంగీతంలో నిష్ణాత్వకమైన ప్రజ్ఞ కలవాడు అయిన మా అన్నయ్య చెల్లెలిపై గల, ఆదరముతో నొసగిన ఆశీస్సులను

ఈ సాహితీ రుద్రమ కావ్యమునకు, మఱింత శోభ నొసగుటయేకాక, ఈ కావ్యరచ యొక్క భవిష్యత్శుభమునకు స్ఫూర్తిని, ఉత్తేజమును కూర్పజాలినొపై ఎంతో ప్రోత్సాహంనొసంగియున్నవనుట అతిశయోక్తికాదు–ఇన్ని విధములనింతగా నన్ను ప్రోత్సహించిన ఈ పెద్దలందరకు నిండైన భక్తితోనై మోడ్పులు–

ఇంక తుదిగా ఈ కావ్యమును ఆశీస్సును ఒసంగుటకై ఉద్దేశించియు, తీవ్ర మైన అనారోగ్యమునకు గురియై అసువులు బాసిన, సోదరులు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నా శ్రద్ధాంజలి.

ఇంక అనేక రంగాలలో ఎంతో శ్రమకోర్చి. మీరు శ్రమకోర్చి. మీరు కావించిన సేవాకార్యక్రమాలు వెలుగులోనికి వచ్చి, ముందుతరంవారికి వెలుగు బాటను చూపవలెనను భావనతో ఈ రచనకు నన్ను పురికొల్పిన చిటిప్రోలు సుబ్బారావు, కె ఎస్ టి. సాయి, లాబందుల తురవిచంద్ సోదరులకు, నిత్యం నాపై గల ఆదరాభిమానం "మాతాశ్రీ" అని నన్ను పిలిచి, మన్నించుచు, "నీ జీవిత చరిత్ర వ్రాయనిదే నేను ఊరుకోనని పలుమార్లు హెచ్చరించిన కె.ఎస్.టి.సాయి ఇంకా ఇతరులకు నా కృతజ్ఞతాభివందనములు.

ఇంక నాపై మాతృభావం వుంచి ఎంతో శ్రద్ధాభక్తులతో, నాకు వైద్యం చేసి, బాపట్లలో ఉన్నంత వఱకు కంటికి రెప్పవలె నన్ను కాపాడిన సౌభాగ్యవతి, మా కుటుంబవైద్యులు శ్రీ సంకా చలపతిరావుగారి కుమార్తె భారతి, శ్రీ చలపతి రావుగారు, వారి కుమారుడు చిరంజీవి రామకుమార్ బొలిపెట్టి వరదరాజులు–సోద రుడు కాల్వ వరదరాజులు–నా సేవాకార్యక్రమాలన్నిటికి–పెద్దదిక్కుగా– అండగా నిలువబడి – కడు సమర్థతతో నిర్వహిస్తూ ఉన్న సోదరుడు కె. సత్యనారాయణ చార్యులుగారు సర్వశ్రీ పోలాప్రగడ రాజ్యలక్ష్మి సత్యనారాయణ దంపతులు–

నెమ్మాని సీతారామయ్య-బాబూరావు-హిందీ లెక్చరర్-వెంకటేశ్వరరావు తన ఆయుర్వేద వైద్య నైపుణ్యంతో నాకు మందు విచ్చుకొన్న శ్రీదుడ్డుదక్షిణామూర్తి డి. రంగారావు దంపతులు శ్రీ ఆచంట రంగనాయకులు-కోళ్ళపూడి సుబ్రహ్మణ్యం నాగసూరి సులోచన-రాజేశ్వరరావు-గెల్లి పిచ్చయ్య- కె. కృష్ణరావు - దేశరాజు బాబు దంపతులు - కోటంరాజు సీతాబాయి-కృష్ణమూర్తి దంపతులు - వెలగపూడి వైదేహిబాబు దంపతులు అన్ని సేవాకార్యక్రమాల్లోచేదోడువాదోడయిన భీమరాజు వరలక్ష్మమ్మ-చిరంజీవులు కొమ్మూరి ఆండాళ్ళు-ఆంజనేయులు దంపతులు - పారేపల్లి సాంబశివరావు-దేవకి వెంకట సుబ్బయ్య-మోదడుగు కృష్ణగుప్త - చీదెళ్ళ సత్యనారాయణ ఆడిటరు కామేశ్వరరావు - చీరాల వాస్తవ్యులు కాకరపర్తి వెంకటేశ్వర్లు పాండురంగారావు-మల్లాది పద్మావతి-మా ఊటుకూరి కుటుంబీకులు కాకరపర్తి మల్లిఖార్జున (వేటపాలెం) వర్ధనమ్మ అనేక విధముల నాకు సాయపడుచున్న పెద్దలకు-చిన్నలకు మోతే సత్యవతమ్మ వారి కుమారుడు రమేశ్‌మీరా దంపతులు-నాకు ప్రీతిపాత్రువాలయిన సౌభాగ్యవతి మద్దిరామకుమారిగార్లకు నిండయిన ఆదరముతో నా ధన్యవాదములు.

బాపట్ల వాస్తవ్యులయిన ఉడిపి సుబ్బారావు దంపతులకు రాజమహేంద్రవరమునందలి నా మాతృసంస్థ అయిన వైశ్య సేవాసదనం ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల వారికి నా ధన్యవాదాలు.

ఇంక ఒక్క ముఖ్యాంశము-సంస్కార వివాహముచేసుకొన్న కారణముగా మేము దూరముగా ఉండినా-ఉదార హృదయంతో- సొ. మా చిన్నమ్మాయి మైథిలి పెండ్లికి మా పిలుపుపై వచ్చి ఎంతో ప్రేమతో నన్ను బొంబాయి తీసుకొని వెళ్ళి ఆంధ్ర మహాసభలో-ఏటమిక్ ఎనర్జీ ఆఫీసులో ఉపన్యాసాలిప్పించి ఆదరించిన మా అన్నయ్యకు విశేషాభీవాదములు.

-డా. లక్ష్మీకాన్తమ్మ

# సాహితీ రుద్రమ సాహసాంకములు



ఐం హ్రీం శ్రీం

# సాహితీ రుద్రమ

—o—

బ్రహ్మాణీం, సుకలాం, వాణీం పరబ్రహ్మ స్వరూపిణీమ్
సురజ్యేష్ఠ ప్రియామ్, భక్తసులభామ్, సురవందితామ్॥

వీణామంజుల పాణిపల్లవయుగ విరాజితామ్
విద్యాధిష్ఠాన దేవతామ్, విజ్ఞానాత్మ ప్రశోభితామ్॥

నాదబ్రహ్మమయీమ్, నవామ్, ప్రణవోద్భాసితామ్
నానార్థ ధ్వని ప్రణయినీం సౌవర్ణవర్ణాత్మికామ్॥

చంద్రామల శుభ్రమూర్తిలలితామ్, వాగధీశ్వరీమ్
గైర్వాణీమ్ సురభారతీమ్, రమ్యార్థ సూక్తిసుందరీమ్॥

చిద్రూపిణీమ్ సంపత్ప్రదామ్, సౌభాగ్య ప్రవిధాయినీమ్
వందేహం జగద్వందితామ్, శారదాం, గిరాందేవతామ్॥

వాణీజ్ఞానమయే, వరే, వరవిపంచీనాద సమ్మోదితే
వాత్సల్యాంచితవాక్సుధాలహరికాసంపుష్టభక్తౌఘకే
వాల్లభ్యాదృతసృష్టికార్యవిముఖత్వద్మోత్థితే, వాక్ప్రదే
వారాహ్యాదినిషేవితే, లలితవిద్యే శ్రీర్నమస్తేనమః॥

# "సంగీత మపి సాహిత్యమ్"

భైరవిరాగం - అట తాళవర్ణము

సారి నీదా నీ సారిగసారి, సరిగగరి, గగరిగమ పదమప

ఆఅ ఆఆ వీరిబోణి ఓఒ ఒఒఒఒణీ, నిఇఇఇఇఇఇఇఇ

గరిస॥ నిసమగరిప నిపరిగసరి నినిదని

ఇఇఇ॥ న్నెవవవవవ కొఒఒఒఒఒ ఒఒఒఒ

పగరి నిసనిదప॥

రిఇఇ ఇఇఇఇఇ

అది పశ్చిమ గోదావరిజిల్లా ప్రధాన కేంద్రమైన ఏలూరు, అనగా చాళుక్యుల రాజధానియైన హేలాపురి — ఆ రాజధానీ నగరం ధార్మిక ప్రభువులైన మోతే జమీందార్ల నివాసం. అచట మోతే రామమ్మ జమీందారిణీగారు, తన కుమారుడు శ్రీ మోతే కృష్ణరావుగారితో, తన మఱది గారు మోతే గంగరాజుగారి భవనంలో నివాసముంటూ ఉన్న రోజులవి. శ్రీ మోతే రామమ్మగారి మనుమసంతానమైన నేను, మా అన్నయ్య శ్రీ నాళము వాగేశ్వరరావు, తూర్పువీధిలో ఉన్న మోతేవారి యింట్లోనే జీవించాము. నాకు ఏడేండ్ల వయస్సు, మా అన్నయ్యకు తొమ్మిదేండ్ల వయస్సు ఉన్నపుడు, నేను, మా అన్నయ్య ఏలూరులోని గంగరాజు గారి క్రొత్తభవనానికి మా అమ్మమ్మగారి యింటికి వెళ్ళాము. అక్కడ ఉదయం కాలకృత్యాలు తీర్చుకొని, స్నానం, ముగించుకొని, మహాభక్తురాలు, పుణ్యసాధ్వి, ధర్మాత్మురాలు అయిన మా అమ్మమ్మగారి పూజకు, వారియింటి తులసివనం నుండి తులసికొయ్యడమే, మా ప్రథమ చర్య, ప్రధాన కర్తవ్యం. ఒకనాడు, నేను, మా అన్నయ్య తులసిదళాలు కోస్తూ, భైరవిరాగంలోని అటతాళ వర్ణాన్ని, ఒకచేత్తో తులసికోస్తూ

ఒకచేత్తో తొడలపై అట తాళం, వేస్తూ భైరవి వర్ణాన్ని పాడుతూ ఉన్నాము.

సరిగా అదే సమయానికి గంగరాజు జమీన్‌దారుగారింట్లో వారి పిల్లలకు. మా మేనమామయైన శ్రీ మోతే కృష్ణరావుగారికి వీణా విద్యను నేర్పించే గురువుగారు శ్రీ తిరువెంగళాచారిగారు గంగరాజుగారి కోట దర్వాజాలోనికివచ్చి, ఒకచేత్తోతులసికోస్తూ, ఒకచేత్తో తొడపై తాళంవేస్తూ కాలపై కాలాలలో భైరవి అట తాళవర్ణాన్ని అపస్వరం లేకుండా, తాళం తప్పకుండా మేమిద్దఱమూ పాడడంవిని, ఆశ్చర్యచకితులై, బ్రహ్మానందంతో గంగరాజుగారి భవనంలోనికి ప్రవేశిస్తూనే, వెంకటసుబ్బమ్మా (మా అమ్మగారిపేరు, ఆమెకు మా నాన్నగారు 'సుశీలమ్మ' అని పేరు పెట్టినా, ఆమె పుట్టింటివైపు వారంతా వెంకట సుబ్బమ్మా అనే పిలిచే వారు.) దక్షిణా, తాంబూలం, క్రొత్తపంచెలూ తీసుకొనిరా, పిల్లలిద్దఱకు సంగీతం ప్రారంభించాలి, అని మా అమ్మగారిని పిలిచి చెప్పారు. ఆమె, ఇంట్లో తక్కినవారూ, అంతా దిగ్భ్రమచెంది "ఏమిటి గురువుగారూ, పిల్లలకు సంగీతం, ప్రారంభించడమేమిటి? అందులో ఈవేళ, ఇంత చిన్నవయస్సులో? అని మా అమ్మ వారిని ప్రశ్నించింది: 'అం చూడు' మీకు వారంరోజులబట్టీ చెప్తూ ఉన్నా, భైరవి వర్ణం రానేలేదు– నీ పిల్లలు, నాగేశ్వరరావు, లక్ష్మీకాన్తమ్మ, కాల పై కాలాలతో ఎట్లా పాడేస్తున్నారో, తులసికోస్తూ ఒకచేత్తో తాళంవేస్తూ మఱీపాడేస్తున్నారు! వాళ్ళను చూచి మీరు సిగ్గుపడాలి! అంత సహజమైన సంగీత జ్ఞానం కల ఆ పిల్లలను చూస్తే ముచ్చటేస్తూ ఉన్నది – వాళ్ళకింక శాస్త్రీయంగా సంగీత విద్యాప్రారంభంచేసి, ఈ వేళనే వారిచేత 'సా, పా, సా' పట్టించాలి అంటూ గుక్క తిప్పుకోకుండా వారు చెప్తూంటే, అంతా ఒక్క మాఱు, కోటప్రక్కన తులసితోటలో భైరవి పెద్దవర్ణం పాడుతూ ఉన్న మమ్ము

ల్నిద్దఱనూ చూచి, ఎంతో ఆనందించి, మమ్మల్ని లోపలకు తీసుకొని వెళ్ళగా, గురువుగారు తిరువెంగళాచారిగారు సరస్వతి పటంపెట్టి పూజ చేయించి

> "సరస్వతీ! నమస్తుభ్యం, వరదే కామరూపిణీ
> విద్యారంభం కరిష్యామి, సిద్ధిర్భవతు మేసదా॥"

అనే శ్లోకం చదివించి 'సా, పా, సా' అనే గాంధర్వ విద్యా ప్రారంభ సూచకములైన ప్రథమశృతి పాఠాన్ని మాకు నేర్పి మా అమ్మగారిచ్చిన దక్షిణ తాంబూలాలు, నూతన వస్త్రాలు స్వీకరించి, ఆనందబాష్పాలు దొర్లుతూన్న కండ్ల వెలుగువారి మోముపై వినూత్న తేజంతో తాండవిస్తుండగా 'అఖండగానవిద్యాప్రాప్తిరస్తు' అని మా శిరస్సుపై చేయి ఉంచి దీవించారు. అంతకు క్రితం అయిదవయేట విద్యా ప్రారంభమైనా నేనూ, మా అన్నయ్యా ఏదో వీధిబడిలోకి వెళ్తూ ఉండేవాళ్ళమేమో మరి ఇప్పుడా విషయం జ్ఞాపకంలేదు.

ఆ తర్వాత మా అమ్మగారు మా యిద్దఱను తీసికొని, రాజమహేంద్ర వరంలో మెయిన్‌రోడ్డులో, (ఇప్పుడు మా తమ్ముడు నాళం కామేశ్వర రావు ఉంటూ ఉన్న) మా యింటికి వచ్చేసింది. రాజమహేంద్రవరం చేరిన తర్వాత, ఏలూరులో జరిగిన సంగతి అంతా మా నాన్నగారి (నాళం కృష్ణారావుగారి) తో చెప్పగా, సహజంగా, కళాభిమాని, గౌతమీ గ్రంథాలయ ప్రతిష్ఠాపకులూ, దేశసేవ, సంఘసేవ, సత్యాగ్రహ సేవ లలో అగ్రశేణి నాయకులు, రాజమహేంద్రవరంలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన ప్రముఖ వ్యక్తియైన మా నాన్నగారు (శ్రీ నాళం కృష్ణరావు గారు) చాలా సంతోషించి, మాకు వీణాగురువులకొఱకు అన్వేషణ ప్రారంభించారు, వారి అన్వేషణ ఫలించి శ్రీ నల్లాన్ చక్రవర్తుల శ్రీరామా

చార్యులుగారనే వైదీక విద్వాంసులు, మా వీణాభ్యాసానికి గురువులుగా లభించారు!

ఈ విధంగా నా జీవిత ప్రథమాంకంలో సంగీత కళాభ్యాసంతోనే విద్యా ప్రారంభం జరిగిందని చెప్పవచ్చును.

కాని విధి బలీయమైనది కదా! సంగీతాభ్యాసంతో, ఒక స్థిర రూపంలో కుదురుకొన్న నా జీవితం, అనంతరకాలంలో తీరని సాహిత్య కళాతృష్ణకల సాహిత్య విద్యార్థినిగా మలుపు త్రిప్పుకోవడం, నిజంగా విధీ లీలయే. తర్వాత ఈ మకుటంలో చెప్పదగిన ముఖ్యాంశం :-

## నా బాల్యం :-

ఎట్లా గడిచింది? అనేవిచికిత్స నా మెదడులో ప్రవేశించగానే, ఎదురుగా చూస్తూ ఉన్న సినిమావలె, ఎన్నోరకాలైన, వింత వింత విష యాలు, నా కండ్లముందు వచ్చి నిలువబడుతూ ఉన్నాయి.

మా అమ్మగారి యిల్లు ఎక్కువ తెలగ కులస్థుల కావాసమైన పరి సరాల్లో ఉండడం వలన, మా యింటికి వెనుక భాగంలో ఉన్న పద్దమ్మ పోలమ్మ మున్నగు వారి కుటుంబాలవారు మా యింటికి వస్తూ పోతూ ఉండడంవలనను, వాళ్ళ పిల్లలతోనే, నేనూ మా అన్నయ్య ఆడుకొనే వాళ్ళం. వాళ్ళంతా మగపిల్లలే, అందులో మాధవరావు అనే అబ్బాయి మాకు మా అన్నయ్యంత సన్నిహితంగా ఉండేవాడు. నాతో ఆడుకోవడా నికి వేరే ఆడపిల్లలు లేకపోవడం వలన, నేను వాళ్ళతోనే కలిసి సైకిలు చక్రాలు రోడ్డుమీద దొర్లిస్తూ, గోడుంబిళ్ళ ఆడుతూ, మా యింట్లో ప్రహరీగోడ లోపల చుట్టూఉన్న చెట్లపై, కోతికొమ్మచ్చు లాడుతూ కాలం ఆనందమయంగా గడిపేదాన్ని: ముఖ్యంగా కోతికొమ్మచ్చుల ఆటలో నేనే గెలవడం నాకు ఎంతో సంతోషాన్నీ, ఉత్సాహాన్నీ కలిస్తూ

ఉండేది. మాకు ప్రైవేటు మాస్టారుగా సాయంకాలం పరమాత్మయ్య శాస్త్రిగారు వస్తూ ఉండేవారు!

నా ఏడవయేట వీణాభ్యాసం మొదలై, కొంతకాలం — అంటే ఒక యేడాది - గడిచేటప్పటికి మా అమ్మ ఉదయం నాలుగున్నరకు లేపి నా చేతా, మా అన్నయ్యచేతా వీణపై త్రిస్థాయి సాధకం చేయించేది. శ్రీ రామాచార్యులవారి దగ్గర వీణాభ్యాసం మూడు నెలలు మాత్రమే సాగింది. తర్వాత, ఆర్యాపురంనుండి దక్షిణామూర్తిగారనే వైణిక విద్వాంసులు వీణా గురువులుగా వచ్చేవారు. వారు చాలాకాలం వీణ చెప్పారు. వారి తర్వాత, మాకు వీణ పాఠం చెప్పేవారు ఆ మహా నగరంలో లభ్యంకాలేదు. ఎవరెవరోవచ్చి పాఠంపేరిట సాధకం చేయించే వారు. కాని మహేంద్రవాడ భావన్నశాస్త్రిగారనే వారు కొంతకాలం వీణ చెప్పడానికి వచ్చేవారు!

తర్వాత చాలాకాలానికి ఈమని శంకరశాస్త్రిగారి తండ్రి, ఈమని అచ్యుతరామశాస్త్రిగారిని అభ్యర్థించి మాకు వీణ నేర్పడానికి మా నాన్న గారు రాజమండ్రి తీసుకొనివచ్చారు. ఆయన ఒక యేడాది మాయింట్లోనే ఉండి భోజనం, మా తాతగారు నాళం కామరాజుగారి (నాళంవారి) సత్రంలోచేస్తూ, మా యిద్దఱకూ వీణ నేర్పించారు. వారి వాద్యం చాలా పట్టుగాను, చాలా కట్టుబాటుగానూ ఉండేది. వారి దగ్గఱే మా యిద్దఱకూ కొంతపట్టైన విద్యలభించిందని చెప్పవచ్చును.

మా అమ్మ ఏలూరులో ఉండగానే మా విద్యాభ్యాసం మొదలయి నది. అందువలన ఆమె మాకు వీణ చెప్పించడంలో సాధన చేయించడంలో ఎక్కువ శ్రద్ధ కనబఱచేది.

—o—

## 'వంశవృత్తాంతఃబలీయం విధినైవచ నిర్మితం'

ఇంతకూ, నే నెవరికుమార్తెనో ఈ చరిత్రలో ప్రప్రథమంగా పేర్కొననేలేదు.

19వ శతాబ్దంలో, తూర్పు గోదావరిజిల్లాలో మండపేట గ్రామం, దానధర్మాదులకు, వ్యాపారనై పుణ్యానికీ, పేరుపడిన వంశం! నాళంవారి వంశం! మండపేటలో తొమ్మిది మండువాల ఇంట్లో ఈ నాళంవారు నివసిస్తూ ఉండేవారు! వారిలో మా తాతయ్యగారు, నాళము కామరాజు గారు! వారి అన్నదమ్ము లేడుగురు. వారందరిలోను కామరాజుగారు గొప్ప వ్యాపార దక్షతకలిగి, కలకత్తానుండి మద్రాసువరకు బండ్లు, బాటలూ కూడా సరిగా లేని ఆ రోజులలో అంచెల బండ్ల మీద అంతర్జాతీయ నౌకా వ్యాపారంచేస్తూ ఉండేవారు. రైలుబండ్లు లేని ఆ రోజులలో తూర్పు కోస్తాలో అతికష్టంమీద తిరుగుతూ వ్యాపారంచేసే కామరాజుగారికి, తాను బసచేసిన ప్రతి నగరంలోనూ ఒక సత్రమైనా ఉంటే, కనీసం కష్టపడి ప్రయాణంచేసి నగరం చేరుకొన్న తర్వాతనైనా అక్కడ ఉన్నన్నాళ్ళూ సుఖంగా భోజనంచేసి, కాలంగడపవచ్చునన్న ఉద్దేశంతో కలకత్తా, కటకం, బరంపురం, విజయనగరం, రాజమహేంద్రవరం, చెన్నపట్టణా లలో సత్రాలు కట్టించారు. కాకినాడలో దేవాలయం నిర్మాణం చేశారు.

వారికి సంస్కృత భాషలో పాండిత్యం లేకపోయినా, మంచి జ్ఞానం ఉండేది, తన కాలానికి ముద్రణా భాగ్యానికి నోచుకోని, గౌతమీ క్షేత్ర మాహాత్మ్యం మున్నగు కావ్యాలను ముద్రణ చేయించి తన మకాములలో పండితులకు సమర్పిస్తూ ఉండేవారు. వారికి జ్యోతి శ్శాస్త్రంలో మంచి ప్రజ్ఞాపాటవా లున్నాయి.

వారి ఆఖరి కుమారుడే మా నాన్నగారు. నాళం కృష్ణరావుగారు. కృష్ణరావుగారి జననానికి ముందురోజే కామరాజుగారు, తన భార్య లక్ష్మీదేవి (అచ్చమ్మ)కి ప్రసవకాలం సమీపించిందని తెలుసుకొని మండపేటకు చేరుకొన్నారు. ఆ మఱుచటినాటి ఉదయం, తెల్లవారు ఝామున పురోహితునితో వాహ్యాళికి వెళ్ళి అచ్చమ్మగారి ప్రసవసమయం సమీపించిందని వేగిరపడి తిరిగి వచ్చేస్తూంటే గుమ్మం దగ్గఱకు వచ్చేటప్పటికి, లోపలనుండి, క్యారు క్యారుమనే బిడ్డయొక్క రోదనం విని అప్పుడే ఆకాశంచూచి, జననకాల నక్షత్రాములను గుర్తించి పురోహితునితో, 'వీడే నా వంశానికి పేరు ప్రతిష్ఠలు తెచ్చేవాడు! వీడే నా వంశాకురం! అంతేకాదు! బాల్యంలో అనేకమైన దుడుకు పనులు చేస్తాడు - అవన్నీ దేశహితంకోసమే. ఆ కారణంగా కృష్ణనామధేయాంకితమై వీడిజీవితం వన్నెచెంది, వాసికెక్కునుగాక అని పురోహితునితో చెప్పి "వెంకటకృష్ణయ్య" అని పేరు పెట్టారు.

తర్వాత శ్రీ కామరాజుగారు తన వ్యాపారానికి ప్రధాన కేంద్రంగా రాజమహేంద్ర వరాన్ని ఎంచుకొని, అక్కడకు కాపురాన్ని (మండపేట నుండి) మార్చేశారు.

నాళం కృష్ణరావుగారి బాల్య క్రీడలనుగూర్చి ఈ నా స్వీయ చరిత్రలో వర్ణింపబూనడం అంటే, ఒక పెద్ద అధ్యాయం వ్రాయడమే—సంగ్రహంగా వారి జీవితవిశేషాలను వారి శతజయంతికి ప్రచురించిన మధురగీతికల సంపుటంలో పేర్కొని యున్నాను—తన వంశానికి ఎంతో పేరుప్రఖ్యాతులు తెస్తాడనుకొన్న తన కడగొట్టు కొడుకుయొక్క దుడుకు చేష్టలకు చింతించి కామరాజుగారు వెంకట కృష్ణయ్యను, కాకినాడ మకాములో తన వ్యాపార ప్రతినిధిగా వ్యవహరిస్తూ ఉన్న తన మూడవ కుమారుడు, ఆంధ్రదేశంలో ఫస్టు బి.యె పట్టభద్రుడు అయిన నాళము పద్మనాభంగారి దగ్గఱకు పంపించి వేయడం, అక్కడ అప్పటికే ఆంధ్ర దేశంలో ఉద్యమ రూపంగా బలపడిన బ్రహ్మ సమాజోద్యమంలో,

పిఠాపురం రాజా, రఘుపతి వెంకటరత్నం నాయుడుగార్ల ప్రభావానికి ఆకర్షితులై పాఠశాల విద్యను నిర్లక్ష్యంచేసి బ్రహ్మ సమాజంలో చేరడం మొదలైన కార్యక్రమాలకు అంకితమై పోయారు; వెంకట కృష్ణయ్య! అయితే అశ్రమంగానే విద్యార్జనలో ప్రథముడిగా ఎన్నికై 9వ తరగతి పరీక్షలను పద్యాలతో జవాబులు వ్రాసి ప్రథమ శ్రేణిలో కృతార్థుడైనాడు; వెంకటకృష్ణయ్య! అది గమనించిన కామరాజుగారు తనకొడుకును, మఱల రాజమండ్రికి పిలిపించుకొన్నారు - కాని వెంకటకృష్ణయ్య కృష్ణరావుగా మారి, రాజమహేంద్రవరంలో వీరేశలింగం పంతులుగారి, వితంతు వివాహోద్యమంలోను. బ్రహ్మసమాజోద్యమంలోను చేరి యథాప్రకారం పాఠశాల విద్యను అలక్ష్యంచేస్తూనేఉండికూడా తన 17వ ఏట, వీరేశలింగ గ్రంథభాండాగారాన్ని స్థాపించి, ఆ గ్రంథాలయాభివృద్ధికి సర్వ విధాలా, అహోరాత్రులు కృషిచేయ సాగారు.

ఆ కాలంలోనే వారికి పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు నగరంలో నివసిస్తూ ఉన్న జమీందార్లు మోతే వెంకట కృష్ణయ్యగారి కుమార్తెతో వివాహమైనది. పెండ్లికి మా తల్లిగారికి ఎనిమిదేండ్లు, మా నాన్నగారికి, పదహారేండ్లని-వినికిడి, అయితే మా అమ్మగారు అప్పటికే మంచినీళ్ళ సుబ్బారావుగారి వీధిబడిలో, నాలుగవతరగతి చదువుతూ, భారత రామాయణాదులను, అవలీలగా చదవగల్గి ఉండేదట! ఆ చదువును, ఆమె సౌందర్యమును చూచి, కృష్ణారావు మోజుపడడం గమనించి, కృష్ణ రావుగారి పెద్దన్నగారు వీరయ్యగారు మోతేవారి సంబంధాన్ని నిశ్చయ పఱచి, కృష్ణరావుగారికి, వెంకటసుబ్బమ్మతో పెండ్లి జరిపించారు. తర్వాత, తన భార్యకు కృష్ణరావుగారు సుశీలమ్మ అని పేరు పెట్టినారు.

శ్రీ కృష్ణరావుగారు తాను అనుష్ఠాన బ్రహ్మ సామాజికులై, ఇంట్లో ఏ శుభకార్యం జరిగినా పీటలమీద కూర్చొని ఆ కార్యకలాపాన్ని, జరిపించ డం ఇష్టం ఉండక అటువంటి కార్యకలాపాలకు స్వస్తి పలికినా,

మా అమ్మగారు సనాతనాచారపరురాలై, ఇంట్లో నిత్యపూజ, పర్వదినాలు శాస్త్రోక్తంగా జరపడం అవీ చేస్తూ ఉండేది. భార్యచేసే, సనాతన విధులకు కృష్ణరావుగారు ఎప్పుడూ అభ్యంతరం చెప్పలేదు.

ఇంట్లో ఈ విధంగా సంసారనిర్వహణంచేస్తూ, బయట సంఘ సంస్కారోద్యమంలో పాల్గొంటూ, గ్రంథాలయాభివృద్ధికొఱకు ఎన్నో విధాలుగా శ్రమించి, కష్టపడుతూండేవారు; శ్రీ కృష్ణరావుగారు!

ఆ దంపతులకు మొదట్లో కొంత సంతాన నష్టం కల్గింది. అది కారణంగా మా అమ్మ రామేశ్వరంలో నాగప్రతిష్ఠచేసి, ఆంజనేయ ప్రదక్షిణాలు చేయగా మా అన్నయ్య కడుపున పడడం, ఆ సంతానం, బాగుండడం జరిగింది. ఆ కారణంగా మా అన్నయ్యకు అంజ నాగేశ్వర రావు అని పేరు పెట్టి పెంచింది; మా అమ్మ! బారసాల మొదలైన తంతులకు మా నాన్నగారు అంగీకరించేవారు కానందున ఊరికే పేరు పెట్టి పిలుచుకోవడం మాత్రమే జరిగింది. మా అన్నయ్య 1915వ సంవత్సరం ఆశ్వీయుజ మాసంలో జన్మించాడు. ఆ తర్వాత నేను 1917 డిసెంబరులో జన్మించాను. అది పింగళనామ సంవత్సర మార్గశిర శుద్ధ త్రయోదశి అని, మా అమ్మమ్మ మోతే రామమ్మగారు ఒక కాగితంపై జననకాల సంవత్సర, మాసతిథి నక్షత్ర, వేళలు పేర్కొంటూ మా అమ్మకిచ్చింది - అలాగే, మా అన్నయ్య జననకాలవేళను కూడా ఆమె నిర్ధారణగా వ్రాసి యిచ్చింది - కానీ దురదృష్టవశాత్తు, మా చిన్నతనంలో, మా యింట్లో దొంగలుపడి ఆ కాగితాలనే వెలుతురుకొఱకు కాల్చి, నగలను దొంగిలించారు. ఆ తర్వాత మళ్ళీ మా అమ్మమ్మ మా జనన కాలాలను పుస్తకంలో వ్రాయించి పంపింది.

నా చరిత్ర స్వభావాదులనుబట్టి, ఆమె వ్రాసి యిచ్చిన జనన కాలంలో కొన్ని మార్పులు ఉండి ఉంటాయని, తర్వాత జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, దైవజ్ఞులు చెప్పారు.

మా అమ్మమ్మ వ్రాసి యిచ్చిన నా జనన కాలాన్ని తెలిపే రాశిచక్రం, అంశాచక్రం ఈ దిగువన ఇస్తూ ఉన్నాను

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

జననకాలం - పింగళ మార్గశిర శు ౧౨ వెళ్ళగా ౧౩ మంగళవారం అనగా ది. 25-12-1917 రాత్రి గం. 2-59 ని॥కు

| | గు | చం | కే |
|---|---|---|---|
| | రాశి<br>రోహిణీ<br>౧వ పాదం | | శ |
| శు | | | |
| రా ర బు | | ల | కు |

| | గు, చం | | రా |
|---|---|---|---|
| శ కు | అంశ | | ల ర |
| | | | శు |
| కే | | బు | |

జననం : 1917-12-25
చంద్రశేష - 9-3-15
జరిగిన దశలు 60-0-0

ఈ నా జాతక చక్రం, ఇటీవల తెనాలి వాస్తవ్యులు శ్రీ త్రిపురారిభట్ల చిరంజీవి శాస్త్రిగారు సవరించినది.

## జాతీయ విద్యాభ్యాసం

మహాత్మాగాంధీ సత్యాగ్రహోద్యమానికి శంఖం పూరించి, సత్యాగ్రహోద్యమాన్ని ప్రబలంగా నిర్వహిస్తూఉన్న రోజులవి!

మా నాన్నగారి పెదతండ్రి కుమారుడు, కాకినాడలో నివాసమేర్పరచుకొని పెద్దయెత్తున వ్యాపారం నిర్వహించుకొంటూ ఉన్న నాళము రామలింగయ్యగారు సతీసమేతంగా తీర్థయాత్రలకు సంకల్పించినపుడు, వారితమ్ముడు నాళం సత్యానందంగారు వారిభార్య శ్రీమతి కాంతమ్మగారు ఆమెచెల్లెలు, శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారుకూడ వెళ్ళారు. బాల్య లోనే వితంతువై, ఆమె మద్రాసుమకాంలో, నాళం కామరాజుగారి ప్రతినిధిగా రత్నాలవ్యాపారం చేస్తూఉన్న, కామరాజుగారి తమ్ముడు, నాళం లక్ష్మీకాంతంగారి యింటిలో, (వారి మేనకోడలు కావడంవలన) ఉంటూ, ఆధ్యాత్మికచింతనా కాలక్షేపంతో బ్రతుకు వెళ్ళదీస్తూ ఉన్నది! ఆ సమయంలో తనఅక్కగారి బావగారైన నాళం రామలింగయ్యగారితో వారి కుటుంబంతో ఆమెకూడా వెళ్ళి తీర్థయాత్రలు సేవించింది.

ఆ తీర్థయాత్రలలో పూనాలో శ్రీ కార్వేగారు స్థాపించిన వితంతు శరణాలయాన్ని చూచి, బావగారైన, నాళం రామలింగయ్యగారిని "ఇలాంటి శరణాలయాన్ని మీరు స్థాపిస్తే, నేను ఆజీవితాంతం అది నిర్వహిస్తూ, దేశసేవచేస్తూ జీవితాన్ని సార్థకం చేసుకొంటానని పలుమార్లు కామాక్షమ్మగారు ప్రాధేయపడి ప్రార్థించినది. రామలింగయ్యగారు సహజంగా దానధర్మాది కార్యాలపట్ల ఆదరణ కల్గినవారౌట వలనను, నిస్సంతువైన తాను ఈ సంస్థను స్థాపిస్తే తనపేరు శాశ్వతంగా ఉండిపోతుందనే సంకల్పంతోను, తాను కాకినాడలోఉన్నా, విద్యలకు నిలయమైన రాజమహేంద్రవరంలో ఈసంస్థను స్థాపిస్తే, అన్నివిధాల అభివృద్ధి పొందగలదని తలంచినారు. ఆయన అప్పటికే అనేక సేవారంగాల్లో పరిశ్రమించి, పరిక్రమిస్తూ ఉన్న మా నాన్నగారితో ఆలోచించి,

రాజమహేంద్రవరంలో "వైశ్యసేవాసదనము" అనేపేరుతో, ఒకసంస్థను సాపించడానికీ, దానికి శ్రీమతి కామాక్షమ్మ గారు నాయకత్వం వహించి, ఆ సంస్థకు సేవచేయడానికీ, ఏర్పాట్లు చేశారు - తీరా సంస్థ స్థాపించే శుభముహూర్తానికి, వ్యాపారపు ఒత్తిడివలన తాను రాలేక, మొదటనుండీ, ఈ సంస్థ స్థాపనకు పూనుకొని, శ్రమ తీసుకొంటూ ఉన్న, మా నాన్న గారినే ఆ ప్రతిష్ఠాపనా కార్యాన్ని నిర్వహించమన్నారు. అప్పుడు మా నాన్నగారే, తనమిత్రులైన అనకావల్లి వాస్తవ్యులు, రాజమహేంద్ర వరంలో ఉపాధ్యాయ వృత్తి నిర్వహిస్తూ, దేశహితైక కార్యాలలో మా నాన్నగారికి చేదోడువాదోడుగా ఉంటూ సేవచేస్తూన్న శ్రీ కోరు కొండ లింగమూర్తిగారి సహకారంతో వైశ్య సేవా సదనాన్ని 1920వ సంవత్సరంలో స్థాపించారు. స్థాపన సమయానికే, బత్తుల కామాక్షమ్మ గారు, నాళం రామలక్ష్మమ్మగారు, నాళం అమ్మన్నగారు, మాణిక్యమ్మ గారు మొదలైన పెద్ద ఇండ్ల మహిళలు ఆ సంస్థలో ఉండి, తమకు వచ్చిన విద్యను పిల్లలకు నేర్పుతూ జీవితం గడపడానికి నిశ్చయించు కొని, ఆ సంస్థలో చేరారు.

తర్వాత క్రమంగా వైశ్య సేవాసదనం జాతీయ బాలికా పాఠ శాలగా రూపులు దిద్దుకొన్నది

బాపూజీ ఆదేశాన్ని అనుసరించి, భారతదేశమందలి, ఆంగ్ల విద్యా శాలల బహిష్కారము, జాతీయ విద్యాశాలల ప్రతిష్ఠాపనము ఒక ఉద్య మంగా ప్రాబల్యాన్ని పుంజుకొని, దేశీయ విద్యలకు, ముఖ్యంగా భారత సంస్కృతికాట పట్టిన గీర్వాణ విద్యకు ప్రాధాన్య మియ్యడం, ఆ ఉద్దే శంతో జాతీయ విద్యాసంస్థల ప్రతిష్ఠలూ జరుగుతూన్న రోజులవి. ప్రప్రథమమునుండి, జాతీయ విద్యలకు ప్రోత్సాహమిస్తూ సంఘ సంస్కరణమునకు ప్రాధాన్యమిస్తూ, దేశసేవకు, సంఘసేవకూ, సత్యా గ్రహోద్యమానికి అంకితమైపోయిన మా నాయనగారు శ్రీమతి కామా

క్షమ్మగారి అభ్యర్థనపై, నన్ను వైశ్య సేవాసదనంలో విద్యాభ్యాసానికి చేర్చారు.

నాకు జ్ఞాపకం ఉన్నంతవఱకు, వైశ్య సేవా సదనం అప్పట్లో, ఇప్పుడు వైశ్య హాస్టలు నిర్వహింపబడుతూన్న భవనంలో నడుపబడ్తూ ఉండేది. నేను పాఠశాలకు వెళ్ళాలంటే మెయిన్‌రోడ్డులో ఉన్న మా యింటినుండి, కంభవారిసత్రం వీధిగుండా, గోదావరి గట్టునెక్కి, చాలా దూరము నడిచి, గుండువారివీధిలోని సదనానికి వెళ్ళవలసివచ్చేది- అట్లాగే వెళ్ళేదాన్ని, కాని, నాలో బాల్యమునుండీ ప్రవర్ధిల్లుతూ వస్తూ ఉన్న సత్కార్యాచరణపట్ల దీక్ష, స్త్రీల అభ్యుదయంపట్ల ఆదరణ, ఒక విశిష్ట వ్యక్తిత్వంగా రూపుచెంది, నన్ను విశిష్ట వ్యక్తిగా స్థిరరూపంలో నిలువబెట్టినవని చెప్పవచ్చును.

## నా వ్యక్తిత్వ రూపకల్పన

ఆ రోజులలోనే ఒక రోజు సదనానికి వెళ్ళాలని నేను గోదావరి గట్టు ఎక్కి కొంతదూరం నడిచాను - ఇంతలో "లక్ష్మీకాంతం"! అంటూ ముందునుండి ఒక కేక వినబడింది. నాకుముందు ఇరవై గజాల దూరంలో బడికివెళ్తూ ఉన్న ఒక అమ్మాయి జడను, ఒక అల్లరి పిల్లవాడు లాగుతూ ఉండడం నాకు కనబడింది. వయస్సులో ఆ కుర్రవాడు మా యిద్దఱ కంటే పెద్దవాడే. అయినా, నేను ఇదంతా ఆలోచించలేదు. వెంటనే కాలి చెప్పుతీసి ముందుకు పరిగెత్తాను అంతే, ఆ కుర్రాడు కాలికి బుద్ధి చెప్పాడు. ఆ వేళ నాకు కల్గిన ఆనందం ఇంతా అంతా కాదు.

సదనంలోనే నా తరగతిలోనే చదువుతూ ఉన్న సీమకుర్తి సూర్య కాంతం అనే అమ్మాయి - నాకు అత్యంత ఆప్తురాలైన నెచ్చెలి - నేనూ సూర్యకాంతమూ ఒకటే మనస్సూ, ఒకటే ఆలోచనతో మెలగుతూ ఉండేవాళ్ళం!

వాళ్ళు సదనానికి వెళ్ళే ఇంకొకదారిలో మామిడివారి యింట్లో ఉండేవారు! మామిడివారు సంపన్నులేకాక, మామిడి లక్ష్మీపతిగారు సత్యాగ్రహోద్యమంలో కాకలు తీరిన వీరయోధుడు! నేను సాధారణంగా గోదావరి గట్టుమీదనుండే వెళ్తూ ఉండేదాన్నైనా అప్పుడప్పుడు సూర్యకాంతం కోసం ఆ దారిలోవచ్చి సూర్యకాంతంతో కలిసి సదనానికి వెళ్ళేదాన్ని! ఒకరోజు మధ్యాహ్నం సదనానికి బడిసమయానికి వెళ్ళే హడావిడిలో సూర్యకాంతాన్ని కలుపుకొని రావడం వీలుపడక తిన్నగా సదనానికి వెళ్ళిపోయాను. సూర్యకాంతం నా కొఱకు కొంచెంసేపు ఆగి బడికి వచ్చింది. ఆమె వచ్చే వేళకు గంట కొట్టడం ఐపోయింది. ఎండాకాలం! ఎండనిప్పులు చెరుగుతూ ఉన్నది. హడావిడిగా సూర్యకాంతం క్లాసులోకి రాబోతూ ఉండగా మా టీచరు రమణమ్మ "అఁ అక్కడే ఆగు. ఆలస్యంగా వచ్చినందుకు, ఈ పీరియడ్ అంతా నీవు ఎండలోనే నిలబడాలి అంటూ, తన చేతిలోని, తన తాళం చెవులగుత్తి తీసి సూర్యకాంతంపైకి విసిరివేసింది. ఆ తాళంచెవులగుత్తి సరిగా వెళ్ళి సూర్యకాంతం కంటిపై భాగంలో పడగా అక్కడ గాయమై రక్తం వచ్చింది. ఆమెకు తగిలిన తాళంచెవుల గుత్తి విసురుగా వెనుకకువచ్చి గది తలుపు దగ్గఱ బల్లపై కూర్చున్న నా కాళ్ళదగ్గఱ పడింది. నేను వెంటనే ఆ తాళంచేతుల గుత్తిని, కాళ్ళతో నొక్కిపట్టాను. రమణమ్మ టీచరు ఆ తాళంచేతులిమ్మని అనేక విధాలుగా, నన్ను అడిగింది. కాని నేను ఆమెకు తాళంచేతులు యివ్వలేదు. ఆ పీరియడ్ పూర్తైన వెనుక శ్రీమతి కామాక్షమ్మగారి కిచ్చి సూర్యకాంతాన్ని తీసుకొని వెళ్ళి చూపించాను. తాళాలకు రక్తం మరకలు గూడా ఉండడం ఆమె గమనించి, బాధతో విలవిలలాడిపోయారు. ఆమె తన బడిలోని పిల్లలను తన కన్నబిడ్డలకంటె హెచ్చుగా చూచేవారు! నేనంటే ఆమెకు అమిత ప్రేమ! అత్యంత ఆదరణ!

అంతే ఆ మర్నాటినుండి రమణమ్మటీచరు మా సదనంలో కాలు పెట్టలేదు.

ఇంకొక సంఘటన కూడా ఇక్కడ చెప్పాలి. 192[illegible]వ సంవత్సరం ఏప్రియల్‌లో మా సదనం వార్షికోత్సవాలు జరిగాయి. అంతకు ముందుగా ఏడాది పరీక్షలు జరిగాయి. నేను 4వ తరగతి పరీక్షల్లో ప్రథమురాలుగా కృతార్థత పొందియున్నాను. "ఎప్పటిలాగా, నీదే మొదటి బహుమతి; నీకు ఏమి కావాలో, కోరుకో" అని అడిగారు! శ్రీమతి కామాక్షమ్మగారు! నాకు అర్థం కాగలదా? లేదా? అనే ఆలోచనకూడా లేకుండా ఆంధ్ర కవితా పితామహ అల్లసాని పెద్దనార్యుడు రచించిన "మను చరిత్ర" (స్వారోచిషమను సంభవ) మహాకావ్యం కావాలని వెంటనే ఆమె నడిగాను. "నీకు అప్పుడే మను చరిత్ర కావాలా?" అని సప్రేమంగా ప్రశ్నించి నాకు ఆ మర్నాడు వార్షికోత్సవంలో 'మనుచరిత్రను ప్రథమ బహుమతిగా తన చేతులతో అందించారు. అప్పటి నా ఆనందం వర్ణించడానికి అలవికానిది; శ్రీకృష్ణదేవరాయలు తనను – "ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూతనిచ్చి ఎక్కించుకొనియె" నని పెద్దనగారు వ్రాసినట్లు మా పిన్ని (శ్రీమతి కామాక్షమ్మగారు) నన్ను తన చేతులమీదుగా ఒక సాహిత్య మదకరీంద్రముపై నెక్కించినంత బ్రహ్మానందపడిపోయాను. తర్వాత కూడా ప్రతి క్లాసుపరీక్షలోనూ, నేనే ప్రథమురాలుగా, విజయం పొందడం, కళాపూర్ణోదయం, భారతం విరాటోద్యోగ పర్వాలు వసుచరిత్ర మొదలైన కావ్యాలను బహుమతులుగా పొందడం, ఆ కావ్యాలను, వేసవికాలపు సెలవులలో చదివి, నోట్సు వ్రాసుకోవడం, నాకు అలవాటు అయిపోయింది.

## ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల

శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు, శ్రీమతి రావూరి వెంకట సుబ్బమ్మగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి అయిదేండ్ల పరీక్ష ఉభయ భాషా ప్రవీణ పరీక్ష చదివి, ఆ పరీక్షలో ఉత్తీర్ణురాండ్రైనారు. తెలుగు నేలలో ఆ పరీక్షలో కృతార్థత చెందిన ప్రథమ మహిళలు వీరే నేమో.

తర్వాత శ్రీమతి కామాక్షమ్మగారు చాలా ప్రయత్నంచేసి, వైశ్య సేవాసదనానికి, ఉభయ భాషా ప్రవీణ పరీక్షా కళాశాలగా పర్మిషన్ తెచ్చినారు. 193 లో సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు వైస్ ఛాన్సిలర్‌గా ఉన్న సమయంలో వైశ్య సేవాసదనం ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలగా రూపొందినది.

ఆ తర్వాత అనుకొంటాను, ఇంటర్ కొలిజియేట్ పోటీలలో, వక్తృత్వంలో నేను ప్రథమురాలుగా గెలుపు సాధించిన సందర్భంలో కూడా 'ఆముక్తమాల్యద' మహాకావ్యాన్ని బహుమతిగా అందుకొన్నానని సంతోషంగా ఇక్కడ ఉటంకిస్తూ ఉన్నాను - ఆ తర్వాత జరిగిన ఒండు రెండు సంఘటనలను వివరిస్తేనే కాని ఈ ఘట్టం పూర్తికాదు -

తర్వాత మా సదనం వేరే వేరే యిండ్లలోకి మారింది - ఆ మారిన సందర్భాలలోనే, గుంటూరు వాస్తవ్యులు శ్రీ గుంటూరు నరసింహారావు గారి మఱదలు సమయమంత్రుల శకుంతల, గుంటూరు వాస్తవ్యురాలే, కూనిసెట్టి రామరత్నం, J. వరలక్ష్మి అనే ముగ్గురు, సదనంలోని జాతీయ భావాలు ప్రోదిచేసే విద్యావిధానంలో అధ్యయనం జరపాలని, సదనానికి వచ్చారు -

సదనానికి అనుబంధంగా బాలికా వసతి గృహం నడుపబడ్తూ ఉండేది. శ్రీమతి కామాక్షమ్మగారు ఆంధ్రదేశంలో విశేషంగా పర్యటించి విరాళాలను, బాలికలను సేకరించేవారు! అట్లా ఆకర్షితులై సర్వాంధ్రము నుండి, ఎంతమంది బాలికలో సదనంలో విద్యాభ్యాసానికి చేరేవారు! సదన వ్యవస్థాపకులైన, మా పెదనాన్నగారు, శ్రీ నాళం రామలింగయ్యగారే, సదన నిర్వహణకయ్యే మొత్తం ఖర్చును భరించినా, ఉదారులైన దాతలు ఉత్సాహంతో ఇచ్చే విరాళాలను శ్రీ కామాక్షమ్మగారు కాదనకుండా తెచ్చేవారు! అట్లా వచ్చినవారే శకుంతల, రామరత్నమూను, వీళ్లిద్దఱూ నా సహాధ్యాయినులు.

వారు చేరేటప్పటికే నసుకొంటా సదనం, కంభంహారి వీధిలో శ్రీ గుమ్మడిదల మనోహరం పంతులు జమీందారుగారి యింటి కెదురుగా ఉన్న ఒక ఇరుకుదారితో లోపలగా ఉన్న చిన్నయింట్లోకి మారింది. అక్కడ చదివే రోజులలో శ్రీమతి భువనగిరి లక్ష్మీకాన్తమ్మగారు మాకు తెలుగు ఉపాధ్యాయినిగా ఉండేవారు! ప్రసిద్ధ బ్రహ్మ సమాజ సభ్యులు శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు ప్రతివారం వచ్చి, మాకు దేశ భక్తి ప్రబోధకమైన విషయాలు బోధించడమేకాక బ్రహ్మ సమాజ కీర్తనలు నేర్పేవారు.

వారు మా తరగతి నడుపుతూ ఉన్నపుడు నాకెంతో ఆహ్లాదంగా ఉండేది! వారి బోధన విధానంలో ఆ ఆకర్షణ ఉన్నది. అయితే నేను క్లాసులోగాని, క్లాసులేనపుడుగానీ చేసే అమితమైన అల్లరిని, మాన్పి పట్టలేని ఆ ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని ఒక మంచి పద్ధతిలో పెట్టాలని ప్రయత్నించేవారు! క్లాసులో ఏ అమ్మాయిని ప్రశ్నించినా, నేనే సమాధానాన్ని చెప్పేదాన్ని, దాన్ని ఆపుచేయాలని వారొకనాడు పిల్లలకు ప్రశ్న వేసె ముందుగా, నన్నుద్దేశించి "లక్ష్మీకాంతం, నీవు ఈ వెనుక గదిలోకి వెళ్ళు, నేను పిలిచేవరకు నీవు అక్కడే ఉండాలి. మాట్లాడ కూడదు." అని, నన్ను వెనుకగదిలోకి పంపి, గదికివతల గొళ్ళెం పెట్టేసి, పిల్లలనుద్దేశించి ఒక పాఠ్యాంశంలో ప్రశ్న వేశారు. క్లాసులో మేము ఏడెనమండుగురం ఉండేవాళ్ళం. వారు ఒక్కొక్కరినీ పేరు పెట్టి అడుగుతూంటే నేను 'తీగెల మహాలక్ష్మి చెప్పలేదు, రాజేశ్వరి చెప్పలేదు, గోవిందం చెప్పలేదు' అని అందఱనూ లెక్కించుకొంటూ ప్రసిద్ధమైన గారెల కథలో తన్ను గదిలో పెట్టి తాళంవేసినా చుంయ్యి, చుంయ్యిని ఒక అల్లరి పిల్లవాడు లెక్కించుకొని గదిలోనుండే "అమ్మా నీవు ఇన్ని గారెలు వేయించావు. అందులో భాగంగా నాకిన్నిరావాలని కేకలు వేసి నట్లు, నా లెక్కప్రకారం, క్లాసులో పిల్లలెవరూ, వారి ప్రశ్నకు బదులు చెప్పకపోవడం గమనించి, ఉరకలువేసే ఉత్సాహంతో గదిలోనుండి

ప్రకాశరాయడుగారూ, ఎవరూ జవాబు చెప్పలేదుకదా! తలుపు తియ్యండి, నేను చెప్తానంటూ, ఒకటే కేకవేశాను - శ్రీ ప్రకాశరాయడుగారు చాలా సాత్వికులు! పాపం నాదుడుకు తనానికి తట్టుకోలేక పోయారేమో! అమ్మా!, ఎంత ఆవేశమే, రా, అంటూ గొళ్ళెం తీసి, తలుపు తెఱచారు. ఒక్క ఉదుటున బయటకు దుమికి, ఆ ప్రశ్నకు జవాబు చెప్పి, వారి ఆశీస్సును పొందగల్గిన సంతృప్తి, నాకిప్పటికీ, తలచుకొంటే పుక్కిలింతలుగా వచ్చి నన్నొక తాదాత్మ్య స్థితిలోకి తీసుకొని వెళ్తుంది -

ఇంతకంటె మహత్తరమైన సంఘటన ఇంకొకటి ఆ యింటిలో ఉండగానే జరిగింది! ఆ సంఘటన నా జీవితానికే ఒక మహనీయస్మృతి!

మా ఉపాధ్యాయినియైన శ్రీమతి భువనగిరి లక్ష్మీకాన్తమ్మగారి చెల్లెలు, శ్రీమతి రాజేశ్వరమ్మగారు గొప్ప యోగసాధకురాలు! ఆమె ధ్యానసమాధిని కూడా పొందుతూండేవారు! ఒకనాడు, వారి అక్కగారు సదనానికి రాలేకపోగా, ఆమె మాకు క్లాసు నడపడానికి వచ్చారు - ఆమె రావడం కొంచెం ఆలస్యమయ్యేసరికి, నేను మా గ్యాంగ్ పిల్లలతో, త్రొక్కుడు బిళ్ళ, త్రాడు ఆట ఆడ్తూ, మహోత్సాహంతో, అల్లరిచేస్తూ పారవశ్యంలో ఉన్నాను - ఆమె మెల్లగా, నడుచుకొంటూ వచ్చి, అప్పుడే యోగసమాధినుండి బహిస్స్మృతిలోకి వచ్చారేమో! అరమోడ్పు కనులతో, ఆ సమాధిగతమైన ఆనందానుభూతి కనులలో దోగాడుతూ ఉండగా, సగం బాహ్యస్మృతితో, నన్ను "లక్ష్మీకాంతం, ఇలారా, ఇలారా" అని పిలిచారు! అంత అల్లరి ఆగంచేస్తూ ఉన్న నేను మంత్ర ముగ్ధురాలనై, చేతులు జోడించి ఆమె సన్నిధికి చేరాను. ఆమె నాతలపై, వీపుపై, భుజములపై, తన దివ్యహస్తాలతో నిమిరి, నా చేయిపట్టుకొని, క్లాసులోకి తీసికొనివెళ్ళి తన దగ్గఱగా కూర్చొబెట్టుకొన్నారు. పొడవు పొడవునా, నా ఒడలంతా ఆమె పావనహస్త స్పర్శకు పులకించి పోతూ ఉంటే, అమేయమైన, అతిలోకమైన ఆనందపారవశ్యాన్ని అనుభవిస్తూ,

నేను అవాక్కైపోయి, ఆమె కండ్లలోకి కండ్లుపెట్టి తదేక ధ్యానంగా చూస్తూ శిలా ప్రతిమలా కూర్చొని ఉండిపోయాను. ఆమె, మెల్లగా కండ్లు విప్పి, "లక్ష్మీకాంతం ! ఎందు కలా అంత అల్లరి చేస్తావు ! నీవు, నీ భవిష్యజ్జీవితంలో ఎంత గొప్పదానవౌతావో నీకు తెలియునా, నీ విద్యా పరిశ్రమకు మించిన ప్రఖ్యాతి నార్జిస్తావు · గొప్ప దేశసేవ, సంఘసేవ, సాహిత్యసేవా చేస్తావు ! నీకు మంచి గుణవంతులు, బుద్ధిమంతులు అయిన సంతానం అయిదుగురుంటారు. ఉదారుడైన, విద్యావంతుడు అయిన భర్త లభిస్తాడు - నీ ప్రతి సేవా కార్యక్రమంలో నీ భర్తగారి ప్రేరణ, ఆదరణ ఉంటుంది". అని చెప్పి, 'నీవంటి అమ్మాయి అల్లరి చేయకూడ దమ్మా' అని శిరస్సుపై చేయి ఉంచి ఆశీర్వదించారు. నా చేతులు పట్టుకొని అల్లరి చేయవద్దని ఆదేశించారు. ఒక్కమాఱుగా నా ఒడలు ఝల్లుమన్నది.

తర్వాత మా సదనం కాలక్రమేణ, కంభంవారి వీధిలో ఉన్న గుమ్మిడిదల మనోహరం పంతులుగారిదేయైన వారి యింటిప్రక్క మేడ లోకి మార్చబడింది. అక్కడ ఆడుకోవడానికి మంచి స్థలము ఉండేది. సాయంత్రం స్కూలు కట్టేసిన తర్వాత ఆ స్థలంలో బ్యాడ్‌మింటన్, రింగ్ టెన్నిస్, టెన్నికాయిట్ ఆటలు ఆడుకొనేవాళ్ళం

క్లాసుల్లో ఉండగా ఎవరైనా చూడ్డానికి వస్తే వాళ్ళమీద నేను ఆశువుగా అధిక్షేపణాపూర్వకమైన తేటగీతికలు చెప్పేదాన్ని క్లాసుల్లో విప రీతంగా అల్లరిచేసేదాన్ని ! ఒకమాఱు శ్రీ కామాక్షమ్మగారు 'ఏమిటి లక్ష్మీకాంతం ! క్లాసుల్లో పిల్లల్ని చదువుకోనిస్తావా లేదా' అని అడిగే వారు ! స్కూలుమూసేసిన తర్వాత ఆడుకొని ఇంటికి వెళ్ళి టిఫిను తిని, శ్రీ మానాన్నగారితో గౌతమీ గ్రంథాలయానికో, టౌనుహాలులోని, బ్రహ్మ సమాజ ప్రార్థనా మందిరానికో, లేక ఇంకేదైనా, సాంస్కృతిక సమావేశాలకో వెళ్లేదాన్ని !

## ఈ ప్రేరణతో

ఒక్కొక్కమాఱు గౌతమీ తీరాన శ్రద్ధానందఘాటులో జరిగే సత్యాగ్రహోద్యమ సభలకు వెళ్లి వింటూండేదాన్ని, ఎవరైనా ఆహ్వానిస్తే సాహిత్యోపన్యాసాలు చేసేదాన్ని, ఈ నా బహుముఖసాంస్కృతికకళారంగాసక్తి గమనించే కాబోలు! కాంగ్రెసుపార్టీవారు ఎప్పుడైనా సత్యాగ్రహోద్యమ సమయంలో నా ప్రసంగాలు ఏర్పాటు చేసేవారు!

అప్పట్లో శ్రీ చెరుకువాడ నరసింహం పంతులుగారు పేరుకెక్కిన మహావక్త! ఆయన ప్రసంగించి వెళ్ళిన తర్వాత ఎవ్వరు ప్రసంగించినా జనం వినేవారు కాదు. ఆ కారణంగా, ముందే నన్ను పిలిపించి ఆయన ప్రసంగం కాగానే రాజమండ్రి కాంగ్రెసు నాయకులైన శ్రీ పాలకోడేటి గురుమూర్తిగారు, ఇంకా పెద్దలు, నన్ను మాట్లాడమనేవారు. గోదావరి తీరాన, మార్కండేయస్వామి ఆలయంవద్దఉన్న మిక్కిలి పొడవైన మెట్లు ప్రసంగాలకు ఒక గ్యాలరీగా ఉపయోగపడేవి. అప్పుడంతగా మైకుల సహాయం కూడా ఉండేది కాదనుకుంటాను. అయినా వేలకొలదీ జనం క్రిక్కిరిసి కూర్చొన్న ఆ సమావేశాల్లో నేను మాట్లాడుతూంటే కూడా జనం శ్రద్ధగా, ఓపికగా వింటూ ఆనందంతో, హర్షధ్వానాలు చేసేవారు!

అప్పటినుండీ ఉపన్యాసాలంటే నాకు భయం పోయింది - అప్పుడు నాకు 12 ఏండ్ల ప్రాయం ఉండేది?

## హిందీ ప్రచారం

చేసే ఉద్యమానికి, నేను అప్పట్లో వ్యతిరేకంగా పనిచేసేదాన్ని, ఈ మా నాన్నగారి యింటికి ముందువైపు పెద్ద పెద్ద అరుగులుండేవి. ఆ అరుగులలో ఎడమవైపు అరుగు చివరగదిలో ప్రసిద్ధకథారచయిత

శ్రీ, శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కళాభివర్ధనీపరిషత్తు అనే సంస్థ నడుపుతూ ఆ గదిలో ఉండేవారు: ఆయన ప్రతిరోజూ 'అమ్మాయి', ఇలారా, అని నన్ను పిలిచి, హిందీ భాషాప్రచారం వలన తెలుగుభాష కెంత అపచారం జరుగుతూ ఉన్నదో ఉదాహరణలతో నిరూపించి చెప్ప డమే కాక, రాత్రిపూట పల్లెటూళ్ళకు నన్ను తీసికొనివెళ్ళి, అక్కడ రాత్రి బడులుపెట్టి, పగలల్లా పొలాల్లో కష్టించి పనిచేసి వచ్చిన రైతాంగానికి, కార్మికులకు, తెలుగేరాని ఆ జనానికి హిందీప్రచార సభవారు హిందీ ఎట్లా చెప్తూ ఉన్నారో చూపించేవారు!

దానితో తెలుగు భాష అంటే పులకించిపోయి, ప్రౌఢ స్తమానమూ, తెలుగు భాషాభివృద్ధికొఱకు తపించి పోయే నాకు హిందీ భాషా ప్రచార మంటే ఏవగింపు కల్గింది. ఆ సమయంలో శ్రీ కాకాకలేల్కర్‌గారు ఆంధ్ర దేశంలో హిందీ ప్రచారార్థం వచ్చారు - హిందీ ప్రేమికులంతా, రాజ మహేంద్రవరంలో హిందూ సమాజంలో ఒక పెద్ద సభ జరిపారు - నేను ఆ సభకువెళ్ళి, మధ్యలోలేచి "కాకాకలేల్కర్"జీ ఆప్ హమారే దేశమే హిందీ ప్రచార్ కేలియే క్యోం ఆగయే? అని ప్రశ్నించాను - అక్కడి పెద్దలంతా "కూర్చో అమ్మాయి, అట్లా మధ్యలోలేచి పెద్దవారిని ప్రశ్నించ వచ్చునా?" అని అడ్డుకొన్నారు. కానీ, నేను జంకకుండా, మళ్ళీ ఆవిధం గానే ప్రశ్నించాను - అప్పుడు కలేల్కర్‌గారు, ఆ సభా నిర్వాహకులను, కార్యకర్తలను ఆపి, నన్ను దగ్గఱకు పిలిచి, అసలు విషయం అడిగి తెలుసుకొని హిందీ ప్రచారంలోని లోపాన్ని తెలుసుకొని, చాలా బాధపడి, "ఔను ఎవరికైనా మాతృభాషలో బోధ ముఖ్యం! అది లేకుండా పర భాషను బోధిస్తేమాత్రం, ఆ దేశజనులకు అపచారం చేసినట్లేకదా! అని "అయితే దీనికి విరుగుడుగా, నీవేమి సలహాఇస్తావు?" అని ప్రశ్నించారు వెంటనే, నేను "మీ హిందీ పాఠ్యాంశ ప్రణాళికలో ఒక తెలుగు పాఠ్యాం శం పెట్టండి" - అన్నాను - వారు ఎంతో సంతోషించి, చిన్నదానివైనా

చాలా చక్కగా సూచించావమ్మా" అని ప్రశంసాపూర్వకంగా నన్ను ఆశీర్వదించారు. తర్వాత వారి హిందీ పాఠ్య ప్రణాళికలో మార్పు తెచ్చి ప్రాథమికనుండి అన్నితరగతులలోను ఒక తెలుగు పుస్తకాన్ని ప్రవేశ పెట్టారు - ఈ విషయం తలచుకొన్నపుడల్లా తల్లి సేవలో ఇంత మహా త్కార్యం సాధించే అవకాశం నాకు లభించింది కదా అనే సంతృప్తి కల్గ డమే కాదు! తెల్గు జాతి చరిత్రలో ఇదెంత గర్వకారణం! అని అనుకొని ఉప్పొంగిపోతూ ఉంటాను. సరిగా అదే సమయంలో శ్రీమతి దుర్గా బాయమ్మగారు, వారితల్లి ఔన్నూరి కృష్ణవేణమ్మగారు, కాకినాడ నివాసం విడిచి, రాజమహేంద్రవరంచేరి, మా కామాక్షమ్మగారి అభ్యర్థ నపై మా సదనంలో హిందీతరగతులు పెట్టినపుడు అక్కడ చదివి, హిందీలో ప్రాథమిక, మధ్యమతరగతులలో, కృతార్థత చెందియున్నాను కాని యీ సంఘటన జరిగిన తర్వాత, నేను హిందీ విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పడం జరిగింది.

ఈ విధంగా నా విద్యాభ్యాసం, సేవాకార్యక్రమాలు, ఒండొంటిని, పెనవైచుకొని, సాగిపోతూ ఉండగా, వెనుక ప్రస్తావించినట్లుగా, శ్రీమతి మా పిన్నిగారు ఉభయ భాషాప్రవీణ పట్టపరీక్షలో విజయం పొంది, ఊరుకొనక శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు, తన సంస్కృత భాషా దరణకు, సంఘసేవకు ఆకర్షితులై, ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలను ప్రసాదించిన మహోత్తమావకాశానికి ఉత్తమ ప్రయోజనం కలుగవలెననే మహిదాకాంక్షతో తన పాఠశాలయందలి బాలికలందఱకు ఆ ప్రాచ్యపట్ట పరీక్షచదివే అవకాశం, కల్పించాలనే అభిలాష, అభిలాషమాత్రమేకాదు వాంఛప్రగాఢంగా ఆమెకుకల్గింది. శ్రీమతికామాక్షమ్మగారిబుద్ధిలో,ఏకాంశ మైనా ప్రవేశించవలెనేకాని, ప్రవేశిస్తే ఆ ఆలోచన, కార్యరూపం ధరించే వఱకూ ఆమె నిద్రపోయేదికాదు - ఎంత మహత్తర కృషియైనాసరే సల్పి ఆ కార్యాన్ని సాధించేది! అనన్య సాధ్యమైన అంత దీక్ష, మహోన్నత మైన సదాశయాలు, ఆమెకు జీవనాడులుకాబట్టే, ఆమె మా యింటికివచ్చి

మా నాన్నగారితో చెప్పి 'బావగారూ సంస్కృతకళాశాల నెలాగైనా సాధించాలి. దానికి రామలింగయ్యగారి నెట్లాగైనా ఒప్పించండి' అని అభ్యర్థించింది. అంటే దీనికి ఒక కారణమున్నది. సదనం నిర్వహణ నానాటికీ పెరిగి రామలింగయ్యగారికి కొంచెం ఆర్థిక సమస్యగానే తయారైనది. అయినా ఆయనకూడా కామాక్షమ్మగారి, పట్టుదలకు కాదనలేక, వైశ్య సదనం కమిటీచే నిర్వహింపబడే విధానంలో ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలను స్థాపించడానికి ఆయన అంగీకరించారు -

వెంటనే ఆ ప్రయత్నాలన్నీ చురుకుగా జరిగాయి - శ్రీమతి కామాక్షమ్మగారు ప్రిన్సిపాలుగా 'ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల అవతరించింది -

వెంటనే కామాక్షమ్మగారు, 'మనలక్ష్మీకాంతాన్ని కాలేజీలోచేర్పించి ఉభయభాషా ప్రవీణ పరీక్షకు చదివించండి. "అని మా నాన్నగారి నడిగింది. "ఆఁ చిన్నపిల్ల ! ఆ పెద్ద కావ్యాలేమి చదువగలదు ?" అని మా నాన్నగారు కొంత సంకోచించారు. "ఆఁ చిన్నపిల్ల అంటూ ఉన్నారా! మన అమ్మాయి సంగతి మీకేం తెలుసు ! అమ్మాయి ఇప్పటికే మను చరిత్ర మొదలైన మహాకావ్యాలు చదివింది.' అని ఆమె చెప్పగానే, మా నాన్నగారు కొంత ఆశ్చర్యపడి - సరే కళాశాలలో చేర్చుకో-తెలుగు కావ్య పరిచయమైనా కల్గుతుంది.' అని, తన అంగీకారం తెల్పారు - కానీ మా అమ్మకు అంతగా ఇష్టంలేదు. నేను నాల్గవ తరగతి చదువుతూ ఉన్నపుడే, నాకు ఆంగ్ల భాషా జ్ఞానం, కల్గించవలెననే ఉబలాటంతో నన్ను ప్రభుత్వ బాలికోన్నత పాఠశాలలో చేర్పించాలనే ప్రయత్నంతో హైస్కూలుకు తీసికొని వెళ్ళింది - సదనం జాతీయ విద్యా ప్రాధాన్యం కల విద్యాసంస్థయైనందువలన, సదనంలో, చరిత్ర, లెక్కలు, భూగోళం అన్నివిషయాలూ బోధించినా, తెలుగు సంస్కృత భాషలకు ప్రాధాన్యం ఇచ్చే విద్యావిధానం సదనంయొక్క విద్యాప్రణాళికగా

ఉండేది. ఆంగ్ల భాషకు అంత ప్రాధాన్యం ఉండేది కాదు - ఆ కారణంగా గవర్నమెంట్ గరల్స్ హైస్కూలువారు "మీఅమ్మాయి ఇంగ్లీషులో Poor గా ఉన్నందున మళ్ళీరెండవ తరగతినుండి చదవవలసి ఉంటుంది" అన్నారు - అలాగైనా సరే-అని మా అమ్మ ఆ హైస్కూలు విద్యాభ్యాసానికి సిద్ధపడింది - కాని నేను మాత్రం, సదనంలోని జాతీయ విద్యను విసర్జించి గత పాఠశాలలో తక్కువ తరగతిలోచేరి ఇంగ్లీషు పాఠ్య క్రమంలో విద్యాభ్యాసం చెయ్యడానికి అంగీకరించలేదు -

నేను పట్టుదలకల స్వభావంకలదానిననీ, మా తండ్రిగారి అన్న తమ్ముల అయిదు కుటుంబాలలో అప్పటికి, (మా నాయనమ్మ పేరుతో ఉన్న) ఆడపిల్లను నే నొక్కదానినే ఆగుటవలన, మా పెదనాన్నగారు నాళం వెంకటరత్నంగారు వారి పెద్దకుమారుడు, నాళం పెద్దరాజారావు గారు అత ంతంగా నాపై ప్రేమ చూపుతూ, గారాబం చెయ్యడంవలన నాలో కొంతపట్టుదల స్వభావము ఏర్పడిందనీ, మా అమ్మఅభిప్రాయపడి, ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలలోచేరి ప్రాచ్యపట్ట పరీక్షకు చదవడానికే తాను కూడా అంగీకరించింది -

నా కప్పుడు 3 సంవత్సరాల వయస్సు! డిసెంబరులో, నాకు పదమూడవ సంవత్సరంవస్తే, మార్చిలో చీరాల వాస్తవ్యులైన శ్రీ ఊటుకూరి వేంకటేశ్వరశ్రేష్ఠిగారి ద్వితీయ పుత్రులైన శ్రీ హయగ్రీవ గుప్త గారితో నాకు వివాహమైనది - అప్పటికే సత్యాగ్రహోద్యమ కార్యక్రమాలలో ఉన్న, నేను వివాహమైన తర్వాత కూడా ఆ సత్యాగ్రహోద్యమ కార్యక్రమాలను మానలేదు. పికెటింగులకు వెళ్ళడం, ఖాదీవస్త్రాలను అమ్ముతూ హాకింగులు చేయడం, ఊరేగింపులలో పాల్గొనడం, ఉపన్యాసాలియ్యడం ముఖ్యంగా నా సేవాకార్యక్రమాలు! కానీ వీటికి మించిన యింకొక ముఖ్య కార్యక్రమాన్ని శ్రీ మా నాన్నగారు, నేనూ కలిసి నిర్వహించామని చెప్పడానికి, గర్వపడ్తూ ఉన్నాను - సబర్మతీ ఆశ్ర

మాన్నుండి, ఇంకా, కాంగ్రెసు నాయకులనుండి, ఇంగ్లీషు రహస్య పత్రాలను మా నాన్నగారు రాత్రిపూట, తెలుగులోకి అనువదించి చెప్తూ ఉంటే, నేను వ్రాసేదాన్ని, తెల్లవారుజామున మూడుగంటలకు కార్యకర్తలా పత్రాలను తీసుకొనివెళ్ళి అచ్చువేయించేవారు. తెలవారేసరికి, ఆ పత్రాలు కాలేజీలలో, సోడాఅంగళ్ళల్లో, హోటళ్ళలో అందరికూ అందుబాటులో ఉండే ఏర్పాట్లు జరిగేవి. ఇంక చూచుకోండి, ప్రజలంతా విరగబడి, వేడివేడి పెసరట్లలా ఆ కరపత్రాలను చదివి, ఉద్రేకంతో ఊగిపోయి, సత్యాగ్రహోద్యమానికి ఏరోజు కారోజు క్రొత్త ఊపిచ్చేవారు! ఈ భాగ్యం నాకు కాక ఇంకెవరికి కల్గిందని మురిసిపోతూ ఉండేదాన్ని-

ఇంతకంటె ఘనకార్యం ఇంకొకటి యిక్కడ పేర్కొంటేనేతప్ప, ఈ సత్యాగ్రహోద్యమ సేవాకార్యక్రమాధ్యాయం ముగించడానికి వీలుకాదు- రాజమహేంద్రవరంలో ఏ ఊరేగింపు జరిగినా, కాంగ్రెసు నాయకులు, నన్ను, గాడిచెర్లవారి అమ్మాయి, ఝూన్సీ అని పిలువబడే శేషను ఊరేగింపు మొగలో నిలువబెట్టి మైక్రోఫోనుల్లో పాటలు చెప్పించేవారు శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారి "మాకొద్దీ, తెల్లదొరతనము," హరీంద్రనాథ్ ఛట్టోపాధ్యాయగారి "శురూహువా హైజంగ్ హమారా," మొదలైన పాటలనేకాక, ఆ రోజులలో హెడ్‌కానిస్టేబులుగాఉన్న నమ్మయ్యపై, పోలీసు అధికారి ముస్తాఫాపై, సర్కిల్ఇన్స్పెక్టరు డప్పుల సుబ్బారావుపై మా నాన్నగారు వ్రాసిన "నమ్మయ్యా నీ బ్రతుకమ్మొయ్యా", 'ముస్తాఫా, నీకస్తీ ఏమిటిరా,' డప్పుల సుబ్బారావూ, నీ బ్రతుకు కప్పులపాలేరా మొదలైన పాటలను మే మిద్దరమూ ఊరేగింపుల మొగలో నిల్చుని మైక్రోఫోనులో చెప్తూంటే ఊరేగింపులోని వారందరూ పాడ్తూ ఉండేవారు -

ఒకరోజు ఒక పెద్ద ఊరేగింపు కాంగ్రెసు కార్యాలయంనుండి బయలుదేరి, గోదావరిస్టేషనుకు చేరేటప్పటికి, పోలీసు ఆఫీసరు ముస్తాఫా

తన సిబ్బందితో ఊరేగింపు చెదరగొట్టడానికి 'లాఠీమారో' అని సిబ్బంది నాదేశించాడు - లాఠీచార్జీ ప్రారంభమయింది. ఊరేగింపులో పాల్గొన్న జనం అంతా చెల్లాచెదరై పోయారు-నేను, ఝాన్సీ, కాంగ్రెసు బ్యానర్లు, కాంగ్రెసు జెండాలు పట్టుకొని మొగలో అట్లానే నిలబడి పోయాం పైగా మేమిద్దరం జెండాలు విడిచిపెడితే ఆ నాటి ఊరేగింపులో కాంగ్రెసువారు ఓడిపోయినట్లేఅనికూడా, మేమిద్దఱంకూడ బలుకుకొని జెండాలు, బ్యానరూ విడిచిపెట్టకుండా, నిలబడిపోయాం - ముస్తాఫా మా దగ్గఱకు వచ్చి బ్యానరు వదిలేసి, జెండాలు దింపెయ్యమని బిగ్గఱగా అరుస్తూ చెప్పాడు- మేమిద్దఱం, ఒకరినొకరు చూచుకొని, సైగలద్వారా, లొంగి పోగూడదనే నిర్ణయానికివచ్చి మాట్లాడకుండా, జెండాలకు మఱింత పైకి ఎత్తాము -

దానితో మండిపోయి ముస్తాఫా కోపంతో ఊగిపోతూ, చిందులు దొక్కుతూ, 'లాఠీ మారో' అని ఆకాశం మారుమ్రోగేటట్లు అరిచాడు - లాఠీలు పైకిలేచాయి. మే మిద్దఱం మా కింక నూకలు చెల్లినట్లే నను కొన్నాం - కానీ ఇంతలో ఒకహఠాత్సంఘటన - "అయ్యో, అయ్యో, పిల్లలు, పిల్లలు, అక్కడే చిక్కడిపోయారు" ! అనే ప్రజల కేకలతో ఆ వాతావరణం అంతా దద్దరిల్లి పోయి, పోలీసుల్ని, లెక్కచెయ్యకుండా, చాలామంది మా వైపునకు దూసుకొనివచ్చి, మా యిద్దఱనూ, చెరోవైపు లాగేసి భుజాలపై ఎత్తుకొని, దూరానికి తీసుకుపోయారు ! ? !

ఈ సంఘటనతో, కాంగ్రెసుకు ప్రతిష్ఠ పెరగడమేకాక, పోలీసుల అపజయం ! మా యిద్దఱి ప్రాణాల సంరక్షణ ? అన్నీ కన్నుతెఱచి, కన్నుమూసేటంతలో జరిగిపోయాయి ! ఇక చూచుకోండి ! ! ఆ మర్నాటి నుండీ ప్రజలనుండి, మాకు అందిన పొగడ్తలతో మేము ఉక్కిరిబిక్కిరై పోయాం ! ఈ సందర్భంలోనే ఇంకో మహత్తరసంఘటనకు ప్రస్తా వించక తప్పదు.

బాపూజీ విదేశ వస్త్ర దహన కార్యక్రమంలో రాజమహేంద్రవరం వస్తూ ఉన్నారన్నవార్త మా అమ్మ చెవిని పడింది - ఆమె గాంధీగారికి పరమభక్తురాలు! ఆమె జమీందార్ల ఆడబడుచు! జమీందార్ల కోడలు! ఆమె నిత్యమూ కట్టే బారెడు బారెడు సరిగంచు విదేశీ చీరెలన్నిటినీ బీరువాలలో నుండి, తీసి, రెండు, మూడు పెద్ద పెద్ద మూటలుగా కట్టి గాంధీజీ వెళ్ళే దారిలో నిల్చొని, ఆయనబండి నాపించి, తాను బాపూజీ సన్నిధిలో విదేశ వస్త్ర దహనం చేస్తానని చెప్పింది - బాపూజీకి ఇంతకంటె, కావలసిన దేమున్నది? ఆయన మెయిన్‌రోడ్డుమీద (ఇప్పుడు మా తమ్ముడు కామేశ్వరరావు ఉంటూ ఉన్న ఇంటి రోడ్డుమీద) తన కారును ఆపించారు మా అమ్మ తాను స్వయంగా తన విదేశీ చీరెలను రోడ్డుమీద పడేసి, తన చేతులతో నిప్పంటించేసింది. జ్వాలాజిహ్వుడు, నాలుకలు చాపి, ధగద్ధగాయమానంగా వెలిగి ఆ విదేశీ వస్త్రాలకు సద్గతి చూపించాడు. ఇక, ఆ సమయంలో అక్కడ ఇసుకవేస్తే రాలకుండా జనం పోగయ్యారు ఆ సమయంలో గాంధీజీ నన్నుపిలిచి, ఆడవాళ్ళదగ్గరనుండి, 'సోనా లావో' అని ఆదేశించారు! సంతోషంతో గంతులు వేసుకొంటూ, నేను నాగొనుపట్టుకొని స్త్రీల సమూహంలోకి చొచ్చుకొనిపోయి "బాపూజీ బంగారం అడుగుతూ ఉన్నారు! బానిస బ్రతుకులకు విముక్తి కల్పించే నిధియిది! ఈ నిధిని సమకూర్చి, బాపూజీకి, బాసటగా నిలువబడి, స్వాతంత్ర్య సమరంలో పాలుపంచుకోండి"! అని, వినాదాలిస్తూ మహిళలను బంగారం అభ్యర్థించాను - బంగారం నగలు గుట్టలుగా ప్రోగుపడ్డాయి. అవన్నీచూచి, గాంధీజీ సంతోషంతో నవ్వుతూ, నా భుజంతట్టి "తుమ్‌హారా భాగ్ క్యాహై?" అని అడిగారు - వెంటనే, నేను నా ఎడమచేతి గాజుతీసి, గాంధీజీకి ఇచ్చివేశాను! ఆవేళ బాపూజీ నా భుజంతట్టిన భాగ్యం రామాయణంలో సేతుబంధన సమయంలో శ్రీరామచంద్రుడు తనకు సాయం చేసిన ఉడతలపై ప్రేమతో, తన వ్రేళ్ళ ముద్రలువేస్తే అవి అట్లాగే ఇప్పటికీ కనబడ్తూ ఉన్నంత ప్రస్ఫుటంగా, నా భుజంమీద, ఆ మహా

త్ముని మహనీయ స్పర్శ అట్లాగే, ఉండి, నాకు త్యాగానికీ, స్వాతంత్ర్యోద్యమ నిర్వహణకూ ప్రేరణగా నిలిచిపోయింది. అంతేకాదు గాంధీజీకి, గాజునిచ్చిన చేతికి, నేను పెళ్ళయేవఱకూ మళ్ళీ గాజు తొడగలేదు - "ఇది గాంధీగారి చెయ్యి" అని గర్వంగా చేయెత్తి చూపేదాన్ని !

ఈలాంటి సంఘటనలెన్నో జరుగుతూంటే ముందు ముందు నేను సత్యాగ్రహోద్యమానికే అంకితమై పోతానేమో' అనే భావంతో కాబోలు చీరాల మా అత్తవారినుండి "అమ్మాయిని, ఇంక సత్యాగ్రహోద్యమంలో పని చెయ్యకుండా, చూడండి అనే ఫర్మానాను అందుకొన్నారు; మా నాన్నగారు !

చీరాలలో మా ఊటుకూరివారి కుటుంబానికిఉన్న పేరుప్రతిష్ఠలు ఇంతాఅంతా కాదు! వాళ్ళంతా ఫక్తు కాంగ్రెసువాదులు, అంతేకాదు మా మామగారు, దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి "పన్నుల నిలిపివేత కార్యక్రమంలో, వారి పిలుపుమేరకు వాడరేవులో ఒక్కరాత్రిలో తాటాకు, ఇళ్లు కట్టించి, చీరాల నగరమంతా ఇళ్లు ఖాళీ చేయించి, ఆ పాకాల్లోకి తరలించి, మునిసిపాలిటీకి ఒక్క రూపాయి, పన్ను వసూలుకాకుండా ఉద్యమం నిర్వహించారు! అయినా, మఱి మా బావగారు ఈ చిన్నపిల్ల ఇప్పుడే ఇంత తీవ్రావేశంతో ఉద్యమంలో చేరిపోతే, మఱి సంసారనిర్వహణమెట్లా అనుకొన్నారేమో! తర్వాత ఎంతో పట్టుదలతో పోరాడి, నేను, మాఅన్నయ్య భీమవరందగ్గఱఉప్పు సత్యాగ్రహానికి, మా అమ్మగారిని, ఒప్పించాము కానీ, భీమవరం ఉప్పు సత్యాగ్రహానికి నిర్వాహకులు దండు నారాయణరాజుగారు, చిన్నపిల్లలనే, కారణంతో - మా యిద్దఱనూ ఒప్పుకోలేదు. ఆయనే కనుక ఒప్పుకొనిఉంటే, ఉప్పు పండించే భాగ్యం కూడా మాకు లభించేది!

మా అమ్మ తాను స్వయంగా రాట్నంపై వడుకుకొన్న ఖద్దరు నూలుతోనే చీరెలు నేయించుకొని, అవే కట్టుకొనేడి, మా నాన్నగారికి

రెండు ధోవతులిచ్చి, గాంధీజీకి రెండు జతల అంగవస్త్రాలు పంపేది. మేమూ విధిగా ఖాదీనే ధరించేవాళ్ళం! ఆమెకు గాంధీగారంటే, అంత వీరభక్తి! దీనితో నా సత్యాగ్రహ సేవనుగూర్చి ప్రధాన విషయాలు ముగిసినట్లే—

కాల గమనంలో ఏదీ ఆగదు - ఇవన్నీ యధావిధిగా నడిచిపోతూ ఉన్నా, వీనితోబాటు, సమానవేగంతో మా నాన్నగారి రచనావ్యాసంగం కూడా జరిగిపోతూ ఉండేది! మా తలిదండ్రులకు ఎనమండుగురు సంతానం. అందులో కొంతమంది కలువైనారు. నా తర్వాతి సంతానానికి నాన్నగారు "కామరాజు" అని తన తండ్రిగారి పేరు పెట్టుకొన్నారు - ఆ పిల్లవాడెంతో అందగాడు, తెలివైనవాడు; ఆ బాలుడు పసిబిడ్డ గుణంతో మమ్ము వీడిపోయాక శ్రీ నాన్నగారు 'పాపాయి' అనే స్మృతి కావ్యాన్ని వ్రాశారు.

## అప్పట్లో మా దినచర్య

మా నాన్నగారు, ఉద్యమాలలో ఎంత నిష్ఠురులో ఇంటి వ్యవహారాలలో అంత అమాయకులు! ఆయనకు పిల్లలను, ప్రేమించడమే తెలియును - కానీ, పిల్లలపట్ల నియమపాలనం తెలియదు. కానీ, మా అమ్మ అన్ని విషయాలలోను, చాలా నిపుణురాలు!

సంగీత విద్యా శిక్షణంలో మాకు ఈమని అచ్యుత రామశాస్త్రిగారి తర్వాత, ఇద్దరు గురువులు మారారు.

శ్రీకాకుళంవద్ద ఉన్న నరసన్నపేటలో, పొట్నూరిస్వామిబాబుగారని పెద్ద ఆసామి ఉండేవారు! వారు, మా నాన్నగారిని పిలిచి వెండి మురళి నిచ్చి, ఖరీదైన పొందూరు ఖద్దరు వస్త్రాలిచ్చి, సత్కారం చేశారు. నరసన్నపేటలోనే పొడుగు రామమూర్తిగారని ఒక గొప్ప వైణికులుండే

వారు! మా నాన్నగారు వారినెలాగో ఒప్పించి, నాకూ, అన్నయ్యకూ, అమ్మకూ వీణ నేర్పించడానికి, రాజమహేంద్రవరానికి తీసుకొని వచ్చారు. ఆయనకు ఆంధ్రదేశంలో సంగీత కచేరి లిప్పించి, ఎంతో డబ్బు ఇచ్చి ఆ మహావైణికుని దగ్గఱ మాకు శిక్షణ నిప్పించారు! వారి శిక్షణతో మాకు వీణావాదనలో మెలకువలు తెలిశాయి! మా అన్నయ్య ఏకంగా వారి శిష్యత్వంలో వీణా హృదయాన్నే, ఆవగతం చేసుకొని, ఆ నైపుణ్యాన్ని తన హృదియగతం చేసుకోగల్గిన భాగ్యశాలి కాగల్గినాడు! నేను సాహిత్యాభిమానంతో ఇట్లా నిలబడి పోయాను. ఆయన ఒక ఆరునెలలు ఉండి, నరసన్నపేట వెళ్ళిపోయారు. మళ్ళీ మా వీణావాదన శిక్షణ, మూలపడి పోయింది - మళ్ళీ మా నాన్నగారు నరసన్నపేట వెళ్ళి, రామమూర్తి శిష్యులు శ్రీ బెహతా రాజారావుగారినితీసికొనివచ్చారు. ఆయన నిలకడగా రాజమహేంద్రిలో నిలువబడి, మాకు వీణావాదనంలో మెలకువలు నేర్పి, ఒక పద్ధతికి తీసుకొని వచ్చారు!

అప్పట్లో మా అమ్మ, నన్ను, మా అన్నయ్యను శీతాకాలంలో, (ఎంత చలైనాసరే) లేపి, వీణ సాధనం చేయించేది, ఒకగంట త్రిస్థాయి సాధకం. కొంత క్రొత్తపాఠం సాధకం అయిన తర్వాత, ముఖాలు కడుక్కొని, యోగసాధన చేసేవాళ్లం తర్వాత, బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారి శిక్షణలో గోదావరికి వెళ్ళి ఈత నేర్చుకొనేవాళ్ళం! ఆ గోపాలరావుగారు మా అమ్మకు మాకు ప్రకృతి వైద్యులు! తర్వాత ఇంటికివచ్చి, శ్రీ బెహతా రాజారావుగారిదగ్గఱ వీణావాదన శిక్షణ! ఇవన్నీ నియమంతప్పకుండా ఆచరించిన తర్వాత, మా అమ్మ గోధుమ రొట్టెలు, వెన్న, పండ్లు, పాలతో, మాకు ఆహారంఇచ్చి బడికి పంపేది! తర్వాత సాయంకాలం ఆటలాడుకొని ఇంటికి వచ్చిన తర్వాత, నాన్నగారితో, గ్రంథాలయానికో, పాట కచేరిలకో, సాహిత్య సమావేశాలకో వెళ్ళేవాళ్ళం! రాత్రి ఇంటికి వచ్చి గ్రంథాలయంనుండి, తెచ్చుకొన్న కావ్యాలూ, వేగుచుక్క గ్రంథమాలవారి నవలలూ, చదివి నిద్రించడం మా దినచర్య!

మధ్యమధ్య మా నాన్నగారు నన్ను వ్యాయామశాలకుపంపి కత్తి సాము, కఱ్ఱసాము నేర్పింప చేసేవారు! ఏలూరు తాతగారింటికి వెళ్తే, మా మామయ్య మోతే కృష్ణరావుగారు రెండుగుఱ్ఱాలు తీసికొని, ఒకదానిపై, నన్ను తనతో ఎక్కించుకొని, శనివారంపేటవైపో, మఱి ఇంకొకవైపో, తీసికొనివెళ్ళి, తన గుఱ్ఱంబంట్లకు సైగచేసి, నన్ను ఒంటరిగా ఇంకో గుఱ్ఱం ఎక్కించి, నేను ఏడ్చి మొత్తుకొన్నా వినకుండా, గుఱ్ఱప్పం బంటులకప్పగించి, తాను వెళ్ళిపోయేవాడు! అప్పుడు ధైర్యం తెచ్చుకొని, గుఱ్ఱాన్ని నడిపి, గుఱ్ఱపు స్వారీ నేర్చుకొన్నాను.

నన్ను రాణీ రుద్రమవలె తయారు చేయవలెనని, మా నాన్నగారి సంకల్పం! అది నెరవేరిందో లేదో, కాని నేను శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారి ఆశీర్వాదంతో "సాహితీ రుద్రమ" నైనాను - ఈ ఘట్టాన్ని తరువాత, ఉటంకించగలను.

## విద్వత్కవయిత్రి

నాకు వివాహమైన తర్వాత, వయస్సు వచ్చిన తర్వాత ఇంకా చదువెందుకని చదువు మాన్పించి వేయవలసినదిగా, మావారికి, వారి అక్కగార్లు చాలా ప్రేరేపణ కల్గించారు. కానీ మావారు, వారిమాటలు చెవిని పెట్టలేదు - నేను సాహిత్యవ్యాసాలు వ్రాసి భారతికి "కృష్ణకుమారి" అనే కలంపేరుతో పంపేదాన్ని శ్రీ మా నాన్నగారి పద్యాలకు ప్రతిమాసం భారతివారు అగ్రతాంబూలం ఇచ్చి పత్రికలో ప్రథమ మకుటంగా ప్రచురించేవారు.

ఇల్లా కాలం గడుస్తూ ఉండగా మహానందిలో జరిగిన ఆర్యవైశ్య మహాసభలలో ప్రప్రథమ కవిపండిత పరిషత్తు ఏర్పాటుచేసి, దానికి శ్రీ మా నాన్నగారిని అధ్యక్షులుగా ఆహ్వానించారు; సభా నిర్వాహకులైన, ప్రొద్దుటూరు వాస్తవ్యులు శ్రీ కొప్పరపు వెంకట సుబ్బయ్యగారు! మేము

కుటుంబమంతా వెళ్ళాము. ఆ సభలో 'వ్యాసునికూర్పు, తిక్కనతీర్పు' అనే మకుటంతో ద్రౌపదీపాత్ర చిత్రణను గూర్చి, నేను ప్రసంగించాను. ఆ ప్రసంగం అఖిలాంధ్రస్థాయిలో సాహితీవేత్తలను బాగా ఆకట్టుకొన్నది ఆ ఆకర్షణతోనే మద్రాసులోని సాహిత్య సంఘాలవారు, నన్ను ఆహ్వానించి, ద్రౌపదిపై ప్రసంగించమని అభ్యర్థించారు. ఆ ప్రసంగమైన తర్వాత అదే మకుటంతో ఆ ప్రసంగాన్ని 'కృష్ణకుమారి' అనే పేరుతోనే భారతి పత్రికా ప్రచురణార్థం పంపాను.

తర్వాత గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషావాదానికాకర్షితురాలనై, వ్యావహారికభాషపై ప్రసంగాలుఇస్తూ ఉండేదాన్ని. అనంతరం కాలగతి క్రమంలో శ్రీ మా నాన్నగారు, గిడుగు రామమూర్తి పంతులుగారికి సప్తతి మహోత్సవం, మూడునాళ్ళు, తిరునాళ్ళుగా, ఎంతోవైభవంగా జరిపారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు అధ్యక్షులుగా విచ్చేశారు. శ్రీ రాయప్రోలువారికీ, శ్రీ మా నాన్నగారికీ ఆంతర్యపు లోతులవరకు ఆర్ద్రతతోనిండిన మైత్రీభావం ఉండేది. ఆంధ్ర దేశపు నలుమూలలనుండి, ఎంతమందో మహాపండితులు, కవులు, ఆ సభలకు విచ్చేశారు. నేను ఆ సభలలో ఆంధ్రభాషకు, సాహిత్యానికీ, అప్పుడంపుబాటులోఉన్న వ్యాకరణం సరిపోతుందా? "ప్రవాహినీదేశ్యా" అని శ్రీ నన్నపార్యుడే, తన చింతామణిలోను; "దేశీయ ప్రయోగంబులెట్లట్ల గ్రాహ్యంబులు అని చిన్నయసూరి తన బాలవ్యాకరణంలోను సూత్రీకరించారు. అప్పుడు పదవ్యావహారాన్ని లొంగదీసుకొనే వ్యాకరణం. లేదనే కదా! అటువంటప్పుడు ఉన్న వ్యాకరణాలతో ప్రవాహినియైన తెలుగు భాషను, తెలుగు భాషాప్రయోగాలకు ఈ వ్యాకరణాలు, గట్లుగా ఉండవలెనేకాని, అడ్డుకట్టుగా నిలబడడం ఎంత సబబు? అనే ఆలోచనలను రేకెత్తించే విధంగా ఒకవ్యాసం వ్రాశాను. అదికూడ 'కృష్ణకుమారి' అనే పేరుతోనే ప్రచురింపబడింది. ఆ సభలకు వచ్చిన మావారు 'కృష్ణకుమారి' పేరుతో వ్రాయడమెందుకు? 'ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ' అనే పేరుతో వ్రాయి అని సూచించారు. అది మొదలు నేను ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

అనే పేరుతోనే నా రచనలను ప్రచురిస్తూ వచ్చాను. అప్పట్లో, నా రచనలు చిన్నవి గృహలక్ష్మిలోను, సాహిత్యాత్మకమైన రచనలు, భారతిలోను ప్రచురింపబడ్తూ ఉండేవి.

తర్వాత రాజమహేంద్రవరంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర మహిళాసభలలో, నేను కీలకమైనపాత్ర వహించి చాలా సేవచేశాను. అంతేకాదు, ఆ సభలలో డైవోర్సు కావాలని కొందఱు తీర్మానంపెడితే, భారతీయ మహిళాసంస్కృతికది విరుద్ధమని మహోపన్యాసంచేసి విడాకుల బిల్లు నెగ్గకుండా చేశాను.

## ఆంధ్ర మహిళా గానసభా ప్రతిష్ఠాపనం

మా నాన్నగారు సాహిత్యంకోసం, ఎంత పాటుపడేవారో, మా అమ్మగారు, సుశీలమ్మగారు సంగీతంకొఱకు అంత పాటుపడేవారు: ఆమె, తొట్టతొలి స్త్రీ నం వైద్యులు శ్రీ బొల్లాప్రగడ సుందర గోపాలరావుగారి భార్య చిన్నమ్మాయిగారు, కలిసి "ఆంధ్ర మహిళా గానసభ" అనే పేరుతో ఒకసంస్థను స్థాపించారు. ఆ సంస్థకు మా నాన్నగారి అక్కగారి అల్లుడై, రాజమహేంద్రవరంలో ప్లీడరుగా మంచి పేరు పొందిన శ్రీ దేవత శ్రీరామమూర్తిగారు, మా నాన్నగారు, సరేసరి మా అమ్మకు ఎంతో తోడ్పడేవారు, ఆ సంస్థకు మా అమ్మ అధ్యక్షురాలు, చిన్నమ్మాయిగారు ఉపాధ్యక్షురాలు, నేను, శ్రీ శ్రీరామమూర్తిగారి కుమార్తె, లీలావతి పథమ కార్యదర్శులం.

మహిళా గానసభ నిర్వహించిన, వీణ పోటీపరీక్షలో, నాకు దేవత శ్రీరామమూర్తిగారిచ్చిన స్వర్ణపదకం నాకు లభించినది. దేవత శ్రీరామమూర్తిగారు, మా నాన్నగారు కలిసి, సంగీతసభలు, ఇంకా కొన్ని సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించేవారు. ఒకమారు ముసిరి సుబ్రహ్మణ్యఅయ్యర్గుగారి పాటకచ్చేరిని ఏర్పాటు చేశారు. సుబ్రహ్మణ్య అయ్యరుగారికి వయస్సు పెద్దదై, గొంతు వణకడం ప్రారంభమైనది. అప్పుడే నేను సభ్యులలో చివరిగా కూర్చొని "ముసిరి, నీ పాటకీగలు

ముసిరెనయ్యా" అని గట్టిగా అన్నాను. అట్లా పెద్దవాళ్ళనుగూర్చి విమ ర్శించడం చాలాతప్పు! మా నాన్నగారు, శ్రీరామమూర్తిగారు, ఆపనికి నన్ను మందలించారు. నిజంగా చాలా తప్పే చేశాను. ఈ సంఘటన జరి గినతర్వాత, నేనుఎవ్వరినీ విమర్శిస్తూ పద్యాలుచెప్పడం మానుకొన్నాను.

కాలాంతరంలో మాసదనం చూడడానికి, రవీంద్రుని శాంతినికేత నంలో అధ్యయనంచేసిన మంత్రవాది, లేక మహావాది వెంకటరత్నంగారు వచ్చారు. వారికి చాలా కళలలో నైపుణ్యం ఉండేది. మాకళాశాల విద్యా ర్థినులను ఒకచోట కూర్చొబెట్టి, ఎన్నో ప్రశ్నలు వేశారు. అన్ని ప్రశ్న లకూ నేనే సదుత్తరాలిచ్చాను అనేది నిర్వివాదాంశం! ఇంక, తుదిసారిగా "ఆఁ, అట్టే అతిశయం చూపించకు! నేను ఒకపాట పాడుతాను నేను పాడుతూ ఉండగానే ఎవరు వీణమీద నా పాటననుసరించి, తడుముకో కుండా వాయిస్తారో, వాళ్ళకు నేనొకమంచి బహుమతి ఇస్తాను" అన్నారు. అందఱం సరేనన్నాం. ఆపరీక్షలోకూడా, నేనే నెగ్గానని వేరే చెప్పనక్కఱ లేదు. ఇది, అహంకారంకొఱకు చెప్పడంకాదు. మఱి భగవద్దత్తమైన వర ప్రసాదంవలె, నాకు అవిధమైన సద్యస్స్ఫూర్తి, తెలివితేటలు, ప్రదర్శింప గల నేర్పు ఉండేది. వెంటనే ఆయన చాలాచాలా సంతోషించి అమ్మాయి లక్ష్మీకాంతం! చాలా బాగున్నదమ్మా. ఇందాకటినుండి, ఎన్ని విధాలు గానో, నిన్ను ప్రధానబిందువుగా చేసికొని, ఎన్ని పరీక్షలో చేశాను. కానీ, నీలో ఎప్పుడూ విజయోత్సాహమేతప్ప ఓటమి లక్షణాలు కన్పించడంలేదు. ముందుముందు నీకు మంచి భవిష్యత్తు ఉందమ్మా కాళిదాసు కుమార సంభవంలో "ప్రపేదిరే ప్రాక్తనజన్మ విద్యా" అని చెప్పినట్లు, నీపూర్వ జన్మ సుకృతంవలన, నీకీ అద్భుత మేధాసంపత్తి, అప్రయత్న పూర్వ కంగా అబ్బింది" అన్నారు. తక్కిన పిల్లలకి ప్రశంస కొంచెం ఇబ్బంది కల్పించినా, అనుకోకుండా లభించిన, ఒక కళావేత్త చేసిన ఈ ప్రశంసకు, నా అంతరంగం ఉప్పొంగిపోయిందనక తప్పదు.

ఇట్లాగే, మునిసిపల్‌వారు నిర్వహించే క్రీడోత్సవాలలో, నాకే ప్రథమ బహుమతి లభించేది. క్లాసుపరీక్షల్లో నాకే, ప్రథమస్థానం లభిం

చేది. కుట్టు మొదలైన చేతిపనుల్లో ప్రథమ బహూకృతి నన్నే వరించేది. తోడివిద్యార్థినులు "ఈ లచ్చి, చావాచావదు. మనకు ప్రథమ బహుమతీ రాదు" అనుకొనేవారు!

ఇంకొక సంఘటన ఈ సందర్భంలో వ్రాయాలి. ఏలూరు నివాస స్థులు. మాకు ముఖ్యబంధువులేకాక, మా నాన్నగారికి చేదోడువాదోడుగా అన్నిపనుల్లో తోడ్పడేవారు అయిన శ్రీ చుండూరి శ్రీరాములుగారు, ఏలూరు, Y. M. H. A. హాలులో మహిళాభ్యుదయంపై, వక్తృత్వపోటీలు, నిర్వహించారు. ఆ పోటీలోకూడా ప్రథమురాలుగా నేనే నెగ్గి, స్వర్ణపద కాన్ని నేనే స్వీకరించాను.

ఇట్లా కాలం దొర్లిపోతూఉంటే, రాజమహేంద్రవరంలో "ఆంధ్ర వాఙ్మయసంఘం" అనే సంస్థవారు కవిసార్వభౌమ శ్రీ, శ్రీ పాద కృష్ణ మూర్తి శాస్త్రిగారికి సమ్మానంచేస్తూ, నాకు "విద్వత్కవయిత్రి" అనే బిరుదం ఇచ్చారు. ఇది 1935 అక్టోబరులో జరిగింది.

ఇది నాకు లభించిన తొలిబిరుదు! శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిగారి ప్రస్తావన వచ్చింది కాబట్టి, వారితో మా కుటుంబానికిగల పరిచయం ఒక్క పంక్తి వ్రాయాలి. శ్రీ శాస్త్రిగారు గౌతమీ గ్రంథాలయంలో, ప్రముఖ నిర్వాహకవర్గసభ్యులు, మా యింటికి దగ్గఱలోనే వారి నివాస గృహం, తెల్లవాఱినతర్వాత, కాలకృత్యాలు తీర్చేసుకొని, స్నానమైనా చెయ్యకుండా, మా యింటికి వచ్చేసి, మా నాన్నగారితో చదరంగం ఆడ్డూ కూర్చొనేవారు, వారి కేకలతో ఇల్లు దద్దరిల్లిపోయేది. "బంధువులు వచ్చారు, మీరింటికి రావాలని", వారి యింటినుండి పిలుపువచ్చినా, ఆర్థిక ఇబ్బందులవలన, వచ్చినవారిని "పోపో" అని ఆ కబురు తెచ్చినవాళ్ళను కసిరేవారు! ఆ సమయంలో మా నాన్నగారు ఆ కబురు తెచ్చినవారికేదో డబ్బిచ్చి పంపేవారు! అట్లా ఆయన పగలంతా మా యింట్లోనే గడిపేవారు! నాన్నగారికి అత్యంత మిత్రులైన శ్రీ బాలదారి నారాయణ దేవుగారు మొదలైనవారుకూడా వచ్చి నాన్నగారితో చదరంగం ఆడేవారు!

అంతేకాదు, కడియంనుండి, శ్రీ చెళ్లపిళ్ల వేంకటకవిగారు, రాజమండ్రివస్తే ఎక్కడ ఉన్నా నన్ను పిలిపించి దగ్గరకూర్చోపెట్టుకొనేవారు! వారు ఉన్నంతసేపూ, వారికి విసనకఱ్ఱతో విసుర్తూ నేను వారి ప్రబోధాలు వింటూ ఉండేదాన్ని! ఆ విద్య నాకు ఎంతో విజ్ఞానాన్ని ప్రసాదించేది - ఒకమారు విజయనగరంనుండి, పర్యటన కార్యక్రమంలో, హరికథాపితామహ శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారు మా యింటికి వచ్చి, కృష్ణారావుగారూ, ఈవేళ, తెలుగు భాషను గూర్చి అచ్చ తెలుగులో ఒక పద్యం చెప్తాను-ఆపద్యాన్ని, విని అమ్మాయి మీకు తన అభిప్రాయం చెప్తే, ఆ అభిప్రాయాన్నిబట్టి, ఈమారు మీరు సత్కరించాలి అన్నారు. ఈ విషయం నాకు చాలా బాధకల్గించింది! దాసుగారూ, చిన్నదాన్ని ఈ బాధ్యత నామీదపెట్టవద్దు- నాన్నగారు ఎప్పుడూ, ఎంతమందినో సత్కరిస్తూనే ఉంటారు. వారెప్పుడూ మిమ్ము తక్కువ అంచనాతో చూడరు అని బదులు చెప్పాను. "ఏమిటి దాసుగారూ, మిమ్మల్ని, నేనెప్పుడైనా, తక్కువ చేశానా అంటూ వారిని సత్కరించి పంపేశారు! వారానాడు చెప్పిన అచ్చతెలుగు పద్యాన్ని చాలా భద్రంగాదాచాను. కానీ తర్వాత అది కనబడలేదు.

అట్లా నాన్నగారు ఎంతమందికవి పండితులకో, సత్కారం, ఆర్థిక సహాయం అందించేవారు, స్నేహితులకు అవసరంలో ఆపదలో ఆర్థికంగా ఆదుకొనేవారు! హరీంద్రనాధ్ ఛట్టోపాధ్యాయగారు రాజమహేంద్రవరం,వస్తే మాయింట్లోనే దిగేవారు వారున్న వారంరోజులూ హార్మోనియం సంగీతంతో మా యిల్లు హోరెత్తి పోయేది! ఇంట్లాటి ఉత్తమ సంస్కార వాతావరణంలో పెరిగిన, నేను ఇట్లాంటి పరిణితిని సాధించానంటే అతిశయోక్తి ఏమీలేదు. సాధించకపోతే అది తప్పు అంచనా.

## ఇంక మా చదువు

మా ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల, అనేకమైన యిండ్లుమారి, ఆఖరుకు ప్రస్తుతం కొవ్వూరు లాంచీలరేవున కెదురుగా ఉన్న వాడాబ్లాకులోని బంగారువారి యింటికి చేరినది-ఈ భవనాన్ని శ్రీరామలింగయ్యగారు కొని, కళాశాలకు గౌతమీ తీరంలో శాశ్వత భవనాన్నిఏర్పాటు చేశారు-నా వయస్సు 13, 14 ఏండ్లు ఉన్నపుడు,

ఉభయ భాషా ప్రవీణ ఎంట్రన్సు కోర్సు చదివాము. ఆ ఎంట్రన్సు కోర్సు ఆంధ్ర యూనివర్శిటీ పాఠ్య ప్రణాళిక ప్రకారం ఒక్కయేడే-అయినా. మాకు ప్రబంధాల్లో సంస్కృతంలో కొంచెం శిక్షణ ఇప్పించవలెనని, మా పిన్ని ఆ ఏడాది కోర్సును రెండేళ్ల చెప్పించింది. అప్పుడే సంస్కృతంలో మాకు రఘు వంశం మొదటి మూడు సర్గలు-దండి మహాకవి రచించిన దశకుమార చరిత్ర, ఆంధ్రంలో కొన్ని ప్రబంధాలు, తిక్కనార్యుని విరాట పర్వము, బాలవ్యాకరణము, అనంతుని ఛందస్సు పాఠ్య గ్రంథాలుగా ఉండేవి.

కృష్ణాజిల్లా శ్రీకాకుళం వాస్తవ్యులు శిరోమణి పరీక్షలో కృతార్థులైన, యరసూరి మల్లికార్జునరావుగారు సంస్కృతోపాధ్యాయులుగా ఉండేవారు, శ్రీయుత వాసా సూర్యనారాయణశాస్త్రిగారు (గిడుగు రామమూర్తిగారికి వ్యావహారిక భాషా ఉద్యమంలో సహచరులు) ఆంధ్రోపన్యాసకులుగా ఉండేవారు, ఇంకొకరు నెల్లూరు వాస్తవ్యులు, వారు కూడా ఆంధ్రోపన్యాసకులుగా ఉండేవారు.

నేను సమయ మంత్రుల శకుంతల, కూనిసెట్టి రామరత్నం, నందిగామ సౌభాగ్యవతి, విజ్జపు హేమలత, సహవిద్యార్థినులం-ఎంట్రన్సు పరీక్షలో విజయం పొందిన తర్వాత, ప్రిలిమనరీ పరీక్షకు వచ్చాం, ఇది రెండేళ్ల పరీక్ష; ఈ పరీక్షకు వచ్చేటప్పటికి, మాకు కోర్సు ఇబ్బడి ముబ్బడిగా పెరిగి పోయింది. వ్యాకరణానికి, బాల, ప్రౌఢలు, అలంకారశాస్త్రానికి సరసభూపాలీయం భారతంలో కవిత్రయం వారి రచనల నుండి కొన్ని భాగాలు, శ్రీనాథ పోతనల రచనలనుండి కొన్నిభాగాలు, మనుచరిత్ర, విజయ విలాసము, ఇంకాకొన్ని ఆధునిక కావ్యభాగాలు, సంస్కృతంలో కిరాతార్జునీయంలో మూడు సర్గలు, జీమూతవాహన చరిత్ర నాటకము. ఇట్లా మొత్తం 25, 26 పాఠ్యభాగాలుండేవి. ఈ పాఠ్యాంశాలే మాకు కంఠదఘ్నంగా ఉండి, ఊపిరిసలపక పోతూంటే, మానాన్నగారు, నాకు బొత్తిగా ఆంగ్ల పరిజ్ఞానం లేకుండా పోయిందని, తమ బ్రహ్మ సమాజసహవాసి, గొప్ప ఇంగ్లీషు పరిజ్ఞాత అయిన కుందూరి వేంకటరత్నం పంతులుగారిచేత కాశీవిశ్వ విద్యాలయం వారి మెట్రికు పరీక్షకు కట్టించి ఆంగ్ల విద్యాభ్యాసానికి ఓం కారం చుట్టించారు ఈ యింగ్లీషు విద్యాభ్యాసం, చాలా చిత్రంగా నడిచేది. శ్రీవెంకటరత్నం పంతులుగారికి తెలుగులో సరియైన పరిజ్ఞానంలేదు. నాకు ఆంగ్లభాషా పరిచయంలేదు. ఆయన ఏదైనా ఆంగ్ల

పదానికి తెలుగులో సమానార్ధక పదంకొఱకు తడుముకొంటూంటే, సందర్భాన్ని బట్టి, నేను తెలుగు పదం వారికందించేదాన్ని, ఆయనకు నేనందించిన పదం సరి పడ్తుందో లేదోననే సంశయం పోక, ఒరే కృష్ణరావు అమ్మాయికి పాఠం చెప్పేటంత వరకు నీ దిక్కడ ఉందు తనేదో తెలుగు పదం అర్థంగా చెప్తుంది! అది సరియైనదో కాదో నాకు సందేహం! అని అనేవారు, మా నాన్నగారు ఏం చెప్పావమ్మా, నన్ను అడిగి, తెలుసుకొని, ఒరే వెంకటరత్నం నీకు సందేహమక్కరలేదురా అమ్మాయికి తెలుగులో మంచి పాండిత్యమున్నది, సరిగానే చెప్తుంది. అనేవారు! ఏమైనా నా నా ఆంగ్లవిద్యాభ్యాసం, ఎన్ని నెలలో జరుగలేదు. నాకు ప్రిలిమనరీలో చాలా పాఠ్యాంశాలు ఉండడం వలన, నేను ఆదనంగా ఈ యింగ్లీషు విద్యాభారం మోయ లేకపోయాను. అది గమనించి నాన్నగారు నాకూ శ్రీ వెంకటరత్నం పంతులు గారికీ ఆశ్రమ తప్పించారు. నేను "బ్రదికి పోయానురా దేవుడా" అని హాయిగా ఊపిరి పీల్చుకొన్నాను. అయినా మా నాన్నగారికి ఇంగ్లీషుపై మక్కువలేదు. అంతే కాదు. ఇంట్లో ఎవరినీ ఇంగ్లీషు పదప్రయోగం కూడా చెయ్యనిచ్చేవారు కారు. నేను ఒకమారు 'మద్రాసు' అని సంభాషణ వశంగా అంటే 'ఏమ్మా, చెన్నపురి' లేక చెన్నపట్నం అనలేవా అని సరిదిద్దారు. ఈ ఇంగ్లీషు విద్యాబోధన ప్రహసనం యిట్లా ముగిసిన తర్వాత, మా కళాశాలా తెలుగు అధ్యాపకులైన శ్రీ కృత్తి వెంటి సుబ్బారావు M. A. గారు సాయంకాలం వచ్చి తెలుగు నాతో చదివేవారు! ఒక సమయంలో ఆయన ఏదో సర్వీస్ కమిషన్ పరీక్షకు కట్టినపుడు, ఆయనకు కండ్లు కలక వచ్చి రెండు నెలలు, నాకు పాఠం చెప్పడం మానేసి తన తెలుగు కోర్సు, నా చేతనే చదివించుకొని, నన్నే నోట్సు వ్రాసిపెట్టమని అడిగేవారు. కొన్నివ్యాసాలు కూడా నా చేతనే వ్రాయించుకొన్నారు.

ఎట్లాగైతేనేమి, ఇంట్లో వీణ పాఠం సాయంకాలం సాహిత్య సమావేశాలు. కళాశాలలో ఎంట్రాయిడరీ కుట్టు ఈత మొదలైన దినచర్య అంతా మామూలుగా జరుపుకొంటూనే కష్టపడి, అధ్యయనం చేసి, రెండేళ్ల కోర్సు చదివి ప్రిలిమనరీ పరీక్షకు వెళ్లాము ఏమీ ఒడిదుడుకులు లేకుండానే ఆ పరీక్షలో కృతార్థులమయ్యాము ఈ పరీక్షకు చదివిన సమయంలో కావ్యూరు వాస్తవ్యులు శ్రీ చదలవాడ చక్రధర

రావుగారి కుమార్తె మాణిక్యం వేదవల్లి తాయారమ్మగారు కూడా సదనంలో చేరి మాతోబాటు ఉభయభాషా ప్రవీణ చదివేవారు. వయస్సులో ఆమె నందిగామ సౌభాగ్యవతి మా జూనియర్ భావరాజు రంగనాయకమ్మ నాకంటే పదేండ్లు పెద్ద వారైనా నేనంటే చాలా చాలా ప్రేమగా ఉండేవారు. అంతేకాదు, నేనన్నివిద్యల్లోనూ ప్రతిభావంతంగాపైకి వస్తూ ఉన్నానని ఈర్ష్యపడే వారందరకూ తగిన సమాధానాలు చెప్తూ ఉండేవారు!

ప్రిలిమనరీ పరీక్షకాగానే నేను వేసవి సెలవులలోనే ఫైనల్ పరీక్షలకు కావలసిన పాఠ్యపుస్తకాలను అధ్యయనం చెయ్యడం ప్రారంభించాను. ఫైనల్లో మా కోర్సు ఇంకా కఠినంగా ఉన్నది. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శాకుంతలం భాగ వతంలో ఇంకొక స్కంధము తిక్కనార్యుని ఉద్యోగపర్వము ఆముక్త మాల్యదలో ఒక పాఠ్యభాగము శ్రీనాథుని ఆయన పరమైన కాశీఖండము నాచన సోముని ఉత్తర హరివంశము, పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయం ఆముక్తమాల్యద అచ్చ తెలుగు ప్రబంధము సీలా సుందరీ పరిణయం ద్వర్థికావ్యం రాఘవ పాండవీయము నన్నపార్యుని నలచరిత్ర ఇవికాక నన్నయభట్టారకుని త్రిలింగ లక్షణం అహోబల పండితీయము అధర్వణ కారికావళి ప్రౌఢవ్యాకరణము అప్పకవీయము నరసభూ పాలీయము నీలాద్రి రాజుగారి (తెలుగు) శాకుంతలము సంస్కృతములో బాణు కాదంబరీసారసంగ్రహం, కిరాతార్జునీయములోని పంచసర్గలు-ఇవికాక ఆధునిక కావ్యాలేవో ఏవో ఉండేవి.

కావ్యాల పేర్లు, అలంకారశాస్త్ర, వ్యాకరణశాస్త్ర, ఛందశ్శాస్త్ర గ్రంథాల పేర్లు చూస్తూంటేనే గుండెలవిసిపోయేయి.

ఫైనల్లో, పిలకా గణపతిశాస్త్రిగారు, నాటకాలు చెప్పడానికి, వ్యాకరణం చెప్ప డానికి విజయనగరం నుండి, గొర్తి సూర్యనారాయణ శాస్త్రి గారనే, మహావైయా కరణ పండితుడు, అదనంగా ఆచార్యులుగా, వచ్చారు. కళాశాలలో పాఠాలు ప్రారంభమైనాయి. శ్రీ పిలకా గణపతిశాస్త్రి గారు చిన్న వయస్కులు. ఆయన కదివరలో ఎక్కడ అధ్యాపకత్వం నెరపినఅభ్యాసం లేనట్లుంది. నేను తరగతిలో అల్లరి చెయ్యడం మానివేసినా, శుభ్రంగా, స్వచ్ఛంగా, పెద్దపెట్టున నవ్వుతూ ఉండే

దాన్ని, అది వికటాట్టహాసమూకాదు, మందస్మేరమూకాదు. 'గంభీరమైనదీ కాదు మనసులోని మాయమర్మ మెఱుగని, సంతోషంతో కూడిన మధురానందహాసం! ఉపాధ్యాయులంతా, మమ్మ తమ పిల్లలలాగే చూచేవారు! కానీ శ్రీ ఫిలకా వారికి మాత్రం ఇంకా విడియం వదల నందున, మేము ఆడపిల్లలం కావడం చేత, తరగతిలో పాఠం చెప్పడానికి, కొంచెం బెరుకుగా ఉండేవట.

## నా నవ్వులో పరమార్థం

గణపతి శాస్త్రిగారు మాకు, వత్సవాయి నీలాద్రిరాజుగారు రచించిన శాకుంతలా నాటకం, పాఠం చెప్పవలసి ఉండెను. కానీ, ఆయన ఆ నాటకాన్ని తెరవను కూడా తెరవలేదు. మహా కవి కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలాన్ని చాలా రస రమ్యంగా హృద్యంగా, తరగతిలో గానం చేసినట్లు పాఠం చెప్పే వారు! నేను ఆ సంతోషాన్ని పట్టలేక సెలయేరులా ఉప్పొంగిపోతూ ఆ ఆనందాన్ని మనస్సులోనే ఆపుకోలేక గల గలా పెదవులు, సెలవి వారగా, గట్టిగా, నవ్వేసేదాన్ని!

ఆయన ఎంతోకాలం మా కళాశాలలో పనిచేయలేదు. ఆయన వెళ్ళిపోయే టప్పుడు మేము వీడ్కోలు సమావేశాన్ని ఏర్పాటు చేశాం. ఆ సమావేశంలో గణపతి శాస్త్రిగారు "నేను కుఱ్ఱవాణ్ణి ఈ విద్యా సంస్థ, ఆడపిల్లల సంస్థ! తరగతిలో, లక్ష్మీకాంతం, ఆడుతూ, పాడుతూ. మాటి మాటికీ నవ్వుతూ, చాలా చలాకీగా ప్రవర్తించేది! మొదట్లో మొదట్లో ఆ అమ్మాయి నవ్వు చూచి, నేను బెంబేలెత్తి పోయే వాణ్ణి. క్రమక్రమంగా, ఆ అమ్మాయి నవ్వును బాగా పరిశీలించడం మొదలు పెట్టి. ఈ చెప్పబోయే విశేషాలు తెలుసుకొన్నాను. ఆ అమ్మాయి స్వభావం, చాలా విశుద్ధము, అకృత్రిమము, అయిన అమ్మాయి స్వభావమే ఆ అమ్మాయి నవ్వులో ప్రతిఫలించేవి. చల్లగా మెల్లగా, మొదలై, నేను పాఠం చెప్తూ ఉంటే, కాళిదాసు కవితా సౌందర్యానికి ముగ్ధురాలై హాయి, హాయి, అని లేచి తన ఆనందాన్ని మధుర హాసంతో వ్యక్త పరుస్తూ ఉంటే, ఆ నవ్వు కళాశాలా ప్రాంగణాన్నంతా పారిజాత పరిమళాల వలె, వ్యాపించి ఒక పారవశ్యంలో ముంచెత్తేది. ఆ దివ్య గాంధర్వ హాసలో ఎప్పుడూ అపశ్రుతులు దొరలేవికాదు! అదొక మధుర మందహాస వీచిక!

నేను ఆ అమ్మాయి నవ్వులో కాళిదాస మహాకవి ప్రదర్శించిన గంభీరార్థాలను, సౌందర్యాలను వీరుకొని ఆ అమ్మాయి తెలివితేటలను మనస్సులోనే ఆశీర్వదించే వాణ్ణి! లక్ష్మీకాంతం ఒక రోజు నవ్వకపోతే నాకు ఆవేళ్ళ అమావాస్యలా తోచేది. ఆమెకు గొప్ప భవిష్యత్తు ఉన్నది" అని అతిగా ప్రశంసించారు. కానీ చిన్నప్పటి నుండి నవ్వుల గనిగా, నవ్వుల తుఫానుగా పేరు పొందిన నా నవ్వున కానాడు అంత మహత్తరమైన ప్రశంస లభించేటప్పటికి, సంతోషంతో గట్టిగా నవ్వేశాను. ఆయన వెంటనే "అదిగో, అదిగో చూశారా? ఆ పవిత్రహాసమే, నన్ను కట్టేసేది! అంటూ నీ బ్రతుకంతా 'నవ్వుల పాలు కాకుండా, నవ్వులతో గడిచిపోతుంది. నీ భర్త సుహృదుడు! ఆయన సాహచర్యంలో, నలుగురూ నిన్ను చూచి, మనసారా, తృప్తిగా నవ్వుకొంటూ ప్రశంసించేటట్లు మీ యిద్దరి జీవితం గడిచిపోతుంది! అని చేయెత్తి, నన్ను దీవించారు!

ఇంకా విశేషమేమంటే, గణపతిశాస్త్రిగారు, ఒకనాడు మా యింటి మీదుగా వెళ్తూ ఉంటే మా యింట్లో నుండి నేను వీణ వాయిస్తూ పాడుతూ ఉన్న "కస్తూరీ తిలకం లలాట ఫలకే" అనే శ్లోకాన్ని విన్నారట. ఆవేశపూరితమైన కంఠంతో గళం విప్పి, గంభీరంగా గానం చేస్తూ ఉన్న నా సంగీతాన్ని విని, ఆయన కొద్ది నిముషాలు అట్లాగే నిలువబడి పోయారట! తరువాత, నా గానం ఆగిపోయేటప్పటికి ఆయన బాహ్య స్మృతిలోకి వచ్చి కళ్లు విప్పి చూచేటప్పటికి, ఆ సమయంలో వీధిలో ఉన్న చాలామంది జనం, తన లాగే నిలువబడిపోవడం గమనించి, మా యింట్లోకి వచ్చి, నాపై కొన్ని పద్యాలు వ్రాసి యిచ్చారు. అవి మరి యిప్పు డెక్కడున్నాయో, వెదకాలి!

మా అన్నయ్య వీణ వాయించినా, నేను గంభీరంగా పాడినా మా యింటి ముందు వీధిలో ఈలాంటి సంఘటనలు తరుచు జరగడం పరిపాటే. అవి మా కళ వాటైన సంఘటనలే, ఇంక ఫైనల్ రెండవ సంవత్సరంలోకి ప్రవేశించాము. అప్పటికి మా కళాశాలలో రాజకీయాలు ప్రవేశించాయి.

ఎప్పుడూ లక్ష్మీ కాన్తమ్మకే ప్రథమ బహుమతులు రావడమేమిటి? ఇంక మిగతా వాళ్ళంత తెలివి తేటలు లేనివారి క్రింద లెక్కేనా? కామాక్షమ్మగారికి ఆమెపై

ఉన్న అభిమానంతో ఇట్లా జరుగుతూంది. ఈ పద్ధతి మారాలి అనే అభిప్రాయం, ఒకరికిద్దరుకు కల్గింది. అది అంతతో ఆగక, శ్రీ కామాక్షమ్మగారి, మనస్సులోకి ఇంజెక్షన్లు చేసినట్లు చేయగలిగారా నిపుణులు! నన్ను ఎంతో ప్రేమించి, ఏపైనా పొరుగూళ్లలో ఉపన్యాస కార్యక్రమాలుంటే, నన్ను తన ఖర్చుతో తీసికొని వెళ్లి, కన్నతల్లివలె, నన్నుకనుఱెప్పవలె కాపాడిన మా పిన్ని, నా పై కొంచెం అసహన భావాన్ని చూపడం మొదలు పెట్టింది. ఈ సంఘటనలు తలచుకొని, నేను బాధ పడ్తూంటే, సోదరీప్రేమతో నన్ను ఆదరణతో దగ్గరకు తీసే, శ్రీమతి మాణిక్యం వేదవల్లి తాయారమ్మగారు, అప్పన వీరవెంకట సుబ్బమ్మ (మా జూనియర్) భావరాజు రంగనాయకమ్మ గారు, నందిగామ సౌభాగ్యవతి, "ఇల్లలు కగానే పండుగ కాదు. ఇదీ ఆఖరు సంవత్సరం! ఇంక నిన్ను వాళ్లేం చెయ్యగలరు నీవు బాధపడి నీ మనస్సు చెడగొట్టుకొని, చదువులో అశ్రద్ధ చెయ్యకు! ఏం ఫరవాలేదు. అన్నీ సవ్యంగానే జరుగుతాయి" అని నా వీపు తట్టి నాకు ధైర్యం చెప్పేవారు. కూని సెట్టి రామరత్నం ఒక సంవత్సరం తప్పి, మాకు జూనియరైనా, తాను నాపై ఎంతో ఆపేక్ష చూపేది.

రామ లింగయ్యగారు "ఈ సంవత్సరాంతం, యూనివర్సిటీ పరీక్షలకు ముందు మన కళాశాలలో జరిగే పరీక్షలలో, ఎవరు ప్రథమురాలుగా వస్తారో, వారికి బంగారు పథకం ఇస్తాను. అని ప్రకటించారు. నిజంగా అన్నీ సవ్యంగా జరిగితే, నాకే ఆ పదకం లభించాలి. కానీ ఈ కుటిల రాజకీయా లెట్లా పరిణమించి, నా కెట్లా అపకారం చేస్తాయో అని నేను భయ పడ్డాను. దానికి తోడు, ఆ సంవత్సరమే మా నాన్నగారు జరిపించిన గిడుగు రామమూర్తిగారి సప్తతి మహోత్సవాల, ప్రభావం వలన, నాకు వ్యాకరణంపై, అభిమానం తగ్గి ఆ వ్యాకరణ విషయాన్ని అలక్ష్యం చేయడం మొదలుపెట్టాను. అంతేకాక, కళాశాల నుండి యింటికి వచ్చేటప్పటికి, గౌతమీ గ్రంథాలయం నుండి, రసపుత్ర నవలలు వేగుజుక్క గ్రంథ మండలి వారి నవలలు నా కోరికపై గ్రంథాలయ సిబ్బంది ఎవ్వరయ్యో, వేంకటస్వామో తీసు కొని వచ్చి ఇంట్లో ఇచ్చేవారు! అవి చదువుతూ రాత్రిళ్ల కాలక్షేపం చేసేదాన్ని! నాయీ అలక్ష్య భావాన్ని మా నాన్నగారు గమనించి భావరాజు కృష్ణారావు గారితో ఆవేదనతో కృష్ణరావు ఎందుకో అమ్మాయి ఇంటి దగ్గర ఏమీ చదవడం లేదురా

పరీక్షలు దగ్గర పడ్తున్నాయి. గ్రంథాలయం నుండి నవలలు తెప్పించుకొని అవి చదువుతూ కాలం గడిపేస్తూ ఉన్నది. నీవు కొంచెం పూనుకొని అమ్మాయికి చదువుమీద శ్రద్ధ కల్గించాలి." అన్నారు. అంతే శ్రీ భావరాజు కృష్ణరావు గారు సాయంత్రానికి తయారై నన్ను మా మేడమీద కూర్చోబెట్టి "ఏమే అమ్మాయి పరీక్షలు దగ్గర పడ్తూ ఉన్నాయి. ఎట్లా చదువుతూ ఉన్నావు? ఏదీ నీ పుస్తకాలు తీసుకొనిరా." అని మొదలు పెట్టి ప్రతి రోజూ ఏదో విషయం మీద ప్రత్యేక శ్రద్ధతో పాఠాలు చెప్పడం మొదలు పెట్టారు. ఆయనేకాదు. శ్రీ నందూరి బంగారయ్య గారు వచ్చి భారతంలోని మా పాఠ్యాంశాలపై విశేషాలు ఆ కవిత్రయం ప్రదర్శించిన కవితాశిల్ప సౌందర్యాలు భారత పాత్రల పాత్ర పోషణలో ఆ కవులు ప్రదర్శించిన తీరుతీయాలూ నాకు బోధించడం మొదలు పెట్టారు. "ఏమిటా వీరిద్దరూ ఇట్లా నా ప్రేవ్ను హరిస్తూ ఉన్నారు? ఏమిటి దీనికి కారణం." అని ఆలోచించి భావరాజు వారిని అడిగేశాను. "అమ్మాయి నీవు నవలలు చదవడంతో కాలక్షేపం చేస్తూ ఉన్నావు! పరీక్ష చాలా కష్టమైనది. నీవు ఇంటి దగ్గర చదవకపోతే సత్ఫలితాలు సాధించడం కష్టమేమో అని నాన్న భయపడ్తూ ఉన్నాడే" అని చెప్పారు. అప్పుడు నేను బాబాయి గారూ, నా పాఠ్యాంశాల్లో, ఎక్కడైనా ఏ విషయమైనా అడిగండి నేను సరియైన జవాబు చెప్పలేకపోతే నాన్నగారి ఆవేదన సరియైనదే అని నేనొప్పుకుంటాను. అయితే ఒకటి మీరు ప్రస్తుతం చెప్తూ ఉన్న పాఠాలన్నీ నాకు బాగా ఉపకరించేవే నేను ఒప్పుకుంటాను. కానీ నా సందేహం తీర్చుకోవడానికి అడిగాను మీరు మాత్రం రావడం మానివెయ్యకండి. వస్తూనే ఉండండి. అని జవాబిచ్చాను. నిజంగా వారిరువు చెప్పిన పాఠాలు నా అధ్యయనంలో చాలా ఉపకరించాయి.

ఈ ప్రేరణతో నాలో ఎట్లాగైనా గట్టిగా చదవాలనే శ్రద్ధ కల్గింది. అప్పుడే నాకు వ్యాకరణంలో కల్గిన అశ్రద్ధను పరీక్షా దృష్టితో, తగ్గించుకొని ఆ అంశంలో బాగా కష్టపడాలి. అని నిర్ణయించుకొని బాల ప్రౌఢ వ్యాకరణాలు శ్రద్ధగా చదివి ఆ రెండు గ్రంథాలలో ఉన్న శేషపూరణాలూ పైరుధ్యాలూ గమనించి ఒక తారతమ్య పరిశీలనా దృష్టితో సమగ్రంగా నోట్సు వ్రాశాను. ఆ నోట్సు చాలా సమగ్రంగానూ సవివరంగానూ ఉన్నవని ఆర్ట్సు కాలేజి B. A తెలుగు విద్యార్థులు కూడా నా దగ్గరకు వచ్చి వాట్ని వ్రాసుకొని చదువుకొనేవారు. ఇది గమనించి నా సోదరి

మాణిక్యంతాయారమ్మగారు ఆ నోట్సు తీసికొని చదివారు. అంతే ఆమె దగ్గర నుండి తీసుకొని ఇంకొకరు మళ్లీ నా కందకుండా చేయాలనే ప్రయత్నాలు చేశారు. కానీ యీ విషయం శ్రీ కామాక్షమ్మగారి దగ్గరకు చేరే ప్రయత్నం చేశాను. అప్పుడు కాని నాకు శాంతి కలుగలేదు.

ఇక్కడ ఇంకో ప్రధాన విషయాన్ని గూర్చి వ్రాయనిదే ఈ అధ్యాయం పూర్తికాదు. అదేమిటంటే ఆంధ్ర విశ్వవిద్యాలయం పరీక్షలముందు మా కళాశాలలో ఆఖరి పరీక్షలు ప్రారంభమై పోయాయి. ఆఖరి పరీక్షమైన "వ్యాసశకుంతల, కాళిదాస శకుంతల అనే వ్యాసం వ్రాయవలసి ఉన్నది. చాలా హెచ్చుగా వ్రాశాను. ఆ వ్యాసం మా అధ్యాపకులు చాలా మెచ్చుకొన్నారు. అది రాజమహేంద్ర వరంలో, చాలా సంచలనం కల్గించిది. ఆఖరు కది ప్రసిద్ధ సంస్కృత పండితులు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి దగ్గరకు చేరింది. ఇంతలో శ్రీ శ్రీపాదకామేశ్వరరావు (నాటక కళారంగంలో నిష్ణాత్వకమైన ప్రజ్ఞకలవారు) గారికి వ్యాసం విషయం తెలిసి ఆ వ్యాసాన్ని తీసుకొని వణుగుతై పగుటు సాహితీవేత్తలతో మా యింటికి గబగబా వచ్చేసి కృష్ణరావూ అమ్మాయినిపిలు! ఇక్కడ ఇక ఒక సాహితీ మిత్రుల సమావేశం ఏర్పాటు చేశాను అన్నారు. నేనేమి తప్పు చేశానా? అని కంగారుపడ్తూ వచ్చి కూర్చున్నాను. అప్పుడాయన తన చేతిలో ఉన్న నా వ్యాసం కాగితాలు నాకిచ్చి 'అమ్మాయి ఇది చదవవే' అని ఆదేశించారు. పన్నెండు పుటలు కల ఆ వ్యాసాన్ని ఆవేశంగా వేగంగా చదవడం మొదలు పెట్టాను. శ్రీ కామేశ్వరరావుగారు నెమ్మదిగా చదువు అని హెచ్చరించారు. ఎట్లాగో ఆ వ్యాస పఠనం పూర్తి అయిన తర్వాత అక్కడ చేరిన పెద్దలందరూ పరీక్షలో ఒక వ్యాసాన్ని ఇంత సమన్వయంగ సోదాహరణంగా తారతమ్య పరిశీలనతో వ్రాసిందంటే కృష్ణారావుగారూ మీ అమ్మాయి యెంత ప్రతిభావంతురాలను కోవాలి! మీరెంత అదృష్టవంతులు! అని ప్రశంసించారు!

ఆ పరీక్షలలో అన్ని అంశాలలో జరిగిన పరీక్షలలో నేనే ప్రథమురాలుగా విజయం పొందానన్న విషయం వేరే చెప్పనక్కరలేదు. విడిగా జరిపిన వ్యాసరచన వక్తృత్వ పోటీలలో కూడా నాకే ప్రథమ స్థానం లభించినా అప్పటి మా సదనా కమిటీ కార్యదర్శి దానిని కాదని ఆ బహుమతి నాకు లభించకుండా చేశారు. అట్లాగే

ఎంబ్రాయిడరీ కుట్టు పరీక్షలో కూడా నేను కొంత సేపు కుట్టిన తర్వాత ఏవో రంగుల దారాలు తెమ్మని నన్ను బజారు పంపించేశారు.

తర్వాత బహుమతులిచ్చే సమావేశంలో రామలింగయ్యగారు ప్రకటించిన స్వర్ణ పథకం ఎవరికీ ఇయ్యకుండా నాకు మాత్రం ప్రథమ బహుమతిగా బహుజనపల్లి సీతారామాచార్యులు వారి శబ్దరత్నాకరం నిఘంటువును బహూకరించారు. మా కుట్టు టీచరు మాణిక్యంగారు నాకు జరిగిన అన్యాయానికి చాలా బాధపడి తాను ప్రత్యేకంగా కుట్టు పరీక్షలో కూడా లక్ష్మీకాంతమ్మదే ప్రథమ బహుమతి దానిని తన కియ్యలేదు! నేను ప్రత్యేకించి సొంతముగా ఆమెకీ బహుమతిని అందజేస్తూ ఉన్నానని బహిరంగంగా ప్రకటించి ఎంబ్రాయిడరీ కుట్టు పుస్తకాన్ని ఇచ్చింది. నేను జరిగిన అన్యాయానికి బాధపడి నా కిచ్చిన నిఘంటువును మళ్లీ నవనం గ్రంథాలయానికే నా జ్ఞాపక చిహ్నంగా ఇస్తూ ఉన్నానని చెప్పి అక్కడే ఇచ్చేశాను.

ఈ సంఘటనతో శ్రీమతి కామాక్షమ్మగారు నన్ను కొంచెం దూరంలో ఉంచారు. ఎన్నో సంవత్సరాల అనుబంధం ఈ విధంగా పరిణమించినందుకు నా మనస్సు చాలా ఖేదం చెందింది. అన్ని అంశాలూ క్షుణ్ణంగా చదివాను కానీ శ్రీ వేదాల తిరువేంగళాచారిగారి కావ్యమీమాంసను మరచిపోయాను. పరీక్షల కొరకు నందిగామ సౌభాగ్యవతి ఒక వారం ముందుగా వచ్చి మా యింట్లోనే దిగింది నా మనస్సులో క్రొత్తగా జరిగిన కళాశాల సంఘటనలతో నా మనస్సునిండా ఆవేదన నిండి చిరాకుగా ఉండే వ్యాకరణాన్ని అలక్ష్యం చేశానని కావ్యమీమాంస అసలు చదువలేదనే బాధతో నా మతి స్థిమితం తప్పి సౌభాగ్యవతిముందు అన్ని చెప్పుకొని కన్నీరు మున్నీరుగా ఏడ్చేశాను. సౌభాగ్యం నన్ను హృదయానికి హత్తుకొని పిచ్చి పిల్లా భయం అనేది నా నిఘంటువులో లేదని నిర్భయంగా చాటిచెప్పే నీవే ఇట్లా భయపడడం సబబేనా? ఇంక కళాశాల సంఘటన అంటావా? నిజం నిలకడమీద తేలకపోదు. ఆ సంఘటన వలన వాళ్లకే అపకారం కానీ నీకేం అపకారం! ఇంత మాత్రానికి బెంబేలు పడిపోయి ఏడుస్తూ చదువు మానేస్తావా? రేపు పరీక్షల్లో సరిగా వ్రాయలేకపోతే నీకు అనూచానంగా అప్రయత్నంగా లభిస్తూన్నా ప్రథమ శ్రేణి లభించకపోతే వాళ్ళ దృష్టిలో ఇంకా ఎంత చులకనైపోతావో ఆలోచించావా? అని

ఆవేశంగా అన్నది. ఈ చివరిమాటతో నాకు పౌరుషం, వచ్చి నిజమే నేనెందు బాధపడాలి అన్నాను. దానితో నా మనస్సులో కళంకం తొలగిపోయి ఉత్తేజం కల్గింది సౌభాగ్యం కావ్యమీమాంసలోని ప్రధానాంశాలను ప్రశ్నో ఉత్తరాలుగా క్రోడీకరించి వ్రాసి యిచ్చింది. ఇంక పరీక్షలకు మిగిలి ఉన్న వారం రోజుల్లో వ్యాకరణంలో తీవ్ర సాధన చేశాం!

పరీక్షల నాటికి నాకు నా విజయంపై సంపూర్ణ విశ్వాసం కల్గింది. ఆ విశ్వాసం నాకు ఊపిరి పోయగా పరీక్షలలో పాల్గొన్నాను. కడవటి ప్రశ్నాపత్రమైన వ్యాస పరీక్షాపత్రాన్ని ఎంతో ఉత్సాహంగా వ్రాశాను. దానికి కారణం, శ్రీ భావ రాజు కృష్ణరావుగారు శాతవాహనుల నాటినుండీ కల ప్రాకృతాంధ్రభాష మొదలు నన్నయ భట్టారకుని భారత రచనవరకు కల్గిన ఆంధ్రభాషా పరిణామాలను గూర్చి యిచ్చిన వివరణకు సంబంధించిన ప్రశ్న రావడం నేను మిక్కిలి ఉత్సాహంతో అదనంగా మూడుమార్లు ఆదనపు కాగితాలు తీసికొని సంపూర్ణంగా వ్రాయడమును! అయితే ఇక్కడ ఒక విషయం వ్రాయాలి.

మంచికో, చెడుకో వ్యాకరణం అంటే నా కొక విధమైన వైముఖ్యం ఏర్పడింది ఆ విషయమై మనస్సును పరీక్షల సాకుతో కొంతవరకు రాజీపరిచాను. కానీ వ్యాకరణ ప్రశ్న పత్రం మేమందరం ఊహించిన దానికంటె భిన్నంగా ఉంది. దానితో నేను కొంచెం బెంగారు తిన్నాను. పరీక్షల సమయానికి నేను మూడు నెలల గర్భవతిని కావడం వలనను మా అత్తవారింటినుండి అప్పటికే నేను ఇంకా చదువు సాగించడాన్ని గూర్చి వ్యతిరేకత ఎక్కువస్థాయిలో ఎదురైన నందువలను అయినా మా వారు 'ఈనగాచి నక్కలపాలుచేస్తే ఏం లాభం' ఈ పరీక్ష అయిన తర్వాత ఎట్లాగూ చదివేదింకేమీ లేదుకదా! నేను మాన్పించేది లేదని మొండిగా వారినందరనూ ఎదిరించి నా చదువునకు ఆటంకం కల్పించక పోయినందువలను ఈ పరిస్థితిని మనసులో పెట్టుకొని వ్యాకరణం ప్రశ్న పత్రం మూలంగా పరీక్ష తప్పితే నా కింక చదువుకోడానికి అవకాశం లేదు కదా! ఇంత చదివీ ఇంతకష్టపడీ, ఎన్నో ఈర్ష్యా వేశాలను ఎదురొడ్డి ధైర్యంగా ఆకుంఠిత దీక్షతో దృఢచిత్తంతో నేను చదివి పరీక్ష

వ్రాస్తే ఆ పరీక్షలో తప్పితే నేను నా జీవితంలో సాధించేదేమున్నది? పెద్దవారి ఆశీస్సులన్ని వృధా యేనా? ఈ పరీక్ష అయిపోతే పట్టుదలగా ఇంగ్లీషు చదివి M.A. అని పించుకోవాలన్న నా చిరకాల వాంఛకు మంగళహారతి పాడేసినట్లేనా? అనే భావాలు తీవ్రంగా నన్ను నా ఊహలను కదిపివేయగా వ్యాకరణోపాధ్యాయులైన శ్రీ శిరోమణి దగ్గర ఏడ్చేశాను. శ్రీ శిరోమణిగారు ఒక్క చిరునవ్వు నవ్వి "ఏమిటి నీవు పరీక్షలో తప్పుతావా? నీవు తప్పితే, పరీక్ష వ్రాసినవారెవ్వరూ కృతార్థత పొందలేరు ఒక్క వ్యాకరణ పత్రం సరిగా వ్రాయకపోతే అందులో కొంచెం మార్కులు తగ్గ వచ్చును. అంతేకాని నీకు అపజయంలేదు. అనవసరంగా బాధపడకు నీవు తప్పక విజయం పొందుతావు" అని ధైర్యం చెప్పి నన్ను ఓదార్చారు. ఈ ఓదార్పుతో నా అధైర్యం పటాపంచలైపోయింది. కొండంత ధైర్యం వచ్చింది. "నీకు అపజయంలేదు" అని వారన్నమాట నా చెవుల్లో రింగుమని మార్మోగి నా హృద యంలోచేరి "నీకపజయంలేదు. నీకపజయంలేదు." అంటూ విజయలక్ష్మి నా అంతశ్చేతనలో స్థిరంగా నిల్చి ఢంకా బజాయించిందా అన్నంత శక్తిని ప్రసాదించింది.

కాకినాడ మకాంలో ఉండి, శ్రీ కామరాజు తాతయ్యగారి నౌకా వ్యాపారాన్ని సాగించిన, మా మూడవ పెద నాన్న శ్రీ పద్మనాభంగారి భార్య శ్రీమతి రాఘవమ్మ గారికి, నేనంటే ఎంతో ప్రేమ అభిమానము ఉండేవి. దానికి కొంత కారణం, నా పేరు వారి అత్తగారి పేరు కావడం ఒకటి, నాకం వారి కుటుంబంలో ఆడపిల్ల తరువాత మా పెదనాన్న వెంకట రత్నంగారి రెండవ కుమార్తె లక్ష్మీకాంతం బి. ఏ. చదివింది. నేను అంత పెద్ద చదువు చదవడం ఆమె కెంతో సంతోషం కల్గింది. ఆ ప్రేమతో ఆమె అమ్మాయిని నా దగ్గర కొన్నాళ్ళు ఉంచుకొని పంపిస్తానని పంపమని రాజమండ్రికి మనిషిని పంపగా నేను కాకినాడ వెళ్లాను.

## దీపశిఖేవ నర్తతే

అక్కడ కొన్నాళ్ళు ఉండి, ఒక రోజు రాజమండ్రికి తిరిగి ప్రయాణమైనాను. నేను రాజమండ్రి పెద్ద స్టేషనులో దిగి, ఇంటికి వచ్చేసరికి కచేరీ చావడిలో

కూర్చొని ఉన్న శ్రీ ఠాకూర్ సదాశివరావుగారు (మా నాన్నగారు ఊసుపోక సాగించిన పట్టుబట్టల వ్యాపారానికి సహాయకుడు) ఏమిటి? నీవు ఒక్కతెవూ వచ్చేశావు! నీ కోసం రైలు స్టేషనుకు వెళ్ళిన వారంతా ఏరీ? అనడిగారు "నా కోసం రైలు స్టేషనుకు వెళ్ళడ మేమిటి? ఎవరు వెళ్లారు? ఎందుకు వెళ్లారు? నేను పెద్ద స్టేషలో దిగి వచ్చేశాను." అని అనేటంతలో, కిలకిలమంటూ ఒక యాభై మందిని వెంట వేసుకొని మా నాన్నగారు ఇంట్లో ప్రవేశించారు! నీవు యూనివర్శిటీ ప్రథమురాలుగా విజయం పొందావట అని మా అమ్మ పరీక్ష ఫలితాలు ప్రచురించిన నాటి ఆంధ్రపత్రికను నా చేతికిచ్చిందో, లేదో ఇంతలో శ్రీ బాలదారి వీర నారాయణదేవుగారు నా దగ్గరకు వచ్చి నా మెడలో పూలమాల వేసి నాకు దిగదుడిచి కొబ్బరికాయ కొట్టి అక్కడకు వచ్చిన యావత్తు మందిని, అక్కడ కచేరీ చావడిలోనే కూర్చోబెట్టి నా పరీక్ష విజయ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. వచ్చిన వారిలో మా పిన్ని కామక్షమ్మగారు, మహిళా సమాజాధ్యక్షురాలు శ్రీమతి తలారి చంద్రమతిగారు, శ్రీ భావరాజు కృష్ణారావుగారు, శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రిగారు, నండూరి బంగారయ్యగారు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, శ్రీ పాద కామేశ్వర రావుగారు మా ఉపాధ్యాయులు ఇంకా చాలా మంది పెద్దలు, ఉండడం నాకెంతో విస్మయాస్పదమైనది. అందరు తలో పూలమాలతో చిని చిన్ని ప్రసంగాలతో నన్ను ఆశీర్వదించారు. నేను అంత వరకు పరీక్ష ఫలితాలు ప్రచురించిన పత్రికను విప్పి పరిశీలించనేలేదు. నా నెంబరు వీళ్ళు సరిగా చూశారా? నిజంగా నాకు విశ్వ విద్యాలయ సర్వప్రథమ విజయం లభించిందా?" అనే సందేహాలు నా మనస్సులోవి మనస్సులోనే గుడుగుంజా లాడుతూ ఉన్నాయి. ఆ సమావేశం దిగ్విజయ సభగా శోభాయ మానంగా ముగిసిన తరువాతమా నారాయణ దేవుగారు లోపలికి వచ్చి ఎంతో ఆర్భాటంగా నన్ను పొగిడి పొగిడి వెళ్ళిపోయారు. తర్వాత నేను పత్రికను తెరచి నా నెంబరును "అందర నెంబర్ల కంటె పైన తలమానికంగా తళుక్కులీనుతూ నేనేకదా అన్ని నెంబర్ల తలపైన ఒంటిగా విజయధ్వజంలా విరాజిల్లుతూ ఉన్నదీ? అని గర్వంగా కులుకుతూన్న" నా నెంబరును చూచుకొని నేను "హిమశైలపు శిఖర మెక్కి వీక్షించితి విశ్వమంత ఏ జనముల బలిమియెంత నా జన్మకు గల కలిమియెంత?" అని ఒక్కమారు గొంతెత్తి పాడి విజయానందంతో చిందులేశాను. పారవశ్యం

పరవళ్లు త్రొక్కుతూండగా నాట్యం చేశాను. "విజయస్ఫూర్తితో వినువీధిలో విజయకేతనం ఎగుర వేశాను. విశ్వరంగంలో విఖ్యాత ప్రౌఢిమతో బిరుదపత్రము స్వీకరించాను." అంటూ ఇల్లంత చిందులేస్తూ రంగు రంగుల రంగ వల్లికలతో తీర్చి దిద్దాను. ఈ విజయం నన్ను భూమ్యాకాశాలేకమయ్యేసంధి ప్రదేశాన్ని సింహాసనం వేసి వీవనలు పట్టినంతగా ఉద్రేక పరచింది ఉబ్బితబ్బిబ్బై పోయాను. ఆ సంవత్సరం ప్రాచ్యపట్ట పరీక్షలో నాల్గు వందల అరవై (460) మంది పాల్గొన్నారు.

అంతరలోను నాకే పదునెన్మిదేండ్ల చిరుతప్రాయంకల, నాకే ప్రథమస్థానం లభించిందంటే, యూనివర్శిటీ నా శిరస్సుపై ఉంచిన ఆశీస్సు వలె మెరుస్తూన్న ఈ కిరీటం విలువ యెంతో, నా ఊహకు అప్పట్లో అందలేదు. కాని ఉత్తరోత్తరా నా బ్రతుకు బాటలో ఇప్పటి వరకు తన కాంతులను ప్రసరిస్తూనే ఉన్న ఆ కిరీటపు ధగద్ధగలు ఆ విలువను కొంత కాకపోతే కొంతైనా దీప్తిమంతంగా కాంతి పుంజాలును వలు దెనలా వెల్లివిరియింపజేస్తూ ప్రకాశిస్తూనే ఉన్నాయి. ఈ భావాన్ని ధ్వనింపజేస్తూ ఆనాటి విజయ సభలో ఎవరో పెద్దవారు "కృష్ణరావు కూతురు, మన అందరకూ కూతురే, ఈ నగరవాసులంతా ఆమె ప్రతిభను ఎరిగినవారే కానీ ఈ వేళ ఈ పరీక్షా విజయంతో ఇన్నాళ్లూ ఆమె అంతశ్చేతనలో ప్రకాశిస్తూ ఉన్న దీపశిఖ ఉద్దీప్తమై ఆంధ్రదేశమంతటా తన వెలుగులను ప్రసరింపజేసింది ఆమె ఆదర్శప్రాయురాలైన విద్యావతి కాళిదాసు రఘువంశంలో చెప్పినట్లు. ఆమె యిప్పుడు ఆంధ్రదేశంలో దీపశిఖేవ రాత్రే అని చేసిన ఆశీర్వాదం చేశారు నిజమేనేమో! నాకు తేజోవంతమైన భవిష్యత్తు ఉంటే నా కంటె గొప్ప అదృష్టవంతురాలెవరు? అనే ఆనందోద్వేగాలలో పులకించిపోతూ నా యెద ఉయ్యాలలూగింది!

వెంటనే ఈ ఆనందం పంచుకోవడానికి మావారు వచ్చారు. శ్రీ బావగారు శ్రీ ఉపేంద్రగుప్త గారు ఇంకా చాలా మంది సంతోషంతో టెలిగ్రాము లిచ్చారు.

మా మామయ్య స్వయంగా వచ్చి కొన్నాళ్ళుంచుకొని పంపిస్తానని చెప్పి నన్ను ఏలూరు తీసికొని వెళ్లాడు. అక్కడ మళ్లీ చుండూరి శ్రీరాములుగారు మొదలైన వారు విజయోత్సవ సభలు జరిపించి ఆశీర్వదించారు.

మా అమ్మమ్మ ఎంత ప్రేమ నాపై కురిపించిందో చెప్పనే అక్కర లేదు. రోజూ వేడి అన్నంపై బంగారు రేకులువేసి కమ్మని నెయ్యి వేసి దగ్గరుండి తాను కలిపి మొదటి ముద్ద తాను తన చేత్తో నాకు తినిపించేది. రాత్రి కుంకుమపూవు పచ్చ కర్పూరం జీడిపప్పులతో వేడి పాలు స్వయంగా త్రాగించేది!

ఆమె పేరు 'రామమ్మ' అహంకారం స్వాతిశయం ఇసుమంత కూడా లేకుండా జూటు మిల్లు కూలీలతో సహా (మామామయ్య జూటు మిల్లు సెక్రటరీ) తన అత్యంత కరుణా శీలాన్ని అత్యంత, ప్రేమానురాగాలనూ ప్రదర్శిస్తూ నిరాడంబ రంగా ప్రవర్తించే జమీందారిణి!

నా పరీక్షా విజయ సంఘటన జరుగక ముందు ఒక సంఘటన వ్రాస్తేనే కాని ఇదీ పూర్తి కాదు. మా పరీక్షలై పోయిన కొద్ది రోజులకే, విజయనగరంలో మహా పండితవరేణ్యులైన శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి గారి సప్తతి మహోత్సవం జరిగింది.

అక్కడకు మా పిన్ని కామాక్షమ్మగారు మమల్ని తీసుకొని వెళ్ళారు. అప్ప టికి ఉభయ భాషా ప్రవీణ పరీక్ష వ్రాసిన స్త్రీలు చాలా తక్కువైనందువలనను, అందులో చిన్నపిల్లలం మేము పరీక్ష వ్రాసినందు వలనను అక్కడి పండిత లోక మంతా మమ్మల్ని చాలా గౌరవంగా చూడడమే కాకుండా వ్యాకరణంలోను, అలం కార శాస్త్రంలోను ప్రశ్నలు వేసేవారు. అందరలోనూ చిలిపిగా, జవాబులు చెప్పి, వారికే మరల ఎదురు ప్రశ్నలువేసే నేను ఎట్లాగైతే ఆంధ్రయువతీ సంస్కృత కళా శాల పిల్లలు గట్టి వాళ్ళని అనిపించుకొని బయటపడ్డాం.

విజయనగరం నుండి తిరిగివస్తూ, మా పిన్ని, విశాఖపట్టణంలో దిగింది. మా పరీక్షలకు సర్వాధికారియైన, శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు విశాఖ పట్నంలో ఉన్నారు. వారిని ఊరికే గౌరవ పురస్కారంగా సందర్శించడానికి శ్రీమతి కామా క్షమ్మగారు వారింటికి వెళ్ళింది.

అప్పుడు వారు 'ఏమిటి కామాక్షమ్మగారూ మొన్న Final పరీక్ష వ్రాసిన పిల్లల్ని తీసుకొని వచ్చారటగా నాకు వాళ్ళని చూడవలెనని ఉన్నది. ఒకమారు తీసి కొని రండి' అన్నారట. ఆమె సందేహిస్తూ 'మీరు పరీక్షాధికారిగా ఉన్నారాయె! మరి ఇప్పుడు నేను మా పిల్లలను మీ దగ్గరకు తీసికొని రావడం సముచితమేనా?

అన్నదట! "అయినా ఫరవా లేదు. పేపర్లు వెళ్ళిపోయాయి లెండి మీ పిల్లలు తెలివైన వాళ్ళు. వాళ్ళని చూడాలని ఉన్నది. తీసుకొనిరండి." అని ఆయన ఒత్తి పలుకగా ఆమె మమ్మల్ని వారింటికి తీసికొని వెళ్లింది. ఆయన ఇందులో కృష్ణ రావుగారి అమ్మాయి యెవరు?" అని అడిగి తెలుసుకొని చాలా ప్రతిభావంతురాల వమ్మా నీకు మంచి భవిష్యత్తు ఉన్నదీ అని ఆశీర్వదించారు,

18 ఏండ్లకే యింత గ్రంథం జరిగిన వెనుక, గర్భవతినగుటచేతకొంత విశ్రాంతి తీసుకొనవలసి వచ్చినది.

1935 మార్చిలో నేను ఫైనల్ పరీక్ష వ్రాసినాను. 1935 నవంబర్ లో స్నాతకోత్సవము.

1935 సెప్టెంబరులో ప్రథమ పుత్రిక జననము. ఆ బిడ్డకు "ప్రమీల" అని నా ప్రేరణ వలననే పేరు పెట్టాము. తరువాత తొలిసారిగా అత్తవారింటికి తీసుకొని వెళ్ళారు. అక్కడ కొద్ది రోజులు మాత్రము ఉండి మళ్ళీ ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి పట్టప్రదానోత్సవ సభలో పాల్గొని పట్టం తీసుకోవడం కొరకు రాజమహేంద్రవరం వచ్చేశాను

తరువాత మళ్ళీ పాపతో చీరాల వెళ్ళినా మా వారు బాపట్లలో ఇల్లు చూచి సందున పాపను తీసికొని బాపట్ల వచ్చేశాను. బాపట్లలో తాలూకాఫీసుకు దగ్గరలో ఉన్న శ్రీ నాళం బాలకృష్ణయ్యగారి యింట్లో ప్రప్రథమంగా చేరాము. బాల కృష్ణయ్య గారు గొప్ప రస హృదయుడు ప్రతి దినమూ సాయంకాలం దీపాలు పెట్టే వేళ వచ్చి పసిపాప ప్రమీలను తన ఒడిలో పరుండ బెట్టుకొని నా చేత వీణ వాయింపించుకొని వినేవారు! ఆ యింటి కానుకొని ఉన్న పెరట్లో కూరగాయల మొక్కలు, పువ్వుల మొక్కలు వేశాం. వాటికన్నింటికి 15, 20 బోళ్ళ బుంగల నీళ్ళు నూతిలో నుండి తోడి నేను పోసేదాన్ని, వంట మనుష్యులు లేరు. ఒక్క జీతగాడు (నౌకరు) ఉండేవాడు, రాజమహేంద్రిలో అమ్మ ఎంత పోరినా, ఏ యింటి పనీ నేను నేర్చుకోలేదు. పాపను చూచుకోవడం కూడా నాకు చేత కాలేదు. మా యింటిగోడ నానుకొని, సామ్రాజ్యం అని ఒకామె ఉండేది. ఆమె పెద్ద కొడుకు

వరదరాజులు నీళ్ళకు భోజనానికీ, వాళ్ళయింటికి వెళ్ళేవాడు. మిగతా సమయాలలో చదువుకొంటూ మా యింట్లోనే ఉండేవాడు. చెరగడం, విసరడం, దంచడం అనే పనులు చేయవలసి వచ్చినప్పుడు నేను ఎంతో అవస్థపడేదాన్ని, ఆ సమయంలో నన్ను చూచి శ్రీమా గుప్తగారు తెగ నవ్వేవారు! ఆ నవ్వు చూచి ఉక్రోషపడి, సామ్రాజ్యం దగ్గర మెల్లిగా అన్నిపనులూ నేర్చుకొన్నాను.

## స్త్రీహితైషిణీ మండలిలో ప్రవేశం

బాల్యం నుండీ, సభలకూ, సంస్థల సేవకూ అలవాటు పడిన నేను బాపట్ల వచ్చిన తరువాత గోళ్ల గిల్లుకుంటూ కూర్చుండ లేక పోయాను.

బాపట్ల నివాసస్థురాలైన, సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు బాపట్లలో "స్త్రీహితైషిణీ మండలి" ని స్థాపించి మహిళా సంఘాభివృద్ధి కొరకు అనేక కార్యక్రమాలు చేస్తూ పాటు పడ్తూ ఉన్నారు. నేను బాపట్ల రాకముందు నుండే గృహలక్ష్మిపత్రికలో ప్రచురింపబడ్తూ ఉండే వారి రచనలను ముఖ్యంగా శారద లేఖలను చదువుతూ ఉండేదాన్ని, ఆ ప్రభావంతో మహిళాభ్యుదయం అంటే తెలుగు సాహిత్యం అంటే, చెవి కోసుకొనే నేను బాపట్ల వచ్చిన రెండు మూడు రోజులకే ఆమె దగ్గరకు వెళ్ళి, ఆమె పట్ల గల నా భక్తి ప్రపత్తులను సవినయంగా తెల్పుకొని మండలిలో "పావలా" చందాదారురాలిగా చేరాను. "హమ్మయ్య ఇక్కడకూడా నేనే సేవాకార్యక్రమాలు జరుపుకోవచ్చును." అనే సంతృప్తి నాకు కల్గింది.

ఇక అప్పటినుండీ, విధిగా మండలి కార్యక్రమాల్లో పాల్గొని చాలా సేవ చేశాను. శ్రీమతి వరలక్ష్మమ్మగారికి అట్టే భారం కలుగకుండా, అన్ని కార్యక్రమాల బాధ్యతా, నేను వహించి నిర్వహించేదాన్ని క్రమ క్రమంగా మా యిద్దరి అనుబంధం ఎంతవరకూ వచ్చిందంటే, నేను అక్కడ చేరకముందు, ఆమెకు అత్యంత ఆప్తులుగా ఉండేవారంతా "ముందు పుట్టిన చెవులకంటే, వెనుక పుట్టినకొమ్ములు వాడి" అని నన్నుచూచి ఈర్ష్యపడేటంత హెచ్చు అనుబంధం ఆమెతో కల్గింది. ఆఖరికి ఏదైనా పండుగా పబ్బంవస్తే ఊళ్లో పేరంటాలకు బయలుదేర్తే ముందుగా నా దగ్గరకు వచ్చి ఒక్క అణాయైనా (అప్పటి ద్రవ్యమానం రూపాయికి పదహారు

అణాలు) నా చేత బోణీచేయించుకొని మరీ బయల్దేరేవారుకూరలవాళ్ళు, బండ్లవాళ్ళు నీ బోణీ మంచిదమ్మా అని నా చేత బోణీ చేయించుకొనేవారు!

ఇట్లా మండలి సభ్యురాలుగా కార్యక్రమాలు నిర్వహిస్తూ కాలక్షేపం చేస్తూం డగా, మా మొదటి పాప ప్రమీలకు విరేచనాలు హెచ్చుగా అయినందున, రాజ మహేంద్రి నుండి, మా అమ్మ వచ్చి ఆ పాపను తీసికొని వెళ్ళింది. ఆ పాప స్ఫోటకం వచ్చి అక్కడే చనిపోయినది.

మరల 1937 అక్టోబరు 3వ తేదీనాడు నాకు ఆడపిల్ల కల్గినది. ఆమెకు 'వందేమాతరంగీతం గుర్తుగా 'సుహాసిని' అని పేరు పెట్టాం. మా సుహాసినిని ప్రసవించడానికి రాజమహేంద్రి వెళ్ళిన సమయంలో శ్రీమతి తలారి చంద్రమతి గారి మహిళా సమాజ స్థాపన పనులలోను, ఆంధ్ర మహిళాగాన కళాశాల పనులలోనూ నేను పూర్తిగా పాల్గొనేవాన్ని, ఆ పాపను, ఇంకారెండు గంటలకు ప్రసవిస్తాననగా కూడా నేను తలారి చంద్రమతి గారూ మహిళా సంఘం రిజిస్ట్రేషను కొరకు నియమ నిబంధనలను వ్రాస్తూ గడిపాము.

మా నాన్నగారు ప్రతి వేసవికాలానికి, బాపట్ల చల్లగా ఉంటుందనీ, తనకు టీకి చిక్కని పాలు ప్రొద్దున్నే దొరకు తాయనీ బాపట్ల వచ్చేవారు!

ఆ సమయంలో బాపట్లయందలి లాయర్లు టేనుహాలులో ఒక సాహిత్యసభ పెట్టి వారిని సత్కరించారు. ఆ సభలో శ్రీ మానాన్నగారు బాపట్లలో ఏ ఊరుకీ లేని ఒక విశిష్టస్థానం ఉన్నది. అదేమిటంటే ఇక్కడ పెద్ద లాయరైన శ్రీ వెలగ పూడి సుబ్బారావుగారు భార్యపేరున సరస్వతీ స్మారక బాలికోన్నత పాఠశాల ఉండడం సాహిత్య తపస్విని, ఆంధ్రభాషాభిమాని, నా కుమార్తె ఇక్కడ నివాసం ఉండడం ప్రసిద్ధ రచయిత్రి శ్రీ కనుపర్తివరలక్ష్మమ్మ గారు మహిళా సమాజం స్థాపించి ఇక్కడ ఉండడం సేవావ్రతురాండ్రైన ముగ్గురు మహిళల కావాస ప్రదే శమైనందున ఆంధ్రదేశంలో బాపట్ల విశిష్టస్థానం సంపాదించుకొన్నది. అని ప్రసం గించారు.

ఇది జరిగిన కొద్దికాలానికి, బాపట్లయందలి యువకులు చివుకుల వేంకటేశ్వర్లు

గారు ఇప్పుడు లాయరుగా ఉన్న కొమరవోలు బాలుడు (బాల రాజకృష్ణశర్మగారు) ఇంకా కొంతమంది కలిసి యువవిజ్ఞాన సమితి అనే పేరుతో సాహిత్య సభలు పెట్టాలని సంకల్పించి మా దగ్గరకు వచ్చి నన్ను ఆహ్వానసంఘాధ్యక్షురాలుగా చేసి మూడు రోజులు తెలుగు దేశంలోని కొందరు సాహిత్యవేత్తలను ఆహ్వానించారు. 'నారాయణరావు' నవలా రచయిత ప్రసిద్ధ సాహితీవేత్త అయిన శ్రీ అడవి బాపిరాజు గారు మా ఆహ్వానం మన్నించి సభలకేతెంచి ఉత్తేజకరమైన ప్రసంగం చేశారు. ఆ సభలనుండి ఉత్తేజం పొందిన ఆనాటి బాపట్ల యువత ఒక స్థిరమైన సాహిత్య సంస్థ బాపట్లలో స్థాపించాలని ఉబలాట పడ్డారు. కానీ అది కార్యరూపం ధరించలేదు.

శ్రీ మా నాన్నగారికి అరవైయేండ్ల పండుగగా రణ్మహేంద్రపురవాసులు షష్ట్యబ్దిపూర్తి ఉత్సవాన్ని తలపెట్టారు. మూడునాళ్ల ముచ్చటగా ఆ ఉత్సవాలు జరిగాయి. చెళ్లపిళ్ల వేంకటకవీశ్వరులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మొదలైన మహా విద్వత్కవివరేణ్యుల ఆశీస్సులతో ప్రసంగాలతో షష్టిపూర్తి సభలు చాలా వైభవంగా జరిగాయి. ఆ సమయంలో మా అన్నయ్య నాగేశ్వరరావు గౌతమీ గ్రంథాలయం కార్యదర్శిగా ఉన్నాడు.

ఆ ఉత్సవాలకు కట్టమంచి రామలింగారెడ్డిగారు అధ్యక్షత వహించారు. వారి అధ్యక్షతన జరిగిన మహాసభలో నేను "నాచన సోమనాథ నవీన గుణసనాథ" అనే అంశంపై ప్రసంగించాను. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు "నాచన సోమన పద ప్రయోగ వైచిత్రికి, పెట్టిన పేరు కానీ ఆ మహాకవిలో ఇంత సులలితభావార్ధసంపత్తి ఉన్నదని సోదాహరణంగా నిరూపించిన ఈ ప్రసంగం బహుధా ప్రశంసనీయం" అని పేర్కొని నన్ను ప్రశంసించారు. ఈ వ్యాసం మా నాన్నగారి షష్టి పూర్తి సంచికయైన శ్రీ కృష్ణ రాయాభ్యుదయ సంచికలో ప్రచురింపబడింది. అంతే కాదు. మా నాన్నగారిని గూర్చి నేను వ్రాసిన పద్యాలు కూడా అందులో ప్రచురితమైనాయి. ఇంకో విశేషమేమంటే నేను విశ్వ విద్యాలయ ప్రథమ స్థానం గెలుచుకొన్నా, నాకు లభించని స్వర్ణపతకం ఆవేళ గౌతమీ గ్రంథాలయంలో కట్టమంచి వారి అధ్యక్షతన జరిగిన మహాసభలో శ్రీమతి కామాక్షమ్మగారు కట్టమంచి వారిచే నాకు బహూకరింప జేశారు. నేను పరీక్షలో ప్రథమ కక్ష్యలో విజయం పొందిన

తర్వాత గౌతమీ గ్రంథాలయం పర్యవేక్షకులుగా ఉంటూ మా యింట్లోనే ఉంటూ ఉన్న శ్రీముద్దుంగి శర్మగారు 'తెలుగు మొలక' అనే మకుటంతో ఒక వ్యాసం వ్రాసి ఒక బహిరంగసభలో 'తెలుగు మొలక' అనే బిరుదాన్ని కూడా యిచ్చారు. ఈ వ్యాసం భారతిలో ప్రచురింపబడింది. నాకిది రెండవ బిరుదు కట్టమంచి వారిచే ప్రసాదింపబడిన స్వర్ణ పతకం మూడవది - మళ్ళీ అనంతర చరిత్రలోకి వద్దాం. మేము బాపట్లలో చాలా యిళ్ళు మారి, సింగరగిరి అనే (ఇప్పుడు మైసూరు ఫర్టిలైజర్స్ ప్రక్కన ఉన్న) ఇంట్లోకి మారాము నేను నా ప్రథమ కుమారుడు ప్రతాపచంద్ర రెండవ కుమారుడు నరేంద్రనాధుడనే ఇద్దరు మగపిల్లలకు తల్లి నైనాను ప్రతాప చంద్రుని కడుపుతో ఉన్నప్పుడు కాకతీయ సామ్రాజ్య చరిత్ర చదివాను దానిఫలితంగా ఆ బిడ్డనికి ప్రతాప చంద్రుడని పేరుపెట్టాము. నరేంద్రుడు నా గర్భంలో పెరుగుతూ ఉన్నపుడు వివేకానందుని చరిత్ర చదివాను. ఆ చరిత్ర చదవడం పూర్తిచేసినరాత్రే నాకు ద్వితీయ పుత్రజననం కల్గింది. ఆ గుర్తుగా నా ద్వితీయ పుత్రునకు 'నరేంద్ర నాధు'డని పేరుపెట్టాము. నేను మొదట్లో ఆ పిల్లవానికి 'రాజరాజ నరేంద్ర' అని పేరు పెట్టాలనుకొన్నాను. దానికి అనుగుణంగానే మా రెండవ అబ్బాయి తనపేరును "రాజరాజ నరేంద్రుడనే వ్యవహరించుకొన్నాడు.

ఇది యిట్లుండగా హితైషిణీ మండలి వార్షికోత్సవానికి 'నదీ సుందరి' అనే 'నాటకాన్ని ప్రదర్శించాలని నిర్ణయించాము. ఈ నాటక నిర్వహణలో స్థానిక న్యాయవాదులైన శ్రీ ధారా నరసింహ శాస్త్రిగారి కుమార్తెలు మల్లాది పద్మావతి, లలిత ఇంకా ఇతరులు బాగా సహకరించారు. అంతేకాదు సుప్రసిద్ధ నటశేఖరులు శ్రీ స్థానం నరసింహారావుగారి చెల్లెలు సత్యవతి కూడా నాకు మంచి తోడ్పాటు నిచ్చింది. ఆ నాటక నిర్వహణలో ఒక తబలా వాద్యకారుడు కావలసి వచ్చింది. అప్పుడామె స్థానిక గుంటూరు జిల్లాపరిషదున్నత పాఠశాలా ఉపాధ్యాయులు శ్రీ బొడ్డు రాఘవయ్యగారి కుమారుడు చిరంజీవి పురుషోత్తం అనే బాలుడు కంజీరా వాయిస్తాడని తీసుకొనివచ్చి పరిచయం చేసింది.

## మండలి భవన నిర్మాణం

నేను బాపట్ల వచ్చేటప్పటికి మండలి ఇప్పుడు టెలిఫోను ఆఫీసు ఉనన్ని

ఇంట్లో ఉండేది. దానికి స్వంత భవనం ఏర్పాటు చెయ్యాలని శ్రీ వరలక్ష్మమ్మగారి అభిలాష! అప్పట్లో గుంటూరుజిల్లాబోర్డు అధ్యక్షులైన శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారి నడిగి ఇప్పుడు మండలి ఉన్నస్థలాన్ని గ్రాంటుగా పొందారు. ఇక భవన నిర్మాణం జరగాలి! దానికొరకు ఆమె విరాళాలకు పర్యటన ప్రారంభించారు. నెల్లూరు, మద్రాసులలో ఆమె విరాళాలడిగడానికి వెళ్ళినచోట దాతలు మాలక్ష్మి కాంతమ్మ ఆ గ్రామ నివాసినియేకదా! ఆమే మీ సంస్థలో సభ్యురాలుకాదా భవన నిర్మాణ సంఘంలో ఆమె పేరు లేదే? అని అడిగారట! వెంటనే ఆమె వెనక్కు తిరిగి వచ్చి 'లక్ష్మికాంతమ్మగారూ నెల్లూరు, మద్రాసు నగరాలలో ఇట్లా జరిగింది. మీరు భవన నిర్మాణ కమిటీలో ఉపాధ్యక్షురాలుగా ఉండాలి' అని అడిగింది. నేను ఎప్పుడూ ఎక్కడా ఏ పదవీ కోరలేదు పనిచెయ్యడం తప్ప! ఆ ఉద్దేశంతో "ఆఁ ఎందుకు నాకిపుడా ఆ ఉన్నత పదవి! నేను కూడా ఈ మారు మీతోవస్తాను. డబ్బు వసూలు చేద్దాం లెండి" అని జవాబిచ్చాను. అయినా ఆమె వినకుండా భవన నిర్మాణ సంఘంలో ఉపాధ్యక్షురాలుగా చేర్చుకొన్నారు. ఆ తర్వాత ఆమెను నేను రాజ్జగరికి కాకినాడకు, ఏలూరుకు తీసికొని వెళ్ళాను. రాజ్జగరిలో ఆమె ప్రసంగం ఏర్పాటు చేశాను. అక్కడనుండి ఆమెను బాపట్ల పంపించి నేను, మా అమ్మగారింట్లో కొన్నాళ్లున్నాను. ఆ సమయంలో జయపురం మహారాజు, రాజా విక్రమ దేవవర్మగారు రాజమహేంద్ర వరం వచ్చారు. అప్పుడు నేను వారిని దర్శించి పద్యాలతో వారిని ప్రశంసించి మండలికి విరాళం (పద్యాలతో) అడిగాను వెంటనే వారు నేను కోరిన విరాళం ప్రసాదించారు. ఇట్లా విరాళాలు ప్రోగు పడినతర్వాత ఇప్పుడున్నభవన నిర్మాణం జరిగింది.

ఆ భవనంలోనే నదీ సుందరి నాటకం ఆడించాలనే ప్రయత్నాలు చేస్తూ ఉన్న సందర్భంలో కంజీరా వాయించడానికి సహాయకారిగా చి॥పురుషోత్తం పరిచయం అయ్యాడు. ఆవిధంగా పరిచయమైన పురుషోత్తం, అప్పటికి IV ఫారం చదువుతూ ఉన్నాడు. తెలుగులో నా సహాయ మర్థించి ఆనాటికి మేము అద్దెకు ఉన్న 'సింగరగిరి' (ఇంటిపేరు)కి వస్తూ ఉండేవాడు!

## బొడ్డుపల్లి పురుషోత్తంతో పరిచయం

సింగరగిరిలో మేము ఉన్న రోజులలో నేను ఇంటిపని వంటపని సంబాళించు కొని, శ్రీ మా వారిని కోర్టుకు పంపి కొంత మంది ఆడ పిల్లలకు సంగీతం, వీణ తేలికయైన ప్రబంధాలు పాఠం చెప్తూ ఉండేదాన్ని వాళ్లువెళ్ళి పోగానే పురుషోత్తం తెలుగు నేర్చుకోడానికి వచ్చేవాడు. సాయంత్రం నాలుగు గంటలయ్యేటప్పటికి మళ్ళీ ఇంటిపనులు మొదలయ్యేవి పురుషోత్తం స్కూలు ఫైనలు చదివి ఆ పరీక్షలో కృతార్థుడైన వెనుక శ్రీ బొడ్డుపల్లి రాఘవయ్యగారు ఇంక నేను చదువు చెప్పించ లేనని తాలూకా ఆఫీసు గుమాస్తాపని కొరకు ప్రయత్నాలు చెయ్యడం మొదలు పెట్టారు. పురుషోత్తానికి పై చదువులు చదవాలని బ్రహ్మాండమంత ఆశ! మేమెన్ని చెప్పినా ఆయన తన పట్టు విడవకుండా తాలూకా ఆఫీసు గుమాస్తాగా చేర్చేశారు చేసేదిలేక పురుషోత్తం ఆ పనిలో చేరినా ప్రైవేటుగా ఇంటరు చదవాలని మొదలు పెట్టాడు. ఆ ప్రయత్నంలోనే వేరే ఊళ్ళల్లో పని అయినా సెలవుల్లో శని ఆది వారాల్లో వచ్చి తెలుగు చదివేవాడు!

ఆ సమయానికి నాకు ఆరుగురు పిల్లలు ప్రమీల (మొదటి సంతానం) పోయిన తర్వాత సుహాసిని, ప్రతాపచంద్ర, రాజ రాజనరేంద్ర, సురేశ్వర్, కృష్ణదేవ రాయలు వీరిలో సురేశ్వర్, కృష్ణదేవరాయలు కూడా చనిపోయారు. ఆ బిడ్డ మరణం సింగరగిరిలోనే జరిగింది. కృష్ణదేవరాయలు జన్మించిన నెలరోజులకు రోహిణీ కార్తె ఎండ దెబ్బకు అతిసార విరేచనాలు కాగా రాజమహేంద్రవరం నుండి నేను మా అమ్మ, శ్రీమతి కామాక్షమ్మగారు చల్లని ప్రదేశానికి తీసుకొనివెళ్తే పిల్లవానికి జబ్బు నయమౌతుందని బెంగుళూరు తీసికొని వెళ్ళాము. అక్కడ శ్రీ మా నాన్న గారు చేసిన పట్టుబట్టల వ్యాపారంలో బెంగుళూరు పట్టుబట్టలు పంపించే దొంతి శ్రీరాములుగారి సహకారంతో వైశ్య హాస్టలులో ఒక గదిని సంపాదించి ఆ పిల్ల వానికి నెల్లాళ్ళు వైద్యం చేయించాము. అక్కడ చల్లని వాతావరణము, వాడిన మందు ప్రభావం వలన కృష్ణదేవరాయలకు వ్యాధి నిమ్మళించింది. అప్పుడక్కడ నుండి వస్తూ నేను బాపట్లలో దిగిపోయాను. ఆ సమయంలోనే వేసంగి సెలవులలో

మా వారు మద్రాసులో మా పెద్ద ఆడపడుచు శ్రీతూనుగుంట్ల రామాంబ నారాయణ మూర్తిగార్ల కుమార్తె (గొల్లపూడి సత్యవతి, సుబ్బారావుగారల ఇంట్లో ఉండి ఆయుర్వేదౌషధసేవనం చేశారు. బాపట్ల వచ్చిన తర్వాత కృష్ణదేవరాయలు సీరసవ్యాధికిగురై ఆరునెలలకే చనిపోయాడు. ఆ రోజులలోనే బాపట్లలో అగ్రికల్చరల్ కాలేజీ ప్రారంభోత్సవం జరిగింది. కొంతి రామమూర్తిగారి కృషిఫలితంగా ఆ కళాశాల బాపట్లకు దక్కింది. బాపట్ల ఇసుకప్రాంతము, ఆ ఇసుకలో 16, 17 రకాల టిస్యూలు ఉన్నవట! ఆకారణంగా ఆ కళాశాలను ఇక్కడ స్థాపించారు. ఆనాడు జరిగిన సభలో శ్రీ కొంతి రామమూర్తిగారు బాపట్ల అగ్రికల్చరల్ కాలేజికి B A.C అని ఇంగ్లీషులో సంగ్రహంగా అనేవారు. ఆనాడు రామమూర్తిగారు ఆంధ్రులకు ఆరంభశూరులు అనే అపవాదు ఉన్నది ఆ కారణంగా B A.cకి k చేర్చి కళాశాలను Back చేయకండి. అని చమత్కరించారు.

ఆ కళాశాలా ప్రారంభోత్సవానికి వచ్చి మా పిన్ని కామాక్షమ్మగారు పిల్లవాని పరిస్థితి చూచి కొద్దిరోజులు ఇక్కడే ఉన్నారు.

పగలంతా, రాత్రంతా ఏడ్చి ఏడ్చి తెల్లవారు జామున గంట, రెండు గంటలు నిద్రపోయేవాడు! ఆ సమయంలో నాలుగు కుంపట్లు పెట్టుకొని వంటచేసుకొనేదాన్ని, ఎంత ఏడ్చినా, రామనామం చేస్తేనో, రాముని పాటలు పాడితేనో కొద్దిసేపు పడుకొనేవాడు. కామాక్షమ్మగారు ఈ విషయం కనుగొని ఎంతో ఆశ్చర్యపడి, వీడు పూర్వజన్మలో రామభక్తుడే, కర్మశేషం ఉండి మళ్ళీ జన్మించాడనేది. ఇప్పుడు మళ్ళీ కొంచెం వెనుకకు వెళ్ళి, ఇంకొక ముఖ్యమైన ఉదంతాన్ని గూర్చి ఉల్లేఖించాలి.

బాపట్లలో కాపురం పెట్టడానికి మాకు అనువుగా లభించిన ఇంటి ఆసామి. శ్రీ నాళం బాలకృష్ణయ్యగారి ఏకైక పుత్రుడు చిరంజీవి రామచంద్రరావు. బాలకృష్ణయ్యగారు షరాబు వ్యాపారం చేసే వారనుకుంటాను. రామచంద్రరావుస్కూలు ఫైనలు పరీక్షలో కృతార్థుడైన వెనుక, ఆ అబ్బాయి చదువు మాన్పించి, తన వృత్తిలో చేర్పించి, తన ఆధ్వర్యంలో తన కుమారునకు తగిన శిక్షణ ఇయ్యాలని, ఆయన ఆలోచన! పై చదువు చదవాలని రామచంద్రరావు ఉద్దేశం! రామచంద్రరావు

మా సహాయం అర్థించాడు. మేమిద్దరమూ చాలా ప్రయత్నించి బాలకృష్ణయ్యగారికి విద్యవలన ప్రయోజనాలు చెప్పి. యిందుమించు ఆయనతో పోరాడి ఒప్పించి ఇంట ర్మీడియేట్ ఇంటర్మీడియేటు పరీక్షయైన వెనుక L.L.B కి కూడా చదివించాం. తరువాత స్థానిక న్యాయవాదియైన శ్రీ మోదదుగు నాగేంద్రగుప్తగారి పెద్దమ్మాయితో పెండ్లి జరిపించారు. శ్రీబాలకృష్ణయ్యగారు! ఆ అమ్మాయి, కొంచెం అమాయకురాలు, చురుకుదనంలేదట ఆకారణంగా రామచంద్రరావు ఆ అమ్మాయంటే చాలా వ్యతిరేకభావం కనబరచేవాడు. రామచంద్రరావు మంచితెలివితేటలు చురుకుదనం, సామర్థ్యం. ఉద్రేకం కల్గిన యువకుడు? గంభీరమైన గళం విప్పి కమ్మగా ఏవేవో పాటలు పాడేవాడు! రాత్రి 10 గంటలకు బూట్లు టకటక కొట్టుకొంటూవచ్చి వీణ తెచ్చి నాచేతిలో పెట్టి, చిందులేస్తూ గంతులేస్తూ తాను పాటలు పాడ్తూ ఉంటే, నేను ఆ పాటలకనుగుణంగా వీణ వాయించేదాన్ని! ఉత్తేజంతో, ఉల్లాసంతో ఎప్పుడూ నవ్వుతూ 'అక్కయ్యగారూ' అంటూ నా వెనుక తిరిగే ఆ అబ్బాయిని నేను సొంత తమ్ముడుగానే నేను చూచేదాన్ని నా సహవాసంతో యువకుడైన రామచంద్రరావు, సహజంగా కాంగ్రెసులోచేరి భారతమాతసేవకు పూనుకొన్నాడు కానీ, ఉద్రేకియైన రామచంద్రరావునకు కాంగ్రెసు యొక్క సాత్వికభావసంపద, సాంప్రదాయ సిద్ధమైన సేవాకార్యక్రమాలు రుచించలేదు. కమ్యూనిజం యొక్క విప్లవ భావాలకు ఆకర్షితుడై, అటు మొగ్గు చూపించడం మొదలుపెట్టాడు. నేనది కనిపెట్టి, మూడు రోజులు ఇంటికి వెళ్ళకుండా మా యింట్లోనే, ఉంచి, బ్రిటిషువారి, పరిపాలనలో భారతీయులనుభవిస్తూన్న దాస్యం వలన భారతదేశప్రజలనుభవిస్తూన్న దుర్భర పరిస్థితులు, రవి అస్తమించని సామ్రాజ్యాన్నేలుతూన్న తెల్లదొరల సైనికశక్తి, ఆయుధ సంపత్తి. సత్యాగ్రహాన్ని అణచి, వేయాలని, వారసునరిస్తూ ఉన్న భయంకరహూరణకాండ! అన్నీ వివరించి బాపూజీ అవలంబిస్తూన్న అహింస, శాంతి సత్యాగ్రహమే బ్రిటిషువారి దమననీతికి సరియైన పద్ధతి కానీ, కత్తికి కత్తి అని విప్లవించే విప్లవ వాదుల ఉద్యమం వలన రక్తపాతం తప్ప, స్వాతంత్ర్యం రాదనీ మెల్లిగా, గట్టిగా, బోధించి బోధించి, అతడు పన్నిన ప్రతియుక్తులతో అతని వాదాన్ని జయించి, ఎట్టకేల కెట్లైతేనేం అతడిని మళ్ళీ కాంగ్రెసువాది గానే నిలుపగల్గాను.

కానీ, అతని హృదయంలో దావాగ్నిలా మండుతూ, నుళ్ల తిరుగుతూన్న విప్లవ భావాలు బహిరంగంగా వెల్లువికి, విప్లవ కార్యాచరణ రూపంలో ఆకృతులు దిద్దుకోవడానికి సమాయత్తమౌతూ ఉన్నాయని, నేను గ్రహింపలేకపోయాను.

బాపూజీ వ్యక్తి సత్యాగ్రహానికి పిలుపునిచ్చిన సమయం అనుకొంటాను! ఉన్నట్లుండి ఒక పెద్ద బాంబు ప్రేలినంత వార్త ఇంట్లోనే ఉన్ననాకు చేరింది.

నాళంరామచంద్ర బాపట్ల సబ్‌కోర్టులోనికి ప్రవేశించి జార్జి చిత్రపటం తీసివేసి రికార్డంతా ధ్వంసంచేశాడని అట్లాగే సబ్‌రిజిష్ట్రారు ఆఫీసులోకి చొరబడి అక్కడ రికార్డంతా తగుల బెట్టాడనీ" నాకు వార్తచేరింది. హఠాత్తుగా ఉరుములేని మెరపులా, ఒక్కక్షణంలో ఈ విధ్వంసకాండ, నిర్వహించి ఆ రంగం నుండి తప్పుకొని పారిపోయాడట! పోలీసులు నిద్రలేచి ఆవులించి చిటికెలువేసేటప్పటికి 'ఏడీ రామచంద్రరావు, ఏడీ' ఎక్కడకు పారిపోయాడు? అని పోలీసులు, ఉద్యోజనమూ, అసలు విషయం తెలియక తెలిసినా నోరెత్తలేకా, రామచంద్రరావు ఎక్కడున్నాడో తెలియక తెలియని ఊహాల సంఘర్షణతో ఉక్కిరిబిక్కిరై పోయారు. పోలీసులు వెంటనే మార్షల్‌లా ప్రకటించారు. కొందరు "పోలీసులు మీ యింటికి వస్తూన్నారంటే అదుగో రానే వచ్చారంటే, ఎక్కడ దాచారండీ అంటే" ఇట్లా మా యింటికి జనం తండోపతండాలుగా వచ్చిఅడగడం మొదలు పెట్టారు. మావారు ఇంకా ఇంటికి రాలేదు. నేనేమీ భయపడలేదు. కానీ, ఈ ముహూర్తంతో ముడి పడి ఉన్న ఇంకొక శుభముహూర్తానికి, నేను వెళ్ళలేనేమోనని బెంగారుపడ్డాను.

## అదే భగవద్గీతాధ్యయన ప్రారంభ సుముహూర్తం

ఆ సమయానికి సబ్‌జడ్జీగా ఉన్నవారు మా పినతాత,నాళం లక్ష్మీకాంతంగారి అల్లుడు, రాజమహేంద్రవర నివాసి, శ్రీ యలమర్తి సుబ్బారావుగారు! ఆయన సాధు సజ్జనమూర్తి, సత్యవాది, న్యాయవాది, నిష్కళంక చరిత్రుడు. సబ్ రిజిష్ట్రారుగా ఉన్నవారు శ్రీ యల్లాపంతుల జగన్నాథంగారు! వారు చాలా గొప్ప ఆధ్యాత్మిక వేత్త! భగవద్గీతా తత్త్వదర్శి! ఆ మహానుభావులు నాకు ఆ వేళ సాయంకాలమే

భగవద్గీతాధ్యాయనం చేయడానికి ముహూర్తం పెట్టినరోజు! ఆ ముహూర్తానికి పాఠం ప్రారంభంకాదే అని బంగారుపడ్డాను.

అయితే ఆ ముహూర్తం సామాన్యరీతిలో పెట్టబడినదైతే అంతబంగారు పడక పోదును. కాని దాని వెనుక ఒక మహిత్తర గాధ ఉన్నది.

శ్రీ జగన్నాథం పంతులుగారు శ్రీమా వారికి ఒక ప్రయాణ సందర్భంలో రైలులో కలిశారట! ఏదో మాటల సందర్భంలో ఆయన భగవద్గీతాధ్యయనంలో, అద్వితీయ పాండిత్యం కల వారనీ, వారు సబ్ రిజిష్ట్రారుగా బాపట్లకు బదిలీ మీద వస్తూ ఉన్నారనీ, తెలుసుకొని, ఆ శుభవార్తను, శ్రీమావారు హయగ్రీవ గుప్తగారు నాకు చెప్పారు. వారెపుడు బాపట్లకు వస్తారా అని, నేను శ్రీమావారు, ఎదురు తెన్నులు చూడసాగాము!

వారు రానే వచ్చారు మేము వారింటికి వెళ్ళివారిని మా యింటికాహ్వానించాము వారు మా యింటిని పావనంచేయగానే, నేను నాకు భగవద్గీత బోధించమని అభ్యర్థిం చాను. ఆంధ్రసాహిత్యంలో చక్కని, ప్రవేశమున్నా, నాకు ఆ మహా కావ్యాలలో ఆధ్యాత్మికమైన రచనా సందర్భాలు తటస్థపడితే అదికొరుకుడు పడక, అంతవరకు, వదిలిపెట్టి తక్కిన సాహిత్యభాగం చదివేదాన్ని ఈ లోపం ఏ మహాను భావుడు తీరుస్తాడా అని నేను ఆరాట పడ్తూనే ఉన్నాను. కాగల కార్యం గంధ ర్వులు తీర్చినట్లు, వీరిరాకతో, నా మహదాశయం నాకాంక్ష తీరిపోగలదని నేను ఆశించి వారినట్లా అభ్యర్థించాను.

కానీ వారు మీరు స్త్రీలు కనుక బోధించను అనలేదు. గృహకార్య నిర్వ హణంలో అనేకమైన ఆటంకాలు రావచ్చును. మీకు నేను చెప్పినపాఠం మరు నాటికి, మీకు అవగాహన కాలేదని, నాకు తోస్తే ఆ వేళపాఠం చెప్పను. అనధ్య యనం అనేది నా పాఠం పూర్తి అయ్యేవరకూ ఉండకూడదు. ముఖ్యంగా ముందు మీకొక, కఠినదీక్షగావ్రతంగా భావించి ఈ ఆధ్యాత్మిక విద్యాధ్యయనానికి, మన స్సును సన్నిద్ధం చేసుకోవాలి. దైవభావన, ఆస్తిక్యమూ ఉండాలి. అని ఎన్నో నిబంధనలను విధించారు. నేను అన్నింటికి అనుమతించిన వెనుక ఆయన

ముహూర్తం పెట్టారు. సరిగ్గా ఆ సమయానికే, రామచంద్రరావు ఈ విప్లవ చర్యచేపట్టాడు.

ఊళ్లో మార్షలా ఉన్నా నేను వెనుకంజవేయకుండా పిల్లలను మా జీతగాడు వెంకయ్యకు ఎదురుగా ఉన్న రాజుగారి కుటుంబానికి (సావిత్రమ్మకు వారి పిల్లలకు) అప్పచెప్పి ప్రక్కసందుల నుండి నడుచుకొంటూ శ్రీజగన్నాథం పంతులుగారి భార్య ఎంత ఆశ్చర్యపడిందో చెప్పలేను. ఈ వేళ, ఎంత విధ్వంసకాండ జరిగిందో మీకు తెలియదా? మావారు అక్కడే ఉన్నారింకా ఈ వేళ భగవద్గీత మొదలు పెట్టడం ఎట్లా సంభవిస్తుంది. చీకటి పడకముందు ఇంటికి వెళ్ళిపోండి." అని యెంతో చెప్పారు. కానీ నే నే ఫరవా లేదులేండి, ఇంకా కొంచెం పేపు ఉండి వెళ్ళిపోతాను. ఈ లోపుగా శ్రీ పంతులుగారు వస్తే "ధర్మక్షేత్రే. కురుక్షేత్రే, సమవేతా యుయుత్సవః" అనే ప్రారంభశ్లోకం చెప్పించుకొని వెళ్ళిపోతాను. లేదా ఆ శ్లోకాన్ని నేనే చదివి వెళ్ళిపోతాను. లేదా ఆశ్లోకాన్ని నేనే చదివి వెళ్ళిపోతాను. అని వారింట్లోనే శ్రీపంతులు గారి అగమనాన్ని నిరీక్షిస్తూ కూర్చొన్నాను. నా నిరీక్షణ వ్యర్థం కాలేదు. శ్రీపంతులుగారు వచ్చి నా దీక్షకు ఆశ్చర్యపడి, అమ్మా ఇంత ఆపత్సమయంలో ఎందుకు వచ్చారు. నియమమున్నది. సాధారణ సమయంలో కాని ఇట్లాంటి ఆ పత్సమయంలో కాదు. ఐనా మీ స్థిర సంకల్పానికి చాలా సంతోషం, పదండి నేను వచ్చి దిగబెడతాను. శ్రీ గుప్తగారు ఏమీ భంగారు పడుతూ ఉన్నారో అని నన్ను బయలుదేరదీశారు. నేను గురువుగారూ ఎట్లాగూ వచ్చాను. కదా! "ధర్మక్షేత్రే" అనేశ్లోకం చదివించండి వెళ్దాం అన్నాను. అట్లాగే అని వారు చేత ఆశ్లోకం చదివించి ఆత్మ విద్యాభ్యాసానికి అంకురార్పణ చేసి నన్ను తాను స్వయంగా వెంటబెట్టుకొని ఇంటికి తీసుకొని వెళ్లారు.

తర్వాత భగవద్గీత పాఠం రెండు నెలలు జరిగింది. ఆ పాఠం జరుగుతూ ఉండగానే శ్రీ మాగుప్తగారిని సర్కిల్ ఇన్స్పెక్టరు పోలీసుస్టేషనుకు తీసుకొని వెళ్లారట మా జీతగాడు వెంకయ్యవచ్చి చెప్పాడు. అయినా నేను భంగారు పడలేదు భగవద్గీతా అధ్యయనం మాని వెళ్ళిపోవడానికి ఆత్రుత చూపలేదు. ఆవేళకూడా శ్రీ పంతులుగారు పాఠం ఆపుచేసి నన్నింటికి తీసుకొని వెళ్లారు. ఆవేళ అట్లా

కోర్టు, రిజిస్ట్రార్ ఆఫీసుల్లో అల్లకల్లోలం సృష్టించి పారిపోయిన రామచంద్రరావు తన యింటికి వెళ్ళిపోయాడట! తండ్రి బాలకృష్ణయ్యగారు అతనిని బాత్‌రూములో పెట్టి ఇవతల గొళ్ళెంవేసి తాళం వెసేశారుట. మరి అక్కడనుండి ఎట్లా తప్పించు కొన్నాడో తప్పించుకొని వాళ్ళ యింటి వెనుక గోడ దూకేసి ఎక్కడకు పారి పోయాడో పారిపోయాడు.

కాలాంతరంలో మేము సింగరగిరిలో ఉండగానే ఒకనాడు ఒక అబ్బాయి ఒక చే యుత్తరం తెచ్చి నా చేతికిచ్చాడు అది రామచంద్రరావు పొన్నూరు వ్రాసి పంపిన ఉత్తరం!

'తన ఆరోగ్యం పూర్తిగా చెడిపోయిందనీ, అడవులలో తిరుగుతూ ఉండడం వలన ఒళ్ళంతా పిచ్చిపోయి రక్తం చిమ్ముతున్నదనీ కొన్ని మందులు, బట్టలు, డబ్బూ తీసికొని వెంటనే పొన్నూరు వచ్చి తనకు అన్ని విధాలా సహాయపడ వలసిందనీ వ్రాసి పంపాడు శ్రీ మా గుప్తగారు ఆవేళ గుంటూరుకో ఎక్కడకో కోర్టు పనిమీద వెళ్ళారు. ఏమిచెయ్యాలో నాకు అసలు తోచలేదు అయినా ఊళ్లో ఉన్న కాంగ్రెసు పెద్దలదగ్గరకు వెళ్ళి ఆ ఉత్తరం చూపించాను. వాళ్ళెవరైనా "ఆడవారు మీరేం వెళ్తారు? మేం వెళ్తాంలెండి!" అని వారే ఈ భారాన్ని తమ భుజ స్కంధాలమీద వేసుకొని రామచంద్రరావుకు ఉపయుక్తమైన సహాయం అందిస్తారేమో అనుకొన్నాను. కానీ వాళ్లెవరూ ఆ బాధ్యత తీసుకోలేదు. సరికదా స్థానిక కాంగ్రెసు అధ్యక్షులు ప్రస్తుతం పార్టీ డబ్బు సర్దుబాటు చెయ్యడానికి కూడా ఏమీ లేదని చేతులెత్తేశారు. ఇక శ్రీ పిల్లుట్ల హనుమంతరావుగారు (పట్టణ కాంగ్రెసు సెక్రటరీ) మాత్రం "అమ్మా గుప్త కూడా ఊళ్లోలేనట్లున్నది. మరి నీవే వెళ్ళాలి నేను కొంత డబ్బు, హోమియో మందులు, బట్టలు కృష్ణాజిల్లాలో ఉన్న మా స్వంత ఊరు కపిలేశ్వరంలో ఉన్న మావాళ్ళ యింటికి ఒక ఉత్తరం ఇస్తాను అక్కడకు వెళ్ళిపొమ్మని చెప్పండి, అక్కడ అతనికి ఏమీ ప్రమాదం ఉండదు. అని చెప్పారు మొత్తం మీద కార్యభారం అంతా మోయవలసిన బాధ్యత నాపై పడింది" సరే భగవంతుడే ఉన్నాడు ఇంతవరకూ ఎన్నిరంగాల్లో సేవచేసినా ఇంత అపత్కారక మైన రాజకీయా పరాధపరమైన భయంకరమైన కార్య క్రమానికి నేను ఎప్పుడూ సంసిద్ధం కాలేదు. రాత్రి వంటకూడా చేసేసి మామూలుగా జీతగాడిమీద ఎదురిం

రాజుగారి కుటుంబం మీదా విడిచి కావలసిన సామగ్రిని తీసుకొని బొడ్డుపల్లి పురుషోత్తాన్ని రైలు స్టేషనుకు రమ్మని మా జీతగాడిచేత కబురుచేసి నేను ఇంటినుండి బయలుదేరాను రైలు స్టేషనుకు వచ్చిన పురుషోత్తానికి అన్నీ చెప్పి నేనేమైనా అయిపోతే విచారించవద్దని గుప్తగారికి చెప్పడానికైనా ఎవరైనా ఉండాలికదా అని పురుషోత్తాన్ని నాతో రమ్మనమన్నాను అప్పుడు పురుషోత్తం "అక్కయ్యగారూ నేను రావడానికి అభ్యంతరమూలేదు. నాకు భయమూలేదు. కానీ ఆపదకానీ అవసరం కానీ వచ్చినపుడు మీకు తోడ్పడే వ్యక్తి కావాలికదా కాళ్ల వరదరాజులును తీసికొనివస్తాను వరదరాజులికైతే పోలీసులతో బాగా పరిచయాలున్నాయి. నాకంటె ఇటువంటి విషయాల్లో అవసరానికి తగినట్లు సమయస్ఫూర్తితో వ్యవహరించగలడు అన్నాడు నాకుకూడా అది సరైనదే అని తోచింది. (మా మొదటి వసతియైన బాల కృష్ణయ్యగారి యింట్లో మాకు తోడుగా ఉన్న కాళ్ల వరదరాజులు వచ్చాడు. నా మనస్సు స్థిమితపడింది ఇద్దరమూ పొన్నూరువెళ్ళి రామచంద్రరావును కలుసుకొని అన్నీ ఇచ్చి కపిలేశ్వరం వెళ్ళమని సలహాయిచ్చి ఆ యింటినుండి బైట వచ్చేకాము రామచంద్రరావు చాలా అనారోగ్యస్థితిలో ఉన్నాడు. అతణ్ణి చూస్తే నాకు చాలా జాలివేసింది. ఆవేళ పొన్నూరులో కలెక్టరు మకాం ఉరునిండా దట్టమైన దిట్టమైన పోలీసు బందోబస్తు ఉన్నది పోలీసులకు నా ప్రయాణం కొంచెం వాసనకొట్టినా వరదరాజులు వారికి సందేహం రాకుండా మసలుకొని నన్ను ఆపద నుండి తప్పించాడు అక్కడనుండి బయలుదేరి ఆ తెల్లవారుజామున శ్రీ ఆచార్యరంగాగారి యింటికి వెళ్ళాలి. శ్రీ భారతీదేవిగారు రంగాగారూ చాలా సంతోషించి నన్ను భద్రంగా తెల్లవారగానే బండెక్కించారు నా చుట్టూ ప్రేస్‌తో పోలీసులే వరదరాజులు మాత్రం నా బండికిరవైగజాల దూరంలో నన్ను చూస్తూ నడచి మా యింటివరకు వచ్చి వెళ్ళిపోయాడు. శ్రీ మా గుప్తగారు ఏమీ బంగారు పడలేదు పైగా నేను ఒంటరిగా సాహసించి, చేసిన పనికి హర్షం చూపి ప్రశంసించారు. అది నాకెంతో తృప్తిని, ధైర్యాన్ని ఇచ్చింది.

తర్వాత కొన్నాళ్లకు నేను రాజమండ్రి వెళ్తే అక్కడకు శ్రీ మా నాన్నగారి యింటికి రామచంద్రరావు వచ్చాడు మా నాన్నగారి యిల్లు చాలా పెద్దదేకాక ఎప్పుడో మాతాతగారు అంతర్జాతీయ నౌకా వ్యాపారం చేసినరోజుల్లో వాడిన పెద్ద పెద్ద బానలు

పెట్టి ఉంచిన పెద్ద అటకలు కూడా మా యింటి మేడపై దాబా భాగంలో ఉన్నవి అవి పైకి అటకలని కూడా ఎవరూ కనుక్కోలేరు. మా నాన్నగారు తన జీవితంలో తాను నడపిన ఉద్యమాల్లో ఇట్లాంటి సంఘటనలెన్నో ఎదుర్కొన్నవారగుట చేత అవసరం ఏస్తే ఆ అటకల్లో దాచెయ్యవచ్చనే ధైర్యంతో ఆశ్రయం ఇచ్చారు ఒకరోజు మెయిన్ రోడ్డుపై అతనొక ప్రక్క నేనొకప్రక్క నడుస్తూ తాలూకాఫీసు వరకూ వెళ్ళాము. మా నాన్నగారింట్లో సుమారు వారం పదిరోజులుండి ఎక్కడికో వెళ్ళిపోయాడు తర్వాత అతడు పోలీసులచేత అరెస్టు చేయబడి ఒంగోలు సబ్ జైలుకు పంపబడిన సమయంలో నేను శ్రీ మా గుప్తగారు ఒంగోలువెళ్ళి చూచి అతని నుదుట వీరతిలకం దిద్ది హారతి నిచ్చి వచ్చాం.

అక్కడే ఒంగోలులో మా అత్తవారికి అత్యంత ఆప్తులైన నల్లమల్లి వేంకటరంగంగారి రెండవ కుమారుడు శ్రీ నల్లమల్లి గోపాలకృష్ణగుప్త రుక్మిణి దంపతులతో నాకు అప్పుడే పరిచయమైనది. తర్వాత గోపాలకృష్ణగుప్త బాపట్లకు A.P.P. గా వచ్చారు. అప్పుడు మా యింటికి మిక్కిలి సమీపంలో ఉండే ఇంట్లోనే ఉండి రుక్మిణి నాకు ఎంతగానో తోడ్పడేది. నాకు అప్ప చెల్లెండ్రులేనిలోటు రుక్మిణి తీర్చింది. ఆమె కూతురైన ఆండాళ్ళ తాయారు పసితనంలో నా దగ్గరే పెరిగింది. వాళ్ళ కుమారుడు లక్ష్మీనారాయణ బాపట్లలో మాయింట్లోనే ఉండి చదువుకొన్నాడు. అంత సన్నిహితులు ఇప్పటికీ నాకు ఎవరూలేదు. రామచంద్రరావు విషయం పూర్తి అయిన తర్వాత మా అన్నయ్య పెండ్లి విషయమై వ్రాయాలి

## మా అన్నయ్య వర్ణాంతర వివాహం

మా అన్నయ్య బొంబాయిలో సుప్రసిద్ధ హిందీశాస్త్రీయ సంగీత విద్వాంసుడు శంకరరావు వ్యాస్‌గారి దగ్గర వీణపై హిందూస్తానీ సంగీతం అభ్యసించడానికి బొంబాయి వెళ్లాడు, ఆంధ్రదేశ బ్రాహ్మసమాజ సభలలో పాల్గొని ఒక విజయవాడ వివాహిని తన తిరుగు ప్రయాణంలో రాజమహేంద్రిలో ఆగి శ్రీ మా నాన్నగారి దగ్గరకువచ్చి తాము బ్రాహ్మలమని, తనకొడుకు, కూతురు ఉన్నారని బ్రహ్మసమాజ పద్ధతులంటే తనకిష్టమని ఆ కారణంగా తన కుమార్తెకు వర్ణాంతర

వివాహం చేయదలిచాననీ ఆ సందర్భంగా పిరునికొరకు తారకంగారిని అడుగగా (తారకంగారు సుప్రసిద్ధ బ్రహ్మ సమాజమతా వలంబకులు సర్ రఘుపతి వెంకట రత్నం నాయుడుగారు పెంచిన హరిజన బాలిక శ్రీ సగుణ మహాలక్ష్మమ్మగారిని పెండ్లాడి జీవితం అంతా పరమ ధర్మ నిరతితో గడపిన అమష్టాన బ్రహ్మసమాజ మతవలంబకులు) వారు మీ పేరు చెప్పి మీ అబ్బాయిమైతే చాలా మంచి"దని సలహా ఇచ్చారనీ చెప్పింది. శ్రీమా నాన్నగారికి వర్ణాంతర వివాహం అనగానే చాలా సంతోషం కల్గి బొంబాయి నుండి మా అన్నయ్యను పిలిపించి "బాపట్ల వెళ్ళి అమ్మాయిని తీసుకొని విజయవాడ వెళ్ళి ఆ అమ్మాయిని చూచి రమ్మనమని మా అన్నయ్యను బాపట్ల పంపారు.

నేను మా అన్నయ్యవెంట బెజవాడ వెళ్ళాను. మా అన్నయ్యకు ఆ అమ్మాయి నచ్చింది. తర్వాత ఆ పెండ్లి విషయంలో చాలా చాలా ఆందోళనకర పరిస్థితులేర్పడ్డాయి ముఖ్యంగా మా అమ్మా ఆపెండ్లి కంగీకరించలేదు. ఆ ఆందోళన పరిస్థితులలో మా అన్నయ్య ఆ అమ్మాయిని తీసుకొని వెళ్ళి బొంబాయిలో పెండ్లిచేసుకొన్నాడు. నా తర్వాత మా అమ్మకు కలిగిన కామరాజేశాక, రామ కృష్ణదనే అబ్బాయి ఇంటర్మీడియేట్ పరీక్షలు వ్రాసి చనిపోయాడు. ఇంక ఆఖరి కొడుకైన కామేశ్వరరావునకు బందరు నివాసస్థులు శ్రీ T. V. గుప్తగారి కుమార్తె భక్తపోతనలో, పోతన కుమార్తె లక్ష్మిగా నటించి గంధర్వగాయనిగా దేశ మంతటా ప్రఖ్యాతిగాంచిన సౌభాగ్యవతి వనజాగుప్తతో అంతకుముందే పెండ్లి అయిపోయినది.

మా అన్నయ్య వివాహానికి సమ్మతించని శ్రీ మా గుప్తగారు నన్ను మా అమ్మగారింటికి పంపలేదు.

నేను రాజమండ్రి వెళ్లి నా సదనంలోను మా పెదనాన్నగారింట్లోను దిగేదాన్ని! ఇట్లా కొన్ని సంవత్సరాలు జరిగినది.

## శ్రీమతి కామాక్షమ్మగారి షష్టిపూర్తి

ఎప్పుడో మాటల సందర్భంలో శ్రీమతి కామాక్షమ్మగారు 1947 మేలో తనకు అరవై యేండ్లు నిండుతాయని చెప్పారు. నాకు వెంటనే ఆమెకు షష్టిపూర్తి ఉత్సవం చెయ్యవలెననే సంకల్పం కల్గింది. షష్టిపూర్తి ఉత్సవం అంటే మాటలా

దబ్బుకావాలి. షష్టిపూర్తి ఉత్సవ నిర్వహణకేకాక మా కళాశాల తరగతులకు తగినన్ని గదులు లేక ప్రతి సంవత్సరము విద్యాశాఖ ఆడిటర్లు "రిమార్కు" వ్రాస్తూ ఉండడం గ్రాంటు చాలినంత యివ్వడానికి ఇబ్బందులు కల్గడం జరుగుతూ ఉన్నది. ఇవన్నీ గమనించిన నేను కళాశాలా తరగతులకు ఇంకాకొన్ని గదులు కట్టడానికి కూడా విరాళాలు సేకరించాలని నిర్ణయించాను.

ఈ తలంపులతో నేను ఆంధ్ర దేశమంతటా విరాళాల సేంరణ పర్యటించాను అప్పటికి మా పెద్దమ్మాయికి 19 సంవత్సరాలు! పెండ్లి చేయవలెననీ పెద్ద చదువులు ఆడపిల్లలకు చెప్పించడం అంత శ్రేయస్కరం కాదనీ ఇంటర్మీడియేట్ ప్యాసైన మా అమ్మాయి సుహాసిని శ్రీ మా గుప్తగారు చదువు మాన్పించారు. నేను షష్టి పూర్తికై విరాళాలకు తిరిగినన్నాళ్లూ (కొన్ని నెలలు) మా అమ్మాయి సహాయంతోను వల్లమల్లి రుక్మిణి సహాయంతోను శ్రీ మా వారు ఇల్లు నిర్వహించేవారు?

నిజంగా నా ప్రతిసేవా కార్యక్రమంలోను వారు ఇచ్చిన ప్రోత్సాహం వారు చూపిన ఓర్పు ఇంతా అంతాకాదు అనుకొన్న ప్రకారం శ్రీమతి కామాక్షమ్మగారి షష్టిపూర్తి రాజమహేంద్రవరంలో ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలముందు ఉన్న రోడ్డుపై పందిళ్ళువేసి మూడు రోజులు నిర్వహించాం. షష్టిపూర్తి కొరకు 30 వేలు వసూలుచేసి యిచ్చాను. నేను! అందులో కొంత "కామాక్ష విజయం అనే సంచికను ప్రచురించగాను, షష్టిపూర్తికైన ఖర్చులు పోను 18, 19 వేల రూపాయలను కళాశాలా తరగతి గదులకొరకు ఇచ్చాను. షష్టిపూర్తి ఉత్సవానికి గొప్ప కాంగ్రెసు నాయకుడు సీతా రామాంజనేయ నాటక సంఘమును ప్రతిష్ఠించిన ప్రముఖవ్యక్తి శ్రీ మోతే నారాయణరావుగారు అధ్యక్షత వహించారు ఉప్పుటూరి పున్నారావుగారు మున్నగు ప్రముఖ వ్యక్తులను ఆహ్వానించాం. ఆహ్వాన సంఘానికి విజయవాడ వాస్తవ్యులు ప్రముఖ వ్యాపారవేత్త శ్రీ చుండూరి వెంకట రెడ్డిగారు అధ్యక్షులుగా ఉన్నారు. ఆ ఉత్సవాలలోనే సదనం వార్షికోత్సవాన్ని కూడా జరిపారు.

షష్టిపూర్తి ఉత్సవాలు చాలా వైభవంగా జరిగాయి. స్త్రీలకు జరిగిన మొదటి షష్టిపూర్తి ఇదే కావడం వలన దేశంలో మంచి చైతన్యం కల్గించింది. ఈ ఉత్సవ

విశేషాలన్నీ విజయవాడ వాస్తవ్యులు శ్రీ అన్నవరపు సుబ్బారావుగారు తన భారతీయ వైశ్య పత్రిక ఒకటి ప్రత్యేక సంచిక తెచ్చారు.

## నాకు వచ్చిన స్వప్నం

షష్టిపూర్తి ఉత్సవాలకు పిల్లలతో బాపట్ల నుండి శ్రీ షాగుప్తగారు వచ్చారు. ఆఖరిరోజున నిద్రలో నాకు ఒక తెల్లని పద్మం ఆకాశం నుండి వచ్చి, నా గర్భంలో ప్రవేశించినట్లు, స్వప్నం వచ్చింది.

తర్వాత 1948 ఫిబ్రవరి రెండవ తేదీనాడు నాకు మళ్ళీ పుత్రోదయమైనది. తెల్లని పద్మం గర్భంలో ప్రవేశించినట్లు స్వప్నం వచ్చినందున, ఆ పిల్లవానికి "విజ్ఞానేశ్వరకుమార్" అని పేరు పెట్టాము.

## ఆంధ్రమహా సభలు

సంఘటన తర్వాత సంఘటనగా వ్రాస్తూ పోవడంలో చాలా ముందుకు వచ్చేశాను. ఈ లోపుగా జరిగిన రెండు సంఘటనలు చాలా ముఖ్యమైనవి పేర్కొనాలి.

గుంటూరులో కాశీరాజు సర్ విజయ అధ్యక్షతన జరిగిన ఆంధ్రమహాసభకు పిల్లలతో వెళ్ళి నేను పాల్గొన్నాను. శ్రీమతి కామాక్షమ్మగారు మా అమ్మగారు కూడా వచ్చారు. ఆ సభలోనే శ్రీ పైడిపాటి సుబ్బరాయశాస్త్రిగారు రచించిన "త్రిలింగదేశం మనదేనోయ్ తెలుంగులంటే మనదేనోయ్" అనే గేయాన్ని అప్పటికప్పుడు కొంత మంది పిల్లలకు శిక్షణ నిచ్చి ఆ పిల్లలతో కలిసి సభా వేదికమీద పాడాను. ఆ సభ్యు లంతా ఎంతో సంతోషించడమే కాదు. ఆ పాటతో సభా కార్యక్రమాల్లో క్రొత్త స్ఫూర్తి, ఉత్సాహం, చైతన్యం వెల్లివిరిసింది.

శ్రీ పున్నయ్య శాస్త్రిగారు కార్యదర్శిగా నిర్వహించారా సభలను ఆ సభలలో నేను చూపిన దీక్షా, దక్షతలకు, నన్ను స్టాండింగ్ కమిటీలో సభ్యురాలుగా వేసుకొన్నారు. ఒరిస్సా మొదలైన ప్రక్క రాష్ట్రాల నుండి కూడా ప్రతినిధులు వచ్చారు. అందులో ఒరిస్సా నుండి వచ్చిన వామనమూర్తిగా రొకరు! వారు ఒరిస్సాలో ఆంధ్రోద్యమ నాయకులు! వారు స్టాండింగ్ కమిటీలో వలసాంధ్రులకు

కూడా, ఆంధ్ర మహాసభ అన్నివిధాలా సహాయ సహకారాలు అందించాలనే తీర్మానాన్ని పెట్టారు. ఆ తీర్మానాన్ని ఆమోదించడానికి చాలా ప్రతిబంధకాలు తటస్థించాయి. ఆంధ్రమహాసభ ఆర్థికంగా ఏ మాత్రం పటిష్ఠంగా లేదు కనుక, వలసాంధ్రులకు ఏమీ సహాయం చెయ్యలేదని ఆంధ్ర మహాసభ నిర్వాహకుల వాదం! అప్పుడు నేను లేచి చాలా యుక్తిప్రయుక్తులతో, ప్రసంగించి వలసాంధ్రులను ఆంధ్రమహాసభ ఆదుకోవాలనే, తీర్మానం నెగ్గింపజేశాను.

ఆ సాయంకాలం బహిరంగసభలు ప్రారంభించడానికి ముందు నేను ఉప్పుటూరి పున్నారావుగారి హాస్టలులో ఆ హాస్టలు విద్యార్థుల ఆహ్వానంపై ప్రసంగించడానికి వెళ్ళాను. అక్కడ కొంచెం ఆలస్యమైనది హాస్టలులో నేను ప్రసంగిస్తూ ఉండగానే, శ్రీవామనమూర్తి గారు తదితర ఒరిస్సా ప్రతినిధులు కారు వేసుకొని ఆ హాస్టలుకు వచ్చేశారు. "లక్ష్మీకాన్తమ్మగారు కొంపమునిగి పోయింది. వలసాంధ్రుల తీర్మానం బహిరంగసభా వేదికకు వచ్చే తీర్మానాల్లో నుండి తొలగించారు. మీరు అర్జంటుగా రావాలి. అని ఆవేదనతో బాధ పడ్డారు. నేను వెంటనే కారులో వారితో వెళ్ళి తిన్నగా సభా వేదికమీదకు ఉరికి సర్ విజయగారికి జరిగిన విషయం చెప్పి. వలసాంధ్రుల తీర్మానాన్ని బహిరంగ సభలో ప్రవేశపెట్టవలసినగా అభ్యర్థించి తగినంత చొరవ తీసుకొని, ఆ తీర్మానాన్ని చేతికితీసుకొని నేను ప్రసంగించాను. సభ్యుల హర్షధ్వానాల మధ్య తీర్మానం ఆమోదింపబడినట్లు శ్రీ సర్ విజయగారు ప్రకటించడం ఎంతో ప్రశంసింపదగిన మహత్తర విషయం!

## అమరావతిలో జీవహింసనాపు చేయుట

ఆంధ్ర మహాసభలోని ఉత్తేజకరమైన, నా పాత్రను పరిశీలించిన ఆంధ్ర జీవరక్షసంఘం యొక్క ఒక కార్యదర్శి తెనాలి వాస్తవ్యులు శ్రీకుశాల్జీగారు అమ్మా లక్ష్మీకాంతమ్మగారూ రేపురాత్రి అమరావతిలో జరిగే తిరుణాళ్ళల్లో జరిగే జీవహింస నాపు చెయ్యడానికి మీరు రావాలమ్మా' అని అభ్యర్థించారు. ఆ సమయంలో నేను ఎనిమిది నెలల గర్భవతిని! కానీ నాకా సమయంలో ఆ విషయం గుర్తుకు రాలేదు. అయ్యో! దేవుడు ఉత్సవాల పేరు చెప్పి కొన్ని మూగజీవాల హింస నా మూలంగా,

ఆగితే, నేనెంత ధన్యురాలను? అనే ప్రబలమైన భావంతో నేను ప్రేరణ పొందీ. అట్లాగేవస్తానండి!" అనేశాను. ఆయన నేను రాలేనని జవాబు చెప్తానను కొన్నారుః కాని నేను వస్తాననేటప్పటికిఆయన ఎంతో సంతోషించి ఎగిరిగంతులువేసి సంతసని చేసి అయితే కారు ఏర్పాటు చేసి కార్యకర్తలను తీసికొనివస్తాను. అమరావతిలో ఏర్పాట్లు చేస్తాను. అని జవాబిచ్చి హడావిడిగా వెళ్ళిపోయారు.

ఆ తర్వాత మా అమ్మ కామాక్షమ్మగారూ, తీవ్రంగా నన్ను మందలించారు. ఎనిమిది నెలల గర్భవతిగా నీ పరిస్థితి, ఏమిటి? ఉత్సవంలో జీవహింస నాపడ మేమిటి? ఆ జీవాలను నరికేవాళ్ళు ఎవరనుకొన్నావు. కరకు కసాయివాళ్ళు, తాగి ఉంటారు? వాళ్ళు నిన్నే నరికేస్తారు! ఏమిటి? మయీ దుస్సాహసం అని గట్టిగా, తీవ్రంగా కోప్పడి ఇప్పటికైనా రానని కబురు చెయ్యి అని సలహాయిచ్చారు. నాకు కూడా నిదానంగా ఆలోచించుకొంటే అక్కడకు వెళ్ళడం చాలా ప్రమాదం! రానని కబురు చేద్దామనే తలంపు కల్గింది. కానీ వెంటనే ఒక మొండి తెగువ కూడా కలిగి ఏమైతే ఔతుంది! వెళ్తాను చావనేది రాసి పెట్టి ఉంటే! ఎట్లాగైనా వస్తుంది! ఈ ఉద్యమంలో చనిపోతే నా జీవితమెంత ధన్యం ఔతుంది!" అని వాళ్ళకు చెప్పి మీరు నాకూడా రండి ఏమైనా అవసరంవస్తే నాకేమైనా సహాయపడవచ్చునని చెప్పాను. అట్లాగే అంతా అమరావతి వెళ్ళాం. అర్ధరాత్రి, కార్యకర్తలు మమ్మ బలి జరిగే స్థలానికి తీసుకొని వెళ్ళారు.

ఒక దున్నను గాటుకు కట్టేశారు. గండ్రగొడ్డలి తీసుకొని, ఆ దున్నను ఒక వ్రేటుతో తెగవెయ్యడానికి ఒక కసాయి మద్దుకత్తి నెత్తాడు! వెంటనే, నాకొక ఆవేశం వచ్చి ఆ దున్నను చేత్తో తోసేసి నేను అక్కడ నా తలను వంచాను. వాడు మత్తుతో తూలిపోతూ ఉన్నాడు. ఆ కసాయికి క్రింద దున్న ఉన్నదో ఇంకెవరైనా మనిషి ఉన్నారో ఆ కసాయికేమీ తెలియడం లేదు! ఇంతలో ఇంకెవరో ముందుకు వచ్చి ఒరేయ్! ఆ యమ్మ కడుపుతో ఉన్నదిరా! అని ఆ కసాయిని వెనక్కుతోసేసి నా చెయ్యిపట్టుకొని ఇవతలకు తీసుకొని వచ్చేశాడు! ఇదంతా అనుకోకుండా ఒక్క త్రుటిలో జరిగిపోయింది! ఏమైతే నేమి జీవహింస ఆగిపోయింది! మా అమ్మ మా పిన్ని అయితే ఎంత ఖంగారు పడ్డారో! అంత బ్రహ్మానంద వచ్చారు నన్ను తీసి

కొని వచ్చి నీకు శాస్త్రీ కూడా ఇట్లా జరుగుతుందను కోలేదు. మతిపోయి ఏమి చెయ్యాలో తోచక మ్రాన్పడిపోయినవాడల్లా తెలివితెచ్చుకొని "ఎంతప్రమాదం తప్పింది? నేనెంత పొరపాటు చేశాను ? అని పశ్చాత్తాపపడ్డాడు ఎట్లాగైతేనేం 'హమ్మయ్య' అని అందరమూ ఊపిరి తీసుకొన్నాం. ఏదో నాచేత ఉపన్యాసం చెప్పి అపుచేయించాలని ఆయన అనుకొన్నాడు. అందరం అంతే అనుకున్నాం. కానీ నేను వచ్చానని తెలుసుకొని బలి కార్యకర్తలు. బలికార్యక్రమాన్ని మామూలు వేళకు ముందే ఏర్పాటు చేశారు. మేము రంగప్రవేశం చేసేటప్పటికి నాకు ఏమీ తోచక ముందు వెనుక ఆలోచించకుండా అంత పనికి పూనుకొన్నాను. ఇట్లా నా ప్రాణాలు కాపాడబడడం ఇది రెండవ పర్యాయం! అంతా భగవత్కృప.

గుంటూరులో జరిగిన ఇంకొక సంఘటన ఒకటి చాలా తమాషా ఐనది. బొంబాయి మేడవారు అని ప్రఖ్యాతి పొందినవారి అమ్మాయిని సికిందరాబాదు మారేడు పల్లి వాస్తవ్యులు శ్రీ ఉప్పల గౌరీశంకర్‌గారి అబ్బాయికిచ్చి పెండ్లి చేస్తూ ఉన్నారు. రాజమండ్రి నుండి కామాక్షమ్మగారు బాపట్ల వచ్చి పెండ్లిలో సదనానికి విరాళం అడుగుదాం అని, నన్ను గుంటూరు తీసికొని వెళ్ళింది. అక్కడ సదస్సులో నేను ఆశీర్వాద పద్యాలు చెప్పి ఆశీర్వదించిన తర్వాత పెళ్ళివారు ఉభయులూ సదనానికి విరాళాలిచ్చారు.

ఆ రాత్రికి సాంస్కృతిక ప్రదర్శనగా 'ఆదర్శ వివాహము' అనే అంశంపై వాగ్వివాదం ఏర్పాటు చేసినట్లు తెలిసింది. నేను కనుక అక్కడ ఉంటే, నన్ను ఆ వివాదంలో పాల్గొనమంటారని నేను పెండ్లి వారికి కనపడకుండా వెళ్ళిపోవాలని ప్రయత్నం చేశాను. కానీ భారతీయవైశ్య సంపాదకులు. శ్రీ అన్నవరపు సుబ్బారావు గుప్తగారు పెండ్లి పెద్దలకు, ముఖ్యంగా ఉప్పల గౌరీ శంకర్‌గారికి, నేను వెళ్ళిపోతూ ఉన్న సంగతి తెలియ జేశారు. వెంటనే గౌరీశంకర్‌గారు వచ్చి మీరు 'డిబేటు'లో పాల్గొనాలని చాలా అభ్యర్థించారు. కానీ ఆ కార్యక్రమంలో, నా బోటివారు పాల్గొనడం అనుచితమని ఖండితంగా చెప్పేశాను. వెంటనే ఆయన అయితే ఒక న్యాయాధిపతిగా ఉండండి, దయచేసి నా మాట కాదనక మీరు అంగీకరించండి" అని బ్రతిమలాడేటప్పటికి, న్యాయాధిపతిన్నిగా అంగీకరించక తప్పలేదు.

వాగ్వివాదం పూర్తి అయి విజేతల ప్రకటనకూడా పూర్తి అయ్యే సమయానికి రాత్రి 9 గంటలైనది. గుంటూరులోని పురప్రముఖులంతా భోజనానికి వచ్చారు. వారంతా లక్ష్మీ కాన్తమ్మగారూ, వాగ్వివాదానికి సంబంధించిన కార్యక్రమం పూర్తియై పోయి నదికదా, ఈ విషయం మీద మీ అభిప్రాయం తెల్పుతూ ప్రసంగించమని అభ్యర్థించారు.

"నేను సరే అని అంగీకరించక తప్పలేదు. అసలు 'అచర్యవివాహో దర్మము' అని మకుటం పెట్టి ఉంటే భారతీయ సంస్కృతీ బద్ధమైన గృహస్థ జీవితంలో, సంసారరథ చక్రాలైన దంపతుల పవిత్ర విధుల భారతీయ జీవన పద్ధతిలో గృహస్థాశ్రమానికి ఉన్న ప్రాముఖ్యము జగతీవనప్రసవంతిలో శుచిస్మితావగాహలైన దంపతుల బాధ్యత ఈ పుణ్య సంస్కృతిని కాపాడడంలో, వారి కర్తవ్యము దాని వలన విశ్వమానవ కళ్యాణానికి దోహదపడే సంసారజీవన విధానము మొదలైన అంశాలను సంస్కృత వాఙ్మయం నుండి తెలుగు సాహిత్యం నుండీ ఉదాహరణలిస్తూ బాగా రెండుగంటలు ప్రసంగించాను

నేను ప్రసంగిస్తూ ఉన్నానని ఆ నోటా విని, గుంటూరు నగరంలోని ప్రముఖులంతా వినడానికి వచ్చారు. సహస్రకమల సౌందర్యప్రభావిభాసితమైన విజ్ఞాన సరస్సువలె, ఆ సదస్సు ఆహ్లాదపూర్ణమై నిశ్శబ్దగంభీర వాతావరణ సంకలితమై స్మేరము భావవింప చిన్ముద్రాముద్రితమై. అసంఖ్యాక తారకావిరాజితమైన నభోవీధి వలె సంపుల్లమై విరాజిల్లింది. అప్పటికి రాత్రి 11 గంటలైనది. మా కామాక్షమ్మ పిన్నైతే ఏ ఆనంద లోకాల్లో మునిగితేల్తూ ఉన్నదో ఎవ్వరూ కదిలే పరిస్థితి కన బడలేదు. నేను ముగింపు మాటలు ముక్తాయించి వధూవరుల నాశీర్వదించి, వవమాన సుతుడు బట్టి పాదార విందములను అని అందుకొనేటప్పటికి హర్షధ్వానాలతో, చప్పట్లతో సభ అంతా మార్మోగింది. అప్పుడు శ్రీ ఉప్పల గౌరీశంకర్‌గారు వెండి సంధ్యావందనపళ్ళెం. పంచపాత్రలతో విలువైన చీరెతో నన్ను సత్కరించాను. అంత సంతోష సముదాయంలోనూ ఆ సభా నిర్వాహకురాలు కసిపోక మసి పూసు కొన్నట్లు నన్ను హేళనచేస్తూ ఏదో ప్రసంగించబోయింది. దానికి నేను సరిగా

ప్రత్యుత్తరం చెప్పేసరికి ఆమెకింక ఊపిరాడక ఊరుకోవలసి వచ్చింది. మళ్ళీ సభ్యుల హర్షధ్వానాలు!

నా ప్రసంగాలన్నీ ఇట్లా సాగేవి!

ఆ సభా నిర్వాహకురాలట్లా ప్రవర్తించవానికి కారణం ఒకటి ఉన్నది. అంతకు పూర్వం కురిచేడులో ఆర్యవైశ్యమహా సభజరిగినది ఆ సభలో ప్రదర్శిత మైన నా ప్రజ్ఞాపాటవానికి ఆమె ఓర్చలేక తన కుమార్తె నాకంటె ప్రతిభావంతు రాలని నిరూపించుకోవడానికి చాలా యత్నాలు సల్పింది. అవి ఏ విధంగానూ నెరవేరకపోయేటప్పటికి నా మీద పంతం బట్టి సమయం కొరకు కాచుకొని ఉన్నది. కాని పాపం అదే సమయమని తలచి కుహనారీతిలో నన్ను వెకిలి ప్రశ్నలు వేయ డమూ నేను తగిన విధంగా నిండుసభలో ప్రత్యుత్తరం చెప్పడమూ జరిగి సభ్యలోక మంతా ఆమెనే నిరసించేటప్పటికి తన అజ్ఞాన్ని తానే బయటపెట్టు కొన్నానుకదా! అని బాధపడి తలదించుకొన్నది. అవీ మొదలు నన్ను సరిగా చూడటం మొదలు పెట్టింది.

## విశ్వ విద్యాలయంలో ప్రసంగం

మా చిరంజీవి విజ్ఞానేశ్వరుడు రెండేండ్ల ప్రాయంవాడై యుండగా ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి సాంస్కృతికోత్సవాలలో మహిళాభ్యుదయోత్సవ సభకు నన్ను ఉపన్యాసకురాలుగా ఆహ్వానించారు.

ఆ సమయానికి సోదరి నాయని కృష్ణకుమారి సోదరి అమరేశ్వరి (హైకోర్టు జడ్జి) విద్యుల్లత మొదలైనవారు ఆంధ్ర విశ్వ విద్యాలయంలో M. A. విద్యార్థినులు విశేషించి, సోదరి అమరేశ్వరి విద్యార్థినీ సంఘాధ్యక్షురాలు (అది 1950 వ సంవ త్సర మనుకుంటాను) రెండేండ్ల పసివానిని మా విజ్ఞానేశ్వరుని తీసుకొని విశాఖ పట్నం వెళ్ళి ప్రముఖ వ్యాపారవేత్త శ్రీ గ్రంధి మంగరాజుగారి యింట్లో బస చేశాను.

గ్రంధి మంగరాజుగారు పూర్ణయాత్రా స్పెషల్సు యాత్రలు నిర్వహిస్తూ

ఉండేవారు. వారు 1947 లో ఉత్తర భారతయాత్రను నిర్వహించినపుడు మా ద్వితీయపుత్రిక సుహాసిని తొమ్మిది నెలల పసిపాప ఆ యాత్రకు నేను ఆ పాపను తీసికొని మా నాన్నగారితో అమ్మగారితో వెళ్ళి ఉత్తర భారతమంతా పర్యటించి చివరకు భారతదేశ సుందరనందనోద్యానమైన కాశ్మీరు కూడా వెళ్ళాము, అప్పటి నుండి మా రెండు కుటుంబాలూ చాలా సన్నిహితంగా ఉంటూ వచ్చినవి. పూర్ణా పిక్చర్స్ ప్రస్తుత అధినేత అయిన గ్రంథి కామరాజు చిన్నవాడు ఆ కాశ్మీరు యాత్రికులలో ఎవరికీ హిందీరాదు. నిజానికి వస్తే నాకూరాదు కానీ ఏపనైనా ఎంత పనైనా తల మోటించి నరుక్కుపోవడమే నా స్వభావం కావడం వలన సోదరుడు కామరాజుని తీసుకొని ఆయా మకాములలో సహయాత్రికులకు కావలసిన బజారు పనులు వచ్చీరాని హిందీ మాట్లాడి చేసిపెట్టూ ఉండేవాళ్ళం! ఆయాత్రలోనే తాజ్ మహలును సిమ్లాను కాశీ విశ్వేశ్వరాలయమును సందర్శించాము. సుందర కాశ్మీరం లోని చష్మషాహి మొదలైన సరస్సులయొక్క ఉద్యానవనాల యొక్క స్కేటింగు క్రీడలనాడే గులన్ మార్గ్ క్వీలన్ మార్గ్, చందన్‌వాడి జీలం నది పుట్టుక స్థానాన్ని అన్ని చూచాము కాశ్మీరు సౌందర్యాన్ని వర్ణించడానికి ఇది అదనుకాదు, కానీ గ్రంథి మంగరాజుగారితో పరిచయాన్ని గూర్చి ప్రస్తావించగానే వారి యాత్రా స్పెషలులో కాశ్మీరు వెళ్ళిన విషయం జ్ఞాపకం వచ్చి ఆ విషయాన్ని ప్రస్తావించాను.

సరే, ఆంధ్ర విశ్వ విద్యాలయం సాంస్కృతిక వారోత్సవాలలో ప్రసంగించ డానికి వెళ్ళి వారింట్లో బసచేశాను.

ఉదయం ప్రారంభ సభకు శ్రీ దిగుమర్తి రామస్వామిగారి భార్య అధ్యక్షత వహించారు. సభకేతెంచిన మహాజనం, ఆమె మాట ఒక్కటి కూడా విననియ్యకుండా ఈలలు ఊళలు చప్పట్లుతోను హర్రై, హుర్రె అని అరుస్తూను గోల గోల చేశారు. అప్పటికి నాకున్న సుమారు 45 సంవత్సరాల ఉపన్యాస జీవితంలో ఇట్లా విద్యార్థులల్లరిచేయడం నేను ఎరుగను.

శ్రీ పెద్దాడ రామస్వామిగారు ప్రిన్సిపాలుగా ఉండగా కాకినాడ పిఠాపురం మహారాజా కళాశాలకు, గుంటూరు పౌలస్‌గారు ప్రిన్సిపాలుగా ఉండగా A. C. కాలేజీకి 5, 6 మార్లు ఆ కాలేజీల సాంస్కృతిక వారోత్సవాలకు వరుసగా వెళ్ళి

ఉపన్యసించి వచ్చాను కానీ ఇంతగా విద్యార్థులల్లరి చేయటం నా అనుభవంలో లేని విషయం ఎప్పుడూ దేనికీ భయపడకుండా భయమనే పదాన్ని నిఘంటువులలో నుండి తీసివేయాలి, అని చెప్పేనేనే సాయంత్రం సభ ఎట్లానా? అని అనుకొన్నాను.

సాయంత్రం సభకు విద్యార్థులు ఇసుకవేస్తే రాలకుండా వచ్చారు. ముందు రెండు నిముషాలు కాళ్ళు దడదడలాడాయి. కానీ రెండు ప్రార్థనాశ్లోకాలు చదివే టప్పటికి ఆ వణుకు ఎట్లా పోయిందో పోయింది.

ఆ తర్వాత కథ మామూలే నిర్విరామంగా మూడు గంటలు ఉపన్యసించాను.

విశ్వ విద్యాలయం వారు "ఆంధ్రాభ్యుదయము, మహిళలు అని మకుటం ఇస్తే నేను" మకుటం తల క్రిందులైనది. ఎందు కంటే గౌతమీ బాలశ్రీ (శాతకర్ణులు) తన కొడుకైన, గౌతమీపుత్ర శాతకర్ణి యుద్ధంలో శాత్రవులు పన్ని నవ్యూహాన్ని ఛేదించలేక తల్లిని సలహా అడిగి వెళ్దామని తిరిగి వస్తూంటే కోట పైనుంచి అంతా చూచి కొడుకు కోటకు చేరేలోపుగా శత్రువ్యూహానికిప్రతివ్యూహాన్ని కోటవాకిట్లో ముగ్గుగా వేసి తెలివిగా కొడుకుకు సలహా చెప్పకుండానే చేసి చూపించి రణరణరంగానికి త్రిప్పి పంపిన గౌతమీ బాలశ్రీతో,ఆంధ్రుల రాజ్యపాలన ప్రారంభ మైనది ఆ కారణంగా ఆంధ్ర మహిళాభ్యుదయం ఆంధ్రోదయమం అని మకుటం ఉండాలి. అని చెప్పి వర్తమాన యుగంలో సరోజనీదేవి, కస్తురిబా, దుర్గాబాయిమ్మ వరకు గల మహిళల మహితోదంతాన్ని గుక్క త్రిప్పకోకుండా ఉపన్యసించేటప్పటికి నన్నెట్లానైనా ఆట పట్టిద్దామనుకొన్న కుర్రాళ్ళకు తక్కిన కుర్రాళ్ళు మీరేమైనా వాగుతే, ఆమె మిమ్మల్ని ఏడిపించి, ఏకు చెరువునీళ్ళు తాగిస్తుంది. జాగ్రత్త అని వాదించారట! విశ్వ విద్యాలయావరణంలో కనుచూపు మేరకు ఆవరించి అతిశ్రద్ధతో వింటూ మధ్య మధ్యలో హాయి, హాయి, భళీ, భళీ అనే హర్షవినాదాలతో సాగర తరంగాలవలె విద్యార్థి లోకం ఉవ్వెత్తుగా ఎగుర్తూ ఉంటే నాకు కూడా హృదయ తంగంలో నిక్షిప్తమైన ఆవేశం కట్టలు త్రెంచుకొనగా చాలా హుషారుగా ఉపన్య సించాను. 'ఆఁ ఆడవాళ్ల సభకు వెళ్ళేదేమిటిలే' అని చుట్టూ ఉన్న యూనివర్శిటీ క్వార్టర్సులో బద్ధకంగా పడుకొన్న మహానుభావులంతా మైకును బ్రద్దలుకొట్టే గంభీరకంఠ నాదంతో చెవులు త్రుప్పుపుట్లిపడేలా నేను ఉపన్య సిస్తూంటే వందల

సంఖ్యలో అంతా ఆ ఆవరణలోకి ప్రవేశించి సభకు శోభను చేకూర్చారు. సభ కళ కళలాడుతూ ఉండగా నా ఆవేశానికి మేరలులేకుండా పోయాయి. ఆఖరున ఆ సంవత్సరం కార్యదర్శిగా ఉన్న విద్యార్థి (నాగిరెడ్డి అని నాజ్ఞాపకం) కోమటి పిరికి, నూతిలో ఉరికి అనే సామెతను చెప్పి ఈ కోమటిబిడ్డ ఏమి చెప్తుందా? అని అనుకొన్నాను. కానీ రోజూలాగ పిల్లలు అల్లరి చెయ్యకుండా వారినోళ్లు మూయించివారమె అనగా 'సభామర్యాద పాటించకుండా నీవు కులంపేరెత్తి అసభ్యమైన పదజాలంతో పరుషంగా నీవు మాట్లాడినా సభామర్యాద పాటించి నీకు శిక్షవిధించకుండా నిన్ను మన్నిస్తూ ఉన్నాను. బ్రతికావు-పో-పీ నూతిలోపడి దాక్కుంటావోపో "అని నేను నాగిరెడ్డికి జవాబు చెప్పేసరికి, విద్యార్థులంతా ఒక్కమారు అంతే శాస్తి కావాలి" అంటూ చప్పట్లు చరిచారు. సెక్రటరీ ముఖం ముడుచుకు పోయింది. ఇంక వందల సంఖ్యమీద విద్యార్థుల సంతకాల కొరకు ఎగబడేసరికి నిర్వాహకులకు మమ్మల్ని కారుదగ్గరకు తీసుకొని వెళ్ళడం చాలాకష్టమైపోయింది. వేల సంఖ్యపై ప్రశంసా వర్షధారలు నన్ను తడిపి కుడిపి వేయగా "నేను గొప్ప ఉపన్యాసకు రాలనేకాబోలు"నని అనుకోక తప్పలేదు.

మరునాడు అక్కడే చదువుకొంటూ ఉన్న మా పినతల్లి కుమారుడు నారాయణమూర్తి అనే అబ్బాయి గ్రంథివారింటికి ఒక ఏభైమంది విద్యార్థులను తీసికొని తయారైనాడు. "ఏరా నిన్న కనబడలేదేమిటి!" అని అడుగగా "అక్కయ్యా ఇది దేశంలోని మామూలు వేదికకాదు. లక్షల కొలదీ శత మర్కటాలు ఉండే యూనివర్సిటీ వేదిక! నీ ప్రతిభ ఏమిటో నాకు తెలియదు. చాలా సాహసించి వచ్చావని ఘోరసాయి చేశావని నేను అనుకొని నీ ఉపన్యాసం అల్లరి పట్టించాలన్న ఆవేశంతో నిన్ను అల్లరి పట్టిస్తే నీవు బెంబేలు పడిపోతే మా కోతులు నాపై చెప్పులు విసిరి డప్పులు మోయించేస్తారని (అంటేవాడు నా తమ్ముడని తెలిసి) నేను నీ దగ్గరకు రాలేదు. కానీ ఎంత బ్రహ్మాండంగా ఉన్నదో నీ ప్రసంగం! నీకు తెలుసా చొక్కాలు చేతులు పైకిలాక్కొని జబ్బలు చరుచుకొన్నవాళ్ళంతా నాలుకలు కరచుకొన్నారు.

ఇదిగో వీళ్ళంతా యూనివర్సిటీలోని వివిధ సంఘాల వాళ్ళు, వీళ్ళంతా తమ తమ శాఖల సంఘాలకు ఉపన్యాసానికి నిన్నాహ్వానించడానికి వచ్చారు. అని వాళ్లను

పరిచయం చేశాడు. 4, 5 సంఘాలకువెళ్లి ఉపన్యసించాను.

ఇంకొక మహత్తర విషయమేమంటే సాంస్కృతిక వారోత్సవాల నిర్వాహకులైన అధ్యాపకులు వచ్చి అమ్మా, చరిత్ర రోజున నాటక కళరోజున ఉపన్యాసకులు రావడం లేదు. మీరు అన్ని రంగాలలోనూ సమర్థత కలవారనే విషయం నిన్నటి మీ ప్రసంగం ఋజువు చేసింది. యూనివర్శిటీలో ఎవరినోట విన్నా ఎక్కడ బట్టినా మీ ప్రశంస చరిత్ర నాటకరంగాలమీద కూడా మీరు ప్రసంగించాలి అని అడిగారు బాగా విషయం మీద సాధనచేసి ఆ విషయంపై అధికారం సంపాదిస్తే కాని నేను చెప్పను నన్ను మన్నించండి. అందులోనూ మీకు నా ప్రసంగాన్ని గూర్చి ముందు ఉన్న ఉద్దేశాలను త్రిప్పికొట్టి ఢంకా బజాయించి బహుధా ప్రశంస లందుకొన్న నేను సరిగా అధ్యయనం చెయ్యకుండా ఇంకో విషయంపై ప్రసంగించ డానికి 'తగుదు నమ్మా' అని తయారైతే ఈసారి మీ విద్యార్థులు నా వెనుక చప్పట్లు కొట్టారు. అన్నాను. అయినా ఆంధ్రుల చరిత్రపై అవసరంగా వారి అభ్యర్థనపై ఇంకొక ప్రసంగం చేసి ప్రశంసలు పొందాను.

ఇంతా చేస్తే నాకు ఖర్చు లిచ్చేరసీదుపై సంతకం చేయించుకొని "రేపు స్టేషనులో దబ్బిస్తామని చెప్పి విద్యార్థి సంఘనాయకుడు, స్టేషనుకు వచ్చి ఉపన్యాసకులుగా వచ్చిన పుట్టపర్తి నారాయణాచార్యుల దంపతులకు ఖర్చులిచ్చారు. కానీ, నాకు వట్టిమాటలతోనే వీడ్కోలు చెప్పారు. ఆఖరుకు ఈ అప్రతిష్ఠపని చేస్తారని నేను ఎంత మాత్రమూ అనుకోలేదు.

ఏమైనా ఇది చరిత్రాత్మకమైన ప్రసంగము.

ఆ మరుసటి సంవత్సరం నాయని కృష్ణకుమారి వాళ్ళు వాళ్ళ ఆడపిల్లల హాస్టలు ఉత్సవాలకు ప్రసంగానికి పిలిచారు అట్లా ఆ విశ్వవిద్యాలయానికి ॥మార్లు ఉపన్యాసాలకు నన్ను ఆహ్వానించారు అక్కడ నా ఆఖరి ఉపన్యాసం 1964 ఆ ప్రాంతంలో (నాపెద్దకుమార్తె సుహాసిని తెలుగు M A చదవవడానికి, నామూడవ కుమారుడు విజ్ఞాన్ B Sc చదవడానికి యూనివర్సిటీకి వెళ్ళిన సమయంలో) నా పదకొండవ ప్రసంగం యూనివర్శిటీ జరిగినపుడు రిజిష్ట్రారు శర్మా, వేణుగోపాలస్వామి గారు లక్ష్మీకాన్తమ్మగారిని మన యూనివర్శిటీ 11 మార్లు ఉపన్యాసాలకు ఆహ్వా

నించింది.

## ఇది మన యూనివర్సిటీ చరిత్రలో

## రికార్డు బ్రేకు

అనుకోవలసిన మహత్తర విషయం! అని ప్రశంసించి, "అమ్మా లక్ష్మీ కాన్తమ్మగారూ విద్యార్థులలో సద్భావన సదాశయ స్ఫూర్తి నశించింది. వాళ్ళకు మన సంస్కృతి పట్లా గౌరవం తగ్గిపోతూ ఉన్నది. మీ బోటివాళ్ళ ఉపన్యాసాలు వినే భాగ్యం ఇంక ఈ తరం కుర్రాళ్ళకు లేదు. మేమింక ఈ సంస్కృతీవారోత్స వాలు మానివేయదలిచాము. మంచి విషయాలు వినాలనే ఆసక్తి లేకపోగా అల్లరి చేయాలనే ఆరాటం ఎక్కువౌతు ఉన్నది. ఇందాకటి నుండీ ఈ పిల్లలను ఆపలేక నేను సతమౌతు ఉన్నాను. ఇంకమిమ్మ ఆహ్వానించి అవమానించడం జరుగదు. అని వేదికపైనే చెప్పేశారు.

నా మూడవ కుమారుడు విజ్ఞాన్‌ని మా అమ్మాయిని వారికి పరిచయంచెయ్యగా మాచిన్నబ్బాయికి కపుడు 14వ సంవత్సరం యూనివర్శిటీలో B Sc ఆ నర్సు చదవ డానికి చేరాడు. వాడు వయస్సులో చిన్నపిల్లవాడేకాక చాలా పొట్టి. అకారణంగా అందరూ వాణ్ణి 'లిల్లీపుట్' అనేవారు. మా అబ్బాయిని చూచి శ్రీ వేణుగోపాల స్వామి ఏమిటీ ఈ 14 ఏండ్ల లిల్లీపుట్ మన యూనివర్సిటీ స్థాయి విద్యాభ్యాసానికి వచ్చాడా?" అని వాణ్ణి చేతులతో పట్టుకొని ఎగురవేసి ప్రశంసించారు.

ఆ సమయానికి మా రెండవ అబ్బాయి రాజరాజనరేంద్ర రాంచీ (మెస్రా) లోని B I.Yలో లెక్చరరుగా ఉద్యోగం చేస్తూ తండ్రికి సహాయపడవలెననే ఉద్దేశంతో యూనివర్సిటీలో చదువుతూన్న అక్కగారికి తమ్మునకు కొంత డబ్బు పంపేవాడు. తర్వాత రెండో సంవత్సరానికి మా విజ్ఞానకు Merrit Scolership వచ్చి యూని వర్సిటీ విద్యకు పూర్తిగా సహాయ పడింది.

## కళాశాలలలో ప్రసంగాలు

ఆంధ్రా విశ్వవిద్యాలయంలోవలె నా ప్రసంగాలు కాకినాడ P.R కళాశాలలో

ఆరు పర్యాయాలు విజయనగరం మహారాజా కళాశాలలో నాల్గయిదు పర్యాయాలు విజయనగరం మహారాణీ కళాశాలలో మూడు పర్యాయాలు రాజమండ్రి ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలలో 15, 20 పర్యాయాలు, గుంటూరు A.C కాలేజీలో 10 పర్యాయాలు హిందూ కాలేజీలో 2, 3 పర్యాయాలు, తిరుపతి దేవస్థాన పక్షంగా 20 పర్యాయాలు.

ఏలూరు సెంట్ థెరిస్సాస్ కాలేజిలో 8, 9 పర్యాయాలు అనకాపల్లి శారదా గ్రంథాలయంలో 6 7 పర్యాయాలు నా ప్రసంగాలు జరిగినాయి. విజయనగరంలో తుదిసారి శ్రీవసంతరావు వెంకట్రావుగారు (ప్రిన్సిపాల్) విద్యార్థులలో విచక్షణా జ్ఞానం లోపించింది. ఇంక మిమ్ముబోటి పెద్ద వారి నాహ్వానించడం బుద్ధి పొరపాటే నని బాధపడ్డారు.

హిందూకాలేజీ ప్రిన్సిపాల్ శ్రీవల్లభజోస్యుల సుబ్బారావుగారు A C కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ పౌలస్‌గారు కూడా అట్లాంటి అభిప్రాయాలే వెలిబుచ్చారు. ఇంక ఈ అధ్యాయానికి మంగళం పాడి సాంస్కృతిక పర్యటన విషయమై ప్రస్తావిస్తాను.

## సాంస్కృతిక పర్యటన

మల్లాది శివరామ్ సోదరులు ఒక సాంస్కృతిక పర్యటన తలపెట్టి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ మహాకవిగారు. శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు నేను మల్లాది వసుంధర మున్నగు వారితో ఖర్గపురం తాతానగర్ బరంపురం ప్రాంతములలో సాంస్కృతిక పర్యటనను ప్రారంభించారు.

నాతోబాటు వాళ్ళ ఖర్చులు వారుపెట్టుకొంటూ మా అమ్మా శ్రీమతి కామాక్షమ్మగారూ కూడా మాతో ఆ పర్యటనకు వచ్చారు. ఆయా నగరాల్లో నా ప్రసంగాలు విని ఖర్గపురంలో ఒక యువజ్యోతిష్కుడు మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి జ్యోతిషం చెప్పాడు. ఆ యువకుడు సాముద్రిక శాస్త్రవేత్త కూడా ఆయన నా దగ్గరకు వచ్చి నా చెయ్యిచూపమని అడిగాడు. నేను నా చెయ్యి చూపడానికి చాలా అభ్యంతరం చెప్పాను. కానీ ఆయన 'అమ్మా మీరు అసాధారణ ప్రజ్ఞావంతురాలు మహామనిషి అత్యంత మేధావియైన ఒక విశిష్టవ్యక్తి! మీ చేతిలో ఉన్న రేఖలను చూచి ఏ రేఖల వంల మీరింత ప్రజ్ఞావంతురాలైనారో తెలుసుకొని అధ్యయనం చెయ్యడానికి మాకు ఉపకరిస్తుంది. కాబట్టి దయయుంచి మాతో సహ

కరించ ప్రార్థన" అని అభ్యర్థించగా నేను సరేనని అంగీకరించి నా చెయ్యి చూపాను. వాళ్ళు నాకు మంచిభవిష్యత్తు ఉన్నదని చెప్తూ త్వరలోనే మీరు ఒక గొప్పగ్రంథాన్ని రచిస్తారు. అనికూడా చెప్పారు. కానీ నేను వారిమాటలను విశ్వసించక "అం నేను నమ్మను. సాహిత్య విషయాలు సాంఘిక విషయాలు నాకు కంఠస్థం కాబట్టి ఏమీ పరిశ్రమ చెయ్యకుండా ఉపన్యాసాలు చేస్తాను. రేడియో అవకాశం వచ్చి నపుడు ఏదో రచన చేస్తూ ఉంటాను. కానీ నే నేమిటి? గొప్పగ్రంథం రచించడం మేమిటి? నేను చాలా బద్ధకిష్టిని వ్రాతకూ నాకూ చాలా శత్రుత్వం అని వారి మాటకు అనంగీకారంగా మాట్లాడాను, అయన "కాదమ్మా, మీరు తప్పక ఒకగొప్ప గ్రంథాన్ని అనంద పూర్వమైన గ్రంథాన్ని రచిస్తారు. దానివలన మీకు ఆ గ్రంథానికి ఆంధ్రదేశంలో ఊహకందని ప్రశస్తివస్తుంది. తర్వాత చాలా కావ్యాలను గ్రంథా లకు జన్మనిస్తారు. అని ఘంటా పథంగా చెప్పారు. కానీ ఆ సమయంలో నాకు ఆ మాటలపై ఏ మాత్రం విశ్వాసం కలుగలేదు.

## ఆంధ్రకవయిత్రుల రచనా ప్రారంభము

ఆ పర్యటన తర్వాత నేను బాపట్ల వచ్చేశాను. ఇంతలో మద్రాసులో నడుపబడుతూ ఉన్న తెలుగుభాషా సమితి వారు వారి నిత్య కార్యక్రమంలో ఒకభాగంగా 1951లో అనుకొంటా 'ఆంధ్రకవయిత్రులు' అనే గ్రంథరచన పోటీకి పిలుపిచ్చారు. ఆంధ్రదేశంలో సాహితివేత్తలంతా ఆ పిలుపునకు హర్షాన్ని ప్రకటిస్తూ, స్పందించారు. కానీ నేను స్పందించలేదు. దానికి కారణం నాకు వ్రాతపని అంటే సహజంగా ఉండే బద్ధకము! రెండోప్రబల కారణం :- కందుకూరి వీరేశలింగం పంతులు గారు తన కవుల చరిత్రలో మొల్ల, తరికుండ వేంగమాంబ ముద్దుపళని మధురవాణి, మున్నగు 5, 6 కవయిత్రులను మాత్రమే పేర్కొనడం జరిగింది.

సుమారు అయిదు వందల కవుల జీవితాలను వెలుగులోనికి, తీసుకొని వచ్చిన శ్రీపంతులుగారే కేవలం 5, 6 మంది కవయిత్రులను పేర్కొంటే వరహం మీద వందమంది కవులు ఆంధ్ర సాహిత్యరంగంలో తమ అద్భుతప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించి ఆంధ్రసాహిత్యాన్ని సుసంపన్నం చెయ్యడానికి పరిశ్రమించి ఆంధ్ర సరస్వతీ

సమర్చనచేస్తే ఏకారణంచేత ననండి ఆ శతంలో వందమంది కవులకు ఒక్క కవయిత్రి తన ప్రాతినిధ్యం ప్రదర్శించడానికి సాహసించి ముసుగు తొలగించి ముందుకు వచ్చిందని నేను వ్రాసి, ఆంధ్రమహిళల ఈ అసామర్థ్యాన్ని సరస్వత సమర్చనలో ఆంధ్ర మహిళలు అలసత్వాన్ని ప్రదర్శించటాన్ని నేను బయటపెట్టనా? అనేది నా ప్రధానవాదం! శ్రీమావారు ఎన్ని ఉపన్యాసాలు చెప్తే మాత్రం ఎన్ని రేడియో రచనలు చేస్తేమాత్రం ఏం లాభం! శాశ్వతమైన సాహిత్యాత్మకమైన ఏదైనా ఒక గ్రంథరచన చేస్తే పేరు ప్రతిష్ఠలు కల్గుతాయి.

సాహిత్యానికి నూత్నప్రక్రియతో ఒక వినూత్న సేవచేసి నట్లౌతుంది. అని నన్ను ఆంధ్రకవయిత్రుల రచనకు చాలా ప్రోత్సహించారు. చాలా మందిచేత చెప్పించారు. కానీ ఎందుకో నాకు ఆ రచనపై మనస్సు అంగీకరించలేదు. ఎందరు చెప్పినా కాదని నేను మొరాయించాను.

ఆ సమయానికి మేము సింగరగిరి విడిచి, రామరాజు చెంచు రామయ్యగారింటికి అద్దెకు వచ్చాము. అక్కడకు మేము చేరే సమయానికి బొడ్డుపల్లి పురుషోత్తం ప్రైవేటుగా B.A కి కట్టి నా దగ్గరకు తెలుగు పాఠ్యగ్రంథాలు చెప్పించుకోడానికి వచ్చేవాడు. పురుషోత్తం కూడా ఆంధ్ర కవయిత్రుల రచనకు నన్ను చాలా చాలా ప్రోత్సహించేవాడు. నేను ఎంతకీ ఒప్పుకోక పోయేసప్పటికి "అక్కయ్యగారూ, సరే మీరు ఉన్న 5,6 కవయిత్రుల కొరకు చరిత్ర వ్రాయనని నిర్ధారణగా చెప్తూ ఉన్నారు పోటీ అనేది బహిరంగ విషయం. ఇంకొకరెవరైనా ఉన్న నల్గురైదుగురితో చరిత్ర వ్రాస్తారు. ఆ గ్రంథమే పోటీలో గెలుస్తుంది. మీరైతే సహజంగా మీకు ఉండే మహిళాభ్యుదయంపై, ఆంధ్రసాహిత్యంపై ఆదరంకొలది కొంత కాకపోతే కొంతైనా పరిశోధనచేసి ఇంకొక పదిమంది కవయిత్రులనైనా వెలుగులోకి తీసుకొని రావచ్చును. అని గట్టిగా హెచ్చరించాడు. ఈ వాదం నాకు బాగా నచ్చింది ఇక ఆ ప్రయత్నాలు మొదలుపెట్టాలి. మొదలుపెట్టడమంటే, మాటలా? ఎన్ని పాత పత్రికలు తిరగెయ్యాలి? ఎన్ని కావ్యాలు చదవాలి? నేను ఎప్పుడీ మహాసాగరమథనం చెయ్యగలను? ఎప్పుడు అమృతోద్భవ కాగలదు? అని వితర్కించుకొని కూడా ఆంధ్రపత్రిక పాతప్రతులు పాత ఉగాది సంచికలు ముఖ్యంగా భారతి

పాత్రప్రతులు గృహలక్ష్మి పాతప్రతులు తెప్పించి పరిశీలించడం ప్రారంభించి, కవయిత్రులకు సంబంధించిన ప్రతి చిన్న విషయాన్నీ నోట్ చేసుకోవడం మొదలు పెట్టాను పరిశోధన సాగుతూన్న కొలదీ చాలా మంది కవయిత్రులు ఉపలభ్యం కావడం ప్రారంభమైనది. ఇక అదే పనిగా నిరంతర పరిశోధనచేస్తూ, నా పరిశోధనకు గౌతమీ గ్రంథాలయంలో చాలా గ్రంథాలు ఉపలభ్యం కాగలవనే తలంపుతో రాజమహేంద్రపురం వెళ్ళాను.

అక్కడ రాజ్యగరిలో పరిస్థితి విషాదకరంగా పరిణమిల్లింది. కాలక్రమాన్న గౌతమీ గ్రంథాలయం ఆంధ్రదేశానికంతా ఒకే ఒక మహాగ్రంథాలయంగా మా నాన్నగారి ఒడిలో పెరిగి ప్రవృద్ధమానమైన గ్రంథాలయంనుండి మా నాన్నగారిని (అధ్యక్షపదవినుండి) తొలగించాలనే ప్రయత్నాలు జరిగాయి. గౌతమీగ్రంథాలయాన్నికి రాజమండ్రినగరమధ్యంలో అనగా కోటలో స్థిరస్థావరం ఏర్పరచాలా? లేక ఊరి బయట ప్రశాంతంగా ఉండే స్థలంలో అనగా పేటలో శాశ్వతనివాసం ఏర్పాటు చెయ్యాలా? అనే కోట పేట సంవాదంలో శ్రీ మా నాన్నగారికి కుడిభుజంగా ఉండి గ్రంథాలయానికి పేటలో అనగా ఇప్పుడున్న స్థలంలో శాశ్వతభవనం నిర్మించడానికి సహాయపడిన శ్రీ కంచుమర్తి రామచంద్రరావు గారి కుమారులు శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారికి అధ్యక్షపదవి కట్టబెట్టవలెనని ప్రయత్నించి, సఫలులయ్యారు. కన్న కుమార్తె కంటె హెచ్చుగా లాలించి, పెంచి పెద్దచేసిన గ్రంథాలయన్ని తన ఒడినుండి, బలాత్కారంగా లాగి శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారికి అప్పగించినందుకు దిగులుపెట్టుకొని మతిపోయి.

మా నాన్నగారు మంచంపట్టి ఉన్నారు. వారిని చూచేటప్పటికి నాకు పుట్టెడు దుఃఖం పొంగిపొర్లింది. నిజమైన దేశభక్తుడు నిష్కళంకమైన భాషాసేవకుడు కాబట్టే ఆ సంస్థను స్థాపించి కన్నబిడ్డలకంటె హెచ్చుగా పాలించి పోషించిన ఆ మహనీయుని ఒడిలోనుండి ఆ గ్రంథాలయాత్మజను కసాయివారై లాక్కొని పోవడం గోవునుండి వత్సాన్ని లాగివేస్తే ఆ గోవు విల విలలాడిపోయినట్లాయన బాధపడ్తూ ఉన్నారు. అయినా నన్ను చూడగానే నా రచనోద్యమాన్ని దీవించి గ్రంథాలయానికి నేను రాలేనమ్మా వాళ్ళ ఈ చర్యతో నా నవనాళ్లూ క్రుంగి చచ్చుపడిపోయాయి. నేనిపుడు జీవచ్ఛవాన్ని అయినా నేను కొన్ని గుర్తులు చెప్తాను.

మన గ్రంథాలయంలో ఎక్కడాలేని మహిళా రచనములున్నాయి. అవన్నీమాకాలంలో మా ప్రోత్సాహంతో బ్రహ్మ సమాజ భావాలతో స్త్రీలచే రచింపబడ్డాయి కొటికల పూడి సీతమ్మ, అవధూతజ్ఞానమాంబ మొదలైన వారి కావ్యాలవి నేను చెప్పిన గుర్తుల ప్రకారం వేంకటస్వామిని ఎర్రన్నను వీళ్ళు గ్రంథాలయోద్యోగులు అడుగు వాళ్ల తీసిస్తారు. అని చెప్పి నన్ను పంపించారు. గ్రంథాలయానికి వెళ్లేటప్పటికి పతితల హాలులో గ్రంథాలన్నీ గుట్టపోసి ఉన్నాయి. ఆ పరిస్థితి చాలా హృదయ విదారకంగా ఉన్నది. అయినా నాన్నగారు చెప్పిన గుర్తులను బట్టి వేంకటస్వామి వాళ్లు నాకు సుమారు 20, 25 మహిళా రచనలను తీసి యిచ్చారు. ఆంధ్ర కవయిత్రుల రచనకవి పెన్నిధులే! వాటిని సంపాదించడం నా మహైశ్వర్యాన్ని చేజిక్కించుకోవడమే. రాజమహేంద్రిలోనే పదిరోజులుండి ఆ కావ్యాలన్ని చదివి. ఆ కావ్యాలపై విమర్శను ఆంధ్ర కావయిత్రులు గ్రంథంలో మీ వితరము అనే మకుటంగా పేర్కొంటూ రచించాను.

తిరిగి బాపట్లవచ్చి మళ్ళీ రచన సాగిస్తూ వేటపాలెం, ఊటుకూరి వేంకట సుబ్బరాయ శ్రేష్ఠిగారిచే స్థాపింపబడిన సారస్వతనికేతనం గ్రంథాలయంనుండి పాత పత్రికలు తెప్పించుకొని అవన్నీ అధ్యయనంచేసి పరిశోధించి ఆంధ్ర కవయిత్రుల రచనను సాగించాను, ఆ పనిమీదనే చెన్నపురి ఓరియంటల్ లైబ్రరీకి తంజావూరు సరస్వతీమహాలుకు కూడా వెళ్ళి మహిళా కర్తృకములైన కొన్ని రచనలను సంపా దించ గలిగాను, ఆ రచన సందర్భంగానే నేను మళ్ళీ ఏలూరు వెళ్లి మా మేనమామ గారైన మోతే కృష్ణారావుగారి యింట్లో ఉండి గ్రంథ రచనచేస్తూ ఏ రోజు రచించిన దానాటి సాయంకాలం మహాకవులైన శ్రీ బొడ్డు బాపిరాజుగారికి చదివి వినిపిస్తూ ఉండేదాన్ని మహాయజ్ఞ నిర్వహణగా పర్యవసించిన ఆంధ్ర కవయిత్రులు గ్రంథ రచనము పూర్తికాగానే గుంటూరువెళ్ళి మా అడబిడుచ—నూకల సావిత్రమ్మ కృష్ణ మూర్తిగార్ల యింట్లో ఉండి శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మగారికి మూడు రోజులు చదివి వినిపించాను. శ్రీ శర్మగారు ఆ సమయంలో సాహిత్రివతుల నాహ్వా నించేవారు.

వారిశుభ ప్రశంసలతో గ్రంథాన్ని తెలుగు భాషా సమితికి పంపడం జరిగింది. ఈ రచనా సమయంలో చిరంజీవి బొడ్డుపల్లి పురుషోత్తముని సహకారం నాకు

పూర్తిగా లభించింది. నా ఆంధ్ర కవయిత్రులు గ్రంథంలో 264 కవయిత్రులు వెలుగు చూచారని చెప్పడానికి ఆనందిస్తూ ఉన్నాను. ఆంధ్రకవయిత్రులు గ్రంథాన్ని 1951 ఆగస్టు 17 వ తేదీనాడు వ్రాయ ప్రారంభించాను. 1951 నవంబరు 1 వ తేదీ తెలుగు భాషా సమితికి పంపించాను. అయితే ఆరునెలలు ఈ విషయమై పరిశ్రమించవలసి వచ్చింది, నా రచనయైన ఆంధ్ర కవయిత్రులు గ్రంథమే పోటీలో విజయం పొందిందనే శుభవార్తను. 14-9-1952 వ తేదీ నాటి పత్రికలు ప్రచురించాయి. అంతవరకూ రేడియో కొరకు రచనలుచేస్తూ ఉన్న నాకు శాశ్వతకీర్తి ప్రతిష్ఠలను సంపాదించి పెట్టిన ప్రప్రథమ గ్రంథ రచనయిదే. ఖర్గపురంలో యువకుడు చెప్పిన జ్యోతిషం ఫలించింది. నా విజయవార్తను ఢంకాబజాయించి పత్రికలు ప్రచురించిననాడు నగరామోతలుగా నా సన్నిహితులు, నా వీనుల విందుగా ప్రశంసలు మ్రోసిన సమయంలో నా మనస్సు ఆనందోత్సాహాల ఆందోళికలో ఊగినట్లు వీధుల్లో విహరించింది నా తరువాత రచనలకు నాంది పల్కిన విజయ శంఖనాదం; ఈ ఆంధ్ర కవయిత్రుల రచనం! నా భవిష్యజ్జీవిత శుభచరిత్రకిదియే త్రిన మంగళ పతాక! దానికి శ్రీ జమ్మలమడక మాధవరాయశర్మగారు దీపిక అనే పీఠికను ప్రసాదించి గ్రంథశోభనతిశయింప జేశారు.

ఈ పతాక సన్నివేశం ఇంతతో ఆగలేదు. అఖిలాంధ్రంలో ఆంధ్ర కవయిత్రుల విజయపతాకగా విహరించి నాకు అఖండ కీర్తి ప్రతిష్ఠల నార్జిస్తూ నా బాలి రచనోద్యమానికి వెలుగు బాటలు తీరుస్తూ నాతోబాటు అఖిలాంధ్రంలోనే కాదు. ఆగిలభారతంలో, విదేశాల్లో కూడా నన్ను ముందుకు ముందు ముందుకు నడిపిస్తూ నన్ను సాహితీ రుద్రమగా తీర్చిదిద్దిన భద్రపతాక!

## గురుగ్రహ ప్రవేశం

'ఆంధ్ర కవయిత్రులు' గ్రంథ విజయానికి సుమారు ఒకనెల ముందు నాకు ఒక మహత్తరమైన స్వప్నం వచ్చింది. నేను ఎక్కడో రాత్రిపూట ప్రసంగిస్తూ ఉన్నానట మధ్యలో కొంచెం మంచినీళ్ళు ఇమ్మని అడిగానట. కార్యకర్తలు ఒక పెద్దగ్లాసుతో పాలు తీసుకొని వచ్చి ఇచ్చారట ఇంతలో గగనమండలం నుండి ఒక పెద్ద తేజోమండలం క్రిందికి దిగివచ్చిందట. అది నేను త్రాగేపాలగ్లాసులో ప్రవేశించగా

నేను పాలరూపంలో ఉన్న ఆతేజో మండలాన్ని త్రాగేశానట. నేను అప్పటికి మూడు నెలల గర్భవతిని నేను ఎవరో మహాశక్తి సంపన్నతకల బిడ్డకు జన్మనిస్తాను కాబోలునని సంతోషించాను ఇంతలో చీరాలనుండి ఆదివరాహాచార్యులుగారు మా యింటికి వచ్చారు. ఆయనతోనా యీ స్వప్నం గూర్చి చెప్పగా శ్రీ ఆచార్యులుగారు అమ్మాయి ఈ కల నీ గర్భానికి సంబంధించిందికాదు. కాని నీ జీవితంలో గురు మహాదశ నీకు స్వప్నం వచ్చిననాడు ప్రవేశించి యున్నది. నీ పురాకృత సుకృతం వలన గురుడు నీ జాతకంలో నీ జీవితంలో ప్రవేశిస్తూ నీకు ప్రత్యక్షమైనాడు. అని చెప్పారు. ఈ స్వప్నం వచ్చిన కొద్దిరోజులలోనే "ఆంధ్ర కవయిత్రులు గ్రంథ విజయవార్త వెలువడింది. అఖిలాంధ్రంలో ఆంధ్రకవయిత్రులు విజయయాత్ర జరిగింది. అప్పికట్లలో కుర్రా సుబ్బారావుగారు ఆంధ్రకవయిత్రులు గ్రంథలో ప్రస్తావింపబడిన గుడిపూడి ఇందుమతీ, చేబ్రోలు సరస్వతీదేవి మున్నగు వారినాహ్వానించి సభ తీర్చి సమ్మానసల్పి కవయిత్రుల యెడల ఆంధ్ర దేశం నిర్వర్తించుకోవలసిన సద్భావ సమ్మాన బాధ్యతలను చాటారు. ఈ సంఘటన జరిగేటప్పటికి మేము రామ రాజు చెంచురామయ్యగారి యిల్లు విడిచి మా మాబజారు మొదటిరోడ్డు కెదురగా ఉన్న ఇంట్లోచేరాము.

## దివ్య దర్శనం

కాని రామరాజు చెంచురామయ్యగారి యింట్లో చేరిన కొలది సమయానికే మా పిల్లలందరికీ అమ్మవారు పోసింది సూనృత అనె ఆరునెల మా పాపకు ముచ్చిలి గుంటలో కూడా అమ్మవారి పోతచూపి ఆ పసికందును బలితీసుకొన్నది. పెద్ద మ్మాయి సుహాసినికి, పెద్దబ్బాయి ప్రతాపునకు చాలా ప్రమాదంగా ఉన్నది. నాకేమో చాలా భయంగా ఉన్నది. ఆ సమయంలో ఒక తెల్లవారుజామున ఒక కల వచ్చింది. "ఆ పిల్లలను పడుకోబెట్టిన గదివెనుకనున్న తలుపు తెరచుకొని దివ్య మంగళాకృతితో చేతిలో త్రిశూలాన్ని ధరించిన, ఒక నవరత్న ఖచిత కిరీటధారిణి గదిలోనికి ప్రవేశించింది. ఆమె వెనుకనే నల్లటి శరీరముతో ఒంటినిండా మచ్చలతో కొప్పుపెట్టుకొనియున్న ఒక భయంకరాకారిణి. పరుగెత్తుకొంటూ వచ్చింది ఈలోపుగా లోపల ప్రవేశించిన దివ్యమూర్తి ఆ గదితలుపులు మూసేసింది ఆ మూయడంలో

వెంట తరుముకు వస్తూన్న ఆకభీరాకారిణి కాలిబొటనవేలు తలుపుసందున బడింది. ఆ భీరాకారిణి హా చచ్చాను. అంటూ ఒక కేకపెట్టి కాలు లాక్కొని వెనుకకు తిరిగి పారిపోయింది. అంతలో లోపలి ప్రవేశించిన దివ్యమూర్తి "హమ్మయ్య అంటూ గుండెలపై చేయివేసుకొని తృప్తిగా నిశ్వసించి నన్ను పిల్లల్ని చూచి మృదుహాసంతో అభయహస్తం ఇచ్చి అదృశ్యమై పోయింది. ఆ మర్నాటినుండి పిల్లలకు వ్యాధి తిరుగు ముఖం పట్టింది. ఆరోజులలో వేదపాఠం విద్యార్థి చిన్న శంకరయ్య అనే అబ్బాయికి మేము భోజనాది సౌకర్యాలు కల్పించాము. ఆయబ్బాయి మాత్రం మాకు సహాయంగా మా యింట్లో ఉండి మాకు సహకరించాడు. మా అత్తగారు కూడా ఆ ఆ పత్సమయంలో వచ్చి మమ్మ ఆదుకొన్నారు.

పిల్లలు ఈ ఆపదనుండి బయటపడేటప్పటికే మా వారిని ఎప్పటినుండో పీడిస్తూన్న దగ్గు హెచ్చుగా వచ్చి వారు మంచంపట్టారు. ఒకరోజు 104 జ్వరం వచ్చి దగ్గలేక కళ్ళు తేలవేశారు. ఆ సమయంలో ఆది వరాహాచార్యులుగారు మా యింట్లోనే ఉన్నారు. ఆచార్యులుగారు గొప్ప ఆయుర్వేదవైద్యులు! మా వారి పరిస్థితి ప్రమాదంగా ఉన్నందున ఏ మందు పనిచేయనందున నేను వెళ్ళి ఆచార్యుల గారి కాళ్ళమీదపడి ఆచార్యులుగారూ ఏమిటి? మేమిట్లా ఆపదలో చిక్కుకొని ఉంటే మీరు చూస్తూ ఊరుకొన్నారు? మేమిద్దరమూ మీ బిడ్డలం కదా వారికి రోగవిముక్తి ప్రసాదించి నాకు పతిభిక్షపెట్టి మా యీ సంసారాన్ని రక్షించరా? అని కళ్ళనీళ్ళతో వారి కాళ్ళు కడిగేశాను,

వారప్పుడు నాతోఅన్నమాటవిని"అమ్మాయీ"నీవు బ్రహ్మ సమాజ విశ్వాసం కల్గినదానివి! నేను విగ్రహారాధకుడను! నేను వైద్యం చెయ్యాలంటే గుప్తకు నీవే ఔషధం తయారు చెయ్యాలి! అదికూడా నేను ఉపదేశించే మంత్రం జపిస్తూ తయారు చెయ్యాలి. గుప్తకు ఏమీ ఫర్వాలేదు. నీవు నేను పదేశించే మంత్రం జపిస్తూ బజారుకు వెళ్ళి నేను చెప్పే మందులు స్వయంగా తెచ్చి ఆ మంత్ర జపంతో వాటిని నూరి ఔషధంగా తయారు చేసి ఆ ఔషధాన్ని నా చేతికిస్తే నేను నా పూజలో ఆ ఔషధాన్ని పెట్టి దైవానుగ్రహంతో నీకిస్తాను. నీవే స్వయంగా ఆ మందును గుప్తచేత తినిపించాలి" అని "అయ్యో అంతకంటేనా? వారి ఆపదకంటె ప్రాణాలకంటె నాకు కావలసిన దేమున్నది?" అని వారు చెప్పిన విధంగా మంత్ర జపంతో మందు

తయారు, చేసి వారి చేతికిచ్చాను. ఒక్క రెండు పొట్లాలతో ఒక్క రాత్రి ఔషధ సేవనంతో వారి వ్యాధి తిరుగుముఖం పట్టింది. నిజంగా వారే నాకు పతిభిక్షపెట్టారు! ఆ మహానుభావుని ఆశీర్వాదం వలననే మా వారికి ప్రాణాపాయం తప్పింది. మేమిద్దరమూ సౌభాగ్యంతో మరల ఈ లోకం చూడలేము అనుకొన్న పరమ దుర్దినమునుండి మేము బయటపడ్డాము. నా పసుపుకుంకుమలు నాకు దక్కాయి. వారికే విధంగానూ ఋణం తీర్చుకోలేము!

వారికి కొంచెం స్వస్థత లభించిన తర్వాత మా వారి ఆరోగ్యం కుదుట బడటం కొరకు నాకు ఉపదేశించిన 'జ్వాలాసుదర్శన' మంత్రోపాసన వారొకమూడు నెలలు నేనొక మూడు నెలలు చేయాలన్నారు. వారు బలహీనతచేత చేయలేకపోతే అదీ కూడా నన్నే చెయ్యమన్నారు. అట్లాగే చేసేటప్పటికి ఆ ఉగ్ర జపోపాసన వలన నా శరీరానికి మిక్కిలి వేడిచేసి అనారోగ్యం కల్గింది. ఆ కారణంగా ఆచార్యులు గారు "అమ్మా, నీవుగృహిణివి ఇంత ఉగ్రమైన జపాన్ని ఇంక నిర్వహించలేవు" అని దానికి తగిన జపహోమతర్పణాదులను నిర్వర్తించి ఆ జపాన్ని ఆపుచేయించారు. ఆ మంత్రాన్ని నాకు ఉపదేశించిన మరునాటి తెల్లవారుజామున నాకు మంత్ర ఫలితాన్ని సూచిస్తూ ఒక స్వప్నం రావలెనట. కానీ రాలేదు. దానికి శ్రీమాన్ ఆచార్యులు గారు. శ్రీ మా గుప్తగారి అనారోగ్యం ఇంకా పెరుగుతుందేమోనని భయపడ్డారు.

## శుభ స్వప్నం

కాని ఆమరుచటినాటి ప్రభాత కాలంలో నాకు ఒక శుభస్వప్నం వచ్చింది. "నేను గుఱ్ఱం ఎక్కి స్వారిచేస్తూ సాగర తీరానికి వెళ్లానట. నా ఉద్దేశం ఆ మహా సాగరాన్ని గుర్రం ఎక్కి దాటి ఆవలి తీరం చేరాలని, కాని ఆ అపారజలనిధి అంతా ఎండి పోయిందట అయ్యో ఇదేమిటా అని నేను విస్తుపోయి వేదనతో బాధపడ్తూ ఉండగా ఆవలి దిక్కున సూర్యోదయమై వెంటనే తప్పున తరంగా లెగసిపడ్తూ ఆ జలది తరంగాలతో పొంగిపోయిందట. వెంటనే గుఱ్ఱం ఉత్సాహంతో సకిలిస్తూ ఎగిరి ఆ తీరందాటినదట. ఈ స్వప్నగాథ విని ఆచార్యులుగారు చాలా సంతోషించి, అమ్మాయీ గుప్తకు ఈ దీర్ఘకాసవ్యాధి తగ్గి ఆరోగ్యం చేకూర్తుంది. కానీ చాలా ఆలస్యం జరుగుతుంది" అని ఆ స్వప్నం యొక్క శుభ ఫలితాన్ని నాకు తెలియ బరచారు.

# ఆంధ్ర సరస్వతి

ఇది ఇట్లా ఉండగా ఆంధ్ర కవయిత్రీ గ్రంథ విజయవతాశవ్యాయలలో నాకు యావదాంధ్రంలో గొప్ప గొప్ప సమ్మానాలు జరిగిన తరుణంలోనే చీరాలలో శ్రీ మా గుప్తగారి పెద నాన్నగారి మనుమడు, నిష్కళంక దేశభక్తుడు సత్యాగ్రహ యోధుడునైన శ్రీకాకుళం పట్టాభిరాములు గుప్త ఒక పెద్ద సమ్మానం ఏర్పాటు చేశాడు. ఆ సమ్మాన కార్యక్రమంలో మంగళ వాద్యాలతో పెద్ద ఊరేగింపు కూడా ఏర్పాటు చేయడం ఒక విశేషం! శ్రీ మారు కూడా నాతోబాటు ఊరేగింపులో పాల్గొన్నారు. చీరాలకే కాదు మామగారు ఆ ఊటుకూరి వేంకటేశ్వర శ్రేష్ఠి గారంటే జిల్లామొత్తం మోతుబరులైన ఆ సాములు కావడం వలన శ్రీమా మామ గారు పన్నుల నిరాకరణోద్యమంలో శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారితో కలిసి చీరాలలో కార్యక్రమం అంతా మిక్కిలిగా సొంత ధనాన్ని వ్యయించి సముద్రపు ఒడ్డున పాకలు వేయించి చీరాల గ్రామమంతా ఖాళీ చేయించి సముద్రతీరానికి తర లింప జేసి ఉద్యమానికి స్ఫూర్తి నిచ్చి ఉద్యమసాధనలో ధీరుడైన, వీరుడైన యోధా గ్రణియైనిలిచి బ్రిటిషువారితో ఎదురొడ్డి, పోరాడి ఆ ఉద్యమానికి సాఫల్యంచే కూర్చిన వారగుట వలన నిరతాన్నదాతగా పేరుపొందిన వారగుట వలన పేద లెందరకో తన ఖర్చుతో పెండ్లిండ్లు చేయించి చీరాల గ్రామపజల అవసరాలకు తానుగా పూనుకొని నాయకత్వం వహించి వారివారి ప్రయోజనాలను తీర్చే మహానుభావుడగుట వలన నా విజయోత్సవ సభ కొరకేర్పాటైన ఊరేగింపులో వేల సంఖ్యలో గ్రామప్రజలు పాల్గొని నినాదాలిస్తూ ఊరేగింపును ఉత్సాహంతో నిర్వహింప చేశారు.

ఆ ఊరేగింపులో శ్రీజమ్ములమడక మాధవరాయశర్మగారు కూడా పాల్గొన డమే కాక సాయంకాలం బహిరంగ సభలో ప్రధానవక్తగా ఆంధ్ర కవయిత్రుల గ్రంథప్రాశస్త్యాన్ని మిక్కిలి వివరంగా విపులంగా విడమర్చి ఉపన్యసించి, ఆ గ్రంథప్రాముఖ్యాన్ని పెంపొందింపజేశారు. అన్నింటికంటె మిన్నయైన అంశ మేమిటంటే శ్రీబెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులుగా వచ్చేసి సభాశోభ నిను మడింపజేశారు.

ఆ మహాసభయందే శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మగారు సభాజనం

యొక్క హర్షధ్వానాలు మిన్ను ముట్టుతూండగా "ఆంధ్ర సరస్వతి" అనే బిరుదాన్ని ప్రదానం చేశారు.

ఈ విజయోత్సయోత్సవాలలో చెప్పుకోదగిన ఇంకొక మహాసభ రాజమహేంద్రవరంలో మా పిన్ని ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలా ప్రధానాచార్యులు శ్రీమతి బత్తులకామాక్షమ్మగారు నిర్వహించిన విజయోత్సవ సన్మాన సభ! ఆమె ఆహ్వానంపై బాపట్ల నుండి బయలుదేరి నేను మెయిలులో గోదావరి స్టేషనులో దిగే టప్పటికి సుమారు వెయ్యిమంది జనం జయజయ నినాదాలతో నాకు స్వస్తి వాచనం పల్కి మంగళహారతులిచ్చి నిలువెత్తు పూలమాలలతో, నన్ను ముంచెత్తి వేశారు. స్టేషనుకు వచ్చిన పెద్దలలో శ్రీమతి కామాక్షమ్మగారు మా తల్లి దండ్రులు మా పెదనాన్నగారి పెద్దకుమారుడు, నాళం పెద రాజారావుగారు, విశించి తెలుగుభాషా సమితి అధికారులలో ఒకరైన శ్రీగిడుగు సీతాశేపతిగారు శ్రీ మా నాయనగారిపై ధ్వజమెత్తిన శ్రీశ్రీ పాద కృష్ణ మూర్తిశాస్త్రిగారు బాలదారి నారాయణ దేవుగారు శ్రీభావరాజు కృష్ణారావు గారు మా కళాశాల అధ్యాపకవర్గము, విద్యార్థినులు ఇంకా ఊరి పెద్దలు, విచ్చేశారు. ఆనాడు గోదావరి స్టేషనులో మెయిలు పది నిముషాలు ఆగిపోయి నా యెడల గౌరవదరాలు చూపించింది. ఇంక సాయంకాలం విక్రమహాలులో క్రిక్కిరిసిన జనసందోహం యొక్క ఆనందోత్సాహాల సందడి మధ్యంలో ఒక మహాసభ జరిగింది.

నన్ను పెంచి పెద్దచేసి తరంగ హస్తాలతో పొదువు కొని లాలించిన గౌతమీ మాత రాజహేంద్రిపౌరుల ఆనందోద్వేగరూపంగా ఉవ్వెత్తుగా ఎగసి పడుతూన్న తరంగహస్తాలెత్తి ఇత్నోధికాయురభివృద్ధిగా తన తరంగఘోషతో మంత్రోచ్చారణ సల్పి నన్ను ఆశీర్వదించింది

నిజంగా ఆనాడు నా జన్మధన్యమైనది. నేను పెరిగిన నాస్వస్థలంలో నా కంతఘన సన్మానం జరగడం నిజంగా నా భాగ్యమే ఆ సన్మానం ఆచికవి నన్న పార్యుని దీవనయే-

నా జీవితంలో గురుడు ప్రవేశించినదాది నీ జీవితగతియే ఒక మలుపు తిరిగిపోయింది, అప్పటి నుండి విజయపరంపరలు నన్ను వెంబడించి ఆశీర్వదించాయి. మచిలీపట్నముందలి ఆత్మూరి లక్ష్మీనరసింహ ఆర్యవైశ్య సంఘమువారు సరస్వతీ చిత్రము ద్రాంకితమైన స్వర్ణ పతకము నిచ్చి సన్మానించారు.

## వరలక్ష్మమ్మగారితో విభేదం

ఈ సమ్మానోత్సవకార్యక్రమానికి ముందు జరిగిన ఒక ముఖ్యకార్యక్రమాన్ని గూర్చి వ్రాయక తప్పదు.

మహిళా హితము నుద్దేశించి నిరంతరము పాటు పడుచున్న ఏ మహిళ నా దర్శనముగా గై కొని నేను కూడా బాపట్లకే తెంచినప్పటి నుండి ఆమెకు నా సహకార సంపత్తిని బాసటగా నిచ్చి సమాజశ్రేయస్సునకై బహుసంతానవతి నయ్యీ అవిచ్ఛిన్నముగా పరిశ్రమిస్తూ ఉన్నానో ఆ వరలక్ష్మమ్మగారు నా స్నేహితురాలైన ఒక మహిళ ఆరు నెలలు తైషిణీమండలికి చందా కట్టలేదనే కారణంగా ఆమె సభ్యత్వాన్ని రద్దు పరచగా నా స్నేహితురాలిపై ఉన్నప్రేమ కొలంది శ్రీమతి వరలక్ష్మమ్మగారితో కొంత అయిష్టత నేర్పరచు కొన్నాను. ఆ విభేదమే పెద్దదై, మా యిద్దరమధ్య రగిలిన అగ్నిగుండమై, ప్రజ్వరిల్లింది. ఎంత గొప్పవారైనా, ఎంత గొప్పమిత్రులైనా, అన్యాయం అక్రమాలు జరుగుతూంటే ఓర్చుకోలేక, అన్యాయం లభించేవరకూ పోరాడే స్వభావం కల నేను శ్రీమతి వరలక్ష్మమ్మగారిపై అవిశ్వాసతీర్మానానికి తీవ్రప్రయత్నాలు చేసి ఒక విధంగా సాధించాననే పరిణామానికి ఆ విషయం చేరుకొన్నప్పుడు బాపట్ల స్థానికురాలై ఉండి, అన్ని విధములా మండలికి సహాయకురాలైన ఒక సంపన్నగేస్తురాలు అవిశ్వాస తీర్మానానికి ఆమోదం తెలిపిన వారి పేర్ల పట్టికను, నా నుండి తీసుకొని, శ్రీమతి వరలక్ష్మగారికి చేరవేసింది. అది తీసుకొని ఆమె ఊళ్లో అందరదగ్గరకు వెళ్ళి విశ్వాస రాహిత్య తీర్మానానికి అనుకూలంగా సంతకాలు చేసినవారు ఆ నిర్ణయాన్ని ఉపసంహరించుకొనేటట్లు చేసుకోగల్గింది. ఊళ్లోని ప్రముఖులు మా వారి దగ్గరకు వచ్చి వరలక్ష్మ గారిపై నేను ఎట్టి వ్యతిరేక చర్యా తీసుకోకుండా నన్ను నివారింప జేయమని ఆయనపై ఒత్తిడితెచ్చారు. శ్రీ మావారు ఆ ఒత్తికికి తీవ్రంగా స్పందించి, ఆ ఒత్తిడి తీవ్రతను నాపై ప్రదర్శింప జేయడం ప్రారంభించారు. "అక్రమాలు జరిగినపుడు దానికి తగిన ప్రతిక్రియ జరుగవలసినదే నేను నా పట్టుదల విడిచేదిలేదని నేను గట్టిపట్టుదలను ప్రదర్శించేటప్పటికి శ్రీ మావారు నేను ఇల్లు విడిచి వెళ్ళిపోతా" వని పెట్టె తీసుకొని బయలుదేరేటప్పటికి నేను వెంటనే నా పట్టుదలను ఉపసంహ

రించక తప్పలేదు. ఈ సంఘటన జరిగిన తర్వాత నేను మండలి విషయాల్లో కల్పించుకోవడమే మానివేశాను నేను మండలిలో ఉండక పోవడం ఆ సంస్థకొక గొప్ప లోటుగా భావించి శ్రీమతి కోనా సుభద్రమ్మగారు (కోనా ప్రభాకరరావుగారి తల్లి) వెంకటలక్ష్మమ్మగారు మొదలైనవారు చాలా చాలా ప్రయత్నించి నన్ను మండలికి తీసుకొని వెళ్ళారు అప్పటినుండి శ్రీ వరలక్ష్మమ్మగారికి నాకు మధ్య పైరభావం తగ్గింది.

## ఇంకొక మహిళాసంస్థ

తర్వాత ఏ స్నేహితురాలి కొరకు శ్రీమతి వరలక్ష్మమ్మగారితో జగడం పెంచుకొన్నానో ఆ స్నేహితురాలూ నేనూ కలిసి ఇంకొక మహిళామండలిని ప్రతిష్ఠించాము. స్త్రీలకు ఎన్నో ఆటల్లో ప్రవేశం కల్పించి సంగీతము నాట్యము మొదలగు ఉత్తమ లలితకళలతో పరిచయం పెంపొందింప చెయ్యాలనీ పత్రికలు తెప్పించి వారి ప్రపంచంలో విజ్ఞానాభివృద్ధికి దోహదం కల్పించవలెననీ స్త్రీలలో సంఘ సేవాశక్తిని రేకెత్తించాలనీ మంచి మంచి పుస్తకాలూ కావ్యాలూ తెప్పించి మహిళలలో ఉత్తమ సాహిత్యాభిరుచికి సహాయపడవలెననీ ఎన్నో ఉత్తమాశయాలతో నాకు ఈ సంస్థపై ఏర్పడిన అధికారాన్ని వినియోగించి ఈ సంస్థకు ఉత్తమ భవిష్యత్తును చేకూర్చాలనీ భావపురి మహిళలను ఉన్నత సంస్కృతీపరులుగా తీర్చి దిద్దాలనీ ఎన్నో కలలు గన్నాను. ఆ ఆశయంతోనే నటావతంస శ్రీ స్థానం నరసింహారావుగారి దగ్గరనుండి వందలమీద ప్రామాణికమైన గ్రంధాలు తీసుకొని వచ్చాను. నాట్యపాఠశాలకు స్థానం కల్పించాను వీణా తరగతులను ప్రారంభించాను. కానీ కాలాంతరంలో నేను ఆ సంఘాను విడిచిపెట్టాను.

## శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు

ప్రసక్తాను ప్రసక్తంగా 'ఆంధ్ర కవయిత్రులు' గ్రంధ విజయప్రసక్తితో నా కలం చాలా ముందుకు దూసుకొని వచ్చింది చిరంజీవి బొడ్డుపల్లి పురుషోత్తముకు నా దగ్గర బి. ఏ. చదివేటప్పుడు అతనికి బి. ఏ. లో ప్యాఠాంశమైన శ్రీ మహాభారతాన్ని నేను పాఠం చెప్పేటప్పుడు స్థానికులైన ఒకరిద్దరు లాయర్లు ఆ పాఠం వినడానికి వచ్చేవారు వారుకాక నేడు సార్వత్రిక విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సెలరైన

శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు (వారి నాన్నగారు అప్పట్లో చేసిన ఉద్యోగం మా బాపట్లకు దగ్గర్లో కావడం వలన) వేసవి కాలం సెలవులలో దగ్గర దగ్గర ఒక నెలరోజులు భారత పాఠానికి వచ్చారు. తర్వాత ఆయన ఒంగోలులో ఆంధ్ర సాహిత్యంపై ఒక సభను ఏర్పాటు చేశారు. ఆ సభకు ఒంగోలు నగరమందలి సాహితీ ప్రియులు శ్రీ నాయని నరసింహారావుగారివంటి ప్రముఖులు వచ్చి సభ్యులుగా పాల్గొన్నారు. ఆ సభలో నేను కేవలం ఆంధ్ర సాహిత్యాన్ని గూర్చి మాత్రమే ప్రసంగించక తెలుగు భాషోత్పత్తి ద్రావిడ భాషలనుండి జరిగిందనే నూతన వాదాన్ని వివరిస్తూ ప్రసంగించాను ఆ వాదానికి ఆ సభలో గొప్ప ప్రశంస లభించింది. భద్రిరాజు కృష్ణమూర్తి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో M. A. తెలుగు సాహిత్యం ప్రధాన విషయంగా ఒక సంవత్సర విద్యాభ్యాసం ముగించిన సమయమది! తర్వాత ఈ నూతన వాదాన్ని నా ప్రసంగం నుండి సవివరంగా తెలుసుకొనినవాడై M. A రెండవ సంవత్సరంలో తెలుగు భాషా చరిత్ర అనే విషయానికి మార్చు కొన్నారు.

ఇది నా ప్రసంగ పద్ధతికి మచ్చుతునకయై గర్వ కారణంగా ప్రకాశించినదన డంలో అత్యుక్తి ఏమీలేదు.

## భీమవరంలో రామాయణ ప్రసంగం

ప్రసంగాల ప్రసక్తికి సంబంధించిన ఈ ఘట్టంలో ఇంకొక ప్రసంగాన్ని ప్రస్తావించి ఇంకొక ముఖ్యఘట్టానికి వర్ణింపవలననే ఉత్కంఠతో ఉరకలు పరుగులు తీస్తూ ఉన్నది. 1951 లో ఆంధ్ర కవయిత్రుల రచనా సమయంలో రాజమహేంద్ర వరానికి వెళ్ళి ఉనప్పుడు భీమవరం కాలేజీనుండి నాకు ప్రసంగానికి ఆహ్వానం వచ్చింది. నేను భీమవరం వెళ్ళాను, నా ప్రసంగానికి ముందు ఎవరో వక్తలు ఇద్దరు ప్రసంగింపగా వారి ప్రసంగాలను వినకుండా విననీయకుండా విద్యార్థులు చాలా అల్లరి చేశారు. కానీ నా భాగ్యమేమో నా ప్రసంగాన్ని సూదిపడ్తే తెలిసేటంత శ్రద్ధగా విన్నారు. విద్యార్థులు కొందరు ప్రశ్నలు వేశారు. నేను జవాబులు చెప్పి వారిని సంతృప్తి పరచాను. విద్యార్థుల అసహనాన్ని నిరసించాను. అయినా సంతో షించారు. ఇదంతా ముగిసిన వెనుక నన్ను దింపిన ఇంటికి తీసుకొని వెళ్ళాగా ఆ రాత్రి అక్కడ విశ్రాంతి తీసికొని ఉదయం లేవకముందే భీమవరం స్థానిక

ప్రముఖులలో ఒకరైన శ్రీ K. నరసింహమూర్తిగారు ఏమమ్మా చెల్లాయి! ఇంకా అలుపు తీరలేదా? నీ విశ్రాంతికి భంగం కల్గిస్తున్నానేమో! అంటూ నన్ను లేపి ఆ క్రిందటినాటి ప్రసంగాన్ని పలువిధాల ప్రశంసిస్తూ ఆనాడు తమ సంఘం ఇంకొక ప్రసంగాన్ని ఏర్పాటు చేసిందనీ అందులో కూడా ప్రసంగించి వెళ్ళమనీ చాలా బ్రతిమలాడారు. ఆంధ్ర కవయిత్రుల గ్రంథ రచన కాటంకం కల్గుతుందని నేను ఎన్నివిధాల నచ్చచెప్పినా ఆయన అకారణానికి విలువ నియ్యకుండా ఎంత చెప్పినా వినలేదు. తుదకు ఆ రోజు కూడా ఉండి. ప్రసంగించి రాజమండ్రి వెళ్ళాను. కాలాంతరంలో శ్రీ నరసింహమూర్తిగారూ వైశ్య సంఘాలవారు త్యాగరాజ గాన సంస్థ వారూ చాలా ఉపన్యాసాలను ఏర్పాటుచేసి నన్నాహ్వానించి సత్కరించారు. ఆ ప్రసంగ పరంపరలో రామాయణంలో సీతపాత్ర ప్రయోజనము అనే అంశంపై రాత్రి 8 గంటలకు మొదలుపెట్టి 11 గంటలవరకు ప్రసంగించాను. ఆ సభలో శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు "లక్ష్మీకాంతమ్మగారు మూడు గంటలూ మమ్మలను రామాయణ కాలానికి తీసుకొనివెళ్ళి సీతాసాధ్వి కష్టాలను ఆమె ప్రదర్శించిన త్యాగాన్ని వివరంగా తెల్పి మనలను త్రేతా యుగానికి తీసుకొని వెళ్ళారు. త్రేతా యుగంలో "త్యాగేనైకేన అమృతమశ్నుతే" అనే నినా దాన్ని తన జీవిత సందేశంగా ఒసంగి భారతీయ సంస్కృతికి ఒరవడులు దిద్దిన ఆ పరమపావన పుణ్యదంపతుల మహనీయగాథా ప్రాధాన్యాన్ని మన హృదయాలలో గట్టిగా వేరూనే టట్లు ప్రబోధించారు. మూడుగంటలూ మూడు నిమిషాలవలె, ఒడలు మఱచి, మనం ఆమె ప్రసంగాన్ని విన్నాం. ఆమె ప్రసంగం ముగించిన విషయమే మనకు తెలియలేదు. శరీరభావాన్ని విడిచి, మనం ఆ పవిత్ర విషయంలో మునిగిపోయాం, ఆమె యింకా చెప్తే బాగుండును." అని ప్రశంసించారు.

ఈ విధమైన ప్రశంసలు ప్రతి సభలోనూ, నాకు పరిపాటైపోయినవి-

## నా ప్రసంగంపై విద్యార్థులు నోట్సు తీసికొనుట

ఒకమారు మచిలీపట్నంలో ఒక ప్రసంగానికి వెళ్తే రెండు రోజులు ఆపి వేసి కళాశాలలో కూడా ప్రసంగానికి ఏర్పాటు చేశారు. ఒక రోజు మా అన్నయ్య నేనూ కలిసి వీణకచేరీ చేశాం. ఒక రోజు "నాచన సోమనాథ, నవీనగుణ సనాథ అనే

విషయంపై ప్రసంగం ఏర్పాటు చేశారు. ఆ సభకు విద్యార్థులు అసంఖ్యాకంగా వచ్చి, నా ప్రసంగంపై 'నోట్సు' తీసుకొన్నారు.

సరే మళ్లీ ఆంధ్రకవయిత్రుల గ్రంథ విజయానంతరం జరిగిన ఘట్టాన్ని పరిశీలిద్దాం.

## హైదరాబాదులో సాంస్కృతికోత్సవాలు

### మరల ఒక దివ్యస్వప్నము

హైదరాబాదులో శ్రీ బూర్గుల వారు ముఖ్యమంత్రిగా ఉన్న తరుణంలో ఆంధ్రసాంస్కృతికోత్సవాలు జరిపారు. ఆ ఉత్సవాలలో నేనొక ఉపన్యాసకురాలిని మాత్రమే కాదు. మహిళా సభకు ముఖ్య అతిథినిగా కూడా పాల్గొన్నాను. ఆ మహిళాసభకు శ్రీ బూర్గుల వారి ధర్మపత్ని అధ్యక్షురాలు. సభ జరిగే తరుణంలో, "ముల్కీ" ఉద్యమ విప్లవకారులు దూసుకొని వచ్చి బూర్గుల వారి కారును కాల్చేశారు. సభ జరిపితే చాలా ప్రమాదాలు వాటిల్లగలవనే నినాదాలిచ్చారు. సభ చెదిరిపోయింది. అందరూ, అక్కడప్రక్కనే ఉన్న హాలులోకి వెళ్ళిపోయి ఆ హాలు లోపల తలుపులు బిగించేశారు. నేను ఒకదాన్నే బయట వరండాలో మిగిలిపోయాను ముల్కీ ఉద్యమ విప్లవకారులు నా ప్రాణం తీస్తారేమోనని, చాలా భయపడిపోయాను. కానీ యింతలో ఆ హాలు తలుపులు తీసికొని వీరమణిగారనే వైశ్య సంఘ సభ్యురాలు నన్ను తనతో తీసికొని వెళ్ళి. తన యింటిలో, నాకు రక్షణ ఇచ్చింది. తెల్లవారగానే ఆమె "అమ్మా, లక్ష్మీ కాన్తమ్మగారూ, నా యిల్లు చాలా చిన్నది. ముల్కీ విప్లవ కారులు, ఏ నిముషం లోనైనా, మీరిక్కడ ఉన్నారని తెలుసుకొంటే, మీకు చాలా ప్రమాదం! మీరు చాలా ప్రతిభకలవారనీ, మీ ప్రసంగం వలన, వారి విప్లవోద్యమానికి దెబ్బ తగుల్తుందని, హైదరాబాదు నగరంలోని వారంతా చాలా హెచ్చుగా చెప్పుకొంటూ ఉన్నారు. మీరెట్లాగైనా, ఏదో ఆలోచించి, ఈ యింట్లో నుండి తప్పుకోవాలి." అని హెచ్చరించింది. వెంటనే నేను దగ్గర్లో ఉన్న ఫోన్‌లో ఆనాటి మంత్రివర్గంలో ఒకరైన శ్రీ వల్లూరి బసవరాజు (వారు బాపట్ల వాస్తవ్యులు) గారికి నా అప్పటి విపత్కర పరిస్థితిని వివరించి, వెంటనే రక్షణ కల్పించవలసిన'దని అభ్యర్థించాను. వెంటనే వారు "మీకేం భయం లేదమ్మా

నేను కారు పంపి, ఒక పోలీసును, రోడ్డుపై వెళ్ళడానికి అనుమతి పత్రాన్ని ఇచ్చి' మీరు మీ వసతికి చేరే యేర్పాట్లు చేస్తా"నని చెప్పి, కారును పంపారు. నేను సురక్షితంగా మేము బసచేసిన శ్రీమావారి సహపాఠి అయిన శ్రీ బొలుసాని దేవేంద్ర గారింటికి చేరి, తర్వాత శ్రీ మంత్రిగారి సహాయంతో నాతో వచ్చిన మా అమ్మగారిని శ్రీమతి కామాక్షమ్మగారిని, నాచెల్లెలు (పెద్దనాన్నకుమార్తె) లక్ష్మీకాన్తమ్మను తీసుకొని, అజంతా ఎల్లోరా గుహలకు వెళ్ళి, అక్కడ అంతా చూచి, తిరిగి వస్తూంటే, దారిలో వికారాబాద్ స్టేషనులో నాకు గర్భ విచ్ఛిత్తి అయ్యే సూచనలు కన్పించాయి. వెంటనే, నేను ఆచార్యులుగారు నాకు పదేశించిన మహాలక్ష్మీ మంత్రజపం చెయ్యడం మొదలు పెట్టాను. అర్ధరాత్రి నా మంత్రాధిష్ఠానదేవత నిద్రలో ప్రత్యక్షమై, నాకు అభయ మిచ్చింది. వెంటనే, ఆ మూడవ మాసం, గర్భం ఎట్టి కష్టం లేకుండా, పోయింది. తెల్లవారి, సికింద్రాబాదు చేరేటప్పటికి, నేను ఏమీ హానాహాండిలేని పరిస్థితిలో, మామూలు మనిషిగా తిరిగాను. ఇదంతా నా ఉపాస్య దేవత యొక్క ఆశీస్సు ప్రభావమే ఇట్లా, నా తల్లి ఎన్నిమార్లో, నన్ను కాపాడింది. నాకా విశ్వాస మున్నది.

ఈ ఘట్టం ముగిసింది. ఇంక స్వర్ణకంకణ ప్రదానం విషయం వివరిస్తాను.

## కేసరిగారిచే స్వర్ణకంకణ ప్రదానము

గృహలక్ష్మిపత్రికాధి పతులైన, శ్రీ కేసరిగారు, ప్రతి సంవత్సరము ఒక ప్రసిద్ధమహిళకు ముఖ్యంగా కవయిత్రులకు, రచయిత్రులకు ఒక స్వర్ణకంకణాన్ని బహూకరిస్తూ ఉండడం ఆంధ్రప్రజానీకానికి బాగుగా తెలిసిన విషయమే. ఆంధ్ర కవయిత్రులు తెలుగుభాషా సమితి పోటీలో విజయం పొందిన తరువాత 1953లోనో, లేక 1954లోనో నాకు ఆ స్వర్ణ కంకణాన్ని బహూకరించినారు. ఆ బహూకరణ సభకు శ్రీమావారు కూడా వచ్చారు. ఆంధ్ర కవయిత్రుల రచనపై తన కుమార్తె కల్లూరు విశాలాక్షమ్మగారికి ప్రాధాన్యం ఇయ్యలేదని, శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి గారు, ఒక వ్యాసం వ్రాసి ముద్రణ చేయించి దేశం అంతటా పంచి పెట్టారు. శ్రీమతి వరలక్ష్మమ్మగారు కూడా ఏవేవో కారణాలతో పత్రికలలో వ్యాసాలు వ్రాశారు ఆమె శ్రీ కేసరిగారికే, స్వర్ణకంకణ బహూకృతికి నాకు అర్హతలేదని కూడా వ్రాశారు



1953లో మదరాసులో శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారికి Mr. K. N. కేసరి గారిచే

స్వర్ణకంకణ బహూకరణ

కానీ, విజయనగర కౌముదీపరిషత్తు వారు శ్రీ క్రొవ్విడి రామంగారు మాత్రం, ఈ వ్యాసాలన్నింటినీ ఖండిస్తూ ఆంధ్రసాహిత్యంలో ఈ తరగతికి చెందిన సాహిత్య చరిత్రతో ప్రప్రథమ వివరణ గ్రంథమై, మహనీయ మహిళా వాఙ్మయ చరిత్రయైన ఈ 'ఆంధ్రకవయిత్రులు' 'గ్రంథ రచన పరిశంసాత్మకమైన రచన అని సకారణంగా నిరూపిస్తూ వ్యాసం వ్రాసి పత్రికల్లో ప్రచురించారు. కొందరు అకారణంగా, కేవలం కక్షచేత సాహిత్య చరిత్రయందగ్ర స్థానం వహించినాటికి నేటికి ప్రప్రథమ గ్రంథమైన, రమణీ, రమణీయ సాహిత్య చరిత్రను దుర్విమర్శా పూర్వకంగా, ఖండిస్తే, శ్రీరామం గారు ఆ గ్రంథాన్ని సద్విమర్శతో అభిషితం చేశారు! ఇరువురకూ నా ధన్యవాదాలు ముఖ్యంగా శ్రీరాంగారికి నా కృతజ్ఞతావందనాలు!

దూషణ భూషణలనే ఒరపిడి రాయి మీద పరీక్షకాగి, నిగ్గు తేలిందే శాశ్వ తత్వాన్ని పొందుతుంది. అట్లా నా గ్రంథం కాలాని కెదురీది శాశ్వత ప్రతిష్ట పొందినది.

ఆనాటికీ, ఈనాటికీ మహిళా రచనలను వెలుగులోనికి తీసుకొని వచ్చినది. నా రచనయైన ఆంధ్రకవయిత్రులే ఇది తిరుగులేని సత్యమేకదా! చాలు! నా గ్రంథా నికి, నాకూ ఈ కితాబు చాలు!

ఇక విషయాంతరానికి వద్దాం! ఆంధ్రకవయిత్రులు గ్రంథ విజయం లభిం చిన తర్వాత, దేశమంతటా నాకు కొన్ని పదవులు లభించాయి. అందులో ముఖ్య మైనది, ఆంధ్ర యూనివర్శిటీ సెనేటు సభ్యత్వం! ఆ సభ్యత్వం నాకు వరుసగా రెండు మార్లు లభించిందని జ్ఞాపకం! ఆ పదవీకాలంలో నేను విశ్వ విద్యాలయా నికి చేసిందేమీ లేదు! కానీ ఆ సభ్యత్వమే గౌరవకారణం గదా! నాకు ఆ గౌరవ ప్రాప్తి కల్గింది! ఆ సమయానికి పూజ్య సోదరులు శ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు యూనివర్సిటీలో ఛాన్సలర్ పదవిలోవున్నారు.

మా ప్రిన్సిపాలు గారైన శ్రీమతి కామాక్షమ్మగారు కూడా సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి హయాములో యూనివర్సిటీ సెనేటు మెంబరుగా కొన్నినాళ్ళు సిండికేటు మెంబరుగా కూడా ఉన్నారు. ఆ వారసత్వం, నాకు లభించిందని, సంతోషంగా, సవినయంగా అంజలి బంధించి మరీ వ్రాస్తూ ఉన్నాను.

## జ్యోతికి B.A పాఠం చెప్పడం

ఇక ఆ లేఖ్యం కాదగిన ఇంకొక విషయం ఏమిటంటే, 1955, 56 సంవత్సరాల మధ్య నేను 8 నెలల గర్భిణినై ఉండగా బాపట్ల D.E.O. గారి P.A గారి భార్య తన కుమార్తె జ్యోతిర్మయి అనే ఆమెను తీసికొని నా దగ్గరకు వచ్చింది. జ్యోతి భర్త నీలగిరిలో వృక్షశాస్త్ర కార్యాలయంలో ఉద్యోగి! ఆయనకు ఆరు నెలలు నీలగిరిలో ఆరు నెలలు ఢిల్లీలో ఉద్యోగము! భర్త ఢిల్లీలో ఉన్న రోజులలో జ్యోతి నోట్సు ఆధారంగా B.A (తెలుగు ప్రధానంగా) చదివి పరీక్ష ఇంక రెండు నెలలున్నదనగా బాపట్లకు తల్లి గారి ఇంటికి వచ్చింది. జ్యోతి నోట్సు ఆధారంగా స్వయంగా అధ్యయనం చేయుట వలన పరీక్షలకు ఎవరిదగ్గరనైనా గట్టిగా చదువుకోవలెననే ఉద్దేశంతో బాపట్ల వచ్చింది!

నా పేరువిని, P. A. గారి భార్య తన కుమార్తెను, నా దగ్గరకు తీసికొని వచ్చింది. నేనపుడు 8 వ మాసం గర్భవతిని నాకు ఆ సమయంలో ఎన్నడూ ఎరుగని వేవిళ్లు! వేవిళ్లతో వికారం చాలా హెచ్చుగా ఉండి తల ఎత్తలేక చాలా బాధపడ్తూ ఉన్నాను. ఇంటి పనులే అంతంత మాత్రంగా చేసి నిరంతర విశ్రాన్తి తీసుకొంటూ ఉండేదాన్ని! ఆ కారణంగా నేను జ్యోతికి పాఠం చెప్పలేనని చెప్పవలసి వచ్చింది. కానీ ఆమె "అమ్మా మీ దగ్గర తప్ప ఇంకెవరిదగ్గరా చదువునకు చేర్చడం నా కిష్టం లేదు. అందరూ మీ పేరేచెప్తూ ఉన్నారు. మీకు ఏదైనా అలసటగా ఉంటే మా అమ్మాయి మీకు సపర్యలు చేస్తుంది. ఎలాగో మీరు ఓపిక తెచ్చుకోవాలి! అని అనేక విధాలుగా అభ్యర్థించింది. 'సరే' అనక తప్పలేదు.

తీరా పాఠం మొదలు పెట్టేటప్పటికి జ్యోతికి సమాసవిధి తెలియదు అలంకార శాస్త్రం తెలియదు ఛందోవిధి తెలియదు సంధిప్రకరణజ్ఞానం లేదు. తెలుగు సంధులు కొంచెం తెలుసునేమోకాని గుణసంధి వృద్ధి సవర్ణదీర్ఘ సంధి మొదలైన సంధుల పరిజ్ఞానం లేదు. అయితే జ్యోతి చాలా తెలివితేటలు సూక్ష్మగ్రహణ శక్తి కల్గిన విద్యార్థిని, ఆకారణంగా నాకు కొంచెం శ్రమమైనా చెప్పింది చెప్పినట్లు గ్రహించి అతి శీఘ్ర గతితో అన్ని విషయాలలోనూ అల్లుకు పోయింది? ఒకమారు మూడు పంక్తుల సమాసం విడదీసి చెప్పవలసి వచ్చింది ఆ పెద్ద సమాసానికి విగ్రహ వాక్యాలు చెప్పి ఎక్కడి కక్కడ అంతర్గత సమాసాలు చెప్పి మొత్తం మీద

బహు వ్రీహి సమాసమని వివరించి చెప్పాను. కానీ అంత పెద్ద సమాసానికి విగ్రహ వాక్యాలు అవీ జ్యోతి చెయ్యలేక పోయింది పాపం! కానీ మా మూడవ అబ్బాయి విజ్ఞాన్ 6, 7 ఏండ్లవాడు సుదీర్ఘ సమాసానికి విగ్రహ వాక్యాలు చెప్పి అంతర్గత సమాసాలు చెప్పేవాడు! తర్వాత పరీక్షకు గుంటూరు వెళ్ళబోతూ జ్యోతి గురువు గారూ పరీక్ష హాలు చూడగానే తల తిరిగిపోతుంది. ఆ కారణంగా నేను సరిగా పరీక్ష వ్రాయలేకపోతూ ఉన్నాను." అని బాధపడింది అది విని నేను అయ్యో జ్యోతీ భయం అనేపదాన్ని నిఘంటువులోనుండి తొలగించిన నాశిష్యురాలవై యుండి నీవు ఆ మాట నోటిమీదకు తెచ్చుకోగూడదు. అని వీపుపై ఒక్క చరుపు చరచి హాలులోకి వెళ్ళి నా శిష్యురాలివి అనే విషయం గుర్తుతెచ్చుకో, భయం, గియం పారిపోయి. నీ కంతా నయంగా న్యాయంగా జరుగుతుంది. అని చెప్పాను. జ్యోతి నిజంగా ఆ విధంగానే చేసిందట బి. ఏ. పరీక్షలో మంచి మార్కులతో కృతార్థురాలైనది! ఇంక వారి సంతోషం చెప్పడానికి లేదు. పరీక్షా విజయం తెలిసిన రోజున వచ్చి నా కాళ్ళు పట్టుకొని నమస్కరించి తమ ఆనందాన్ని తెలియ బరచారు.

## అయ్యగారి సోమేశ్వరరావుగారు

విజయనగరం వాస్తవ్యులు శ్రీ అయ్యగారి సోమేశ్వరరావుగారు, విజయ నగరం బాణీ, వీణా వాదనలో సిద్ధహస్తులైన ప్రముఖ వైణికుడు! ఆయన ఏదో ఊరిలో వీణాకచేరీ చేస్తూండగా శ్రీ మా వారు విని వారిని బాపట్ల కాహ్వానించారు! శ్రీ మా గుప్తగారు ప్రాచీనాచార సంస్కృతికి వారసులైన సుప్రతి ష్ఠితమైన ఉత్తమ కళా సంస్కార శీలంకలవారు! మా పెద్దమ్మాయి సుహాసినికి సంగీతం చెప్పించాలని స్థానిక సంగీతజ్ఞులను అభ్యర్థించగా ఎవ్వరూ మా యింటికి వచ్చి సంగీత విద్య చెప్పడానికి భయపడి రాలేదు. కానీ సుప్రసిద్ధ ఫిడేలు వాద్య పండితులు శ్రీ నోరి నాగభూషణంగారు సంతోషంతో అంగీకరించి గాత్ర సంగీతాభ్యాసం చేయించారు. కానీ వీణ చెప్పించాలని శ్రీ మా గుప్తగారి అభిలాష! శ్రీ అయ్యగారి సోమేశ్వర రావుగారు మా ప్రార్థన సంగీకరించి బాపట్ల వచ్చి మా యింట్లో నాకు మా పెద్ద మ్మాయి సుహాసినికి వీణా వాదనంలో గురుత్వం స్వీకరించారు. ఆ శుభముహూర్తం మా జీవితంలో సువర్ణాధ్యాయం! ఉదయం 8 గంటలకు మా యింటికి వచ్చి 11 గంటల వరకు మా యింట్లోనే ఉండి నాకూ మా అమ్మాయికి వీణా వాదనలో

కుశలతను తెలియ జెప్పడమేకాదు. ప్రావీణ్యాన్ని, నైపుణ్యాన్ని కూడా అలవడే అధ్యయన పద్ధతుల్లో పాఠం చెప్పారు. ఒక రోజైతే శ్రీ సోమేశ్వరరావుగారూ నేనూ కలిసి యమునా కళ్యాణిరాగాన్ని ఒక గంటా, గంటన్నరా ఆలపించాము. ఆవేళ శ్రీ సోమేశ్వరరావుగారు "ఈ మారు నా పాటకచేరీలో మీరు కూడా పాల్గొని నాకు సహకార వీణా వాదనం చెయ్యాలి" అన్నారు. అంతగా వీణా వాదనంలో నైపుణ్యాన్ని కైవసం కావించుకొన్న నేను ఇప్పుడసలు వీణనే పల్కించలేను. శ్రీ సోమేశ్వరరావుగారి యొద్ద వీణా శిక్షణం పొందడం ఎంత సౌభాగ్యమో ఇప్పుడసలు వీణను స్పృశించలేక పోవడం అంత అభాగ్యం. తరువాత శ్రీ సోమేశ్వరరావుగారు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం విజయవాడలో నెలకొల్పిన సంగీత కళాశాలకు వైస్ ప్రిన్సిపాలుగా వెళ్ళి అక్కడే స్థిరపడి పోయారు.

బాపట్లలో వారు ఉన్న సమయంలో శ్రీ సోమేశ్వరరావుగారికి సన్మాన చెయ్యాలనే ఉద్దేశంతో మేము స్థానిక న్యాయవాది శ్రీ పిల్లుట్ల హనుమంతరావుగారు శ్రీ నాగభూషణగారు, శ్రీ కోనా ప్రభాకరరావుగారు ఇంకా చాలా మంది స్థానికులు కలిసి విరాళాలు పేకరించి సోమేశ్వరరావుగారికి స్వర్ణ కంకణాన్ని సమర్పించడమే కాక వారికి గృహవసతి కూడా కల్పించి ఉన్నాము దీనికంతా ఆ సమయంలో ఉన్న (రాజమండ్రి. దేవత శ్రీరామమూర్తిగారి రెండవ కుమారుడు శ్రీ దేవత సుబ్బారావుగారు ఇక్కడ సబ్ జడ్జిగా ఉన్న) శ్రీ దేవత సుబ్బారావుగారు ఆధ్వర్యం వహించి ఆ సన్మాన సభను వైభవంగా నిర్వహించారు. శ్రీదేవత సుబ్బారావుగారు బాపట్లలో ఉద్యోగ ధర్మంలో ఉంటూనే అనేక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించారు. ఎన్నో ప్రజాహిత కార్యకలాపాలను తన యాజమాన్యంలో జరిపించారు. ఆనయ గొప్పకవి కళా హృదయుడు! అనేక కావ్యాలు రచించాడు! ఆ సన్మాన సభలో శ్రీ సోమేశ్వరరావుగారి శిష్యులంతా ఆవేళ వీణ ఆర్కెస్ట్రా-గోష్ఠి సల్పారు. అందులో నా కుమార్తె సుహాసిని ఒకతె ఆవేళ మాపెద్దల్లుడు శ్రీ పోలేపల్లి హరనాధ్ (అప్పటికి ఆయన బాపట్లలో అగ్రికల్చరల్ కాలేజీ విద్యార్థి) మా అమ్మాయిని చూచాడు తర్వాత మా అమ్మాయికి శ్రీపోలేపల్లి హరనాధ్‌గారికి 1957 నవంబరులో పెండ్లి జరిగింది.

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ సభ్యత్వం

మా అమ్మాయి పెండ్లికి ముందు 7-8-1957 నాడు, శ్రీ రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ మహాశయులచేత హైదరాబాదులో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రారంభింపబడినది. శ్రీ K.S.P B. పట్టాభి రామారావుగారు ఆ సమయంలో విద్యామంత్రిగా ఉన్నారు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ మాన్య సోదరులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని ప్రప్రథమంగా అధ్యక్షపదవి వరించింది. మాన్య సోదరులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారిని కార్యదర్శి పదవి వరించింది. ఆంధ్ర సాహిత్యాభిమానులు సాహిత్య పోషకులు, సుహృదయులు ఆంధ్ర సాహిత్యాభివృద్ధి శతదళ పద్మ సౌందర్యంతో విలసిల్లవలెననే నిష్కళంకమైన అభిలాషతో ఈ పదవి నంగీకరించిన ఈ సోదరులిద్దరూ సాహిత్య ఎకాడమీ రజతోత్సవమును తమ యాజమాన్యంలో తమ సారథ్యంలో నడిపించిన మహోదయులు నిజంగా వారి నేతృత్వంలో ఎన్నో వందల గ్రంథాలు ప్రచురణ భాగ్యాన్ని పొందాయి! ఉయ్యూరు కుమారరాజా, శ్రీ అప్పారావుగారు విద్యా మంత్రిగా ఉన్నప్పుడు ప్రాచీనాంధ్ర ప్రబంధాలను భారత భాగవతాలను శ్రీ మంత్రిగారి ప్రోత్సాహంతో చౌక ధరలతో పునరుద్ధరింపజేసింది. ఇంకా ఎన్నో సాహిత్యాత్మక కార్యక్రమాలను ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ విజయవంతంగా నిర్వహించింది.

అట్టి మహాసంస్థలో నాబోటి అల్ప వ్యక్తికి సంస్థస్థాపించినప్పటినుండి సభ్యత్వం లభించిందంటే నా మహా భాగ్యాన్ని గూర్చి ఏమి వర్ణించను? 'ఆంధ్ర కవయిత్రులు' గ్రంథం ఏ తెలుగు భాషాసమితి పోటీ పిలుపుపై రచింపబడినదో, ఆ తెలుగు భాషా సమితిలో సభ్యత్వం కూడా లభించింది. ఆంధ్ర విశ్వ విద్యాలయ సభ్యత్వం కానీ సాహిత్య ఎకాడమీ సభ్యత్వం కానీ తెలుగు భాషా సమితి సభ్యత్వం కానీ శ్రీ డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి సోదరుల ఆదరాభిమానాల వలన లభించినవే.

## విజ్ఞాన సర్వస్వాలలో నా రచనలు

తెలుగు భాషా సమితి వారి ప్రధాన ప్రణాళిక విజ్ఞాన సర్వస్వాలను రూపొందించడం! ఇట్లా సాహిత్య విషయాలలో పోటీలుపెట్టి ఉత్తమ సారస్వత గ్రంథాలను

వెలయించడము మొదలైనవి శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు విజ్ఞాన సర్వస్వ గ్రంథాల్లో మూడవదైన విశ్వసాహితి సంపుటాన్ని తయారు చేస్తూ ఉన్నారని విని నేను వారింటికి వెళ్ళి "విశ్వసాహితి సంపుటంలో మహిళల సాహిత్య కృషికి స్థానం ఇచ్చారా?" అని అడిగాను. వారు "లేదమ్మా ఆ విషయ ప్రశంసే తలయెత్తలేదు" అని ప్రత్యుత్తరం ఇచ్చారు. నేను చాలా బాధపడి" ఏమండి వెంకటావధానిగారూ జనాభాలో సగభాగం ఆక్రమించి దేశ రక్షణ దేశ సేవా కార్యకలాపాల్లో పాల్గొని, విజ్ఞాన విషయాల్లో విద్యా విషయాల్లో దేశపరిపాలనా రంగంలో సమర్థురాండ్ర నిపించుకొనిన రాణీ రుద్రమ, ఝాన్సీ లక్ష్మీబాయి, సరోజినీదేవి, తోరూదత్తు రాజశ్రీ విక్టోరియారాణి, మొల్ల, అవ్వైయారు, మీరాబాయి, విజయలక్ష్మి పండిట్, కస్తూరిబా, ఇందిరాగాంధీ మొదలైన అసంఖ్యాక మహిళాజనం భారతమాత అనుంగు పుత్రికలై దేశంలో సంఘంలో తమవంతు పాత్రను తాము నిర్వర్తించడం మరిచారా? విజ్ఞాన సర్వస్వంలో వారిని గూర్చి ప్రస్తావించకపోతే ఆ గ్రంథ రచన సమగ్ర రచన ఎట్లా కాగలదు? అని అడిగాను వెంటనే వారు అవునమ్మా మీరు చెప్పినది నిజమే ఈ విషయాన్ని గూర్చి తెలుగు భాషా సమితి అధ్యక్షులైన శ్రీ గోపాలరెడ్డిగారితో ప్రస్తావించండి అని మళ్ళీ 'అమ్మా లక్ష్మీకాన్తమ్మగారూ, అష్టాదశ పురాణాలపై సంగ్రహ వివరణలు వ్రాసియిమ్మని కొందరను అభ్యర్థించాను. వ్యవధి దాటిపోయినా వారు పంపలేదు. మీరు 5, 6 పురాణాలకు సంగ్రహ వివరణ వ్రాసి పంపుతారా?' అని అడిగారు. నేను సంతోషంతో అంగీకరించాను.

తర్వాత మళ్ళీ ఇంకొక కొన్ని పురాణాలను గూర్చి కూడా వ్రాయుమని కోరారు. అగ్ని పురాణము, బ్రహ్మవైవర్తపురాణము, వరాహ పురాణము, వామనపురాణము, గరుడ పురాణము, కూర్మ పురాణము, బ్రహ్మపురాణము, మార్కండేయ పురాణము, భవిష్యత్పురాణము, లింగపురాణము, పద్మ పురాణము మొదలగు పదమూడు పురాణములను గూర్చి 1961 వ సంవత్సరమునందు ప్రచురింపబడిన ఆరవ సంపుటం 'విశ్వసాహితి'లో నేను రచించిన పురాణ సంగ్రహ వివరములు 'అష్టాదశ పురాణములు' అనే మకుటంలో ప్రచురింపబడినవి. అంతేకాదు 1959 వ సంవత్స రమునందు ప్రచురింపబడిన తెలుగు సంస్కృతి అనే మకుటం గల ఆరవ సంపు టంలో కవయిత్రులను గూర్చిన నా రచనలు ప్రచురింపబడినవి. మరల సంస్కరింప

బడి 1988 లో ప్రచురింపబడిన (తెలుగు విశ్వ విద్యాలయం వారిచే) రెండవ సంపుటమున నాళం కృష్ణరావుగారిని గూర్చి కవయిత్రులను గూర్చిన నా రచనలు ప్రచురింపబడినవి. ఈ సంపుటాలలోనేకాక శ్రీ ఇందవల్లి లక్ష్మీరంజనంగారిచే సంపాదకత్వంలో వెలువడిన సంగ్రహాంధ్ర విజ్ఞాన సర్వస్వంలో కూడా దొడ్డా సీతమ్మ, చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్లను గూర్చి తెలుగుజాతి వారి కొన్ని జాతీయ క్రీడలను గూర్చి నా రచనములు ప్రచురింపబడ్డాయి.

1957 వ సంవత్సరంలో ప్రతిష్ఠాపింపబడిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీలో స్థాపింపబడిటినప్పనుంచి సభ్యురాలుగా ఉన్నారు. అంతేకాక నేను చాలా శాఖలలో సభ్యురాలుగా పనిచేశాను. శ్రీమతి పొణకా కనకమ్మగారు కూడా మహిళా సభ్యురాలగా నియమింపబడ్డారు. కాని ఏ కారణం వలననో ఆమె ఏ సమావేశానికి హాజరు కాలేకపోయారు.

తర్వాత కాలాంతరంలో నాయని కృష్ణకుమారి, వాసిరెడ్డి సీతాదేవి, లత, యశోదారెడ్డి మున్నగువారు మహిళా సభ్యురాండ్రగా నియమితురాండ్రైనారు.

సాహిత్య ఎకాడమీ ప్రాతినిధ్యంతో నేను బాలల ఎకాడమీ సభ్యురాలుగాను సంగీత నాటక ఎకాడమీ సభ్యురాలుగానూ ఎంచుకోబడినాను.

## ఎకాడమీలో మొదటి కార్యవర్గ సభ్యురాలు

1961 ఆ ప్రాంతంలో నేను ఎకాడమీలో కార్యవర్గ సభ్యురాలనిగా ఉండగా, కేంద్రప్రభుత్వము వారి నుండి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య సంస్థకు ఒక పెద్ద పత్రికతో ఒక సూచిక వచ్చింది. ఆ పట్టికలో సూచన ఏమంటే, "ఈ పట్టికలోని, ఏ అంశాన్నైనా చేపట్టి, ఆం. ప్ర. సాహిత్య ఎకాడమీ పని చేయుగలదా?" అని ఆ పట్టికలో మూడవ అంశం 'అఖిల భారత రచయిత్రులు' అనేది! వెంటనే నేను లేచి అఖిల భారత రచయిత్రులు ప్రాజెక్టు నేను చేస్తాను. అని ఎంతోసంతోషంతో అన్నాను. వెంటనే శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు 'ఆ! అఖిల భారత స్థాయి ప్రాజెక్టిది! మన మెందుకు చెయ్యాలి?" అన్నారు తక్కిన సభ్యులెవరూ మాట్లాడలేదు. కానీ, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగార్లు మాత్రం ముక్త కంఠంతో" చెయ్యనియ్యండి.

ఒక గౌరవసభ్యురాలు, మన ఎకాడమీ పక్షాన్న ఒక మంచి పని, అఖిల భారత స్థాయికి చెందిన ఒక గొప్ప ప్రాజెక్టు చేపట్టి నిర్వహిస్తే అది ఎకాడమీకి ప్రతిష్టా కరమే కదా" అని నా ఉద్యమానికి అనుకూలంగా మాట్లాడడమే కాకుండా, లక్ష్మీకాన్తమ్మగారూ ఇది అఖిలభారత స్థాయిపని, మీరు ఉత్సాహంతో చేస్తానన్నారు. బాగానే ఉన్నది. దాని సాధ్యాసాధ్యాలు బాగా ఆలోచించుకోండి. మీకు ఈ అంశంలో సహకరించడానికి ఒక ఉప సంఘం నియమిస్తాము. రేపు మీరూ ఆ సంఘమూ కలిసి చర్చించి మీ నిశ్చయం తెల్పండి. అని కూడా అన్నారు. కార్యవర్గంలో కొంత పాత్రికూల్యం ఉన్నందు వలననే ఈ ఉపసంఘం ఏర్పాటు అవి నాకు తెలుసు! అయినా కార్య సాధనముఖ్యం అనే ఉద్దేశంతో నేను అంగీకరించాను. ఉపసంఘం వారు ఎంతసేపూ "అమ్మా ఈ వయస్సులో మీ కెందుకీ శ్రమ! నిన్న నార్ల వారన్నట్టు మీరు అఖిల భారత పర్యటనం చెయ్యాలి, వారే అన్నట్లు అవసరమైతే నాగాల్యాండు కూడా వెళ్ళాలి. వెళ్తారా? అని అడిగారు. "ఏమిటి మీరు చెప్పబోయేది? నార్ల వారి ఈ ప్రశ్నకు నేను నిన్ననే అవసరమైతే నాగాల్యాండు కూడా వెళ్తానని చెప్పియున్నాను కదా! మళ్ళీ మీరు అదే ప్రశ్న వేస్తా రెందుకు? అన్నాను సరే మీరంత దీక్షతో పని చేస్తానంటే సంతోషమే కానీ మీరు ఇంట్లో ఉండే యావద్భారత దేశంలోని ఎకాడమీలకు రేడియో స్టేషనులకు వ్రాసి Matter తెప్పించుకొని పని పూర్తి చెయ్యవచ్చునుకదా!" అని నాకు సలహా చెప్పారు. కానీ నేను అయ్యా మీ కిష్టముంటే. నాకీ బృహదుద్యమంలో తోడ్పాటునియ్యండి లేదా మానెయ్యండి, అంతే కానీ నన్ను నిరుత్సాహ పరచకండి ఎకాడమీ పక్షాన్న కాకపోయినా, ఇంత వరకూ వచ్చిన తర్వాత నేను ఆగేదిలేదు. నేను సొంతంగా నా ఖర్చులతో నెలకొక రెండు రాష్ట్రాలు తిరిగైనా ఈ ఉద్యమాన్ని నిర్వహిస్తాను అన్నాను. ఆ మాటకు ఉపసంఘ సభ్యులేమనుకున్నారో, లక్ష్మీకాన్తమ్మగారంటే దీక్షకూ, సాహసానికి మారుపేరు! ఆమె అకుంఠిత దీక్షతో, ఎకాడమీ పక్షాన్న ఇంత గొప్ప ఉద్యమాన్ని నిర్వహిస్తా నంటూంటే మనం ఎందుకు అడ్డుపడాలి! అని. నా ఉద్యమానికి ఆమోదం తెలియ జేశారు. అప్పటికే ఎకాడమీ ముందు ఖర్చుల నిమిత్తం 500/—రూలు Advance గా Sanction చేసి ఏయే రాష్ట్రాలకు వెళ్ళాలో ఏ రాష్ట్రంలో ఎన్నిరోజులుండాలో

వాటికి ఖర్చు ఎంత కాగలదో వివరిస్తూ ఒక పథకాన్ని పట్టికనూ తయారు చేసి వచ్చే సమావేశంలో చూపించమన్నారు.

## విశ్వసాహితిలో మహిళా సాహిత్యానికి ప్రవేశం లేదా ?

అసలు జరిగిందేమిటంటే ఆంధ్రకవయిత్రులు గ్రంధాన్ని ప్రచురించినప్పటి నుండీ, ఆంధ్రదేశ స్థాయిలోనే అజ్ఞాతంగా 200 మంది కవయిత్రులుంటే అఖిల భారత స్థాయిలో ఇంకెన్ని వందల మంద ఉన్నారో విశ్వసాహిత్యంలో భారత రమణుల సాహిత్య పరిశ్రమకు స్థానం కల్పించాలని నేను మనస్సులో మథనపడ్తూనే ఉన్నా సామాన్యగృహిణినైన నేను భారతదేశం అంతా పర్యటించలేక అవకాశం కోసం ఎదురు చూస్తూ మిన్నకుండి పోయాను.

దివాకర్ల వేంకటావధాని గారిని భారతీయ మహిళా సాహిత్యానికి, విశ్వసాహితి సంపుటిలో స్థానమియ్యలేదా? నేను అడిగినప్పుడు వారు తెలుగు భాషా సమితి అధ్యక్షులైన, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని సంప్రదించమన్నపుడే నేను శ్రీ గోపాలరెడ్డి గారితో సంప్రదించాను. వారు ఎకాడమీలతో, 'Who is Who' గ్రంధ సహాయం తోను విషయాన్ని సేకరించండి అన్నారు.

ఎకాడమీలకు రేడియో స్టేషనులకు వ్రాసి 'Who is who' గ్రంథంలోని ఎడ్రసులు తీసుకొని తిన్నగానే నేనే కవయిత్రులకు వ్రాసి ఆరు నెలలు శ్రమించాను. ఆరు నెలలశ్రమకూ దేశదేశాలలోని కవయిత్రుల పేర్లూ వారివారి కాలము వారి రచనల పేర్లూమాత్రమే నేను సంపాదింప గల్గాను. నాకు చాలా నిరుత్సాహం కల్గినా లభ్యమైన విషయాన్ని క్రమపద్ధతిలో ఒక పట్టికగా రూపొందించి పంపాను. కానీ అప్పటికే ఆ సంపుటం పూర్తియై పోయి ముద్రణ కూడా ప్రారంభమైపోవడం వలన శ్రీ గోపాలరెడ్డిగారు తమ అశక్తతను ప్రదర్శిస్తూ కూడా "అమ్మా మీ దీక్ష చాలా ప్రశంసనీయం! ఇప్పుడవకాశం లభించలేదని మనం నిరుత్సాహ పడవద్దు. సమయాంతరంలో మీ కృషికి మీ శ్రమకూ అవకాశం రావచ్చును. మీరు సంపాదించిన విషయాన్ని అలక్ష్యం చేయక భద్రపరచండి" అన్నారు. ఇదంతా తెలిసిన వారు

కాబట్టే శ్రీగోపాల రెడ్డిగారు కార్యవర్గ సమావేశంలో అడిగిన వెంటనే అఖిల భారత కవయిత్రులు గ్రంథం యొక్క ఉద్యమానికి ఆమోదం తెల్పారు.

1962, 63 సంవత్సరాలలో అఖిల భారత పర్యటనం చేసి ఆయా భాషలలో ప్రవీణులైన సాహితీవేత్తలకు వారివారి భాషలలోని మహిళా సాహిత్యాన్ని సేకరించి నాకు పంపే ఏర్పాట్లు చేశాను. ఈ సందర్భంగా బొంబాయిలో జరిగిన కార్యక్రమం నాకు చాలా సహాయకారియైనది. శ్రీమతి లీలావతి మున్షీ 15, 16 భాషలలోని సాహిత్యవేత్తలతో ఒక సమావేశం ఏర్పాటు చేసి, నాకు వారివారితో పరిచయం కల్గించారు. అక్కడే చాలామంది రచయితలు నాకు ఆయా భాషలయందలి మహిళా సాహిత్య పరిశ్రమను తెల్పుతూ వ్యాసాలు వ్రాయడానికి అంగీకరించారి. ఈ విషయంలో శ్రీలీలావతి మున్షీగారికి నేను ఋణపడి యున్నాను.

కలకత్తా, ఢిల్లీ మొదలైన ప్రదేశాలకు వెళ్ళి పని పూర్తి చేశాను. ఢిల్లీలో, శ్రీగోపాలరెడ్డిగారి యింట్లోనే బస. కలకత్తాలో L.C జైన్ గారి సహాయంతో నాపని కొంత నెరవేరింది. కలకత్తాలో శ్రీ N S L రావుగారింట్లో బస, బొంబాయిలో నేను ఉన్న సమయంలో చైనా దురాక్రమణ చాలా ముమ్మరంగా ఉన్నది. బొంబాయిలో చీరాల వాస్తవ్యులు ప్రముఖ వ్యాపారవేత్త శ్రీగ్రంధి వీరరాఘవస్వామి గారింట్లో బస. వ్యాసాలు పంపడంలో కొంత ఆలస్యం జరిగి వ్యాసాల అనువాదంలో కొంత ఆలస్యం జరిగి మొత్తం మూడేండ్లు ఈ గ్రంధ పరిష్కరణ కొరకు శ్రమ పడవలసివచ్చింది. వ్యాసాలను తెలుగులోని కనువదించడంలో బాపట్ల స్థానిక కళాశాలకు, ఆ సమయంలో ప్రిన్సిపాలుగా ఉన్న రాజమహేంద్రవర వాస్తవ్యులు (శ్రీ పాదకామేశ్వరరావుగారి కుమారులు) శ్రీశ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు పూర్తిగా తోడ్పడ్డారు. ఆ సంపుటంలోని ఒక భాషా సాహిత్యవ్యాసాన్ని నా పెద్దకుమార్తె సుహాసిని అనువదించింది. హిందీ భాషా వ్యాస సేకరణ.

ఎట్లాగైతేనేమి! భారతీయభాషలకే తొలిప్రయత్నంగా

## 1965 లో 'అఖిల భారత కవయిత్రులు

అం. ప్ర. సాహిత్య ఎకాడమీచే ప్రచురింపబడింది. నా చిరకాల వాంఛ ఈడేరింది

1964 హైద్రాబాద్‌లో అఖిలభారత రచయిత్రుల మహాసభలో తీసిన చిత్రము

శ్రీమతి పి. భానుమతి, లీలావతిమున్షీ, శ్రీమతి విజయలక్ష్మి పండిట్, శ్రీమతి కాసు రాఘవమ్మ

శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ, శ్రీమతి నాయని కృష్ణకుమారి గార్లు

## అఖిల భారత రచయిత్రుల మహాసభ

ఈ ప్రచురణ జరిగిన తర్వాత అఖిల భారత స్థాయిలో రచయిత్రుల సదస్సు జరుపవలెననే వాంఛ కల్గింది, నాకు! ఆ నా ప్రయత్నాన్ని కూడా గోపాలరెడ్డిగారు శ్రీ రామానుజరావుగారు ఆశీర్వదించారు. వెంటనే ఆ సమయంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రివర్యులైన శ్రీకాసు బ్రహ్మానందరెడ్డిగారి దగ్గరకు, నేను వెళ్ళి ఈ ఉద్దేశాన్ని వారి కెరుక పరచి ఆర్థిక సహాయమర్థించాను. వారు సంతోషంతో అంగీకరించారు. ఆ సదస్సు నిర్వహణ సందర్భంగానే కేంద్రప్రభుత్వం వారిని కూడా ఆర్థిక సహాయాన్ని అర్థించాము. అదికూడా లభించింది. ఇదంతా ఒక యెత్తుగానూ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారి నిర్వహణ సహాయమేకాక ఆర్థిక సహాయము కూడా హెచ్చుగా లభించింది.

వెంటనే శ్రీమతి కాసురాఘవమ్మగారు (శ్రీబ్రహ్మానందరెడ్డిగారి సతీమణి) ఆహ్వానసంఘాధ్యక్షురాలుగాను, ప్రసిద్ధ నటీమణి ప్రముఖ రచయిత్రి శ్రీమతి భాను మతిగారు ఉపాధ్యక్షురాలుగాను నేను ప్రధానకార్యదర్శినిగాను, నాయని కృష్ణకుమారి సహాయకార్యదర్శినిగాను కె. రామలక్ష్మి మున్నగు వారు సభ్యురాండ్రుగాను ఒక కమిటీ ఏర్పాటు చేయబడింది. సభా నిర్వహణ కొరకు ద్రవ్య సహాయానికి విరాళాల వసూళ్ల పని మరల నాపై బాధ్యత మోపబడింది. మరల ఆంధ్ర దేశమంతా తిరిగి సుమారు 23, 24 వేల రూపాయలు వసూలుచేసి ఎకాడమీకి నేనిచ్చాను. 1965 లోనే ఈ సదస్సు శ్రీలీలావతి మున్షీ అధ్యక్షురాలుగాను, శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ముఖ్య అతిథిగాను మూడురోజులు అఖిలభారత రచయిత్రుల సదస్సు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ఆధ్వర్యంలో అఖిలభారతస్థాయిలో అత్యంత వైభవంగా నిర్వహింపబడింది తొలినాటి సమావేశంలో రచయిత్రుల సమ్మాన కార్య భారాన్నంతా, సోదరి శ్రీమతిభానుమతిగారు తామే వహించి, చక్కగా నిర్వహించారు. ఆఖరిరోజున అఖిల భారతస్థాయిలో ఒక కమిటీ ఏర్పాటు చేయడానికి కొంత కృషి జరిగింది. కానీ ఆప్రయత్నం ఆనాటికీ, ఈనాటికీ నెరవేరలేదు.

ఇంతలో కొంతమంది రచయిత్రీ సోదరీమణులు అఖిల భారతస్థాయిలో ఏర్పడ బోయే కమిటీకి నేను కార్యదర్శినిగా ఉండడానికి తగిన అర్హత నాకు లేదని

ఆకారణంగా, నా స్థానంలో తమరిని నియమించి కమిటీ ఏర్పాటు చేయమని శ్రీగోపాల రెడ్డిగారి దగ్గర వారికి చెప్పి వారిని ఒప్పించడానికి వెళ్ళారు. కానీ శ్రీగోపాల రెడ్డిగారు "ఆహాఁ ఆమెకు అర్హత లేదా? ఇప్పటికి పది సంవత్సరాల బట్టి మహిళా రచయిత్రులను వెలుగులోనికి తీసుకొని రావాలని కుటుంబాన్ని కూడా విడిచి ఎన్ని కష్టాలకో ఓర్చి అహరహం శ్రమ పడ్తూన్న లక్ష్మీ కాన్తమ్మగారికి ఇంగ్లీషు రాక పోయినా భారతస్థాయిలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిందే! తీరా భారతస్థాయిలో కమిటీ ఏర్పడబోతూ ఉన్న సమయంలో ఆమెను తొలగించాలా? సరే లెండి. అన్నీ నేను చూచుకొంటాను. మీరు వెళ్ళండి' అని విపులంగా మాట్లాడి వారిని పంపించి వేశారు.

## విష్ణుపారిజాత యక్షగాన అవిష్కరణ

ఇంకొక ముఖ్యవిశేషమేమనగా ఆ అఖిల భారత సదస్సులో తరికుండ వేంగ మాంబచే రచింపబడి, రసవత్తరమైన ప్రబంధం స్థాయిని సంపాదించుకొన్న "విష్ణు పారిజాత యక్షగానాన్ని నేను మద్రాసు ఓరియంటల్ లైబ్రరీనుండి సంపాదించగా ఆం. ప్ర. సాహిత్య ఎకాడమీ ప్రచురించగా ఆ మహాసభలో అవిష్కరింపాము.

## కేంద్ర సాహిత్య ఎకాడమీ సభ్యత్వం

ఎట్లాగైనా అఖిల భారత స్థాయిలో కమిటీ ఏర్పడడానికి దోహదకారిగా కేంద్ర సాహిత్య ఎకాడమీ సభ్యత్వం నాకు లభించే కృషిలో ఆ సమయంలో రాష్ట్ర పతిగా ఉన్న శ్రీసర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారితో శ్రీ గోపాలరెడ్డిగారు ఒక సమావేశం ఏర్పాటు చేశారు. దాని ఫలితంగా, నేను కేంద్ర సాహిత్య ఎకాడమీ సభ్యురాలనైనాను. ఆ సమయంలో అఖిల భారత స్థాయిలో మహిళా సాహిత్య ఎకాడమీని ఏర్పాటు చేయగోరుతూ నేను ప్రధానమంత్రిణి శ్రీమతి ఇందిరాగాంధీగారి దగ్గరకు వెళ్ళాను. తర్వాత వారహగిరి సరస్వతీగారి దగ్గరకు కూడా వెళ్ళాను! కానీ ఏ కారణం వలననో అట్టి కమిటీ ఏర్పడనేలేదని చెప్పడానికి, చాలా విచార పడ్తూ ఉన్నాను. దానికి అశక్తతే కారణం.

తర్వాత ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రముఖ కార్యక్రమమైన చౌక

ధరల ప్రాచీన సాహిత్య ప్రచురణ విషయంలో 1967లో మొల్ల రామాయణానికి నేను పీఠిక వ్రాశాను.

ఎకాడమీ రజతోత్సవ కార్యక్రమంగా సాహిత్యమందలి వివిధ ప్రక్రియల విపి ప్రతుల ప్రచురణలలో 'మహిళా సాహిత్యం'పై ఒక సాహిత్య గ్రంథాన్ని నేను రచించాను

## విశిష్ట సభ్యత్వం

అంతేకాదు. శ్రీ జలగం వెంగళరావుగారు ముఖ్యమంత్రిగా ఉన్న తరుణంలో సాహిత్య ఎకాడమీ నాకు విశిష్టసభ్యత్వం ఇచ్చింది. మహిళా సభ్యులాంధ్రకెవరకూ ఈ విశిష్ట సభ్యత్వం లభించలేదు. ఆ భాగ్యం నాకే లభించింది. శ్రీ వెంగళరావుగారు తమ కరకమలాలతో విశిష్ట సభ్యత్వ పదకాన్ని నాకు ప్రసాదించారు మలేషియాలో ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు జరిగినపుడు సాహిత్య ఎకాడమీ ప్రాతినిధ్యంతో నేను పాల్గొనడం జరగడం కూడా నా భాగ్యమే 1957లో సాహిత్య ఎకాడమీ ప్రతిష్ఠింపబడి నప్పటినుండీ అది రద్దుపడేవరకూ నేను సభ్యురాలనుగా అన్ని సమావేశాలలో పాల్గొన్నాను.

## ఆంధ్ర రచయిత్రుల మహాసభలు

1965 లో అఖిల భారత రచయిత్రుల సదస్సు జరిగిన కొన్నాళ్ళకు శ్రీ గోపాలరెడ్డి, శ్రీ రామానుజరావుగారల సౌజన్యంతో ఆంధ్ర రచయిత్రుల సలహా సంఘాన్ని ఎకాడమీ అనుబంధశాఖగా ఏర్పాటు చేయగల్గాను. మొదటిసభ గుంటూరు ఏకాదండయ్య పంతులుగారి హాల్లో శ్రీమతి క్రొత్త లక్ష్మీ రఘురామ్‌గారి అధ్యక్షతన జరిగినది. ఆ సమావేశాల్లో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి సన్మానం జరిపినాము.

తక్కిన సభలు ఏలూరు, రాజమహేంద్రి, వరంగల్లు, గుడివాడ, విజయవాడ, ఖమ్మం మచిలీపట్నములలో జరుగగా 3, 4 సభలు హైదరాబాదులో జరిగినవి నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు వరంగల్లు సభలలో దుర్గాబాయమ్మగారు అధ్యక్షత వహించారు. వరంగల్లు సభలను శ్రీమతి కనకరత్నం M. L. A గారు ఆహ్వాన సంఘ

ధ్యక్షురాలుగా ఉండి నిర్వహించారు. గుడివాడ సభలను శ్రీమతి కనకరత్నం M. L A. గారు ఆహ్వానించి నిర్వహించారు. జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ పిన్నమనేని కోటీశ్వరరావుగారు చాలా సహాయపడినారు. ఆ సభల సమయంలోనే రాష్ట్రపతి జకీరు హుస్సేన్‌గారు మరణించినందున రెండవరోజునుండే సభలను జరుపలేక పోయినాము. ఏలూరు సభకు శనివారంపేట రాణీగారు శ్రీమతి హేమలత గారు ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగా ఉన్నారు హైదరాబాదు మహిళాకళాశాల ప్రిన్సిపాలు శ్రీమతి శ్రీదేవిగారు అధ్యక్షత వహించారు. విజయవాడ సభలకు శ్రీ ప్రసాదు గారి సతీమణి, ఆహ్వాన సంఘానికి అధ్యక్షురాలుగా ఉన్నారు. మాంటిస్సోరీ కళాశాల ప్రిన్సిపాలుగారైన శ్రీమతి కోటీశ్వరమ్మగారు తదితరులు తోడ్పడినారు. విజయవాడ సభలకు శ్రీ గోపాలరెడ్డిగారు, శ్రీ రామానుజరావుగారు మూడురోజులు విజయవాడలో ఉండి తోడ్పడినారు.

## సాహితీ రుద్రమ

ఆ సభలోనే ఆఖరి సమావేశమైన కవయిత్రులసభ నా అధ్యక్షతన జరుగబోతూ ఉండగా శ్రీ గోపాలరెడ్డిగారు "లక్ష్మీకాన్తమ్మగారు సభా నిర్వహణకు పూనుకొన్నదంటే, ఆ సమావేశం జయప్రదం కావడానికి ఏమీ అభ్యంతరంలేదు. నేనింక వెళ్ళిపోతాను" అని సభలో బహిరంగంగా చెప్పి వెళ్ళిపోయారు. శ్రీ రామానుజరావు గారు సమాపనంలో ప్రసంగిస్తూ ఈ మహాసభలో సోదరి శ్రీమతి లక్ష్మీ కాన్తమ్మగారికి "సాహితీ రుద్రమ" అని బిరుదిస్తున్నానని సభ్యులాంధ్ర హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

ఆ బిరుదునే నాయీ స్వీయ చరిత్రకు నేను మకుటంగా ఎంచుకొన్నానని సగర్వంగా చెప్తూ శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి కృతజ్ఞతతో నమస్సుమాంజలి సమర్పిస్తూ ఉన్నాను.

ఇంకొక గొప్ప విషయమేమంటే ఏ జిల్లాలో లేక హైదరాబాదులో సభలు జరిగినా ఆఖరిరోజు కవయిత్రుల సభ నా అధ్యక్షతనే జరిగి 'మంగళేనచ మధురేణచ సమాపయేత్' అనే సూక్తికి సవాలుగా వైభవోపేతంగా ప్రారంభింపబడి మంగళప్రదముగా ముగిసేవి.

మచిలీపట్నంలో జరిగిన సభలకు 'స్పందన' సాహితీ సంస్థారథపోదకులైన శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారు నేతృత్వం వహించారు. రాజమహేంద్రవర సభలకు సోదరి అద్దేపల్లి వివేకానందాదేవి ఆహ్వాన సంఘ సారథ్యం వహించిది ఆనాటి సభకు సాహిత్య ఎకాడమీ ప్రతిష్ఠకు కీలకపాత్ర వహించిన శ్రీ K.S.P B పట్టాభిరామారావుగారు (కపిలేశ్వరపురం వాస్తవ్యులు) ముఖ్య అతిథిగాను సోదరులు శ్రీదేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షులుగాను వ్యవహరించి సభ శోభను సమ కూర్చినారు.

ఇంక హైదరాబాదులో జరిగిన సభలకు ఎకాడమీయే యజమాన్యం వహించింది.

ఈ ఆంధ్ర రచయిత్రుల సలహాసంఘానికి ఏటా పదివేల రూపాయలు కేటా యించబడినవి ఆ నిధినుండి రచనలను అచ్చువేయించుకోలేని రచయిత్రులకు 500 రూపాయల సహాయముగా ఇయ్యడానికి కథలు, నవలలు రచించి అచ్చు వేయించు కోలేని వారికి 6000/ రూ. లు అప్పుగాను ఇయ్యడానికీ నిర్ణయాలు తీసుకొన్నాము ఆ నియమాను సారంగా వందల సంఖ్యతో రచయిత్రులకు తోడ్పడ్డాను.

## ఆలిండియా రేడియో సలహాసంఘ సభ్యత్వం

ఆలిండియా రేడియో వ్యవస్థ : ఆంధ్ర రాష్ట్రం మద్రాసు రాష్ట్రంలో అవిభాజ్యంగా ఉండగా ఆంధ్రులుకూడా మద్రాసు రేడియోస్టేషనుకే వెళ్ళేవారు. నాకు రేడియో వారి పిలుపు రాలేదే అని బాధపడ్తూ ఉండేదాన్ని! అయితే ఒక మంచి పని చెయ్యడానికి ఒకరిపిలుపుతో అవసరమేమున్నదనే చొరవతో నాకు నేనై కల్పిం చుకొని ఆయా సంస్థలలో సేవ చేసే స్వభావం కలదాననైనందువలన 1944, 45 సంవత్సరాలలో నేనే మద్రాసు రేడియోవారికి దేశంలో చాలామంది రచయిత్రు లున్నారు. ఎవరో ఒకరికిచ్చి మీ బాధ్యత తీరిందని భావించడం, సంభావ్యం కాదు. మమ్మల్ని కూడా రేడియోకి ఆహ్వానించండి". అని ఒక ఉత్తరం వ్రాశాను. దానికి మద్రాసు రేడియో వారు ప్రతిస్పందించి, సంక్రాంతి పేరంటం అని పేరుపెట్టి ఆంధ్రదేశంలో ఏడుగురకు ఆహ్వానాలు పంపారు. నేను పులవర్తి కమలావతీదేవి బిత్తుల కామాక్షమ్మ కనపర్తి వరలక్ష్మమ్మ ఇంకా కొందరకు రేడియో కార్యక్రమ

ప్రయోక్తలైన శ్రీ ఆచంట జానకిరామ్‌గారు ఆహ్వానాలు పంపారు. అప్పటినుండి ఇప్పటివరకూ నేను రేడియో కళాకారిణినే క్విజ్ కార్యక్రమాలు నిర్వహించాను. ప్రసంగాలు చర్చలు కవిసమ్మేళనాలు ప్రత్యేక కార్యక్రమాలలో ఎన్నింటిలోనో పాల్గొన్నాను. ఒకమారు రేడియోవారు (మద్రాసు) ఆంధ్ర సాహిత్యంలో భక్తి కీర్తనలు అనే అంశం ఇచ్చారు. అప్పుడు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మున్నగు వారి పాటలను (త్యాగయ్య, అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు శ్యామశాస్త్రి, స్వాతి తిరునాళ్ వీరందరి కీర్తనలను) ఉదాహరిస్తూ. నేను మాత్రం ఒక కీర్తన ఎందుకు వ్రాయకూడదు. అనే భావనతో "నీలో మధురిమమ్మ నేనై నాలోని వైభవము నీవై నిఖిల మాలోకాలు నిండి వెల్లెదమోయీ అనే కీర్తనను రచించి రేడియోలో ఆలపించాను. అది మొదలు కొన్ని భక్తి కీర్తనలు రచించాను, వాటిలో కొన్ని 'క్రాంతి శిఖరాలు' అనే మకుటంలో ప్రచురించాను. ఆంధ్రదేశం నడి బొడ్డున విజయవాడలో రేడియో వ్యవస్థ నెలకొల్పబడిన తర్వాత నన్ను ప్రభుత్వం రేడియో సలహా సంఘ సభ్యురాలుగా ఎంపిక చేసింది. నేను సభ్యురాలుగా ఉన్న కాలంలోనే, శ్రీ విస్సా అప్పారావు గారు అమ్మన్న రాజాగారు కొండ కొలకుల కవి వెంకటరావు గారు ఇంకా కొంతమంది సభ్యులుగా ఉండేవారు! నేను శ్రీవిస్సాల అప్పారావుగారు కలిసి సినిమా సంగీతం చాలా అసభ్యంగా ఉన్నందున ఆ అశ్లీల సంగీతాన్ని రేడియో ప్రసారం చేయకూడదు అని తీర్మానించాము.

## ఆశ్లీల సంగీతాన్ని రేడియో ప్రసారం చేయకూడదు

అయితే మరునాటి సమావేశానికి మేము వెళ్ళగానే రేడియో డైరెక్టరుగారు ఒక పెద్ద మూట ఉత్తరాలు తెప్పించి సమావేశంలో ఆ మూట మాకు చూపించారు. అవన్నీ రేడియో శ్రోతలు నుండి వచ్చినవి రేడియోలో సినిమా సంగీతం తీసేస్తే రేడియో స్టేషనుకు నిప్పు పెట్టి తగుల పెట్టేస్తాం." అనే ధోరణిలో ఉన్న ఉత్తరాలు అవి! మేము చాలా బాధపడి మన ప్రజల విజ్ఞానం ఇంత వెర్రితలలు వేస్తూ ఉన్నందుకు చింతించి లలిత సంగీతం భక్తి సంగీతం ప్రసారం చేసేటట్లుగా తీర్మానించాం.

రెండవమారు నన్ను విజయవాడ హైదరాబాద్ కేంద్రాలకు సలహా సంఘ సభ్యురాలుగా ఎంపిక చేశారు. ఆ సమయంలో కేంద్ర రేడియో జనరల్ డైరక్టరు శ్రీమాథుర్‌గారు హైదరాబాదు సమావేశానికి వచ్చారు.

## భక్తి సంగీతంతో ప్రారంభం కావాలి

అప్పుడు నేను ఉదయం ప్రసారం ప్రారంభించగానే భక్తి సంగీతంతో ప్రారంభం కావాలి అది కూడా తిరుపతి దేవస్థానంలోని సుప్రభాతంతో ప్రారంభం కావాలి. అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చాను. తెలుగులో కావ్య పఠనం హిందీ తరగతుల వలెనే తెలుగు తరగతులు సంగీత పాఠాలు ప్రసారం చేయించాలి." అనే ప్రతిపాదనలు చేశాను. శ్రీ మాధుర్ గారు, నవ్వుతూ నన్ను అభినందిస్తూనే లక్ష్మీకాన్తమ్మగారు మీ ప్రతిపాదనలకు మద్దతుగా కొన్ని సంతకాలు సంపాదించ గలరా?" అని అడగారు. "తప్పక తెస్తాను". అన్నాను. తర్వాత సమావేశానికి సంతకాలు సంపాదించి తీసుకొని వెళ్ళాను కూడా. శ్రీమాధుర్ గారు చాలా సంతోషించి మీరు చాలా కార్యదీక్ష పరులని విన్నాను ఇప్పుడు స్వయంగా మీతో పరిచయం కల్గినందుకు, చాలా సంతోషం! అని ప్రశంసించి, నా ప్రతిపాదనలన్నింటినీ, అమలు పరచారు.

ఈనాటికీ రేడియోలో శనివారం నాడు ప్రసారం చేస్తున్న శ్రీవేంకటేశ్వర సుప్రభాత ప్రసారం ఈ సోదరి లక్ష్మీకాన్తమ్మ ప్రతిపాదనే! అని మీరు భావిస్తే నిజంగా నా జీవితమెంత ధన్యత చెందినదో!

## ది. బాపట్లలో కోఆపరేటివ్ విమెన్స్ కాటేజి ఇండస్ట్రీస్

1954 ఆ ప్రాంతంలో స్థానిక న్యాయవాద ప్రముఖులైన శ్రీ వెలగపూడి సుబ్బారావుగారు తన పత్రిక పుత్రికయైన శ్రీమతి భీమరాజు వరలక్ష్మమ్మగారిని ప్రోత్సహించి "బాపట్ల యువతీ సహకార సంఘ స్థాపన చేయించారు. అందులో కూడా నేనూ ఒక సభ్యురాలనే ప్రధానంగా స్త్రీలకు స్వయం ఉపాధి పథకం క్రింద మిషన్ కుట్టు నేర్పించేవారము. కొన్నాళ్ళు ఆ సహాకార సంఘము శ్రీమతి సోదరి వరలక్ష్మమ్మగారి అధ్యక్షతను నిర్వహింపబడింది తరువాత ఆమె కర్నూలు మహిళా కళాశాలకు ప్రిన్సిపాల్‌గా వెళ్ళిపోయిన తర్వాత నన్ను అధ్యక్షురాలుగా ఎన్నుకొన్నారు. కుట్టు ప్రధాన పరిశ్రమగా ఉన్న ఆ సంస్థను ఇంకాకొన్ని గృహపరిశ్రమలు నిర్వహించాలని ప్రయత్నించినా అవి సరిగా కొనసాగనందున కుట్టు పరిశ్రమ మీదనే

ఆ సంస్థను నడిపినాము. సోషల్ వెల్ఫేరు బోర్డులో నేను సభ్యురాలుగా ఉన్నపుడు ఒక ఎంబ్రాయిడరీ మిషను కూడా వెల్ఫేరు బోర్డు నుండి గ్రాంటు చేయించి తెప్పించాను. శ్రీమతి వరలక్ష్మమ్మగారి తర్వాత నేను 15, 20 సంవత్సరాలు అధ్యక్షు రాలుగా ఉన్నాను. నేను అధ్యక్షపదవికి నన్ను ఎన్నిక కాకుండా చెయ్యాలని చాలా ప్రయత్నాలు జరిగాయి. కానీ వారి ప్రయత్నాలు నెరవేరనందున నేనే అధ్యక్షు రాలుగా చిహాకాలం కొనసాగాను. నేను అధ్యక్షురాలుగా ఉన్నపుడే సోషల్ వెల్ఫేరు బోర్డువారి సంక్షిప్త విద్యావిధానంలో ఆంధ్రయూనివర్సిటీ వారి ఉభయ భాషాప్రవీణ ఎంట్రన్సు కోర్సు తరగతి నడవవలెనని ప్రయత్నించి, కో ఆపరేటివ్ సొసైటీ నియ మావళిలో కొంత సవరణలు చేయించుకొని సంస్కృతకళాశాల నిర్వహించ డానికి వీలు కల్పించుకొన్నాము. నియమాన్ని సవరించడానికి కోఆపరేటివ్ డిపార్టుమెంటు (గుంటూరు) ఇన్‌స్పెక్టరు శ్రీ శౌరయ్యగారు మాకు బాగా సహకరించారు. ఇక కాలేజీ నిర్వహణకు స్థానిక న్యాయ వాదులైన శ్రీ మల్లాది రామమూర్తిగారు వారి సతీమణి నాకు ఆప్తమిత్రము శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మగారు శ్రీమాగుప్తగారు చాలా సహకరించారు. సంస్కృత తరగతి ప్రారంభింపబడి జరుగుతూ ఉన్న దానికి ఆభ్యంతరం కల్పించి ఆ సంస్థను భగ్నం చెయ్యాలనే ప్రయత్నాలు మొదలై కాలం జరుగుతూన్న కొలదీ తీవ్ర స్వరూపం ధరించాయి ఆ కోర్సు రెండేళ్ళకోర్సు 32,000/-రూల పథకమది! ఎట్లాగో శ్రమపడి అన్ని కష్టాలను ఎదుర్కొంటూ రెండవ సంవత్సరం పరీక్షలకు పిల్లలు రుసుము చెల్లించే సమయం వరకూ వచ్చాము. సరిగ్గా ఆ సమయానికి, ప్రత్యర్థులు గుంటూరు కో ఆపరేటివ్ డిపార్టు మెంటులో కేసువేసి, నన్ను అల్లరి పెట్టడం మొదలుపెట్టారు. 1970 ఆగస్టు 8 వ తేదీనాడు మా రెండవ అబ్బాయి రాజారాజ నరేంద్ర పెండ్లి! ఆగస్టు 1వ తేదీనాడు కో ఆపరేటివ్ డిపార్టుమెంటువారి విచారణ! అప్పటికి నాకు రెండు రోజులబట్టి జ్వరము! శ్రీ మా వారు చాలా పట్టుదలతో కేసులో పాల్గొన్నారు. సంస్కృత కళాశాల కమిటీ ప్రెసిడెంటు కాలేజీ ప్రిన్సిపాలు నేనే. స్థానిక కొమరవోలు ఆదిలక్ష్మమ్మగారనే వయో వృద్ధురాలు మా కమిటీలో ఒక సభ్యు రాలు ఆమె కూడా చాలా పట్టుదలగా గుంటూరులో జరిగే విచారణలకు న్యాయాన్ని కాపాడడానికీ, కళాశాల నిరాఘాటంగా నడవడానికీ బాగా శ్రమించి పాటు పడ్డారు.

కానీ మేమెంత ప్రయత్నం చేసినా కళాశాల పెట్టడానికి మొదట్లో సాయ పడిన శౌరయ్యగారే వ్యతిరేకంగా తీర్పు చెప్పారు. ఇట్లా జరుగుతుందని ముందే ఊహించిన మేము పరీక్షల దరఖాస్తులు తెప్పించి ఫీజులు కట్టించేయడమే కాకుండా శౌరయ్యగారి తీర్పు అమలు జరగడానికి ఉన్న నిర్ణీతమైన గడువులోపలే చట్టపర మైన కొన్ని చర్యలు తీసుకొన్నాము. మా వారు (లాయరు) బాపట్ల కోర్టులో అపీలు పడేశారు. దానితో మా పిల్లలందరూ పరీక్షకు వెళ్ళగలిగారు *24 మందికి 19 మంది కృతార్థత పొందారు. మా కాటేజి ఇండస్ట్రీస్‌లో పని చేస్తూ ఉన్న గాలి వర్ధనమ్మ హనుమాయమ్మగార్లు కూడా సాక్ష్యం చెప్పటంలో తక్కిన పనులలో చిత్త శుద్ధిగా మాకు తోడ్పడ్డారు. వారందరకూ నా ధన్యవాదాలు

## శ్రీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాత రచన

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభవారు, మా వైశ్యుల ఇలవేల్పైన శ్రీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాత రచనకు ఒక పిలుపునిచ్చారు. దానికి నేను స్పం దించి, ఒక శుభ ముహూర్తంలో

"కుసుమా సుప్రజా గౌరి ప్రభాతము పపద్యతే
ఉత్తిష్ఠ పరమేశాని, కర్తవ్యం లోక రక్షణమ్
ఉత్తిష్ఠ యోగమాయే, త్వము త్తిష్ఠ కన్యకే
ఉత్తిష్ఠ కుసుమ శ్రేష్ఠి పుత్రికే సర్వమంగళే॥

అని వ్రాసి రచన ప్రారంభించాను. కానీ ఇది దేవతా సంబంధమైన రచన! సాంప్రదాయం తెలుసుకోకుండా రచిస్తే అమ్మవారి విషయంలో అపచారం జరగడమే కాదు! నాకు కూడా పాపం కల్గడమే కాదు! మా కుటుంబ విషయంగా కీడు కూడా కలగవచ్చుననే ఊహా సందేహాలు కలిగి, చీరాల నుండి శ్రీమాన్ వీరాహాచార్యుల వారిని పిలిపించుకొని రచన సాగిద్దాము లెమ్మని రచనను ఆపు చేశాను.

ఇంతలో అనగా 1964 అగస్టు 15వ తేదీనాడు శ్రీమా గుప్తగారు సర్వితోట లెట్లా ఉన్నాయో చూచి వద్దామని నీరాల వెళ్ళాను. ఆ సంవత్సరం ఆగస్టు వచ్చినా ఎండల తీవ్రత చాలా చాలా హెచ్చుగా ఉన్నది. శ్రీమూవారు బాగా గుబురుగా ఎది గిన సర్వితోటలో తిరుగుతూ చెప్పుల్లో ఇసుక చేరి, కాళ్ళు మండుతూ ఉన్నాయని

చెప్పులు తీసేసి సుమారు 40, 50 ఎకరాల తోట, కాలినడకన, తిరిగి చూచారు. దానితో వారి పాదాలు కాలి బొబ్బలెక్కి-పోయాయి. ఆ బొబ్బల బాధను మంటనూ ఓర్చుకొని మధ్యాహ్నం ఒంటిగంట, రెండు గంటల ప్రాంతంలో ఇంటికి వచ్చి దొడ్లో నూతి దగ్గరచేరి నీళ్ళు తోడుకొంటూ ఆ బొబ్బ లెక్కి-న చర్మాన్నంతా లాగే యడం మొదలు పెట్టారు, నాకిదేమీ తెలియదు నౌకరు రామయ్య కాటుతూన్న క్తాన్ని చూచి భయపడి వచ్చి నాకు చెప్పాడు. దొడ్లోకి వెళ్ళి చూద్దును! దొడ్డంతా రక్తమే కళ్ళు బయర్లు కమ్మి, ఇదంతా ఏమిటి? అని వారి నడిగాను. వారు ఏమీ లేదులే నీవు లోపలికిపో' అన్నారు మా వారు సాహసానికీ, నిర్భయత్వానికీ పెట్టింది పేరు! నేను వెంటనే మా కుటుంబ వైద్యులు, శ్రీ సంకా వేంకట చలపతి రావు గారిని పిలిపించాను. ఆయన కూడా ఆ పాదాలు చూచి నివ్వెరపడి, హాలులో మంచం మీద ఆయనను పడుకోబెట్టి పాదాలు బాగా తుడిచి, కట్టు కట్టారు. ఆ ఆగస్టు నెలాఖరుకు ఆయనకు గాయం కొంచెం తగ్గి, మళ్ళీ క్రొత్త చర్మం పట్టడం మొదలు పెట్టింది. ఇంక ప్రమాదం తగ్గిందనే నమ్మకం నాకు కుదిరింది. ఆ పరిస్థితులలో సెప్టెంబరు 5, 6, 7 తేదీలలో వరుసగా నాకు మూడు స్వప్నాలు వచ్చాయి. అవి సద్యస ఫలితాల నిచ్చాయి కూడా.

రోజూ మా వారికి కాలికి కట్టుకోడానికి, వచ్చే డాక్టరు చలపతిరావుగారు నేను ప్రారంభించి ఆపు చేసిన సుప్రభాతరచన కాయితాలను హాలులోని బల్లపై గాలి కెగురుతూ, ఉంటే చూచి ఏమండీ లక్ష్మీకాన్తమ్మగారూ సుప్రభాత రచన పూర్తి చెయ్యండి". అంటూ హెచ్చరిస్తూ ఉండేవారు.

అట్లాంటి తరుణంలో 1964 సెప్టెంబరు 5వ తేదీనాటి, తెల్లవారుజామున ఒక దివ్యస్వప్నం!

నేను శ్రీమావారు మా హాలులో పడుకొని యున్నాము హాలు నానుకొని యున్న గదిలో ఉన్న, నా పూజా మందిరం నుండి సుమారు 20 ఏండ్ల వయస్సు కల ఒక మహిళ బయలుదేరి వచ్చి హాలుకూ, పూజామందిరానికి మధ్యనగల, ద్వారం తలుపులు రెండూ పట్టుకొని నన్ను చూస్తూ నిలువబడిపోయినది. నే నామెను చూచి "ఎవరు నీవు! ఈ రాత్రివేళ ఇంటి తలుపులన్నీ మూసి యుండగా ఎట్లా లోప

లికి ప్రవేశించావు?" అని అడిగానట అమె వెంటనే 'ఆఁ ఎంతమాట అడిగావు' నేను నీ తల్లిని అంతేకాదు! జగజ్జననిని!" అని బదులిస్తూ మేము పడుకొని యున్న హాలులోకి వచ్చి కిరీట త్రిశూల ధారిణియై, సర్వాభరణ భూషితురాలై ఒక స్వర్ణ కమలంలో హసన్ముఖంతో అభయ హస్త ముద్రతో ఆసీనురాలై పోయింది. నా కెంతో ఆశ్చర్యం కల్గింది. అంతేకాదు వెంటనే మెలకువ వచ్చి చూస్తే నాలుగు గంటలైనది. వేరే మంచం మీద పడుకొన్న మా వారిని మేల్కొల్పి స్వప్నం విషయం చెప్పాలని ప్రయత్నం చేశాను కానీ, వారు "ఆఁ నీ కెప్పుడూ స్వప్నాలే. నన్ను పడుకోనియ్యి" అన్నారు. ఆ మర్నాడంతా నాకు ఇదే వ్యాకులం! ఈమె ఎవరు? ఎందుకు స్వప్నంలో కనిపించింది?" అనే ఆలోచనలతో ఆనాడంతా గడపేశాను. మళ్ళీ 6వ తేదీన రాత్రి సరిగ్గా అదే సమయానికి మళ్ళీ స్వప్నం. అదేమిటంటే "ఒక పెద్ద తేజోమండలం ఆ మండలం నుండి ఒక ఆకాశవాణి! "ఎందుకంత కలవరం పడ్తావు నాకు చెల్లిస్తానన్న ఉపచారం చెల్లించి నావా!" అనే వాక్కులు వినపడ్డాయి.

అప్పుడు నాకు అమ్మవారి సుప్రభాత రచనా 'విషయం స్ఫురణకు వచ్చి, చీరాల నుండి శ్రీమాన్ ఆచార్యులుగారిని పిలిపించుకొని శ్రీ కన్యకా సుప్రభాత రచనను (సంస్కృత భాషలో) పూర్తిగా రచించాను ప్రధానంగా సుప్రభాత శ్లోకాల వరకు, శ్రీమాన్ ఆచార్యుల సంపూర్ణ సహాయంతో రచించడం పూర్తియైన తర్వాత

'మహిళా జన పావన ధర్మరతే
వర వర్ణిని వాసవి, సౌమ్యమతే
హర సుందరి, భారతి, భవ్యరమే
విజయీభవహే పెనుగొందహితే॥

అను శ్లోకంతో ఉపారబ్ధమైన శ్రీ కన్యకా పరమేశ్వరీ స్తోత్రాన్ని నేను రచించిన పిమ్మట మంగళం శ్లోకాల రచన నాకు సరిగా కుదరలేదు. అప్పుడు అప్పికట్ల వాస్తవ్యులు సోదరులు శ్రీ కుర్రా సుబ్బారావుగారు అప్పికట్ల వాస్తవ్యులు తిరుపతి దేవస్థానం ఆస్థానపండితులునైన శ్రీమాన్ వేదాంతం జగన్నాథాచార్యుల వారి దగ్గరకు తీసికొని వెళ్ళారు. వారి సలహాలతో మంగళం శ్లోక రచన కూడా పూర్తియై

నది. ఇంక స్తోత్రంలోని "మహనీయ కృపామహితా భరణామ్" అనే శ్లోకమును "జగదాత్మ సమీహిత రూపగుణే" అనే శ్లోకాన్ని ఒకనాడు బస్సులో ప్రయాణం చేస్తూ బస్సు టిక్కెట్టుపై వ్రాశాను

సుప్రభాత రచన పూర్తియైన వెనుక సోదరులు డా. చలపతిరావుగారు ఇంకా ప్రార్థనా సంఘ సోదరులు బెజవాడలో జరిగిన ఆర్యవైశ్య మహాసభ కార్యవర్గ సమావేశంలో చదివి, రచన శోభనినుమడింప జేశారు. వారికి ధన్యవాదాలు.

కానీ దేశంలో ఇంకా చాలా మంది రచించిన మహాసభకు పంపినందున అదొక పోటీగా రూపొందింది. కొందరి సిఫారసుల బలంతో వేరొకరు రచించిన సుప్రభాతం పోటీలో గెలిచింది. ఆ తర్వాత ఈ సుప్రభాతాన్ని గ్రామఫోనులో ప్లేటుగా రికార్డు చేశాము. ఆ రికార్డులో నేను నా పెద్ద కుమార్తె సీ సుహాసినీ గానం చేశాము. ఈ సుప్రభాత రచనను పుస్తక రూపంలో ప్రచురింపచేశాను.

## దుర్గాస్తవతారవళి

ఇంతకు ముందు నేను విజయవాడ యందు వేం చేసియున్న కనక దుర్గ ఉత్సవాలకు, ఎన్నోమార్లు ప్రసంగాలకు వెళ్ళి యున్నాను. కానీ శ్రీ పైడి లక్ష్మయ్య గారు దేవాదాయ శాఖమంత్రిగా ఉండగా నేను దుర్గాస్తవమును శ్లోకములుగా రచించి కనకదుర్గ ఉత్సవాలలో చదివి అమ్మవారిని స్తోత్రం చేశాను. నాకు అదే సంస్కృత శ్లోక రచనకు ప్రారంభం కావడం వలన, దానికి కూడా శ్రీమాన్ ఆచార్యులవారి సహాయం అర్థించాను. వారు దేవీస్తోత్రపరమైన ఒక శార్దూలవృత్తాన్ని చదివి "ఇట్లా వ్రాయమ్మా" అని చెప్పేసి చీరాల వెళ్ళిపోయారు. ప్రథమ ప్రయత్నం కావడం వలన చాలా కష్టపడి ఒక ఏడు శ్లోకాలు రచించి తీసుకొని వెళ్ళాను. నేను ఆ రచన విషయంలో ఎంత భయపడ్డానో! అంత హెచ్చు ప్రశంస సభలో లభించింది. పత్రికల వాళ్ళు ఆ శ్లోకాల్ని ప్రచురించారు. తర్వాత ఇంకా శ్లోకాలు రచించి 'దుర్గాస్తవతారావళి'గా ఒక లఘుకావ్యాన్ని ప్రచురించాను. కాలాంతరంలో 'జాతిపిత' మకుటంతో అర్ధశతి కావ్యాన్ని రచించి ఈ మూడు లఘుకావ్యాలను దేవనాగరిలిపిలో ముద్రింపింప జేసి ఒక ప్రచురణగా తీసికొనివచ్చాను

## ముస్లిం కన్యకు రక్షణ

ఈ రెండు కలలు ఇట్లా ఫలింపగా, సెప్టెం. 7వ తేదీనాడు ఇంకొక విచిత్ర మైన కల వచ్చింది! "మా యింటి కెదురుగా ఉన్న ఖాళీ స్థలంలో (64వ సంవత్స రంలో ఖాళీగానే ఉన్నది) ఏదో ఒక ఆటల పోటీ జరుగుతూంటే నేను వ్యాయామాధిపు రాలుగా కూర్చుని ఉండగా ఎవరో అమ్మాయిని ఎవరో కారులో ఎక్కించుకొని తీసికొని వెళ్ళిపోయారని చెప్పారు. నేను వెంటనే కారుపై వెళ్ళి ఆ అమ్మాయిని రక్షించానట. ఈ స్వప్నం వచ్చిన నెలరోజులకే మస్తానీ అనే ఒక ముస్లిం కన్యను నేను ఒకటి రెండు నెలలు ఇంట్లో పెట్టుకొని రక్షించాను. మరి ఈ విధంగా నా స్వప్నాలు నిజజీవితంలో ఆకృతులు మలచుకొని ప్రత్యక్షం కావడంలో అంతర్య మేమిటో!

## విశ్వహిందూ పరిషత్తు సేవలు

నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు 1947 రాజమహేంద్రిలో గోదావరీ పుష్క రాలలో శ్రీ కంచి పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామి వారిచే ఆంధ్ర దేశమున ప్రారంభింపబడిన విశ్వహిందూ పరిషత్తుశాఖలో నేను కూడా సభ్యత్వం సంపాదించుకోగల్గాను రాజమహేంద్రిలో హిందూ సమాజంలో ప్రారంభ సభ జరుగుతూ ఉన్నపుడే నేను నా అంత నేను ప్రేరణ పొంది సభలో ప్రసంగించడానికి అనుమతి పొంది హిందూమతం స్త్రీల ప్రాచీన సదాచార సంపత్తి వలననే నేటి వరకూ సజీవంగా ఉన్నది కాబట్టి విశ్వహిందూ పరిషత్తులో స్త్రీలకు ఎక్కువ స్థానములనిస్తేనే పరిషత్తు ప్రచారం చక్కగా జరిగి హిందూ ధర్మం పునరు జ్జ్వలమై రక్షింపబడుతుందని ఉద్రేకావేశాలతో ప్రసంగించాను. శ్రీ కంచి పరమా చార్యులు సంతోషించి, ఆంధ్రదేశ శాఖలో నాకు ప్రవేశం కల్గించారు.

శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు అధ్యక్షులుగా ఉన్నప్పటినుండి, నేను ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయకమిటీ సభ్యురాలుగా ఎంపుకోబడి, పరిషత్తు కార్యక్రమా లకు. నా శక్తి వంచనలేకుండా పాటుబడ్డాను.

విశ్వహిందూ పరిషత్తు అఖిలభారత సంస్థకు అధ్యక్షులైన శ్రీ రాజా హైదరా బాదు రాక సందర్భంగా విధి వసూళ్లకు నేను శ్రీగోపరాజు వేంకటేశ్వర్లుగారు శ్రీ

జనార్దన శర్మగారు ఉపద్రష్ట వారు మున్నగు వారితో ఆంధ్రదేశంలో పర్యటన కార్యక్రమం నిర్వహించి చెప్పదగినంత మొత్తంలో నిధిని వసూలు పరవాము హిందూ ధర్మప్రచారార్థమేర్పాటు చేసిన పర్యటన కార్యక్రమంలో మూడేసి రోజులు కూడా పర్యటించేదాన్ని. ఒక్కొక్కపుడు రాత్రి 11 గంటలవరకూ కూడా ప్రసంగ కార్యక్రమాలుండేవి. ఈమని మొదలైన చాలా గ్రామాల్లో వేలకొలదీ జనం నా ప్రసంగాలు వినడానికి వచ్చిన సంఘటనలు ఉన్నాయి.

## ధర్మప్రచారభారతి

ఈ విధంగా పర్యటనలో ప్రసంగాలు నిధివసూళ్ళు మొదలగు కార్యక్రమాలకు చాలా హెచ్చుగా అంటే కుటుంబ కార్యక్రమాలను కూడా లక్ష్యం చేయకుండా నిర్వహించేదాన్ని ఇలా చాలా ఏళ్ళు జరిగిన తర్వాత నేను 1972లో ప్రభుత్వ ప్రతినిధిగా విదేశాలకు వెళ్ళి వచ్చిన తరువాత శ్రీగోపరాజు వేంకటేశ్వర్లుగారు శ్రీ జనార్దనశర్మగారు ఇంకా తక్కిన విశ్వహిందూ పరిషత్కార్యకర్తలు గుంటూరులో పెద్ద సమావేశం ఏర్పాటు చేసి "ధర్మప్రచార భారతి" అనే బిరుదము నిచ్చారు.

ప్రస్తుతం నేను విశ్వధర్మపరిషత్తు గౌరవాధ్యక్షురాలుసుగా ఉన్నాను.

## అవినీతి కమిటీలో సాక్ష్యం
## అయోధ్యలో శ్రీరామ చంద్ర దర్శనం

1968వ సంవత్సరంలో శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు పార్లమెంటు సభ్యులుగా ఉన్న సమయంలో కేంద్రప్రభుత్వం యాజమాన్యంలో అశ్లీలత అసభ్యతలను గూర్చియావద్భారత స్థాయిలో ప్రముఖుల నుండి అభిప్రాయ సేకరణ జరుపవలెననే ఉద్దేశ్యంతో భారత పార్లమెంటు సభ్యులేర్పాటు చేసిన కమిటీముందు సాక్ష్యం చెప్పడానికి భారతస్థాయిలో ప్రముఖవ్యక్తులను అనేక రంగముల నుండి ఆహ్వానించారు. ఈ సాక్ష్యాలకు ప్రముఖంగా మహిలా సభ్యురాండ్రు అత్యంతావశ్యకమని వారు భావించి ముందు ప్రతిరాష్ట్రం నుండి ఒక్కొక్క ప్రముఖ మహిళను ఆహ్వానింపాలను కొన్నారట. కానీ అది ఎక్కువ ఖర్చుతో కూడిందనుకొని ఒకే ఒక ప్రముఖ

మహిళను ఆహ్వానించాలను కొన్నారట. అప్పుడెవరో నా పేరును మాత్రమే సూచించారట. ఆ నిర్ణయం జరిగిన తర్వాత పార్లమెంటు కమిటీవారు నన్నాహ్వానించారు. తర్వాత శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు కూడా ఈ విషయం తెల్పుతూ సాక్ష్యానికి కావలసి అధారాలను ప్రాచీన శ్రుతిస్మృతుల నుండి సేకరించుకొని రావలసినదిగా తెలిపారు. ఆ విధంగానే అశ్లీలత అసభ్యత అనేది ఏ కళారంగంలోనైనా ప్రమాద కారణమే ననే అంశాన్ని ధ్రువీకరించే అంశాలను శ్రుతిస్మృతుల నుండి సేకరించుకొని ఢిల్లీ చేరాను. అక్కడ శ్రీ కంటి వెంకట సుబ్బయ్య (ఆ సమయంలో M.P) గారింట్లో బస చేశాను. శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు శ్రీ వెంకట సుబ్బయ్యగారింటికి వచ్చి 'అమ్మా మీకు ఇంగ్లీషు, హిందీరాదు కదా! మరి మీ సాక్ష్యాన్ని ఎట్లా నిర్వహిస్తారో!" అనే సందేహాన్ని వెలిబుచ్చారు. "ఫరవా లేదు లెండి". ఆ భాషలో నా అభిప్రాయాన్ని వెలిబుచ్చ గలను లెండి అని వారి సందేహాన్ని నివారించాను. ఆ విధంగానే, విజ్ఞులు, బహుశాస్త్రవిదులు అయిన M P లతో కూడిన కమిటీలో అశ్లీల అసభ్య కళలు మానవ సంఘానికే నాశనహేతువులనీ మానవ సంఘానికి శీలమే ముఖ్య ప్రాణమనీ ఆ నైతిక విలువలను పవిత్ర ప్రాచీన భారతీయ సంస్కృతి యందలి త్రికాలావిచ్ఛిన్నమైన సందేశాలను భగ్నం చేసే అశ్లీలత అసభ్యతలను తప్పక నిషేధించి ఆయా ప్రదర్శకులను దోషులుగా పరిగణించి కఠినముగా దండించవలెనని ఆ విధమైనచట్టాన్ని నిర్మాణం చేసి పకడ్బందీగా అమలు పరిచే చర్యలను ప్రభుత్వంగై కొనవలెనని మనుస్మృతి మున్నగు స్మృతులనుండీ ఉదాహరిస్తూ నేను నా సాక్ష్యాన్ని నిర్వహించడమే కాక పార్లమెంటు సభ్యులు వేసిన ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు కూడా హిందీ ఇంగ్లీషులలో కష్టపడి ఇయ్యగల్గాను. పార్లమెంటు సభ్యులంతా నా సాక్ష్యానికి నా సూచనలకూ చాలా ప్రశంసించడమేకాక "అమ్మా లక్ష్మీకాన్తమ్మా చాలా ప్రశంసనీయంగా నీ వాదనను వెలువరించారు. "You have clon well Con gratulations" అని బహువిధాల ప్రస్తుతించారు ఇక తెన్నేటి వారి సంతోషానికి హద్దులేలేవు.

"అమ్మా లక్ష్మీ న్తమ్మగారూ భారత దేశానికంతకూ ఏకైక ప్రముఖ మహిళగా ఈ పార్లమెంటు సంఘము మీకు ప్రాతినిధ్యమిచ్చి ఆహ్వానిస్తే మీకు ఇంగ్లీషు హిందీలు రావని నేనెంతో భయపడ్డాను. కానీ మీ రెంత నిపుణంగా నిర్వహించారు!

అద్భుతం మా కమిటీ వారంతా మీ వాదన పటిమకు మీరిచ్చిన స్మృతుల ఉదాహరణ లకు మీ సూచనలకు ఎంత ఆనందపడ్డారో చెప్పలేను నిజంగా అత్యంత మేధస్యం పదకల మహనీయ వ్యక్తి మీరు! మీ వ్యక్తిత్వము మీ పై దుష్యము ఆంధ్రదేశానికే కాదు. భారత మహిళలకే గర్వకారణం" అని నన్ను అభినందించారు.

ఆ సాక్ష్యం ముగిసిన తర్వాత అయోధ్య వెళ్లాను. ఆ సమయానికి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా ఉన్నారు ధర్మవిగ్రహుడు త్యాగమయ జీవితానికి సార్థకత కల్పించడానికి మూల ప్రకృతితో బాటు ప్రప్రధ మముగా ధరణిపై అవతరించి రాక్షస చక్రవర్తియైన రావణ వధకై సతీమణి తానును పరస్పరము తమ్ముతాము త్యాగమొనర్చుకొనిన ఆ పుణ్యదంపతుల త్యాగమును ఇలలో శాశ్వతగా విలువలతో నిలిపిన అయోధ్యను సందర్శించి పున్నెమును సంత రించుకొని ధన్యురాలను కావలెనను ఆకాంక్ష ఎన్నియేండ్లనుండో నా గుండెలలో పదిలముగా కాపురమున్నది.

## అయోధ్యలో శ్రీరామ దర్శనం

శ్రీ గోపాలరెడ్డిగారికి ముందువ్రాసి లక్నోకు వెళ్ళాను ఆ సమయంలోనే శ్రీ గోపాలరెడ్డిగారి జన్మదినం ఆ సందర్భంగా వారు లక్నోనుండి వారి సతీమణి కాంతమ్మగారితోను కుమార్తె అనూరాధతోను సిబ్బందితోను అయోధ్యకు పయనం చేశారు. వారితోబాటు నేను కూడా వేళ్ళాను సరయూనదిలో స్నానంచేసి అయోధ్య నగరమంతటా వెలసి విలసిల్లుతూ ఉన్నరామాలయాల సందర్శనానికి బయలుదేరాము అయోధ్యలో మర్యాదా పురుషోత్తముడైన శ్రీరామ చంద్రుని ప్రధాన దేవలయానికి వెళ్ళి అక్కడ పూజాది కార్యక్రమాలు నిర్వర్తించాము ఇంకా మేము సందర్శనం చేయవలసిన రామాలయాలు చాలా ఉన్నాయి. ఆ ఆలయాలను కూడా సందర్శించ డానికి అంతా ప్రయాణం అయ్యారు నాకు మాత్రం ఆ ఆలయం విడిచి వెళ్ళాలని పించలేదు. నేను అక్కడే ఉంటానన్నాను. కానీ శ్రీమతి కాంతమ్మగారు "11 గంటలకు ఇక్కడ భజన ఉన్నది. మళ్ళీ వద్దాం అన్నారు. 11 గంటలకు మళ్ళీ వచ్చాము నేను శ్రీరామ చంద్రుని విగ్రహానికెదురుగానిల్చొని, ఆ దేవాలయంలో రామనామజపం చేసుకోవలెననే ఆకాంక్షతో అర్చకుని అడిగి జపమాల తీసుకొన్నాను

వెంటనే శ్రీరామ చంద్రుని విగ్రహంనుండి ఒక కాంతి రేఖవెల్వడి ఓం కాం రూపంతో నా ముందు నిలిచిపోయింది.

## ఆ ఓం కారము మధ్య వంశీధరుడైన బాలకృష్ణుడు

నవ్వుతూ నాదెస చిరునవ్వుల పారిజాతాలను వెదజల్లుతూ ప్రసన్నరుచిరమైన వీక్షణ మాలికలతో నన్ను ఆశీర్వదించిన దృశ్యం బాహ్యస్థితిలోనే ప్రదర్శితమైనది. వెంటనే నాకు అనేక విధమైన పారవశ్యస్థితి కలిగి ఆ జపమాలను తీసికొని అక్కడనే ఒక ప్రక్క కూర్చొని శ్రీరామ నామజపం చేయ నారంభించాను.

నేను బాహ్యస్మృతిని ఒక విధముగా కోల్పోయాను, చాలా పెడ్చానట నా ప్రక్కన కాశీ రాజకుమార్తె ఆసీనురాలై ఉన్నారు. ఆమె ఎన్నిమార్లో నన్ను తట్టి నారట కానీ నా కేమీ తెలియదు రెండు గంటల తర్వాత అర్చకస్వామినాపై కొంచెం నీళ్ళు చల్లారట అప్పుడు నాకు బాహ్యస్మృతి కల్గింది. ఆతన్మయ స్థితిలో నన్ను అక్కడి వారంతా ఒకపాట పాడమని అభ్యర్థింపగా శ్రీరామ లీలలను ధ్వనిస్తూ నేను రచించిన "కరుణ లేక మనగలనా" అనే పాటను పాడాను నాకే ఆశ్చర్యం కల్గించేటంత గంభీరంగా భక్తి రసార్ద్రముగా ఆవేళ నాముఖ గహ్వరంనుండి ఆగీతం వెల్వడి అందరినూ సమ్మోహితులను చేసింది. ఒకటి రెండు నిమిషాలు అంతా ఉత్సుకతో నా గీతాన్ని విన్నారు నేను హిందీలో ఆగీతార్థాన్ని వివరించి చెప్పాను. ఆవేళ 3-4 గంటల వరకు ఏదో విధమైన తదాత్మ్యస్థితి నన్ను విడువలేదు. నేనెంత భాగ్యవంతురాలను

## అహో!ఇతధన్య మభవత్ మే జీవితం

జీవిత సర్వస్వాన్నీ విజువ కట్టలేని భాగ్యవంతమైన సౌభాగ్యం నాకు లభించింది. జీవితాంతం స్మరించి పులకించిపోగల మహనీయస్మృతి అది !!

## అఖిల భారత కాంగ్రెసుకార్యవర్గసభలు

శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి భారతప్రధానిగా ఉన్న సమయంలో గుంటూరులో A I C.C మహాసభలు జరిగాయి. ఆ సభల సందర్భంగా నాకేమైనా సేవావకాశం లభిస్తుందేమోననే ఆశతో నేను గుంటూరు వెళ్ళి మద్ది సువర్ణరంగారెడ్డిగారింట్లో బసచేశాను.

ఆ మహాసభలకు నాయకత్వం వహించిన మంత్రి వర్యులు, శ్రీ పి. తిమ్మా రెడ్డిగారు అనాడు గుంటూరులో కార్యకర్తల సమావేశం జరుపుతూన్నారని తెలిసి నేనూ ఆ సమావేశానికి వెళ్ళాను. శ్రీ తిమ్మారెడ్డిగారితో నాకిది వరకే పరిచయ మున్నది. శ్రీ తిమ్మారెడ్డిగారు ఒక పర్యాయం బాపట్ల వచ్చినపుడు నా ఆహ్వానంపై మా యింటికి ఉదయం టిఫిన్‌కి వచ్చారు. బాపట్లకు ఏ రంగంలో ప్రముఖులు పెద్ద వారు వచ్చినా తప్పనిసరిగా మా యింటికి రావడం మొదటినుండి అలవాటు! తర్వాత కూడా హైదరాబాదు వెళ్తే ఆయనను చూడనిదే తిరుగు ప్రయాణం చేసేదానను కాదు!

గుంటూరులో కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో నన్ను చూచి లక్ష్మీ కాన్తమ్మగారూ మిమ్మల్ని చూడగానే నాకు మహిళా విభాగ నిర్వహణ విషయమై సందేహం తీరిపోయింది. సభా నిర్వహణ విషయంలో మహిళా విభాగం కార్య క్రమాలకు మీరే నాయకత్వం వహించాలన్నారు, చాలా సంతోషం తిమ్మారెడ్డిగారూ మా గుంటూరులో ఏ. ఐ. సి సి. సభలు జరుగుతూంటే నావిధి నేను నిర్వహించాలి కదా! కానీ ఏమేమి చెయ్యాలో నాకు వ్రాతపూర్వకంగా తెలియజేస్తే నేను అట్లా చేస్తా నన్నాను. మళ్లీ సమావేశంలో మీ విధులు ఏమేమో మీకు తెల్పుతామన్నారు. సరే రెండవ సమావేశంలో "మహిళా ప్రతినిధుల వసతి సౌకర్యాలను చూచుకోవడం వారి భోజన సౌకర్యం ఏర్పాట్లు చూడడం మీపని మేము మీకు కావలసిన సౌకర్యాలు అర్థిక వనరులు సమకూరుస్తాం" అని చెప్పారు.

సభలు సమీపిస్తూ ఉన్నాయి. నేను మళ్ళీ గుంటూరు వెళ్ళాను కానీ నాకేమీ బాధ్యతలను ఎవరూ అప్పగించలేదు.

ఇంతలో నేను గుంటూరులో ఉండగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు మహిళా సంఘ అధ్యక్షురాలు గుంటూరు సమావేశాల ఇన్‌ఛార్జీ అయిన శ్రీమతి కాంతాదేవి గారు గుంటూరు వచ్చారు. శ్రీ మద్ది సుదర్శనంగారింటికి వచ్చి వాళ్ళ కోడళ్లతో ఇక్కడ గుంటూరులో బాధ్యతగా పనిచెయ్యానికి ఎవ్వరూ స్త్రీలు దొరకలేదమ్మా" అన్నారు అప్పుడు సుదర్శనంగారి చెల్లెలు శ్రీమతి సోదరి స్వరాజ్య లక్ష్మిగారు కోడళ్ల "ఏమిటి కాంతాదేవిగారూ గుంటూరుజిల్లాలో మహిళా కార్యకర్తలే కరువైనట్లు మాట్లాడుతూ ఉన్నారు" ఇదిగో మహా సాహసికురాలు! దీక్షాపరురాలు! సేవాశక్తి నిజాయితీ కల మా లక్ష్మీకాన్తమ్మగారు! ఆమె ఒక్కతె చాలు? మేమంతా వెనుక

ఉండి సహాయం చేస్తాం! ఆమెతో మాట్లాడండి ఆమెకేపని అప్పగిస్తారో! ఆమెతో మాట్లాడండి" అని నన్ను చూపించారు! శాంతాదేవి వెంటనే విరాళాల రసీదు పుస్తకాలతీసి ముందు విరాళాలు వసూలు చెయ్యండి తర్వాత నేను వస్తూంటాను మనం కలిసి మాట్లాడుకొని చేయవలసిన పనులు నిర్ణయిద్దాం! అన్నారు. "శ్రీ తిమ్మారెడ్డిగారు ఆర్థిక సహాయం తదితర సహాయాలూ తామే చేస్తామన్నారే మీరు నన్ను విరాళాలు పేకరించమంటారేమిటి అన్నాను. నేను! 'ఓహో మీరపుడే తిమ్మారెడ్డిగారితో మాట్లాడరన్నమాట! అయితే యింకేం? సరే మీకన్నీ తెలిసే ఉంటాయి! అయినా ఈ విరాళాలు సభా నిర్వహణకొరకు మనం చేసుకోవాలి!" "అని చెప్పినాకా పుస్తకాలప్పగించి వెళ్ళి పోయారు! గుంటూరు స్థానిక మహిళా విభాగానికి శ్రీమతి కొండా" పార్వతీదేవిగారధ్యక్షురాలు! నేనొక ఉపాధ్యక్షురాలను గుంటూరులో పనులు (మహిళా విభాగం పనులు) పనులకు నేనే పర్యవేక్షురాలను! ఆనాటి నియామకాలవి! తర్వాత శాంతాదేవిగారు కానీ పార్వతీదేవిగారు కానీ నాకు కనబడలేదు. సమావేశం ఇంక మూడు రోజులున్న దనగా "కాంగ్రెసు ఆహ్వాన సంఘ సమావేశం మహిళా విభాగం పక్షాన్న మీరు గుంటూరుకు రావలసిందని నాకు బాపట్లకు ఒక నోటీసు వచ్చింది! నేను గుంటూరు వెళ్ళాను గుంటూరులో మహిళా కళాశాల స్త్రీలకు వసతి గృహమనీ ఒకరోజు ముందగా మహిళల భోజనానికి టిక్కెట్లు అక్కడ నిర్వహణకు సిబ్బంది ఫోను, కారు, బస్సులు అన్ని ఇస్తామని చెప్పారు. సరే నేను రేపు సభ అనగా మహిళాకళాశాలకు వెళ్లాను. అక్కడ ఏమీ ఏర్పాట్లు లేవు సిబ్బందిలేదు. పరిస్థితి అయోమయంగా ఉన్నది. వెంటనే కాంగ్రెస్ ఆఫీసుకువెళ్ళి కొంతమంది సిబ్బందిని తీసుకొని వచ్చి అంతా తుడిపించి గదులపై జిల్లాల పేర్లతో అట్టలు అమర్చి మంచినీటి సౌకర్యం చూసాను. మరునాటి ఉదయం డెలిగేట్లు రావడం మొదలు పెట్టారు. వాళ్ళకు సౌకర్యాలు చూస్తూండగా కర్నూలు డెలిగేట్ల గదిలో దిగిన వారి సామాను దొంగతనం జరిగిందని నాకు కబురు వచ్చింది.

నాకేం చెయ్యాలో తోచలేదు. ఎవరినీ గదులు విడిచిపెట్టి వెళ్ళవద్దని చెప్పి అప్పుడు మంత్రివర్గంలో ఉన్న శ్రీ బస్సు గురుమూర్తిగారి మకాముకువెళ్ళి ఆయనట్రాన్స్పోర్టు ఎలెక్ట్రిసిటీ సప్లై విభాగం చూస్తూ ఉండడంవలన ఆయన నభ్యర్థించి మహిళా వసతి గృహానికి ఫోను రెండు బస్సులు ఒక జీపు తెప్పించుకొని కాంగ్రెస్ ఆఫీసుకువెళ్ళి

వలంటీర్లను గైడ్సును తీసికొని వచ్చాను. అప్పటికే నాలుగు వందలమంది డెలిగేట్లు వచ్చారు. భోజనవసతి తెలియలేదు. అప్పుడొక గైడు అ ప్రక్కనందులో కాంగ్రెసు వారి భోజనశాల ఉన్నదని చెప్పగా జీపుమీద వెళ్ళి అక్కడ మాట్లాడాలని వెళ్ళగా తీరా చూస్తే ఆ భోజనశాల కధికారి చీరాలవాస్తవ్యులు, జనాబ్ అలీ బేగ్‌గారు! వారు నన్నుచూచి అమ్మా భోజనం ప్యాసుపుస్తకాలియ్యలేదా అయ్యో మీరొక్కరే ఎట్లా అవస్థపడుతున్నారు! ఉండండి నేను కొన్ని చీట్లిస్తాను. దాని మీద మీరు సంతకం పెట్టి స్త్రీలనందరను ఇక్కడకు పంపండి నేను ఈ పూటకు ఎంతమంది వచ్చినా భోజనం పెట్టిస్తాను. రాత్రినుండి ప్యాసులు ఏర్పాటు చేసుకోండి. అని చెప్పారు! బ్రదుకు జీవుడా! అని బస్సులపై అప్పటికి ఉన్న మహిళలందరను భోజనానికి పంపించివేసి జీపుతీసుకొని కాంగ్రెసాఫీసుకు వెళ్లాను.

అక్కడ ఎవరినడిగినా మాకు తెలియదండీ, మాకు తెలియదండీ అనే వారే కానీ ఎవ్వరూ ఏమీ సాయం చెయ్యలేదు. అయితే నేను ఈ పదవికి రాజీనామా ఇస్తూ ఉన్నాను. అ శాంతాదేవిగారూ పార్వతీదేవిగారూ ఎక్కడ ఉన్నారో తెలియదు! శ్రీ తిమ్మారెడ్డిగారు నాకు అన్ని సౌకర్యాలూ సమకూరుస్తామంటే నేను సరేనని ఈ పనికి పూనుకొన్నాను ఇప్పుడాయన కనబడ్డంలేదు. అక్కడ పూటకు వెయ్యి పదిహేను వందల మహిళలు పిల్లలతోసహా భోజనానికి తయారుగా ఉన్నారు! నేనేం చెయ్యాలి? ఇదిగో నా రాజీనామా ఎవరికిస్తారో ఇవ్వండి నేను వెళ్ళిపోతూ ఉన్నాను. ఆ మహిళా డెలిగేట్ల భవనానికి నాకూ ఇంకసంబంధంలేదు." అని గిరుక్కున వెనక్కు తిరిగేటప్పటికి ఒకరు వేలుపెట్టి ఒకగది చూపించారు. సరే ఇక తిమ్మారెడ్డిగారు అందులో ఉన్నారనుకొని వెళ్ళి అ తలుపులు బాదీ, బాది కేకలు వేశాను. దానితో తిమ్మారెడ్డిగారు తలుపులు తీయించి బయటకు వచ్చి "అమ్మా ఏం చెయ్యమంటారు? అవ్యానికిమించి జనం వచ్చారు. మేము ఏమీచెయ్యలేకపోతూ ఉన్నాం? మహిళాక్యాంప్ మాట మరచిపోయాం, మావిపొరపాటు! అని చెప్పి 5 వేల భోజనం ప్యాసులు, 25 కారు ప్యాసులు, సభా ప్రవేశానికి ఒక వెయ్యి పాసులు, ఒక బ్యానరు, డెలిగేటు గుర్తింపు పువ్వులు అన్నీ వెంటనే యిప్పించి అమ్మా నీవు సాహిత్యాది కళలలోనే ఎదురులేని దానివని తెలుసుకొని ఇంత కార్య

దీక్ష సేవాసక్తికల దీట్టవని తెలిసిందమ్మా, చూడు ఇంకేమైనా లోటువస్తే ఈ నెంబరుకు ఫోను చెయ్యి!" అని ఫోను నెంబరు నిచ్చి ఇద్దరు ముగ్గురు పోలీసులనిచ్చి నన్ను పంపేశారు! దానితో గుంటూరు నగరమంతా ఈ విషయం మల్లెల పరిమళంలా వ్యాపించి ఎందరో నన్ను ఫోనులో ప్రశంసించడం మొదలు పెట్టారు. జరిగిన విషయం తెలుసుకొని శాంతాదేవి కారువేసుకొని మహిళా వసతి గృహానికి వచ్చి" చూశమ్మా నీలో ఇంత కార్యదీక్ష దాగివున్నదని తెలియదు. నీవీక్యాంపు చూసుకో నేను ఇందిరా గాంధీని Recieve చేసుకోవడానికి విజయవాడ వెళ్తాను. అని కూడా అన్నది. నాకు భలే ఒళ్లమండిపోయి ఆమె చీరగట్టిగా పట్టుకొని "ఏమమ్మా పెద్ద మనిషీ, మహిళా విభాగానికి అధ్యక్షురాలివై యుండి గుంటూరు వచ్చి పార్వతీదేవిగారి యింట్లో కూర్చొని విందుభోజనాలు గుడుస్తూ ఇంకా నీవీక్యాంపు చూసుకోమని చెప్పడానికి వచ్చావా? నేను ఇక్కడి ఆహ్వాన సంఘంలో ఉపాధ్యక్షురాలిని! నేను ఈ Camp తో ఎన్నిపాట్లు పడ్తూన్నానో నీవు కానీ పార్వతీ దేవిగారు కానీ ఒక్కమారు ఆలోచించారా? ఇప్పుడిందిరా గాంధీ కోసం వెళ్తున్నానని చెప్పడానికి నోరెట్లా వచ్చింది. నీవు ఈ క్యాంపు చూసుకో, విజయవాడకు నేను వెళ్తాను అని బాగా గట్టిగా మాట్లాడి ఆమె యెక్కి వచ్చిన కారు నేనెక్కి డ్రైవర్ విజయవాడే పోనీ అన్నాను. దానితో ఆమె

## కళ్ళకుక్రమ్మిన అధికారపు పొరలు విడిపోయి

కాళ్ల బేరానికి వచ్చి 'అమ్మా బుద్ధితక్కువైనది. నిన్ను కూడా తీసుకొని వెళ్తాను మా తల్లీ నేను వెళ్ళకపోతె నా పదవి ఊడిపోతుంది" అని బ్రతిమలాడు కోవడం మొదలు పెట్టింది. సరేనని ఇద్దరమూవెళ్ళి శ్రీమతి గాంధీని గుంటూరు తీసుకొని వచ్చి ఆమెను బసలోదింపి, ఇద్దరమూ మహిళావసతి గృహానికి వచ్చాము. ఇంకనేను శాంతాదేవిని ఎక్కడకు వెళ్ళనీయకుండా అక్కడనే ఆపి ఇంటిదగ్గర పిల్లలేమైపోయారో ఈ రాత్రికి నేను బాపట్లవెళ్ళి చూచి మళ్ళీ ఉదయానికి వస్తానని చెప్పి కారుమీద ఒక మారు సభ జరిగే పెండాలు వెళ్లిచూచి బాపట్లవచ్చి ఇల్లు చూసు కొని పిల్లలను తీసుకొని ఆ మర్నాడు ఉదయానికి మళ్లీ గుంటూరు చేరాను.

రెండోనాడు సాయంకాలం హైదరాబాదు నుండి వచ్చిన భాగ్యవంతురాండ్రైన

మహిళా డెలిగేట్లు మహిళా వసతి ఏర్పాట్లు బాగుండ లేదని గోలగోలగా అరుస్తూ ఒక మీటింగుపెట్టి నాపై ఆరోపణలు చేయడం మొదలు పెట్టారు. సంగతులన్నీ తెలిపిన డెలిగేటు ఒకామె ఇందులో లక్ష్మీకాంతమ్మగారి పొరపాటు ఏమీలేదు. అసలు అధి కారి శాంతాదేవి. ఆమె కొండా పార్వతీదేవి గారింట్లో ఉన్నది. వెళ్ళి ఆమెను పట్టుకోండి." అని చెప్పినా వినక తిమ్మారెడ్డిగారి దగ్గరకు వెళ్ళారట. ఆయన వాళ్ళను మందలించి "లక్ష్మీ కాన్తమ్మగారు అక్కడ ఉండబట్టే మీకు ఆ మాత్రం సౌకర్యాలు లభిస్తున్నాయి. ఆమె మీరు తొందరపడినట్లు తొందర పడి, కేకలు వేసేది కాదు. మీరు వెళ్ళి సౌమ్యంగా ఆమెతో మాట్లాడితే, ఆమె మీకు అన్నీ సదుపాయాలూ చేస్తుంది." అని చెప్పి పంపారట వాళ్లు మళ్లీ వసతి మందిరానికి తిరిగి వచ్చి క్షమాపణలు చెప్పుకొన్నారు. నేను వాళ్ళకి, నా విధిగా భావించి కారు ప్యాసులు, గదులూఅన్నీ సమకూర్చివారిని శాంతింపజేశాను. ఇక మూడవ రోజు ఇందిరాగాంధీ సందేశసభ మూడవరోజు ఉదయం శాంతాదేవి ఆ సభా మందిరానికి వెళ్తే అక్కడ ఏమీ ఏర్పాట్లు జరుగలేదట. ఆమె గాభరా పడిపోయి నా దగ్గరకు పరుగెత్తికొని వచ్చింది. నా కదేమీ తెలియనందున ఆ పనులేమి చెయ్యాలో కూడా నాకు తెలియ లేదు. అప్పుడు శ్రీ మద్ది సుదర్శనంగారి యింటికి వెళ్ళి అక్కడ వారి సిబ్బందిని తీసుకొని వెళ్ళి అక్కడ ఏర్పాట్లు చేయించాను. అయితే శాంతాదేవిగారితో "నేనే ఇందిరాగాంధీకి మొదట స్వాగతం చెప్పాలి, నేనే మొదట దండ వెయ్యాలి ఆమెకు నన్ను మొదటిగా పరిచయం చెయ్యాలి". అనే విషయలు ఒప్పందం చేయించు కొని మరీ ఆ ఏర్పాట్లు చేశాను.

ఆమె కూడా అట్లానే చేశారు. ఇన్ని ఇబ్బందులు పడి A I.C ఇన్ని ఇబ్బం దుల కోర్చి మహిళా వసతి సౌకర్యాలు, సరిగా నిర్వర్తించాననే సంతృప్తితో నేను బాపట్లకు తిరిగి వచ్చాను.

## సాళము కృష్ణ రాయ విజ్ఞాన సర్వస్వము

శ్రీమా నాయనగారు తాను సృజనాత్మకంగా సృష్టించిన గోరు ముద్దలు వెన్న బుడగలు తేనె చినుకులు మొదలైన బాల వాఙ్మయమే కాక తెలుగు సాహిత్య ప్రపం

చమున మహాకవి ప్రయోగములలో కోకొల్లలుగ వెల్లివిరిసియున్న సామెతలు న్యాయ ములు లోకోక్తులు జాతీయములను సేకరించి యున్నారు. అంతేకాక అనేక కానేక విషయ ప్రపంచమునుఆయాకవివరేణ్యులు ఆంధ్ర సాహిత్యమున ఎట్లు వర్ణించి వివరించి యుండిరో ఆ వస్తు వివరము నంతను 240 మకుటముల క్రింద విభజించి ఉద్ధరించి యుండిరి. వారు మరణ శయ్యపై నుండగా నాచే ఆ సేకరణ గ్రంథ మును తెప్పించి నాచేతిలో నుంచి కళ్ల నీళ్ళు పెట్టుకొనిరి. ఆ స్థితిని చూచి నేనును నిర్వేదమును చెందీ, దానిని ముద్రణ చేయించే ఆర్థిక పరిస్థితి నాకు లేదని తెలిసియు కష్టపడి యైనా ముద్రణ చేయించ గలనని వారికి మాట యిచ్చాను.

కానీ అనేక సంవత్సరములా త్రవాత ప్రతిని అట్లనే యుంచి వేసినాను. కడకు ధైర్యముచేసి శ్రీ గోపాలరెడ్డి గారికి శ్రీరామానుజరావుగారికే చూపగా ముద్రణకు 4,000-00 రూ. లను ఆదరంతో ఇయ్యడానికి వారంగీకరించారు.

ఆ ప్రతిని శ్రీబిరుదు రామరాజుగారు చూచి కృష్ణరావుగారు ఈ సంపుటము నకై వేసుకొన్న పథకము చాలా గొప్పది. కానీ చాలా మకుటములు అసమగ్ర ములుగా ఉన్నవి. ఇది రెండవ సంపుటములని వారే వ్రాసి యున్నారు. మీకురెండవ సంపుటము లభింపలేదు. కావున మీరు శ్రమించియైనా ఆ మకుటములననుసరించి,ఆంధ్ర వాఙ్మయాన్ని పూర్తిగా అవలోకనము చేసి తక్కిన విషయాలను సముద్ధరించి ప్రచు రణ చేయండి. లేకపోతే మరొకరెవరైనా, ఈ గ్రంథాన్నాధారంగా తీసుకొని ఇంకొక సంపూర్ణ విజ్ఞానసర్వస్వ గ్రంథాన్ని ప్రచురిస్తారు. అప్పుడింతగా శ్రమించిన శ్రీ కృష్ణరావు గారి కృషి వ్యర్థమౌతుంది. అంతేకాదు ఏ ఇతర భాషా వాఙ్మయము లందూ జరగని ఈ అపూర్వకృషికి సార్థకత ఉండదు. అని సలహా యిచ్చారు. నేను అప్పుడు కేంద్ర సాహిత్య ఎకాడమీలో కూడా సభ్యురాలను ఈ గ్రంథాన్ని చూచి అక్కడి సభ్యులుకూడా ఇట్టి సలహానే ఇచ్చారు. "ఇది అపూర్వమైన సేక రణ గ్రంథం! ఒక్కరుగా ఇంతకృషి చేసిన కృష్ణరావుగారి భాషా సేవ చాలా ప్రశంసనీయం! అని ప్రశంసించారు.

శ్రీ బిరుదురామరాజుగారి సలహా ననుసరించి సాహిత్య విషయాలలో నాతో సంప్రదించడానికి తరుచుగా మాయింటికి వచ్చే యువపండితుడు శ్రీనందిపాటి దీన

బంధుగారిని పిలిపించి ఆయన సహాయముతో శ్రీకృష్ణరావుగారి ప్రణాళిక ననుస రించి అనేక విషయములను మరల గ్రంథముల నుండి సముద్ధరించి రాజమహేంద్రీ వాస్తవ్యులు శ్రీసంపత్కుమారబంగ్‌వారి నభ్యర్థించి తక్కువ రేటుకు కాగితము లభించే ఏర్పాటుచేసి 800 పుటలు గల ఆ మహా విజ్ఞాన సర్వస్వాన్ని ముద్రించే ప్రయత్నం చేశాను. గుంటూరులోని వెల్‌కమ్ ప్రెస్సువారు ముద్రించి యివ్వుట కంగీకరించినారు. ఆ సమయానికి గుంటూరులో ఉంటూ ఉన్న చిరంజీవి బొడ్డు పల్లి పురుషోత్తం ప్రూపులు చూడ్డానికి అంగీకరించినాడు. ఈ మహాప్రయత్నం (ఒక విధంగా ఉద్యమంలాంటిది) ఒక రూపానికి వచ్చిన తర్వాత రెండేళ్ళుగా, ఎంతో శ్రమ పెట్టిన ఈ గ్రంథ ముద్రణ కార్యానికి ఒక స్థిరరూపం ఏర్పడిన తర్వాత నేను 'హమ్మయ్య' అనుకొని సంతృప్తిపడ్డాను. 1972 ప్రథమార్ధంలో ఈ కార్యం ఇట్లాసాఫల్యాన్ని సంతరించుకొన్నది.

ఈలోపుగా 1968లో ప్రథమ ముద్రణ భాగ్యాన్ని పొందిన శ్రీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాత (సంస్కృత)

## అభినవ వివేకానంద

కావ్యాన్ని 1970 ఆ ప్రాంతాల్లో నేనూ నా పెద్ద కుమార్తె సుహాసిని పాడి (గ్రామఫోను) రికార్డు చేయించిన రికార్డులను తీసికొని అమ్మి వారి సుప్రభాత ప్రచారార్థము నేను నంద్యాల, కర్నూలు. హిందూపురం, అనంతపురం, మడకసిర, బళ్ళారి మొదలైన నగరాలకు వెళ్ళినపుడు నంద్యాల వాస్తవ్యులైన శ్రీ రాజా పెదసుబ్బారాయడుగారు అచ్చట జరిగిన నా ప్రసంగానికి నంద్యాలయందలి చిన్మయ మిషన్ వారి నాహ్వానించారు వారు నా ప్రసంగములకు ప్రభావితులై భగవద్గీత యందలి కర్మయోగమును గూర్చి మా చిన్మయ మిషన్‌లో ఒకమారు ప్రసంగించ వలెనని కోరారు. నేను పర్యటనలో ఉన్నందున పై నగరాల్లో పర్యటన పూర్తి చేసుకొని తిరిగి వస్తూ మరల నంద్యాలలో ప్రసంగించగలనని చెప్పి హిందూపురము మొదలైన నగరాలకు వెళ్ళి తిరిగివస్తూ నంద్యాలలో దిగాను చిన్మయ మిషన్‌వారు ప్రక్క గ్రామాలకు కూడా బాగా ప్రచారం చేశారు. రెండెడ్లబండ్లు కట్టించుకొని

ప్రక్క గ్రామాలనుంచి కూడా వచ్చిన జనానీకాన్ని చూచి నేను ఈ మహాసభయందు కర్మయోగాన్ని గూర్చి ప్రసంగించి మెప్పించగలనా అని చాలా భయపడ్డాను కానీ అన్నింటికీ ఆ సరస్వతమ్మ తల్లి ఆ శ్రీరామ చంద్రుడే ఉన్నాడనే అచంచల విశ్వా సంతో ప్రసంగం ప్రారంభించాను. చిన్మయానంద మిషన్‌వారి నియమం ప్రకారం 45 నిముషాలకంటె ప్రసంగాన్ని ఎక్కువగా కొనసాగించరాదట. ఈ నియమాన్ని వారు నాకు ముందే తెలిపారు. నేను నా చేతివాచీ చూచుకొంటూ సరిగ్గా 45 నిము షాలకు నా ప్రసంగాన్ని ఆపుచేశాను. కానీ కార్యకర్తలు ఇంకొక 45 నిముషాల వ్యవధి తీసికొని ప్రసంగించమని అభ్యర్థించారు. మళ్ళీ 45 నిముషాలు ప్రసంగం జరిగింది. అప్పటికే శ్రోతలు ఒక విధమైన తన్మయ స్థితిలో ఉన్నారు. ఆపే గమ నించి కార్యకర్తలు ఇంకా కొంత సమయం ప్రసంగించవలసినదిగా అభ్యర్థించారు. మరల ఇంకొక అరగంట సమయం తీసుకొని నా ప్రసంగాన్ని కొనసాగించి ఆపి వేశాను. నా ప్రక్కనే అధ్యక్షులుగా కుర్చీలో కూర్చొనియున్న శ్రీ రాజా పెద సుబ్బ రాయడుగారు మన లోకంలోనికి రాకుండా ఒక తన్మయత్వస్థితిలో పరమానందాన్ని అనుభవిస్తూ ఉండిపోయారు. అక్కడ ఉన్న యావన్మంది జనం 'అమ్మా ఉప న్యాసం అయిపోయిందా? ఇంతసేపూ మమ్మల్ని ఏలోకాలకు తీసికొని వెళ్లావు; తల్లీ నీవు అపరవివేకానందుడవమ్మా, చిన్మయానందుడు తెలుగులో ఉపన్యసించాడా అనే అనుభూతిని పొందామమ్మా. ఎంత సుకృతం చేసుకొంటేనో కానీ ఇంత గహన మైన ఆధ్యాత్మిక విషయాన్ని ఇంత సరళంగా ఇంతమృదు మధురంగా చెప్పలేరమ్మా అని పొగిడారు.

శ్రీ ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రియైన క్రొత్తలో నెల్లూరు వారి ఆహ్వానంపై నెల్లూరు వచ్చిన రోజున శ్రీ సుంకు వారి అతిథిగా నేను నెల్లూరులో ఉన్నాను టౌనుహాలు వెనుక ఉన్న స్థలంలో ఆంధ్రకేసరి అభినందన సభను ఏర్పాటు చేశారు.

సాహసాంకమూర్తి, వీర దసావతారకీర్తి తమ ప్రియతమ నాయకుడైన ఆంధ్రకేసరిని సందర్శించుకొని అభినందించాలనే తహతహతో ఇసుకవేస్తేరాలనంత జనం వచ్చారు. శ్రీ పంతులుగారిరాక ఆలస్యమైనది. జనుల యొక్క సంరంభము

ప్రేక్షకులకే ఉత్సాహభరిత వాతావరణము ఒక విధమైన సంచలనానికి దారితీసింది. ఆ సంరంభ సమయంలో కార్యకర్తలు సుంకు శంకర్‌గారూ నా వద్దకు వచ్చి శ్రీ పంతులుగారు వచ్చే వరకూ మీరీ అపార జనసందోహాన్ని నియంత్రణం చెయ్యాలన్నారు. ఆ జనాన్ని అల్లరి చేయకుండా నేను ఆపగలనా? అని భయపడ్డాను. ఆ సంగతినే వారితో అన్నాను. అంతకు క్రితం జరిగిన వేదం వేంకట్రాయ శాస్త్రి గారి ఉత్సవాల్లో ఇంకా ఇతర ప్రసంగావసరాల్లో నాశక్తి వారు చవిచూచే ఉన్నారు. మీరు మాట్లాడకపోతే ఈ జనాన్ని మేము పట్టలేము. అని ఒత్తిడిచేసి నన్ను వేదికమీదకు తీసికొనివెళ్ళి మైకుముందు నిలువబెట్టారు. భగవత్ప్రార్థన చేసుకొని మహాశయురాలా" అని ప్రసంగాన్ని ప్రారంభించాను. అన్ని వేలమంది జనం చిత్రప్రతిమలవలె నిలువబడి చెవులొగ్గి నిశ్శబ్దంగా విన్నారు.

ఇవన్నీ ఇట్లా ఉండగా కుటుంబ విషయాలు కొంత తెలియజేస్తాను మా రెండవ కుమారుడు రాజరాజ నరేంద్రుడు' మైక్రోవేవ్స్ Subject తో బెంగుళూరులో M.E పూర్తి చేసిన తర్వాత కెనడాలో వాటర్లూ యూనివర్సిటీలో P.H D చేయడానికి అవకాశం లభించింది. P.H.D. పూర్తి అయిన తర్వాత మాతృభూమికి భారతదేశానికి తిరిగివచ్చాడు. అతనికి పెండ్లి చేయవలెనని చాలా సంబంధాలు చూచాము. ఆఖరుకు కాకినాడ వాస్తవ్యులు శ్రీముత్తా వేంకటేశ్వరరావుగారి కనిష్ఠ పుత్రిక సౌ॥ మాలతితో 1970 ఆగస్టు 8వ తేదీనాడు వివాహం జరిగింది.

చి॥ నా ప్రథమ పుత్రుడు ప్రతాపునకు ప్రథమ భార్యా వియోగం కలగడం వలన 1973లో వండూరు వాస్తవ్యులు శ్రీ వల్లభోతు వేంకటేశ్వర్లుగారి ప్రథమ పుత్రిక సౌ॥ ఆదిలక్ష్మితో వివాహం జరిగింది.

19·7లో మా ప్రథమ పుత్రిక సౌ॥ సుహాసినికి చిత్తూరు మండలం చదుము గ్రామ వాస్తవ్యులు శ్రీ పోలేపల్లి గోపాలకృష్ణయ్యగారి పుత్రుడు శ్రీ హరనాధ్ B Sc గారితో వివాహమైనది.

పరే ఇవి ఇట్లా ఉండగా తక్కిన ఇద్దరు పిల్లల వివాహములను గూర్చి తర్వాత చెప్పుకొందాము.

మా రెండవ అబ్బాయికి కెనడా విండర్స్ యూనివర్సిటీలో అసి ప్రొఫేసరుగా

ఉద్యోగం రాగా ఆ అబ్బాయి నరేంద్ర పెండ్లి కాగానే కెనడా దేశంలోని విండ్సర్‌కి వెళ్ళిపోయాడు.

మా రెండవ కోడలు సౌ॥ మాలతి తర్వాత తన రెండవ అన్నగారైన పుత్తా రమణ మూర్తికి న్యూయార్కులో డాక్టరుగా ఉద్యోగం రాగా ఆయనతో అమెరికా వెళ్ళి, అక్కడ నుండి కెనడాకు భర్త దగ్గరకు వెళ్ళింది.

మా పెద్ద కోడలు నండూరులో పెండ్లికి ముందు తాను చేస్తూన్న టీచరు ఉద్యోగమే కొనసాగిస్తూ ఉండి పోయింది.

మా పెద్ద కుమార్తె M A తెలుగు యూనివర్శిటీలో మూడవ స్థాయిలో కృతార్థురాలై ఏలూరులో సెయింట్ థెరిస్సాస్‌లో తెలుగు Head of the Depat ment గా ఉద్యోగం చేస్తూ ఉన్నది మా పెద్ద అల్లుడు శ్రీ హరనాథ్‌గారు పశ్చి. గోదావరి జిల్లా వ్యవసాయ శాఖా కార్యాలయంలో ప్రస్తుతం Asst. Directorగా పనిచేస్తూ ఉన్నారు. మళ్ళి నా సేవా కార్యక్రమాల్లోకి వద్దాం.

ఇంక ఇప్పుడు ముఖ్యంగా వ్రాయవలసినది

## నా విదేశీ పర్యటనం

1972 జూన్ 1 వ తేదీనాడు కేంద్ర ప్రభుత్వం సాంస్కృతిక వినిమయ పర్యటన శాఖవారి నుండి భారతదేశ స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా విదేశ పర్యటనకు ఎంపిక చేసే కార్యక్రమంలో నన్ను కూడ ఎంపిక చేసినట్లు, ఉత్తరం వచ్చింది. అది చూచి నేను మా కుటుంబం వారమంతా చాలా ఆశ్చర్యపడ్డాము.

ముఖ్యంగా ఇంగ్లీషులో అధమ పక్షం సంభాషణ కూడా చేయలేని నన్ను ప్రభుత్వం ఎంపిక చేయడ మేమిటి ? నేను వెళ్ళి అక్కడేల్లో చేయగల్గేదేమిటి? అని నేను చాలా ఆశ్చర్య పడడమే కాదు. ఏమి చెయ్యాలి! ఆ పర్యటనను అంగీకరించ డమా? లేక తిరస్కరించమా అనే తీవ్రమైన ఆలోచనలో పడ్డాను. కాని వెంటనే “దైవ నిర్దేశితంగా ఈ ఎంపిక జరిగింది. భారతీయుల కెవరికైనా మిక్కిలి ఆక ర్షణ దాయకమైన ఈ విదేశీ పర్యటన నేను కోరకపోయినా అయాచితంగా నాకు లభించినపుడు నేను ఎందుకు కాదనాలి?” అనే భావన నాకు కల్గింది. వెంటనే

అంగీకరిస్తూ సాంస్కృతిక వ్యవహార వినిమయశాఖ వారికి నా అంగీకరం తెల్పుతూ ప్రత్యుత్తరం వ్రాశాను.

1972 ఆగస్టు 1[illegible]వ తేదీనాడు ఢిల్లీ నుండి ఉదయం 9 గంటలకు విమానంలో బయలు దేరి రాత్రి 8 గంటలకు తూర్పు జర్మనీలోని బెర్లినుకు చేరాను. ఆగస్టు 15 వ తేదీనాడు జర్మనీలో జరిగిన భారతదేశ స్వాతంత్ర్య రజతోత్సవాలను చూచిన తర్వాత మా పర్యటన కార్యక్రమం మొదలైనది. జర్మనీలో, 'స్టాట్ బెర్లిన్' అనే 37 అంతస్థుల హోటల్‌లో, 24వ అంతస్థునందలి 17వ నెంబరు రూమును నాకిచ్చారు. జర్మనీ విదేశాంగ కార్యాలయాధికారి మట్యోవ్, వారి పర్సనల్ అసిస్టెంట మిసెస్ అర్నాయిట్ జర్మనీలో నేను చూడదలచిన ప్రదేశాలేమిటో, సందర్శించాలను కొన్న వ్యక్తులెవరో తెలుసుకొని, ఆవిధంగా నా కార్యక్రమం రూపొందిపజేయడానికి ఆహోటల్ కు వచ్చారు.

"భారతదేశంనుండి, ఎందరెందరినో, వేదపండితులను సంస్కృత పండితులను జర్మనీ ప్రభుత్వం తీసికొనివచ్చి, వేద విజ్ఞానాన్ని అభ్యసించిందని విన్నాము. అట్టివారిని సందర్శించాలని, నాప్రథమ వాంఛ, తర్వాత సంస్కృత విద్యాభ్యాసం కోసం స్థాపించిన సంస్థలుంటే, అవి సందర్శించాలని కూడా, నాచిరకాల వాంఛ. అదీకాక, ఇక్కడి మహిళా నాగరికత, సంస్కృతీ సాంప్రదాయాలకు నిలయాలైన మహిళా సంస్థలను కూడా చూపించండి అని నేను వారినడిగాను.

అసలు భారతదేశం నుండి, సాహిత్యపరంగా, భారత ప్రభుత్వం ఈ పర్యటనకు ముఘ్వురను ఎంపిక చేసింది.

అందులో కాశ్మీరదేశానికి చెందిన, మహాపండితుడు మిష్టర్ పుష్ప (ప్రొఫెసర్) ఒకరు. పంజాబీ కవయిత్రి, అమృతాప్రీతమ్ ఒకరు. ఈయిద్దరూ మొదట్లో రాలేదు. ఆకారణంగా, ముందు నా అభీష్టాన్ననుసరించి రూపొందించిన కార్యక్రమం ప్రకారం, ప్రప్రథమంగా బెర్లిన్ యూనివర్సిటీ నుండి, రిటైరైన, ఓరియంటల్ డిపార్టుమెంటు ప్రొఫెసర్ రూబెన్ మహాశయుని దగ్గఱకు తీసుకొని వెళ్ళారు. ఆయన స్ప్రేనదీ తీరమున ఉన్న రవీంద్రనాథ్ టాగోర్ వీధిలో 25వ నెంబరు ఇంట్లో నివాసమున్నారు. సరిగ్గా ఎపాయింటుమెంటు సమయానికి, ఆయన తనయింటి

ముంగిటివీధిలోనికి వచ్చి నిలబడి, ఎంతో ఆదరంతో, నాకు స్వాగతంపలికి లోపలికి తీసుకొని వెళ్ళారు. ఆమహాపండితుడు, కాళిదాసుని రచనలన్నింటిపై అధికారికమైన వ్యాఖ్యలను, భారతీయ సంస్కృతిని సమర్థిస్తూ, వ్రాసి ప్రచురించిన మహావిద్వాంసుడు ఆయన నన్నుచూచి, అమ్మా, రాకెటువేగంతో అధునాతన నాగరికతా ప్రపంచంలోకి దూసుకొని వెళ్తూఉన్న, మా పాశ్చాత్య దేశాలకు వేదకాలపు ముత్తైదువైన. నిన్ను ఏ ఉద్దేశంతో భారతీయ ప్రభుత్వం, ఇక్కడకు, పంపినదమ్మా అని అడిగి, వెంటనే మళ్ళీ తానే, మీ ప్రాచీన కావ్యపరంపర యందలి వర్ణితమైన భారతీయ సంస్కృతికి, తదనుగుణంగా జీవించి, తామనుసరించిన జీవన విధానమునే యావత్ప్రపంచానికి అమృత సందేశముగా పంచిన, శకుంతల, ద్రౌపది, సీత, దమయంతి మున్నగు సాధ్వీమ తల్లుల ఉజ్వల చరిత్ర సౌందర్యాన్ని కంఠదఘ్నముగా ఆ స్వాదించి ఆ విషయాలపై ప్రామాణికంగా అధ్యయనం చేసిన, మహావిదుషీమణులు మీరని తెలిసినది. మిమ్మ ఒక సాంస్కృతిక రంగసభ్యురాలుగా ఎంపిక చేసుకొని యీ పాశ్చాత్య దేశాలకు భారత ప్రభుత్వం పంపినందుకు మీ ప్రభుత్వాన్ని ప్రశంసిస్తూన్నాను. నానుండి ఏమి తెలుసుకోగోర్తూన్నారో చెప్పండి." అన్నారు. నాకు ఇంగ్లీషులో మాట్లాడడం. అదే ప్రథమం, నేనుకొంచెం ఆలోచిస్తూ ఉండగా 'ఆయనే, మళ్ళీ "అమ్మా, ముందు నన్ను చెప్పనీ ఇంకా యేమైనా అడగవలసిఉంటే మీరు అడుగ వచ్చును.

ముందు శకుంతలను గూర్చి మాట్లాడుకొందాం అరణ్యంలో శకుంతలను చూచి ఆమె సౌందర్యానికి ముగ్ధుడై గాంధర్వ విధిని ఆమెను పెండ్లాడిన దుష్యంతుడు శకుంతలను విడిచిపెట్టినాడు! ఈ దేశంలో అట్లాచేస్తే వెంటనే మా దేశంలోని స్త్రీలు కోర్టుకు వెళ్ళి డైవోర్సు తీసుకొనే వారు! కానీ కర్తవ్య పరాయణురాలైన శకుంతల తన తల్లి మేనక ప్రత్యక్షమై తనను మారీచ్యాశ్రమానికి తీసికొనివెళ్తే అక్కడ మగబిడ్డను ప్రసవించింది. ఆ బిడ్డ దెవరు? ఒక మహోన్నత పవిత్ర సంస్కృతికి కాణాచియైన దేశానికి తన పేరుతో రూపురేఖలు దిద్దగలంత సమర్థుడైన వానినిగా కుమార భరతుని రూపొందించి తుదకు భర్తను పాదాక్రాంతుని చేసుకొన్నది. ఇట్లే త్యాగంలో ఉండే మహనీయాదర్శాన్ని విశాల వసుంధరకు చాటిచెప్పిన మహిళా రత్నాలు భారతీయ వనితలు! వారి పౌరుషేయమైన ధర్మ సంస్కృతీ బద్ధమైన

జీవితోద్దేశాలను పేర్కొంటూ నేను జర్మనీ భాషలో మహా గ్రంథాలు రచించాను. అని అనర్గళంగా ఒక మహోపన్యాసం ఇచ్చారు. అసలు మా ఎపాయింటు మెంటు 45 నిమిషాలే. 45 నిమిషాలకు కాదు వచ్చేసింది. అయినా ఆయన నేను స్వయంగా కారులో అమెను హోటల్లో దింపుతానని ప్రభుత్వం కారుని పంపివేసి రెండు గంటలు నాతో మాట్లాడారు.

తర్వాత నేను కలుసుకొనిన హోబరు పండితుడు వేదనాగరికత అనాటి చరిత్రపై పరిశోధన చేస్తూ ఉన్న రీఘెలు పండితురాలు మొదలైన వారంతా ఇట్లాంటి అభిప్రాయాలనే వెలిబుచ్చారు. రీఘెలు పండితురాలు ఇప్పటికి 15000 సంవత్సరాలకు పూర్వమే భారత దేశంలో ఉజ్జ్వలమైన వేదనాగరికత వెలసి ఉన్నట్లు ఆధారాలు చూపుతూ P. HD చేస్తూ ఉన్నది.

తర్వాత రష్యాలోని విల్నూస్‌లోని ఓరియంటల్ డిపార్టుమెంటులో డైరక్టర్ ైన ఎడ్వర్‌దాస్ అనే పండితుడు నేను సంస్కృత కవయిత్రినని తెలుసుకొని Belt-of Poets ను నాకు బహూకరించారు. అక్కడే విల్నూస్ విశ్వ విద్యాలయంలోని మీరోనస్ అనే పండితుడు, లిధువేనియా మున్నగు రష్యన్ భాషలు సంస్కృతానికి ఎంత దగ్గరగా ఉంటాయో విశదీకరించి చెప్పాడు. అంతేకాదు. హాలేనగరంలో నివసించే మోడే పండితుని గృహమే ఒక భారతీయ విశ్వవిద్యాలయం! ఆయన యింటి ముఖద్వారంపై గజ లక్ష్మి చిత్రాన్ని అలంకరింపజేసుకొన్నాడాయన నన్ను మోడే అనవద్దు నా పేరు "మోద" మాడఊరు హాలేకాదు. 'శాల' అని పిలవండి అని చెప్పిన భారతీయ తత్త్వాభిమాని ఆయన ఆయన భార్య నాతో "మేము పెండ్లి చేసుకొని ఎన్నో సంవత్సరాలైనా మేము విడిపోకుండ మీ భారతీయులవలె ఒక వివాహానికే కట్టుబడి ఉన్నాము. అని చెప్పి ఎంతో సంతృప్తితో ఆనందాన్ని పండించిన ముఖంతో నా భుజం తట్టింది.

ఆ తర్వాత చెకొస్లవేకియా వెళ్లి ఆఖరుగా రష్యా మాస్కోలో మా కాతిథ్య మిచ్చిన మిస్ మిరియమ్ సల్గానికా అనే రష్యను రచయిత సంఘాధిపతి ఇంగ్లీషు వ్యాఖ్యానంతో ఉన్న Pocket భగవద్గీతను నేనియ్యగా కాళ్ళ చెప్పులు విడిచి అతి వినయంగా వంగి రెండుచేతులతో దోయిలిబట్టి ఆభగవద్గీతను తీసుకొని భగవద్గీతపై తనకున్న భక్తి ప్రవత్తులను ప్రదర్శించింది. "మీ కమ్యూనిస్టుదేశంలో భగవద్గీతపై

ఇంత భక్తి విశ్వాసాలు చూపుతూ ఉన్నారేమి? అని నేనడుగగా" కర్మపరమైన సందేశాన్ని వసుంధరామలిలో ఆదర్శ పూర్వంగా చాటిచెప్పిన ఒకే ఒక మహా గ్రంథం భగవద్గీత మాత్రమే భగవద్గీత యావత్ప్రపంచాని కృష్ణ పరమాత్మ ఇచ్చిన సందేశం కదా ఆయావత్ప్రపంచంలో మా రష్యాదేశానికి స్థానంలేదా? అని నా కెదురు ప్రశ్న వేసిందా తల్లి! అమెరికాలో Statue of Liberty దగ్గర అగ్రాయందలి రాధా స్వామి మతానుయాయులైన 2000 మంది స్పెయిను దేశీయులైన భక్త బృందాన్ని చూచాను. అందులో ఒకాయన నా దగ్గరకు వచ్చి గీతను గూర్చి ప్రశ్నించాడు. నేను మీ బైబిలునుగూర్చి చెప్పండనగా ఏ సమయంలోనూ ఎట్టి పరిస్థితిలోను ఏ వయస్సులోను స్త్రీలకు, పురుషులకూ నాగరికులకు అనాగరికులకూ పిల్లలకూ, పెద్దలకూ సందేశ మియ్యగల ఒకే ఒక గ్రంథరాజం భగవద్గీత మాత్రమే బైబిలులో కొన్ని ప్రాథమిక నీతి సూత్రాలు కొన్ని భక్తుల చరిత్రలూ ఉండవచ్చును. కాని బైబిలులో భగవద్గీతవంటి విశ్వమానవశ్రేయస్ పథకాలెక్కడ ఉన్నాయి? What is in Byble Mear Shallow అనేఉన్నతాశయాన్ని వెలిబుచ్చాడు. మేము ఎక్కడకు వెళ్ళినా రామాయణ, భారత గ్రంథాలకు 6, 7 అనువాదాలూ భగవద్గీతా భాష్యాలు, యోగశాస్త్ర గ్రంథాలూ ఉన్నాయనే భారతీయ తాత్త్విక జ్ఞాన ప్రశంసలే వినబడడం చెప్పుకోదగిన విషయం!

న్యూయార్కులో ఉన్న హరేకృష్ణ, హరేరామ మందిరంలో ఒక అద్భుత మైన సంఘటనతో తులసి తీర్థంతో న్యుమోనియా తగ్గిన ఒక యూరోపియన్ కుటుంబంఅంతా హిందూమతాన్ని స్వీకరించారు.

ఇట్టి అద్భుతాద్భుత భారతీయ సంస్కృతీ పరమైన గౌరవ విశ్వాసాలతో కూడిన అనుభవాలెన్నో నా విదేశీ పర్యటనలో సంఘటితమైనాయి. అన్నింటి కంటె ఒక గొప్ప సంఘటన వ్రాస్తే కాని ఈ విదేశీ పర్యటనోల్లేఖనం పూర్తికాదు.

## 24.2 భేదాలుకల క్రీస్తు ధర్మవిశ్వాసాల చర్చిలు

విధువేనియాలో ఇటలీ చర్చి, ఫ్రాన్సుచర్చి, అనే పేర్లతో అనేక చర్చిలను చూచాము. అప్పుడు నేను మా ఇంటర్ప్రెటర్ విక్టర్‌తో ఇన్ని దేశాల పేర్లతో

ఇన్ని చర్చిలుండడంలో విశేషమేమిటి? అని ప్రశ్నించాను. అప్పుడాయన "ఔను ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క ధర్మ భేదాలుగల చర్చి ఆర్డర్లు ఉన్నాయి. ఆకారణంగా ఆయాదేశాల పేర్లతో వేరు వేరు చర్చిలున్నాయి" అన్నాడు అయితే మీ మత విశ్వాసాలలో ఎన్ని భేదాలున్నాయి! అని అడిగాను. మాకు 242 భేదాల ధర్మ సూత్రాలున్నాయి అన్నాడు.

అబ్బా! అయితే మా భారత దేశంలో ఎన్నిసార్లు లెక్క పెట్టినా 20, 25 మత భేదాలకంటె ఎక్కువలేవు. అయినా మేమంతా "ఏకం సద్విప్రా బహుధావదంతి" అనే పరమేశ్వరతత్త్వము యొక్క ఏకతా సూత్రాన్ని మూల సూత్రంగా విశ్వసిస్తాము, అని మీ భగవంతుని పేరేమిటి? అని తిరిగి ప్రశ్నించాను, వెంటనే విక్టర్ "క్రీస్తు అని చెప్పలేదు. హాహా హూ హూ అని జవాబిచ్చాడు. వెంటనే నేను బాబూ హా హా హూ హూ" అనేది ఒక గంధర్వరాజుపేరు! అని అన్నాను. సంస్కృత శబ్ద మంజరిలో విశేష శబ్దాలలో "హా హా హూ హూ అనే గంధర్వ రాజు శబ్దమున్నదని కూడా చెప్పాను. అప్పుడు విక్టర్ ప్రపంచమంతా పరమాత్మ డొక్కడే అయినా ఆ పరమార్థం తెలియక భిన్న భిన్న మతభేదాలతో పరస్పరం కలహించుకోవడం, హింసించుకోవడం చాలా తప్పు అని అంగీకరించాడు అప్పుడు నా కెంతో సంతోషం కల్గింది.

మాస్కోనుండి నేను అప్పట్లో నా రెండవ కుమారుడు రాజరాజ నరేంద్ర ఉద్యోగం చేస్తూ ఉన్న కెనడాలోని విండ్సరకి వెళ్ళాను. మాస్కోతో, భారత ప్రభుత్వం వారి పర్యటన ముగిసి పోయింది. మాస్కోనుండి నేను కెనడా చేరే ఏర్పాట్లు నా కుమారుడు చేశాడు.

విండ్సర్‌లో ఉండగా అక్కడి భారతీయుల కోరికపై మా అబ్బాయి భగవద్గీతలో ఏ అధ్యాయమైనా పాఠప్రవచనంగా చెప్పమని అడిగాడు. భగవద్గీతలో నా ఉద్దేశంలో మకుటాయమైన మానవుని సమతా భావము విశిష్ట కర్మే భక్తి అని ప్రబోధించిన భక్తి యోగమును గూర్చి ప్రవచనం చెయ్యడం మంచిదని తోచి ఒక వారం రోజులు ఆ అధ్యాయం యొక్క విశిష్టతను గూర్చి చెప్పాను. విండ్సర్‌లోని చాలా మంది భారతీయులు వినడానికి రావడమే కాదు. ఫ్రెడరిక్ స్టాక్ అనే విండ్సర్

యూనివర్సిటీ లైబ్రరీ అసిస్టెంటు భార్యతో కూడా ఆఖరి రెండు రోజులూ వచ్చి విని అమ్మా నేను కూడా చాలా మంది భారతీయుల గీతా ప్రసంగాలు విన్నాను. కాని భక్తియోగానికి మీరు చెప్పిన కర్మాచరణ విశిష్టతే లేక విశిష్ట కర్మాచరణమే భక్తి అనే ప్రవచనం వినలేదు మీరు భారతదేశంలో కన్యాగురుకులం స్థాపించి సేవ చెయ్యాలనే సంకల్పంతో ఉన్నారు. మీకు నేను కెనడా అమెరికాల్లో ఒక నెల్లాళ్ల భగవద్గీతా ప్రసంగాలు ఏర్పాటుచేసి మీ కన్యాగురుకుల ప్రతిష్ఠాపనకు నిధిని చేకూరుస్తాను ఒక్క నెల్లాళ్ళు ఉండండి. అని కోరాడు. కానీ భారతదేశంలో నా పెద్ద కుమార్తె సుహాసిని నిండు గర్భవతి అగుటచే వారి ప్రతిపాదనను అంగీకరించలేక పోయాను ఆందువలన నేను నాజీవితంలో ఒక సువర్ణావకాశం కోల్పోయాను.

ఆ సమయంలో నేను ఫ్రెడరిక్‌స్టాకును 'ఏమండీ' మీ క్రైస్తవ మతంలో 242 భేదాలున్నాయన్నారు. నిజమా? అని అడిగాను. అయ్యోతల్లీ 242 భేదా లేమిటి తల్లీ 460 మతభేదాలున్నాయని చెప్పడమేకాక క్రైస్తవమత ప్రచారంలో భారతదేశంలోని అను చితవిధానాలను నిరసించాడు.

ఈ విధమైన అనుభవాలతో అప్పటి నా విదేశపర్యటనం ముగిసింది. మానవునకు గల పవిత్రకర్తవ్యపు విలువలను తెల్పుతూ, మానవుడు మాధవుడుగా పరిణమించడానికి సందేశమునిచ్చే నిచ్చెన మెట్లెక్కి ఆత్మజ్ఞానంతో గమ్యస్థానం చేరుకోవడానికి మార్గదర్శనం చేసే భారతీయతత్త్వంపై పాశ్చాత్యులకు అంతకంతకూ పెరుగుతూన్న పరమాదరాన్నీ అంతమహిమాన్వితమైన భారతీయ ధర్మాచరణే ముఖ్య లక్షణంగా కల్గిన భారతదేశంలో పుట్టి కూడా ఈ పవిత్ర ధర్మంయొక్క విలువలను నిరాదరించి హింస దౌర్జన్యము మాతృమూర్తులగు మహిళల యెడ మానభంగాలు ఇత్యాది హేయమైన నీచమైన పాపకార్యాలు చేస్తూ, అటు పాశ్చాత్యుల క్రమశిక్షణ, కార్య దీక్ష దేశభక్తి, నేర్చుకోకుండా, ఇటు భారతీయ సంస్కృతికి దూరమై, పతనావస్థలో వున్న భారతీయ సమాజపు అసభ్య ప్రవర్తనను బేరీజు వేసుకొంటూ ఈ భారతీయు లెన్నాళ్ళకు తమపూర్వౌన్నత్యాన్ని పొందగల్గుతారా?" అనే ఆవేదనతో ఆ విదేశవాసుల ధర్మానురక్తి నిజాయితీ పుక్కిలింతలుగా గుర్తుకు తెచ్చుకొంటూ భారతదేశంలో కాలు పెట్టాను.

ఆ సమయానికి ఆంధ్రదేశంలో 'ఉక్కు, మా హక్కు, నినాదాలతో బందులతో రైళ్ళు బస్సులు నిలిపివేసే ఆందోళనలతో ఉక్కు ఫ్యాక్టరీ ఆంధ్ర దేశంలో స్థాపించవలెననే మహా ఉద్యమం చెలరేగుతూ ఉన్నది. కట్టలు త్రెంచు కొని పైకి పొంగి విజృంభించిన ఆ ఉద్యమ సంరంభంలో ఢిల్లీ నుండి హైదరాబాదు రాగల్గాను. అక్కడ నుండి విజయవాడ అతి కష్టంమీద చేరాను. ఇక విజయ నుండి బాపట్ల చేరడమెట్లాగో తెలియలేదు. బెజవాడలో ఉన్న శ్రీకొంకిమళ్ళ నాగ భూషణం ఏద్వోకేటుగారూ వారి సతీమణి మా అడబడుచు శ్రీమతి సత్యవతిగారూ, నన్ను బాపట్ల చేర్చడానికి చాలా ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నాల ఫలితంగా మాకు చాలా సన్నిహితుడైన గొల్లవాసుదేవరావు (షావాలేస్ కంపెనీలో ఆఫీసరు) తెల్లవారు జామున 3 గంటలకు తన కారు పంపగా, దానిపై బాపట్ల చేరి మళ్ళీ తెల్ల వారేసరికి ఆయనకు కారు అందేటట్లు తిరిగి విజయవాడకు పంపేశాను. ఆ సమ యంలో అతడు చేసిన సహాయం చాలా మహత్తరమైనది. అతనికి నా శుభాశీస్సులు.

ఇంటికి వచ్చేటప్పటికి రాజమహేంద్రిలో మా అమ్మకు పక్షవాతం వచ్చిందని తెల్పుతూ తొమ్మిదిరోజులనాడు మా తమ్ముడు కామేశ్వరరావు వ్రాసిన ఉత్తరం వచ్చియున్నది.

అదేకాక రాజమహేంద్రినుండి శ్రీ సంపత్కుమారబంగుగారు కాగితం పంపనందున కృష్ణరాయ విజ్ఞాన సర్వస్వముద్రణ కార్యం ఆగిపోయిందనే ఉత్తరం కూడా వచ్చి ఉన్నది. మళ్ళీ వెంటనే బయలుదేరి విజయవాడ వరకు రైళ్లు నడు స్తూండడం వలన అక్కడ వరకూ రైలులో వెళ్ళి అక్కడనుండి టాక్సీలో రాజ మహేంద్రి వెళ్లి మా అమ్మను చూచి (ఆమెకప్పటికి వ్యాధి తిరుగుముఖం పట్టినది) మర్నాడు శ్రీ సంపత్కుమార బంగుగారితో మాట్లాడి కృష్ణరాయ విజ్ఞాన సర్వస్వ ముద్రణకు మరల కాగితం నప్లైని పునరుద్ధరించుకొని బాపట్ల చేరాను. ఈ విజ్ఞాన సర్వస్వ ప్రచురణ కార్యక్రమానికి ఏ ఉద్యమానికి నేను అర్థించి నాకాదనకుండా విరా ళాలిచ్చే అనకాపల్లి వాస్తవ్యులు శ్రీ కోరుకొండ లింగమూర్తిగారు వారి సోదరులు శ్రీ బుచ్చిరాజుగారు వారి కుమారులు డా॥ శ్రీ సుబ్బరాజుగారు ఇంకా తక్కిన ఉదారులు విరాళాల నందియ్యగా చాలా నత్తనడకతో కృష్ణరాయ విజ్ఞాన సర్వస్వ ప్రచురణము పూర్తియైనది.

## అఖిల భారత తెలుగు రచయితల సంఘసత్కారం

1971 లోనే జరిగిన ఇంకొక విశేషాన్ని గూర్చి ప్రస్తావించాలి. శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు దీక్షాబద్ధులైన సాహిత్యసేవా కార్యకర్త, ఆయన నేతృత్వంలో అఖిల భారత తెలుగు రచయితల మహాసభలో నాకు విశేష సత్కారం జరిగినది.

## బెంగుళూరు విశ్వవిద్యాలయంలో నా రచనలు పాఠ్యాంశాలుగా నిర్ణయించుట

1974-76 176-78 సం॥ రములలో బెంగుళూరు విశ్వ విద్యాలయంలో నా రచనమైన 'మొల్ల' ఖండకృతి B. A. పరీక్షకు ఒక పాఠ్యాంశముగా రెండు మార్లు స్వీకరింపబడినది.

## ఆంధ్ర యూనివర్సిటీలో పాఠ్యాంశముగా

రణసూ క్తము 87-88 కాలములో B.A. కు తీసికొనబడినది. ప్రస్తుతము స్వయం ప్రతిపత్తి పొందిన విజయవాడ, లైలా కాలేజీ, ఏలూరు సెంట్ థెరిస్సాస్ కాలేజీలలో 'ఆంధ్రకవయిత్రుల గ్రంథము సందలి' 'సమీక్ష' B A తరగతికి, ఒక పాఠ్యాంశముగా తీసుకోబడినది.

## 1974 లో కవి సమ్మేళనం

1974లో అఖిల భారత తెలుగు సాంస్కృతిక సంఘము వారు నిర్వహించిన కవి సమ్మేళనములో, నేను ఒక కవయిత్రిగా పాల్గొనుట జరిగినది. రేడియో సంస్థ యందు, ఆంధ్రప్రభుత్వము ఆహ్వానముపైనను, ఎన్నెన్నో కవి సమ్మేళనములలో పాల్గొనుట జరిగినది.

## 1975 ప్రపంచ తెలుగు మహాసభలలో సత్కారం

శ్రీ జలగం వెంగళరావుగారు ముఖ్యమంత్రిగాను, శ్రీమండలి వెంకటకృష్ణ రావుగారు, విద్యాశాఖామాత్యులుగాను ఉన్న సమయంలో 1975లో వారిరువురూ

అత్యంతవైభవముగా నిర్వహించిన ప్రపంచ తెలుగు మహాసభలలో విశిష్ట కవయిత్రిగా సత్కరింపబడడం జరిగింది. శ్రీ జలగం వెంగళరావుగారిచే ఆ సమయంలోనే, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారి విశిష్ట సభ్యురాలుగా కూడా సత్కరింపబడినాను. ఆ సభ్యత్వ చిహ్నంగా బంగారు పతకాన్ని ఎకాడమీ వారు బహూకరించినారు.

## 1976 కళా ప్రపూర్ణ బిరుద సత్కారం

నా జీవితం, ఒక సాగరమును పోలినది. ఒక తరంగము వెనుక ఒక తరంగముగా ఎన్నో సేవాకార్యక్రమాలతోడను, మహోదాత్త ప్రసంగ పరంపరతోడను నేనెప్పుడూ ఉక్కిరి బిక్కిరౌతు ఉందేదాన్ని బహుసంతానవతియైన, నాకు ఈ కార్యక్రమ సంరంభమంతా విజయవంతం కావడానికి, నిరంతరము గృహనిర్వహణంలో తోడ్పడినవారు 1961 నుండి మా కుటుంబంతో కలిసిపోయిన చేపూరి గురువర్ధనమ్మ, మా అత్తయ్యగారు ఊటుకూరి మహాలక్ష్మమ్మగారు మా పెద్దమ్మాయి సుహాసిని, మా చిన్నమ్మాయి మైథిలి, నా పెద్దకుమారుడు చి॥ ప్రతాపచంద్ర, రెండవ కుమారుడు రాజ రాజనరేంద్ర మూడవవాడు విజ్ఞానేశ్వర కుమార్ నా పెద్ద కోడలు సౌ॥ ఆదిలక్ష్మి నా చెల్లెలితో సమానప్రేమచూపిన సల్లమల్లి రుక్మిణి ఇంకా ఇతరులను పేర్కొనవలసియున్నది.

అట్టి సంరంభములలో ఒకటైన మహోన్నతవైభవోత్సవము, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి కళాప్రపూర్ణ బిరుదప్రదానము శ్రీనూజివీడు కుమారరాజా, M.R అప్పారావుగారు ఆంధ్రయూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌గా ఉన్నపుడు, వచ్చిన విశ్వవిద్యాలయం వారి పిలుపు నందుకొని గృహనిర్వహణ భారాన్ని శ్రీమతి మా అత్తయ్యగారిపై విడిచి, మా పెద్ద అల్లుడు శ్రీపోలేపల్లి హరనాద్‌గారిని, నా చిన్న కుమార్తె చి॥ మైథిలిని తీసికొని విమానముపై వాల్తేరు వెళ్ళినాను. అచ్చట, నాకు అతిథ్యమునిచ్చి ఆదరించినవారు బాపట్ల వాస్తవ్యుడు నా కుమారుల సహాధ్యాయియైన బొలిసెట్టి ప్రభాతకుమార్, మా మేనమామ శ్రీ మోతేకృష్ణారావుగారి అల్లుడు శ్రీ అప్పన సుబ్రహ్మణ్య గుప్తగార్లు ఆ సమయానికి ఆంధ్రప్రదేశ్ గవర్నరుగా ఉన్న శ్రీమతి శారదా ముఖర్జీ గారి కరకమలముల నుండి నేను కళాప్రపూర్ణ బిరుద పత్రాన్ని



1976లో ఆంధ్రవిశ్వవిద్యాలయ కళాప్రపూర్ణ బిరుద ప్రదాన
సమయమున శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ గారిని అభినందిస్తున్న
శ్రీ అర్జునసింగ్.

స్వీకరించాను. ఆ ఉత్సవ సమయము నందే శ్రీ హరీంద్రనాధ్ ఛట్టోపాధ్యాయ, శ్రీ N.T. రామారావు గార్లు ఇంకా చాలామంది ప్రముఖులు కళాప్రపూర్ణ బిరుదముచే గౌరవింపబడినారని తెలుపడానికి ఎంతో ఆనందిస్తూ ఉన్నాను. రాష్ట్రపతియైన శ్రీ నీలం సంజీవరెడ్డిగారు తెలుగులో ముఖ్య అతిధిగా ప్రసంగించారు.

ఆ ఉత్సవం జరుగుతూ ఉండగానే, విశాఖపట్టణ రోటరీక్లబ్బువారు. నన్ను శ్రీ N.T. రామారావుగారిని తీసికొని వెళ్ళి ప్రప్రథమంగా సత్కరించారు. ఆ సమయానికి ఖర్గపురములో అసి. ప్రొఫెసరుగా ఉన్న నా రెండవ కుమారుడు రాజరాజ నరేంద్ర కూడా వచ్చి ఆ సంతోషములో పాలు పంచుకొనెను 1977 నవంబరులో ఆంధ్రదేశానికి సంభవించిన ప్రళయం వంటి పెనుముప్పు, యావత్ప్రపంచానికి తెలిసినదే,

అదే తేదీలలో అనంతపురం, లలితకళా పరిషత్తు వారి నేతృత్వంలో, గవర్నరు శారదా ముఖర్జీగారు ముఖ్యఅతిధిగా కనకాభిషేకము జరగవలసియున్నది. కానీ, శారదా ముఖర్జీగారు రావడానికి వీలుకాదని తెల్పినందున ఆ తేదీకి రద్దు పడిన నట్లు, తంతి పంపారు. అంతా తయారైన నా ప్రయాణం ఆగిపోయింది. ఇంతలో 19వ తేదీనాడు ప్రళయభయంకరమై ఛటచ్ఛటార్భట్ చటులతో ఉప్పెన విరుచుక పడింది. అంతకు క్రితంరాత్రి మా కుటుంబవైద్యులు శ్రీ S.V చలపతిరావుగారింట్లో దొంగలు పడ్డారని తెలిసి చూడడానికి వెళ్లి అక్కడ నుండి తిరిగి రావడమే కష్టమై పోయింది. మధ్యాహ్నం ఉత్తరాలివ్వడానికి వచ్చిన పోస్టు జవాను సుభానీ తిరిగి వెళ్ళలేక మా యింట్లోనే ఉండి పోయారు. వద్దంటే నా మాట వినకుండా చీరాల వెళ్లిన శ్రీ మా గుప్తగారు, చీరాలలోనే ఉండిపోయారు. ఇట్లో నేను మా చిన్నకుమార్తె మైధిలి పోస్టుజవాను సుభానీ మాత్రం ఉన్నాము. ఉప్పెన అంతకంతకూ ఉద్ధృతమై ఏనిముషాన్న ఇల్లేమౌతుందో మా పరిస్థితి యేమౌతుందో అనే అనుక్షణభీతితో ప్రాణాలరచేతిలో పెట్టుకొని కాలం గడిపాము. రాత్రి 10గంటలకు గాలీ వాన పూర్తిగా తగ్గిపోయి మబ్బులుకూడా వెలిసిపోయి వెన్నెల వచ్చేసింది. ఇంత ప్రళయాన్ని సృష్టించిన భీకర ప్రకృతి తానేమీ ఎరగనట్లు నవ్వుతూ సృష్టిప్రాణికోటిని పలకరిస్తూందా? అన్నట్లు చంద్రుడు తెల్లని వెన్నెలతో నవ్వుతూ తనప్రకాశాన్ని చూపాడు. కానీ అంతలోనే జరుగవలసిన విధ్వంసకాండ జరిగిపోయింది. అనంభ్యా

కంగా ప్రాణనష్టం పంటనష్టం తోటలనష్టం సంభవించి పోయింది. పిల్లా, పెద్దా కలిసిపోయిన వరద భీభత్సం! వర్ణింపనలవికాని విధంగా అధర్మపరాయణులై అరాచకాన్ని సృష్టిస్తున్న జన సందోహంపై, ప్రళయ కోపాగ్నితో విరుచుకు పడింది. ప్రకృతిమాత వెళ్ళగ్రక్కిన దారుణ, భీషణ ప్రతాపానికి ప్రజలు తట్టుకోలేక తల్లడిల్లి పోయారు.

తెల్లవారేటప్పటికి మాకు ఇంకా పై ప్రదేశాలలో సముద్రం వైపుగా ఉన్న ప్రజానీకం సర్వస్వం కోల్పోయి కట్టుబట్టలతోనూ పిల్లపాపలతోను ఊరిలోనికి అసంఖ్యాకంగా రానారంభించారు. మా యింట్లో మా వారూ నేనూ మా అమ్మాయి మాత్రమే ఉండడం వలన ఖాళీ స్థలాలు (గదులు) చాలా ఉండడం వలన పై పాలెముల నుండి వచ్చే జనానికి మేము పూర్తిగా వసతి నియ్యగల్గాము. సుమారు 20 30 కుటుంబాల వాళ్ళు బాలింత రాళ్ళతో నెలల పిల్లలతో సహావచ్చి మా యింట్లో ఆశ్రయం పొంద గల్గారన్న తృప్తి మాకు లభించింది. ఇంటి చుట్టూ ఉన్న ఖాళీ స్థలంలో వంటలు పెట్టుకొని అన్నాలు వండుకొని కాలక్షేపం చేశారు. తెల్లవారే లేచి ఇల్లంతా బాగుచేసికొని ఏమైనా సహాయ కార్యక్రమాలలో పాల్గొనాలని నేను తహసీల్దారు ఆఫీసుకు వెళ్ళాను. ఆట్లారోజూ వెళ్ళి వాళ్ళనడిగి తెలిసి‍కొని ఆ సేవా కార్యక్రమాలకు వెళ్ళిపోయేదాన్ని ఇంట్లోపని మా చిన్నకుమార్తె చూచుకొనేది. ఇంట్లో పెరుగును మజ్జిగ చేసి అందులో అన్నం పిసికి వచ్చినా వాళ్ళకు ధారకంగా ఆ మజ్జిగ రెండురోజులు పోశాము. ప్రతిరోజు తాసీల్దారు గారి దగ్గరకు వెళ్ళి పని అడిగిచేసేదాన్ని హైదరాబాదు నుండి గాంధీపీస్ మిషన్‌వారు తూర్పు గోదావరిజిల్లా రాజమహేంద్రిదగ్గరగా ఉన్న సీతానగరం నుండి కస్తూరిబాసేవా సంఘంవారూ మా యింట్లో దిగారు. ఇంకా కొన్ని సేవా సంఘాలవాళ్ళు నా సలహా ప్రకారం పని చేశారు.

ఇదీ యిట్లా ఉండగా, సాల్వేషను ఆర్మీకి సంబంధించిన, ఒక మిషనరీ యువతి, మా యింటికి వచ్చి, మా యింట్లో ఉన్నవాళ్ళకు, ఇంజెక్షనియ్యడం మొదలి పెట్టి, ఇంజెక్షను మార్చకుండా, చాలామందికి ఒకే సూదివాడింది. అప్పుడు నేను అసలే ఆపదలో ఉన్న జనానికి మీరు సూది మార్చకుండా ఇంజెక్షనిస్తే ఇంకా

వ్యాధులు ప్రబలవా? అని అడిగానని "You are all Dirty Indians this much is enesh for your people" అన్నది. ఆ మాటకు నాకు కోపంవచ్చి మీరు మా దేశానికి సేవ చెయ్యడం కోసం వచ్చి ఇట్లాంటి మాటలనడం తగనిదని అనగానే. నన్ను చెంపమీద ఛెళ్ళుమని, కొట్టింది. వెంటనే నేను నిలువరీసి పట్టు కొని గట్టిగా కేకలు వేశాను. ఆ కేకలకి పదిమంది పోగై, ఆమెను పట్టుకొన్నారు వెంటనే నేను చెంపపై కొట్టాను. దానితో భయపడి, అందరనూ విడిపించుకొని, తాను వచ్చిన వేనెక్కి పారిపోయి ఆ మర్నాడు బజార్లో మీ లీడర్ని నేను కొట్టానని ప్రచారం చెయ్యడం మొదలుపెట్టింది. వెంటనే మావారు, వారి శిబిరం మేనేజరు నోటీసిచ్చారు. దానితో దిగివచ్చి వ్రాత పూర్వకంగా క్షమాపణ చెప్పుకొన్నారు.

ఉప్పెనలో నా శక్తి వంచన లేకుండా సోదర ప్రజానీకానికి సేవ చేయగల్గా ననే తృప్తి నాకు కల్గింది. ఆ భీభత్స సమయంలో శ్రీమండలి కృష్ణారావుగారు కేంద్రమంత్రి శ్రీ చవాన్‌గారూ బాపట్ల తాలూకా ఆఫీసుకు వచ్చారని విని, నేను తాసీల్దారు ఆఫీసుకు వెళ్ళి, ఏమేమో మెత్తమెత్తగా తమ బాధలు చెప్పుకొంటూ ఉన్న వాళ్ళ దగ్గరనుండి మైకు తీసికొని, ఆవేశంతో 'చవాన్ భైయాజీ' అని సంబోధించి, ఉప్పెన వలన ప్రజలకు సంభవించిన ఇక్కట్లన్నీ గట్టిగా చెప్పేశాను. ఆయన ఇంత శక్తి కల ఈమె యెవరు? అని తెలుసుకొని, నన్ను వెంటనే తుఫాను సేవా సంఘంలో చేర్చాడు. తర్వాత మధుదండావతే రైళ్ళ పరిస్థితి విచారించడానికి వస్తూ ఉన్నారు. కాని బాపట్ల విజిట్ లేదన్నారు.

## మధుదండావతేను బాపట్లలో ఆగేటట్లు చేశాను

నేను వెంటనే రైలు స్టేషనుకు వెళ్ళి ఒక వినతిపత్రం తయారుచేసి, స్టేషనులో గుమికూడియున్న వారిచేత సంతకాలు పెట్టించి, విజయడ స్టేషనుకు ఫోన్లమీద ఫోన్లు చేసి, మధుదండావతే, బాపట్లలో ఆగేటట్లు చేశాను. అప్పుడా సమయంలో ఆ ప్రత్యేక రైల్వే బోగీలో ఉన్న రైల్వే సిబ్బంది, పత్రికా విలేకరులు నన్నుచూచి టూర్ ప్రోగ్రాములో చేర్చని కార్యక్రమాన్ని రద్దు పరచి, బాపట్లలో ఆగేటట్లు ఎవరు ప్రయత్నించారా? అనుకొంటూ ఉన్నాము. "ఓ మీరా? లక్ష్మీకాన్తమ్మగారా" అని "లక్ష్మీ కాన్తమ్మగారు ఆగేటట్లు చేశారు." అని తమలో తాము చెప్పుకొన్నారు. మధు

దండావతే బాపట్ల ప్లాట్ ఫారము స్టేషన్ మాస్టరు గది అన్నీ చూచి, మా విజ్ఞాపన పత్రం అందుకొని. ఆ విధంగా అన్ని మరమ్మత్తులూ చేయించారు.

ఉప్పెనవలన ఆంధ్రదేశానికి అంతఘోరవిపత్తు సంభవించిన తర్వాత మద్రాసులో ఉన్న గిల్డ్ ఆఫ్ సర్వీస్ సంస్థవారు, బాపట్లలో ఒక శాఖను ఏర్పాటుచేసి ఇక్కడి వరద బాధితులను ఆదుకోవాలనే నిర్ణయం తీసుకొన్నారు.

## గిల్డ్ ఆఫ్ సర్వీసులో నా సభ్యత్వం

వారు శ్రీ వెలగపూడి సుబ్బారావుగారి కుమార్తె శ్రీమతి భీమరాజు వరలక్ష్మమ్మ గారి నాయకత్వంలో, ఆ సంస్థను నడపడానికి నిశ్చయించి ఆ సంఘంలో నాకూ్కడా ప్రాధాన్యంకల సభ్యత్వం తీసుకోమని కోరడానికి మా యింటికి వచ్చారు. వరద బాధితులకు శాశ్వత ప్రయోజనం కల్పించే ఆ సేవా సంస్థలో సభ్యత్వం తీసుకోడానికి చాలా సంతోషంగా, నా ఆమోదం తెల్పాను.

ఒక ప్రాజెక్టు ఆఫీసరు. ఒక Administration officer ఒక డాక్టరు ఒక టైపిస్టు ఎకౌంటెంటు, 18 మంది గ్రామ సేవికలతో 1978 జనవరి 1వ తేదీనాడు ఇక్కడ బాపట్లకు దగ్గరలో గిల్డ్ ఆఫ్ సర్వీసు శాఖ ప్రారంభించబడింది. బాపట్లకు దగ్గరలో సాగర తీరాన్న ఉన్న పేర్లి అనే గ్రామంలో మూడు సెంటర్లు బాపట్లలో రెండు సెంటర్లూ ప్రారంభించాము. ఉదయాన్నే పిల్లలకు టిఫిన్ పాలు, వరదలో నష్ట పడిపోయిన వారి కుటుంబ పెద్దలు పనులలోనికి వెళ్ళి, ఉపాధి కల్పించుకోవడము, మళ్ళీ మధ్యాహ్న భోజనము, పిల్లలకు చదువు చెప్పడము, సాయంకాలం పాలు అనారోగ్యం కల్గిన వారికి మందు లిచ్చి వైద్యం చేయించడం, ఇది నిత్యకార్యక్రమంగా గిల్డ్ ఆఫ్ సర్వీసు పక్షాన్న మేమంతా చాలా పాటు పడ్డాము, బట్టలైనా వేసుకోలేని, తలకు నూనె రాసి దువ్వుకొనే అలవాటు లేని వారికి తలలు దువ్వి ముక్కుల నుండీ కండ్లనుండీ వెలువడే అనారోగ్య పదార్థాలను తీసివేసుకొని శుచిగా శుభ్రంగా ఉండాలనే విషయం కూడా తెలియని ఆ పల్లె వాసుల పిల్లలకు తలస్నానాలు చేయించి తలలు దువ్వి మంచి బట్టలు తొడిగించి, ఆహారమిచ్చి మందులిచ్చి వారిలో మంచి సంచలనం కల్గించాము క్రమక్రమంగా చదువటను వ్రాయటను నేర్పి అక్షరాస్య

లను చేశాము. వారికి ఆటలు పాటలు నేర్పాలనే అభిప్రాయంతో నేను ఎన్నో పాటలు వ్రాసి నాటికలు వ్రాసి భీకరమైన వరద నష్టంపై నేను బుర్రకథ వ్రాసి ఆ పిల్లలను సాంస్కృతికంగా కూడా తీర్చిదిద్దాము.

వరద బాధితుల సంక్షేమ సంఘాలను పరిశీలించడానికి వచ్చే అనేక'బృందాలు పత్రికా విలేకరుల బృందాలు బాపట్లలోని త్రికరణ శుద్ధిగా నిర్వహిస్తూ ఉన్న మా సేవలను హార్దికంగా ఎంతో ప్రశంసించేవారు! ఆ బృందాలలో 14 మంది గవర్నమెంటు సెక్రటరీల సంఘం ఒకటి వచ్చింది. అందులో ఛీఫ్ సెక్రటరీల సంఘం ఒకటి వచ్చింది అందులో ఛీఫ్ సెక్రటరీగా ఉన్న I j. నాయుడుగారు కూడా ఉన్నారు 'ఓహో లక్ష్మీకాంతమ్మగారు సంగీత సాహిత్యాదికళలలోనేకాక సేవా కార్యక్రమాల్లో కూడా నిపుణురాలన్నమాట! అని ప్రశంసించారు! గుంటూరు జిల్లా కలెక్టరు రాంబాబు గారి అధ్యక్షతన జరిగిన వార్షికోత్సవం కలెక్టరుగారి మనస్సు నాకర్షించి చాలా ప్రశంసలు పొందింది ఆ కార్యక్రమంలో నాటకాలు, పాటలు అన్నీ నావే సర్వీసు సంస్థ బాపట్లలో స్వంత భవనా లేర్పరచుకొని సేవలు చేస్తూనే ఉన్నది.

## ఆర్య వైశ్య సంఘ సేవలు

నా జన్మకు కారణమైన ఆర్యవైశ్య సంఘమును గూర్చి ప్రస్తావించాలి 1932-33 సంవత్సరాలలో నంద్యాలలో జరిగిన ఆర్యవైశ్యమహాసభా సమయం నుండి ఆర్యవైశ్య సంఘ యెడల ఆర్యవైశ్య మహాసభల పట్ల, నేను చాలా ఆసక్తి చూపిస్తూ, స్వ సంఘ సేవలు చేస్తూనే ఉన్నాను. అనకాపల్లిలో ఒకమారు ఆర్యవైశ్య మహాసభ జరిగినప్పుడు నేను మహిళాసభాధ్యక్షురాలుగా ఆ సభలలో అప్పుడు నిండు గర్భవతిని. మహిళా సభకు కూడా పురుషులు వేల సంఖ్యలో వచ్చారు. అనకాపల్లి సభ యందే మహిళా శాఖకు నేను పునాదులు వేశాను. విద్యా విజ్ఞానరంగాల్లో చాలా వెనుకబడియున్న వైశ్య మహిళలలో బాగా శ్రమపడి ప్రచారం చేసి రాష్ట్రమంతటా సంఘాలు స్థాపించి వైశ్య మహిళలలో చైతన్యం జాగృతి కల్గించ వలెనని నా ఉద్దేశం. పెద్దలుకూడా ఆమోదించి, ఆ శాఖ యేర్పడడానికి చాలా ఉత్సాహంతో ముందుకు వచ్చారు. ఆనాడు అనర్గళంగా జరిగిన నా ప్రసంగాన్ని ప్రెస్ రిపోర్టర్లు వ్రాసుకోలేక కవాలుదించి కూర్చున్నారు.

## వెంటనే మహిళాశాఖ నా అధ్యక్షతన

వెంటనే మహిళా శాఖ నా అధ్యక్షతను ఏర్పడింది సంధ్యాల పురవాస్త వ్యరాలు శ్రీమతి ఎలుకూరి సుబ్బరత్నమ్మగారు కార్యదర్శినిగా పని చేస్తానని, ముందుకు వచ్చారు. అది మొదలు మేమిద్దరము స్వంతంగా ఖర్చులు భరించి, పర్యటించి ఆంధ్రదేశంలో అక్కడా అక్కడా కొన్ని మహిళా శాఖల నేర్పాటు చేశాము. మొదట్లో ఆర్యవైశ్య మహాసభలో యువజన సభ, కవి పండితసభ, వ్యాయమసభ మహిళా సభలు జరుగుతూ ఉండేవి. ఆర్థిక పరిస్థితులను బట్టి ఈ ఉపశాఖల సమావేశాలను జరపడం మానివేశారు.

అయితే ప్రతి ఆర్యవైశ్యమహాసభకు నేను వెళ్ళడం మానలేదు. అదీ నా విధిగా భావించి హాజరౌతూనే ఉన్నాను. 1979 ఆ ప్రాంతంలో కర్ణాటక రాష్ట్ర వాస్తవ్యులు, కర్ణాటక రాష్ట్ర విద్యాశాఖా మంత్రిణి శ్రీ నాగమ్మాకేశవ మూర్తిగారు అఖిల భారత వైశ్య మహిళా సభలు బెంగుళూరులో జరిపి, ఆంధ్ర తమిళ కేరళ దేశాలకు చెందిన ఆర్యవైశ్య మహిళలను ఆహ్వానించారు. హైదరాబాదు ఆర్యవైశ్య మహిళలు, నేను ఆ సభలలో పాల్గొన్నాము. అప్పుడే ప్రతి రాష్ట్రంలోను ఒక ఆర్యవైశ్య మహిళా సంఘం ఉండాలి. అనే సంకల్పానికి ఒక స్థిర రూపం ఏర్పడింది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కూడా ఒక సంఘానికి రూపకల్పన చేశాము

ఇది యిట్లా ఉండగా 1980 లో చిక్కమగళూరులో కర్ణాటక రాష్ట్ర మహిళా సభను నిర్వహిస్తూ నన్ను ముఖ్యఅతిథిగా ఆహ్వానించారు. సభలు చాలా వైభవంగాను, విజ్ఞానాత్మకంగాను, ప్రబోధాత్మకంగాను జరిగాయి.

## ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్యా మహిళా సభాధ్యక్షురాలు

ఇదీ జరిగిన తర్వాత అఖిల భారతస్థాయిలో బెంగుళూరులో మళ్ళీ ఒక సమావేశం జరిగింది. ఆ సమావేశంలో నేను ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహిళా సభాధ్యక్షురాలుగా, ఎంపిక చేయబడినాను. ఇవి జరిగిన తర్వాత, దావణగిరిలో అఖిల భారత ఆర్యవైశ్య మహాసభ జరిగింది. ఆ సభలో నేను ఆంధ్రప్రదేశ్ పక్షాన్న ప్రాతినిధ్యం వహించి పాల్గొన్నాను. ఆ మహాసభలలోనే నాకు పాదాలు వాపు చూపించాయి. ఇక దావణగిరి నుండి తిరుపతి వెళ్ళి తిరుపతిలో నా హోమియో డాక్టరు

శ్రీమతి అన్నపూర్ణా రెడ్డిగారికి చూపించి, మందు తీసుకొని యింటికి వచ్చాను. ఇంటికి వచ్చిన తర్వాత ఒళ్ళంతా నీరు చూపింది. చాలా భయం కల్గించింది. ఆ తర్వాత కూడా శ్రీమతి A. అన్నపూర్ణా రెడ్డిగారు బాపట్లకు వచ్చి నాకు వైద్యం చేశారు.

## ప్రప్రథమంగా నాకు సంభవించిన వ్యాధి

ఆమెకి వైద్యంతో నీరు పూర్తిగా తగ్గింది. ఆ సమయంలోనే, నా పెద్ద కుమారుని తీసుకొని, గుంటూరుకు వెళ్ళి, అక్కడ శ్రీమద్ది సుదర్శనంగారి అభికి కోడలు, నా మేనమామ మోతే కృష్ణరావుగారి కడపటి కుమార్తె రామకుమారి సహాయంతో పరీక్షలన్నీ చేయించుకోగా, ఆ పరీక్షలలో చక్కెరవ్యాధి ఉన్నట్లు తెలిసింది. ఆ వ్యాధి క్రమక్రమంగా నన్ను బలహీన పరచింది. అంతకు క్రితమే ఎన్నాళ్ళబట్టో ఉన్న కీళ్లనొప్పులు కూడా హెచ్చయి బాధించడంతో, నా సేవా కార్యక్రమాలు కుంటుపడ్డాయి.

## సుమారు అరవై సంవత్సరాల అవిచ్ఛిన్న సేవ,

ఒక విధంగా కుంటుపడడంతో నాలో నాకే విపరీతమైన, బాధ కలిగి, మానసికంగా కూడా దౌర్బల్యం చేకూరింది. ఒక్కొక్కమారు ఏదైనా ఊరికి వెళ్ళి యింటికి వచ్చి, పోస్టుమాడుకుని మళ్ళీ ఆ మర్నాడు, ఇంకేదైనా ఊళ్ళో కార్యక్రమం ఉన్న దంటే వెళ్ళిపోయిన నేను సేవకు దూరమైపోయానే అనే దిగులు నన్ను క్రుంగదీసింది. ఒక్కోమారు పిల్లలు, సెలవులకు ఇంటికి వస్తూ "మనం బాపట్ల వెళ్ళేటప్పటికి, అమ్మ ఇంట్లో ఉంటుందో లేదోనని ఉత్తరాలు వ్రాసుకుని వచ్చేవారట!

అయినా వాళ్ళు ఎన్నడూ, నా సేవా కార్యక్రమాలకు అడ్డుతగుల లేదు.

ఈ విషయంలో మా వారే ఎన్నడూ నా సేవా కార్యక్రమాలకు అడ్డు చెప్ప లేదు. వారి యీ ప్రోత్సాహానికి నేను ఎప్పుడూ ఋణపడే ఉన్నాను.

## మధురా విజయవ్యాఖ్యానానికి సహాయం

తెనాలి సంస్కృత కళాశాలా పండితులైన శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గంగాదేవి విరచితమైన మధురా విజయ సంస్కృతకావ్యానికి వ్యాఖ్యానం

వ్రాసి ముద్రణ చేయించి నా దగ్గరకు తీసికొని వచ్చారు. శ్రీ శాస్త్రిగారు సంస్కృత పండితులే కాక, తర్క-వ్యాకరణాది శాస్త్రంలో కూడా మహా పండితులు ఎన్నో మహా కావ్యాలకు వ్యాఖ్యానాలు రచించిన మహాపండితులువారు మధురావిజయానికి వ్యాఖ్య వ్రాశారని తెలిసినపుడు నేనెంత ఉప్పొంగిపోయానో! నాకే తెలియదు. ఇన్నాళ్ళకు ఒక మహాకవయిత్రి కావ్యం సవ్యాఖ్యానంగా వెలుగు చూచినందుకు పరవళ్ళు త్రొక్కే ఆనందతరంగాలతో నా హృదయం, పరవశమై, చిందులు త్రొక్కింది. ఆ కావ్యం యొక్క వ్యాప్తికి, నేను అప్పటికే నా రచనలు కొన్ని అచ్చుపడడంతో, నా కావ్యాలతో పాటు ఆ కావ్యం యొక్క విక్రయానికి, నేను చాలా శ్రమించి శ్రీ శాస్త్రిగారికి ఎంతో సహకరించాను. ఆ కార్యక్రమం అట్లా ఉండగా గంగాదేవి చరిత్ర నవలగా వ్రాయండి' అని శ్రీ శాస్త్రిగారిని, నేను పదే పదే అభ్యర్థించాను. నా ప్రార్థన నంగీకరించి శ్రీ శాస్త్రిగారు గంగాదేవి నవలగా రచించారు. దాని ముద్రణ విషయం మిగిలింది! ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖవారిని అడిగి, అడిగి, విసుగు పుట్టినా, పట్టుదలతో ఆ శాఖ నుండి, కొంత — సగం—అర్థిక సాహాయ్యం సాధించగల్గాను. తక్కినది, సంతోషంగా నేను భరించాను. శ్రీ శాస్త్రిగారు నా షష్టి పూర్తినాడు ఆ నవలను నాకే అంకితం చేశారు. ఇది నిజంగా ఆ మహా పండితుని, ఆ మహాపురుషుని ఆశీర్వాదంగా, వరంగా నేను స్వీకరించాను. నా షష్టిపూర్తి అనగా 1977 డిసెంబరు అదొక మహత్తరమైన మహనీయస్మృతిగా నా జీవిత చరిత్రలో ప్రస్తుతించేకో దగిన భవ్యఘట్టం!

శ్రీ శాస్త్రిగారు అచ్చతెలుగు నిఘంటువునొక దానిని రచించారు. ప్రస్తుతం హరివంశానికి వ్యాఖ్యవ్రాస్తూ ఉన్నారు. అత్యంత అనారోగ్యంతొ బాధపడ్తూ కూడా అనన్యసాధ్యమైన, సంస్కృత మహాకావ్యాలకు వారు వ్యాఖ్యానం వెలయించి. సాహిత్యాభిమానులకు ఆ మహాకావ్యాలను సులభతరబోధ్యాలు చేయడం అనేది ఎంతో మహత్తర విషయం! ఈ మహాకావ్యానికి ఆంధ్రజాతి వారి కెంతో ఋణపడి యున్నదీ.

ఈ అభిప్రాయంతోనే నేను మధురకవి నాళము కృష్ణారాయ విజ్ఞాన పీఠం స్థాపించినపుడు, వారినే ప్రథమంగా సత్కరించాను.

## కావ్యస్వీకారాలు

ఈ సందర్భంలోనే ప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి అనందారామం 'దోలిక' అనే కథా సంపుటాన్ని నాకు అంకితం చేసిన విషయాన్ని 1970 ఆగస్టులో మా రెండవ కుమారుడు రాజారాజనరేంద్రుని వివాహ సందర్భముగా 'మృత్యుంజయ 'విలాసం' అనే కావ్యాన్ని నాకు అంకితం చేసిన సత్యవోలు నాగేశ్వరరావు చిరంజీవి సౌ హృదయాన్ని స్మరించుకోవాలి. సత్యవోలు అప్పారావుగారు మా నాన్నగారి ఆస్థాన కవులలో (అష్టదిగ్గజాలలో పెద్దనగా వ్యవహరించారు. వారి కుమారుడే యితడు!)

Institute of Hestorical Studces Culcul'a వారి the Suplementary Dictionery of National Biography వారి సేకరణ—

## గ్రంధములో, నా సాహిత్య జీవితచరిత్ర సేకరణ

ఖమ్మంమెట్టు జిల్లా సత్తుపల్లి గ్రామంలోని ప్రభుత్వ జూనియర్ కళాశాల జూనియర్ లెక్చరరు శ్రీ కనకబండి మోహనరావుగారినుండి 30-7-1982వ తేదీతో నేను ఒక లేఖనందు కొన్నాను. ఆ లేఖలో పై సంస్థవారు తయారుచేస్తూ ఉన్న డిక్షనరీలో నా సాహిత్య జీవితాన్ని కూడా చేర్చవలసినదిగా నిర్ణయం తీసుకొన్నారు. కనుక నా సాహిత్య జీవితాన్ని పంపవలసినదిగా కోర్తూ శ్రీ మోహనరావుగారు వ్రాసియున్నారు.

వెంటనే వారు సూచించిన విధంగా నా సాహిత్య జీవితాన్ని తెలుగులో వ్రాసి పంపాను.

వెంటనే శ్రీ మోహనరావుగారు నా రచనను 7 పుటల ఆంగ్ల వ్యాసగాం వ్రాసి పంపినట్లు తెల్పుతూ Natinoal Biography లో మీ చరిత్ర ఎక్కుతుంది. మీ రచనలకు మీ జీవితానికీ విశిష్టమైన గుర్తింపు లభించింది" అని తెల్పుతూ నవంబరు 1982 తేదీలో మరల ఇంకొక లేఖవ్రాశారు. ప్రపంచ వ్యాప్తంగా అన్ని గ్రంథాలయాలకు అన్ని విద్యాసంస్థలకు ఈ సేకరణ గ్రంథం పంపబడుతుంది విశ్వ

వ్యాప్తంగా మీ శిష్ట సేవలు ఎరకపడగలవనీ ఆ ఉత్తరంలో శ్రీ మోహనరావు గారు ఉల్లేఖించారు.

## ప్రపంచ సాహిత్య చరిత్రలో నా రచనలు

ఇది జరిగిన కొద్ది సంవత్సరాలకే మధురై కామరాజ నాడార్ విశ్వవిద్యాలయం నుండి తెలుగు శాఖాధిపతి శ్రీ సంపత్కుమార్‌గారు "మీ సాహిత్య సేవను, కేరళ ప్రభుత్వం తయారుచేస్తూ వున్న ప్రపంచ సాహిత్య చరిత్రలో చేర్చడానికి నిర్ణయం జరిగింది. కాబట్టి మీ జీవిత చరిత్ర సాహిత్య సేవలను తెల్పుతూ వ్రాసి పంప మన్నారు. అట్లాగే వ్రాశాను.

## మధురకవి నాళము కృష్ణరాయ శతజయంతి

మధురకవి నాళము కృష్ణరావుగారు బాల వాఙ్మయానికి ఆదిపురుషుడు అనే అంశం ఆంధ్రులందరెరిగినదే. ఆయన తన రచనలన్నింటిని ముద్రణ చేయించారు కానీ అవి ఆయన జీవిత కాలంలోనే మరల ముద్రింపవలసిన అవసరం ఏర్పడింది. ఆ పనిని ఆయన చేయలేక పోయారు. ఆమహాశయుని సేవలనేకకారణాంతరములచే మరుగున పడిపోవుటచే ముఖ్యంగా బాలల భవిష్యత్తును శుభోదర్కంగా తీర్చిదిద్ద వలెననే మంచి అభిప్రాయంతో కావించిన ఆ బాలబంధుని రచనల పునర్ముద్రణ భాగ్యం కల్గించవలెననే ఉద్దేశంతో నేను ఎంతో శ్రమించి ఎంత మంది దాతలయొద్ద నుండో విరాళాములు తీసికొని వారి రచనలను పునర్ముద్రణ చేయించి మధురగీతికలు అను పేరున ఒక సంపుటముగా తీసుకొని రావడం జరిగింది. 1981 జనవరి 16వ తేదీనాడు రాజమహేంద్రిలో గౌతమీ గ్రంథాలయంవారు బాపట్లలో కళాభారతి వారు అదే తేదీనాడు శతజయంత్యుత్సవం జరిపారు. రాజమహేంద్రి ఆర్యవైశ్య యువజన సంఘంవారు ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభవారు వేటపాలెం సారస్వత నికేతనం వారు ఇంకా నరసరావుపేట మున్నగు గ్రామాలలో శతజయంతి ఉత్సవాలు జరిగాయి.

1984 వ సంవత్సరము నాటికి మధురగీతికలు సంపుటము పూర్తియైనది. బహుశః అదే సమయంలో అనుకుంటాను. రాజమహేంద్రి నగరమందలి ఆంధ్ర

కేసరి యువజన సంఘమువారు అద్దేపల్లి వివేకానంద నాగేశ్వరరావు దంపతులు (సరస్వతీ పవర్ ప్రెస్ యజమానులు) కలిసి మధురకవి నాళము కృష్ణరాయని శత జయంతిని గౌతమీ గ్రంథాలయమునందు మూడునాళ్ళ తిరునాళ్ళుగా జరిపినారు శ్రీ మధునాపంతులవారు శ్రీ కొర్లపాటి శ్రీరామ మూర్తిగారు ఇంకా ఇతరులు అధ్యక్షులుగా విచ్చేసి సభను శోభాయమానంగా నిర్వహించారు. బొంబాయినుండి వచ్చి మా అన్నయ్య నాగేశ్వరరావుగారు మా తమ్ముడు నాళము కామేశ్వరరావులు కూడా ప్రసంగించారు.

కాలుజారిపడి కృష్ణరావుగారు అయిదు సంవత్సరాలు మంచముమీదఉండి 1961 ఏప్రెల్ 17 వ తేదీ నాడు పరలోకప్రాప్తి నొందినారు. చివరి నిమిషం వరకు ఆయన కత్యంత ప్రీతి పాత్రమలైన బ్రహ్మ సమాజకీర్తనలను వారికి విన్పించే భాగ్యం నాకు దక్కింది.

నాకు గురువు, ఆదర్శమూర్తి మహిళాభ్యుదయ కాంక్షి గీర్వాణ భాషా ప్రియు రాలు పైశ్యసేవాసదన ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల వ్యవస్థాపకురాలు ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలా ప్రిన్సిపాల్ శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు 1969 లో దైవసన్నిధి కేగినారు. విశేషించి ఆమె నా అభ్యుదయానికి నిరంతరము శ్రమించారు. కళాశాలా నిర్వహణానికి కొంత ఆర్థిక లోపం వాటిల్లినదంటే ఆంధ్ర దేశంలో మళ్ళీ పర్యటించి కొంత ఆర్థిక సాయం అందించే భాగ్యావసరాన్ని కూడా ఆమె నాకే కల్గించారు. శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు మంత్రిగా ఉన్నపుడు ఆర్థిక పరమైన ప్రభుత్వ గ్రాంటుల విడుదలలో జాప్యం జరిగిందంటే కూడా ఆమె బాపట్ల వచ్చి నన్నే హైదరాబాదు పంపించారు. ఆ సమయంలో నాకు జ్వరం కూడా తుదకు ఆమె శిలా విగ్రహాన్ని తయారు చేయించే బాధ్యతను కూడా కమిటీ వారు నాపైననే మోపారు.

## కామాక్షమ్మగారి శిలావిగ్రహ ప్రతిష్ఠ

అంతేకాదు ఆమె శిలావిగ్రహాన్ని ఆవిష్కరించే మహాభాగ్యం కమిటీ వారి సౌహృదయ్యంతో నాకే లభించింది ఆ ఉత్సవానికి అప్పట్లో ప్రతిపక్ష నాయ కులైన శ్రీ కొణిజేటి రోశయ్యగారు ముఖ్యఅతిథిగా విచ్చేశారని సంతోషంతో వ్రాస్తూ ఉన్నాను.

శ్రీమతి కామాక్షమ్మగారికి నాకూకల తల్లీకూతుళ్ల బంధమే మా యిద్దరనూ ఆ కళాశాలావేవా కార్యక్రమాల్లో అట్లా కల్పిందని చెప్పాలి.

## మాతృవియోగం

నిరంతరగాందేయవాది అత్యున్నత సంగీత ప్రియురాలు ఆంధ్ర మహిళాగాన సభా వ్యవస్థాపకురాలు కఠిన దీక్షపరురాలు ఆయిన మా తల్లిగారు సుశీలమ్మగారు 1971 లోనే పరంధాముని దివ్యసన్నిధికి చేరుకొన్నారు. ఆ సమయానికి నేను విశ్వ హిందూ పరిషత్తు కార్యవర్గ సమావేశానికై వెళ్లి తిరుపతిలో ఉన్నాను. ఆమె మరణ సమయానికి నేనామె చెంతనుండి ఆమెకు పరిచర్యలు సలుపలేక పోయాను.

## భావపురి రచయితల సంఘం

బాపట్ల వాతావరణానికిగానీ గ్రామ పరిస్థితికిగానీ, సాంస్కృతిక రంగచైతన్యానికిగానీ చాలా అనుకూలమైన ప్రదేశం! దేనికైనా ఆర్థిక ప్రోత్సాహం లభించడానికి చీరాల పౌరులెంత సహకరిస్తారో బాపట్లలో జనుల ప్రోత్సాహం లభించక పోయినా పలువిధములైన విద్యాసంస్థలకు నెలవైనందువలన సాంస్కృతిక రంగానికి సహకరించే వారుండిడం వలన ఇక్కడ సభలూ, సమావేశాలూ బాపట్లలో ఎక్కువగనే జరగుతాయి. సాధారణంగా బాపట్లలో ఏ సాంస్కృతిక సమావేశం జరిగినా అందులో పాల్గొనడానికి వచ్చే కళాకారులు ముఖ్యంగా సంగీత సాహిత్యరంగాల్లో కళాకారులు మా యింటికి రావడం మా యింటి ఆతిథ్యం తీసుకోవడం జరుగుతూ ఉండేది.

శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు రచయితల Work Shop ను బాపట్లలో ఏర్పాటు చేశారు. సమావేశానికి వచ్చిన వారందరకూ ఒకపూట ఆతిథ్యము కవిసమ్మేళనం మా యింటిలో జరగడం నా భాగ్యంగా భావించాను ఇట్లా జరగుతూంటే ఈ గ్రామంలో సాంస్కృతిక రంగానికి ఆలంబనంగా ఏదైనా ఒక స్థిరమైన సంస్థ నేర్పాటు చేసుకోవడం మంచిదని నాకు ఆలోచనగా ఉండేది. కానీ నేనెప్పుడూ ఉపన్యాసాల ఆహ్వానంపై. పై ఊళ్ళకు వెళ్ళడం జరుగుతూ ఉండడం వలన ఆ సంస్థను ఆటంకాలు లేకుండా నిర్వహించడం కష్టంకదా! ఆ ఉద్దేశంతో స్థానికులైన స-

కళావేత్తలను సంప్రదిస్తూ ఉండేదాన్ని ఆ ప్రయత్నాలు జరుగుతూ ఉండగానే శ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారు వచ్చారని తెలిసి నేను వెళ్ళి వారి నభ్యర్థించ గానే వారు ఆదరంతో మా యింటికివచ్చి హిందీనుండి వారు ఆంధ్రీకరించిన "కామాయని కావ్యగానం చేశారు. అప్పుడు మా యింట్లో సమావేశమైన సాహిత్యాభిమానుల సమాలోచనలలో 'రచయితల సంఘం'నికి ప్రాతిపదిక ఏర్పడింది.

కానీ నేను మళ్ళీ ఉపన్యాసమియ్యడానికి వరుసగా 15 రోజులు హెచ్చుగా ఊళ్లో ఉండక పోవడం తటస్థించింది. తరువాత శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ గారు ఇక్కడి ఆర్ట్సు కాలేజీలో ఆంగ్లాధ్యాపకులుగా వచ్చారు. నా ఆహ్వానంపై ఆ దంపతులిద్దరూ మా యింటికి రావడము వారిదగ్గర నేను సాహితీ సంస్థ విషయం ప్రస్తావించడం జరిగింది. వారు తప్పక నిర్వహిద్దామని ఉత్సాహం చూపారు.

వెంటనే నేనూ ప్రముఖ నాటకరచయిత శ్రీ కొర్రపాటి గంగాధరరావుగారు శ్రీ ఆత్రేయ, ముజీర్, శ్రీ సత్యనారాయణగారూ పూనిక వహించి వారానికి ఒక రోజు స్థానిక పౌరగ్రంథాలయంలోనో లేక యింకొక ప్రదేశంలోనో సమావేశమై రచనలు చదవడమనే కార్యక్రమాన్ని ప్రారంభించాము. కాలాంతరం లో ఆ సంస్థ చాలామంది రచయితలను ఆకర్షించింది. ఆ సంస్థ పక్షాన్నే శ్రీ తల్లావజ్ఝల శివ శంకరశాస్త్రిగారిని సౌభాగ్యవతి సోదరి నాయని కృష్ణకుమారిని, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారిని ఇంకా కొంతమంది ప్రముఖులనూ సన్మానించడం కూడా జరిగింది.

ముఖ్యంగా ఆసంస్థ సమావేశాల్లో చదవడానికే నేను ప్రత్యేకించి కూనలమ్మ పదాల ఛందస్సులో "కన్యకమ్మ నివాళి అనే పదకావ్యాన్ని రచించాను. తర్వాత దాన్ని ముద్రించాను. ఒకమారు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఎక్కడికో వెళ్తూ నా ఆహ్వానంపై బాపట్లలో మా యింటికి వచ్చారు. ఆవేళ రచయితల సంఘంవారిని కూడా నేనాహ్వానించాను. అప్పుడు శ్రీ గోపాలరెడ్డిగారు రచయితల సంఘ సంస్థ నిర్వహిస్తూన్న కార్యక్రమానికి సంతోషించి రెండువందల సమావేశాల ముగింపు సమావేశానికి నేను వస్తానని ప్రకటించారు. అట్లాగే మేము వారి నాహ్వానించాము. ఆ సమావేశానికి ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగా శ్రీ ఊటుకూరి గోపాలరావుగారు ఈ

ఊరికి బదిలీ అయి వచ్చారు. వారు మిక్కిలి సాహిత్యాభిమానులు మాత్రమే కాదు. సాహిత్య పోషకులు కూడా! వారి ఆదర ప్రోత్సాహాలతో మేము ఒక గొప్ప సమావేశాన్ని స్థానిక N.G.O ఆఫీసులో ఏర్పాటు చేశాము. శ్రీ కొర్రపాటి గంగాధర రావుగారు 'అరని పారాణి' అనే నాటికను ప్రదర్శించారు. ఆనాటికలో వారు కూడా పాత్రధారి! ఆ సభకు వేల సంఖ్యలో జనం వచ్చారు. ఆవేళ ఉదయం కావ్య పఠనం కూడా ఏర్పాటు చేశాము.

శ్రీ గోపాలరెడ్డిగారు చాలా ఉత్సాహంగా కావ్యపఠనంలో పాల్గొన్నారు. మా సభా నిర్వహణానికి రసమూర్ధన్యులు, సౌజన్యనిధి అయిన శ్రీ గోపాలరెడ్డిగారు ఆనందంతో ఉప్పొంగిపోయి రచయితల సంఘాన్ని బహుధా ప్రశంసించారు.

ఏ కారణం వలననో వైభవోపేతమైన ఈ సమావేశం జరిగిన తర్వాత భావపురి రచయితల సంఘం అంతగా నిత్య కార్యక్రమాలను నిర్వహించలేదు. ఈ సంస్థ సమావేశాలలోనే "కోరలమధ్యన కోటిస్వర్గాలు" అనే కథానికను రచించాను; నేను!

అయితే శ్రీ ఊటుకూరి గోపాలరావుగారి సాహితీ ప్రియత్వం మమ్ము ఊరికే ఉండనీయలేదు. వారి నిరంతర ప్రేరణను పొంది. స్థానిక ఇన్‌కమ్ టాక్సు అధికారిగారైన శ్రీ కోదండరాజు సత్యనారాయణశర్మగారు మళ్ళీ నాతో సంప్రదింపులు ప్రారంభించారు.

## కళాభారతి

అప్పుడు బాపట్లలో కళాభారతి అనే సాహిత్య సంస్థ వెలసి రూపులు దిద్దుకొన్నది. అందులోనూ నా ఆధ్వర్యమే అవలంబనం కావలసి వచ్చింది. సరేమళ్ళీ దానికి ప్రాణం పొయ్యడం ప్రారంభించాము. నేనూ శర్మగారూ ముందుండే వాళ్ళం కానీ వెనుక కర్తంతా శ్రీ ఊటుకూరి గోపాలరావుగారే. శివామోదము మున్నగు కావ్యాలు వెలయించిన శ్రీ K. శివయ్యగారు విజయవిలాస కావ్యంపై ఒకమారు మనుచరిత్రపై ఒకమారూ కళాభారతిలో మా ఆహ్వానంపై ప్రసంగించడానికి విచ్చేశారు. వారికక్కడ సౌకర్యాలు మాసనం శర్మ బాధ్యతైనా వారికి తేనీరు అల్పాహారాది ఆతిథ్యమర్యాదలు నెరపడం మొదలైన కార్యక్రమాలు నిర్వహించే భాగ్యం

నాకు దక్కడం నాకు ఒక వరప్రసాదమే. ప్రాచీన భారతీయ సంస్కృతికి చెందిన ప్రసంగాలూ ఆధ్యాత్మిక ప్రసంగాలు ఆంధ్రసాహిత్య ప్రసంగాలూ కళాభారతి కార్యక్రమాల్లో ఎక్కువగా చోటుచేసుకోవడం గమనీయం కళాభారతిప్రసంగాలు ఎక్కువగా దత్తాత్రేయ మందిరంలో జరిగేది.

శ్రీ ఊటుకూరి గోపాలరావు గారికి బాపట్ల నుండి బదిలీ అయినది. కళాభారతి వ్యాసంగాలు, క్రమక్రమంగా అదృశ్యమైనవి.

ఊరిలో ఉన్న సాహిత్యప్రియుల సాహిత్య తృష్ణ తీరనిదైనది.

## బాపట్ల మ్యూజిక్ సిండికేట్

ఇదీ ఇట్లా ఉండగా చాలా ఏండ్లనాడు బాపట్లలో బాపట్ల మ్యూజిక్ సిండికేట్ అనే పేరుతో నేను మా యింట్లోనే ప్రతీ నెలా రెండవ శనివారం స్థానికులైన సంగీతజ్ఞులను ఆహ్వానించి చిన్న చిన్న సమావేశాలు ఏర్పాటు చేసేవాణ్ని. ఆ సమావేశాల్లో పాల్గొనడానికి చాలామంది ఉత్సాహం చూపి వస్తూ ఉండేవారు! ముఖ్యంగా బాపట్ల అగ్రికల్చరల్ కాలేజి పిల్లలు వివిధములైన ఇంగ్లీషు వాద్య విశేషాలను తీసుకొని వచ్చి, చాలా చక్కని సంగీతాన్ని వినిపించేవారు. వాళ్ళ ఆసక్తిని గమనిస్తే మా అందరకూ చాలా ముచ్చట వేసేది. ఈ సమావేశాలు ఎంత వరకూ వచ్చాయంటే ఈ సంస్థకు వార్షికోత్సవం చేయాలని ఈ సంస్థను శాశ్వతం చెయ్యాలని ఆ విద్యార్థులంతా చాలా పట్టుపట్టారు. ఆ సమయంలో నా దగ్గర వీణ నేర్చుకొన్న వెలుతురుమల్లి శ్యామసుందర్, శ్రద్ధతో ఓపికతో పనిచేసి వార్షికోత్సవాన్ని ఏర్పాటు చేశారు. ఒక్కరోజు అనుకొన్నది. విద్యార్థుల పట్టుదలతో రెండు రోజులు చాలా వైభవంగా అగ్రికల్చరల్ కాలేజీ అసెంబ్లీ హాలులో వార్షికోత్సవాలు నాలుగేళ్ల జరిగాయి. ఇన్నా ఈ సంస్థ విషయం నాక రేకమో అప్పుడప్పుడు నను కూడా పిలిపించే వాళ్ళను!

ఒక వార్షికోత్సవంలో మిత్రులు రచయితయైన శ్రీ ఆత్రేయ నా కవితా సంపుటిలో బాపూజీని గూర్చి నేను వ్రాసిన "ఒక్క చిన్న దివ్వె చుక్కవోలె మొలసింది". అనే పదాన్ని అభినయ పూర్వకంగా నాట్యం చేయించారు స్థానికంగా ఉన్న కొందరు బాలికల చేత! తరువాత, తరువాత ఏదైనా పని ఉండికాని, ప్రవేశ

గాలకు గానీ, నేను ఊళ్లో వెళ్తుంటే ఆ నెల్లాళ్ళ సమావేశాలు జరిపేవారు లేక పోయారు. ఈ సమావేశాలు ఆధారంగా ఒక శాశ్వతసంస్థను నిర్వహించాలనే తలంపుతో ఒక కమిటీని ఏర్పాటు చేశాను. ఆ కమిటీలో శ్రీ వెలగపూడి సుబ్బారావు గారి రెండవ కుమార్తె సీతాలక్ష్మిగారు, నేను, వెణుతురు మల్లి శ్యామసుందర్ ప్రముఖ పాత్ర వహించి నడిపేవాళ్ళం. ఉత్సవావసరాన్ని బట్టి ఊళ్ళో చందాలు వసూలు పరచి, అవి ఖర్చుపెట్టేశేవాళ్ళం! నేను లేనపుడల్లా సమావేశమే జరుగని పరిస్థితుల్లో క్రమంగా అదీ అదృశ్యమైనది.

బాపట్ల ఆర్థికంగా సుసంపన్నమైన గ్రామం కాకపోవడం వలన శాశ్వత చందాదార్లుగా ఉండేవాళ్లు స్థిరంగా లభించక ఇక్కడ ఏ సంస్థా శాశ్వతత్వాన్ని పొందలేకపోవడం తటస్థిస్తూ ఉన్నది.

## భావపురి సంగీత సభ

ఇవన్నీ ఇట్లా ఉండగా కర్ణాటక సంగీత సామ్రాజ్య సార్వభౌముడైన, శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారి పాట కచేరీ చేయించాలని స్థానిక గాయకోత్తముడైన శ్రీశిష్టా సత్యనారాయణ రాజశేఖరంగారికి చింతలూరి ఆయుర్వేద నిలయ నిర్వాహకులైన శ్రీ దుడ్డు దక్షిణామూర్తి గారికీ, సంకల్పం కలిగి శ్రీ బాల మురళీ గారి నాహ్వానించడం గూడా జరిపినట్లు జ్ఞాపకం! ఆయన అంగీకారం కూడా పొందిన తర్వాత శ్రీ దుడ్డుదక్షిణామూర్తిగారు తర్వాత శిష్టా రాజశేఖరంగారూ నా దగ్గరకు వచ్చి 'అమ్మా బాలమురళీ కృష్ణవస్తూ ఉన్నాడు. ఆనాదబ్రహ్మను తగు విధంగా సత్కరించి పంపాలి, మనం!" అన్నారు. సరేలెండి! అంతకంటె మనకు భాగ్యమే మున్నది? ఆ పుంభావ సరస్వతి రావాలే కాని, మనం సత్కరించలేక పోతామా? ఘనమైన ఏర్పాటు చేసి వైభవంగాసత్కరిద్దాం। మహా కావలసివస్తే 4 లేక 5 వేలవిరా ళాలు ప్రోగుచెస్తే చాలుకదా! అన్నాను. 'అలా! అట్లా కాదు ఈ అవకాశాన్ని పుర స్కరించుకొని ఈ గ్రామంలో శాశ్వతంగా, ఒక సంగీత సంస్థ ఏర్పాటు చెయ్యాలి అనేది మా సంకల్పం అన్నారు. అప్పుడు నేను 'అయ్యా, రాజశేఖరంగారూ! ఈ ఊళ్లో ఎన్నివేల విరాళాలు వసూలు చేయగలమంటారూ? ముందు శ్రీ బాలమురళీ గారి పాట కచ్చేరి కానివ్వండి. తర్వాత చూద్దాం" అన్నాను. కానీ వారు దాని

కంగీకరించక ఈ సమయంలోనే విరాళాలు వసూలు వసూళ్లకండి ధానికి మీ సంపూర్ణ సహకారం కావాలన్నారు.

## ఎవ్వరే సేవా కార్యక్రమం కావాలన్నా కాదనను

ఎవ్వరే సేవాకార్యక్రమం కావాలన్నా కాదనకుండా శక్తి వంచన లేకుండకృషి చేసి. ఆ కార్యక్రమాన్ని అవలీలగా పూర్తిచేయవచ్చునులే. దానికి ఆ సర్వేశ్వరుని ఆశీస్సు మనకు లభిస్తుందిలే అనే చిత్తవృత్తి కల నేను, వారితో కలిసి. డబ్బు వసూళ్ళకు బయలు దేరాను నేను శ్రీరాజశేఖరం గారూ, శ్రీ దుడ్డు దక్షిణామూర్తి గారూ, ఆ సమయంలో ఇక్కడి జడ్జిగా ఉన్న నరసింహం గారి సతీమణి రాజ్యలక్ష్మి గారూ ఇంకా కొంత మంది కలిసి వసూళ్ళకు పూనుకొన్నాము. స్థానిక ప్రముఖులైన శ్రీ ఉడిపి N. సుబ్బా రావుగారూ శ్రీ గెల్లి పిచ్చైయ్యగారూ, ఇంకా సంగీతాభిమానులూ మాతో బాటు విరా ళాల వసూళ్ళకు పాటుపడ్డారు విచిత్రమేమిటంటే నేను ఆశించనంత ఎక్కువగా. విరాళాలు వసూలయ్యాయి. బాలమురళిగారి పాట కచేరీ చాలా వైభవంగా జరిగింది శ్రీ కోసా ప్రభాకరరావుగారు భావపురి సంగీత సభకు ప్రారంభోత్సవం చేశారు, శ్రీబాలమురళిగారు జ్యోతి వెల్గించారు. నేనా గాయక సార్వభౌమునకు పుష్పాభిషేకం చేశాను తరువాత కమిటీకి గెల్లి పిచ్చైయ్య శ్రీ రఘురామయ్యగార్లు కార్యదర్శులుగా శ్రీరాజశేఖరంగారు అధ్యక్షులుగా, నేనూ శ్రీదుడ్డు దక్షిణామూర్తిగారు ఉపాధ్యక్షులుగా, ఒక కమిటీ ఏర్పడింది, జడ్జిగారి భార్య, ఉడిపి సుబ్బారావుగారూ ఏ పదవిని చేపట్ట దానికి అంగీకరించలేదు. కాని కార్యభారమంతా భుజస్కంధాలపై వేసుకొని, కార్య వర్గ సభ్యులుగా మాత్రం మిగిలిపోయారు. మధ్యలో చాలామంది కార్యదర్శులు మారినా, ప్రస్తుతం. కె. కృష్ణారావుగారు (ఫిడేలు వాద్య నిపుణులు) కార్యదర్శిత్వంతో ఆ సంస్థ పని చేస్తూందని చెప్పడానికి సంతోషిస్తూ ఉన్నాను. 1992లో ప్రస్తుతం నేనే ఆ సంస్థకు అధ్యక్షురాలనై నాను.

## శ్రీరామాలయ నిర్మాణం

క్రొత్తబస్స్టాండువద్ద చీలు రోడ్డుమొదట్లో ఒక చిన్న పెంకుటింట్లో శ్రీరామ చంద్రమూర్తి చిత్రపటం పెట్టి పూజ, భజన చెయ్యడమనే కార్యక్రమం. ఎన్నేళ్ళ

బిట్లో జరుగుతూ ఉండడం, వావట్ల వాస్తవ్యులందరకీ తెలిసిన విషయమే. గూడూరు వాస్తవ్యులు శ్రీ కోటయ్యగారు ఆయా కార్యక్రమాలు నిర్వహించేవారు.

అక్కడ శాశ్వతమైన శ్రీరామాలయ నిర్మాణానికి పూనుకోవాలనే సంకల్పం కల్గడం, స్థానిక ప్రముఖులైన శ్రీ నంబూరి పిచ్చియ్యగారు ప్రధానంగా పూనుకోవడం జరిగింది. ఏదో బాల్యంనుండి రామనామాన్ని జపించే అభ్యాసం నాకు ఉండడం వలన శ్రీరామాలయనిర్మాణాసందర్భంగా నేను పూనకోవడం నా ధర్మం నా విధి నా కర్తవ్యమని భావించి నేను కూడా నిర్మాణ సంఘంలో సభ్యత్వం తీసుకొని వసూళ్ళకు సహాయం చేయవలసినదిగా శ్రీ కోటయ్యగారు నన్ను కోరగా సంతోషంతో అంగీకరించడమే కాకుండా శ్రీపిచ్చయ్యగారు శ్రీ కోటయ్యగారు శ్రీ అంకమ్మగారు మొదలైన ప్రముఖులతో కలిపి మున్మురమైన కార్యక్రమంచేసట్లే గుంటూరు వరకు వెళ్ళి నిధి వసూలుచేసి శ్రీరామాలయ నిర్మాణానికి ప్రతిష్ఠకు తోడ్పడమే కాక 2,000/రూ లు విరాళంగా వసూలుచేశాం. ఈ పవిత్ర కార్యం 1987 లో జరిగిందని వ్రాయడానికి ఆనందిస్తూ ఉన్నాను. ఆసందర్భంగా జరిగిన జపహోమాది కార్యక్రమాల్లో నేను కూడా పాల్గొని నేను నిత్యమూ పారయణకావిస్తూ ఉన్న రామనామ తారక మంత్ర జపానికి హోమ తర్పణాదులు నిర్వర్తించుకొన్నాను.

శ్రీయుత బెజవాడ గోపాలరెడ్డిగారి M. P. ఎలెక్షను సమయంలో వారు అనారోగ్యం పాలైనందువలన వారి భార్య కాంతమ్మగారితోబాటు నేను కూడా ప్రచారంలో పాల్గొన్నాను. ఆ సమయంలోనే నేను ఏర్పాటు చేసిన గడగు సీతాపతిగారి సమ్మానానికి కూడా వెళ్ళలేక పోయాను. అట్లాగే శ్రీవద్ది సుదర్శనంగారి M. P. ఎలెక్షనులో కూడా పాల్గొన్నాను.

## అనంతుని మండల సందర్శనం

శ్రీ సుదర్శనంగారి ప్రచారానికి తిరుగుతూండగా ఒక రాత్రి కారులో నేను శ్రీ తెల్లాకుల జాలయ్యగారు, దోర్నాల వెళ్తూండగా దారిలో ఇంజనులో నీళ్ళుపొయ్యడానికి రోడ్డుమీద కారు ఆపగా అందరము కారునుండి రోడ్డుమీద క్రిందకు దిగాము ఆ సమయంలో కొవ్వూరు కేంద్రీయ గీర్వాణ విద్యాపీఠం వారు ప్రచురించిన నక్షత్ర మండలానికి సంబంధించిన పుస్తకాన్ని చదువుతూ కాలక్షేపం చేసేదాన్ని. నక్షత్ర

శాస్త్రం అంటే నాకు చాలా చాలా ప్రీతి. చిన్నపుడు గొబ్బూరి వేంకటానంద రాఘవ రావుగారు భారతిలో నక్షత్రాలపై వ్రాసిన వ్యాసాలు తప్పకుండా చదివి వారిచ్చిన సూచనలనుబట్టి రాత్రిళ్లు అదే పనిగా చూస్తూ ఉండేదాన్ని. భోమండలంలో అతి దూర సుదూర తీరాలలో ఉండి యావద్విశ్వానికి విధి తప్పకుండా తమ విధిగా కాంతి కిరణాల సహాయంతో వెలుగు రేఖలను అందించే నక్షత్రరాశి అంటే నా హృదయం సంతోషంతో స్పందిస్తుంది. అది ఫిబ్రవరి మాసం అని గుర్తు! రోడ్డుమీద నిల్చొని ఒక్కుమాలు నీలి గగనాల దవళాలపై నిశాకాంత కట్టకొన్న స్వర్ణకుసుమాల వలె మెలసిపోయే ఆ చుక్కల సోయగాన్ని చూడాలని తల పైకెత్తాను. ఆశ్చర్యం! పడగవిప్పి, తోకవలకు చుట్టలు చుట్టలుగా చుట్టుకొని రోదసీకుహరశోభనతిశయింప జేస్తూన్న అనంతుడు (ఆదిశేషువు) ఈ పరమాద్భుతాన్ని తిలకిస్తూ ఎంతసేపు నిలిచిపోయానో నాకే తెలియదు! ఇంతలో శ్రీ జాలయ్యగారూ "అమ్మా ఏమిటి ఎంత పిలిచినా పలకరు! ఆకాశంలో ఏమి చోద్యాలు చూస్తూ ఉన్నారు? రండి వెళ్దాం. దొర్బాల త్వరగా చేరకోవాలి" అని గట్టిగా పిలిచారు. అప్పుడు నేను ఈ లోకంలోకి వచ్చాను. అది మొదలు మూడు రోజులు ఒక విధమైన తన్మయీభావం నన్నావేశించకమానేదు! ఆ నక్షత్రమండలం కన్ను మూసినా కన్ను తెఱచినా నా కళ్ళ ముందు ప్రత్యక్షంగా కాంతిరేకలు విచ్చుకొంటూ దర్శనమిచ్చేది. అప్పుడు నేను అనంతా నన్ననుగ్రహించు నేను గృహిణిని నీవిట్లా నన్నావేశిస్తే నా సంసార బాధ్యత నిర్వహించలేను. ఈ పారవశ్యం నన్నొదిలిపెట్టకపోతే నేను మళ్ళీ ఈ లోకంలోకి రాలేను. అని ప్రార్థించాను. ఆరాత్రి ఒక అశరీర వాక్కు "భయపడకు నీకు నేను మేలేచేస్తాను" అని గంభీరంగా వీనులకు సోకింది.

ఇట్లాగే వీణామండలం, త్రివిక్రమమండలం కూడా నాకు ఆరోజుల్లో దర్శన మిచ్చేది! అనంతుని దర్శనాన్ని పొందగలిన నేను ఆ అనంతుని సేవను చేస్తూ ఉంటే ఇప్పుడు నా పరిస్థితి ఎంత గొప్పగా ఉండేదో Like the Star that Shins effer without hast and rest అని ఒక ఆంగ్ల కవిసత్తముడు వాకొనినట్లు కాంతి రేకలతో భువన పాళికి వెలుగు వాకిళ్ళు తెఱిచే విసుగూ విరామము లేకుండా సర్వేశ్వరుని నియమపాలనను విధిగా నిర్వహించే ఈ జ్యోతిర్మండలం ఒక్కొక్క ప్పుడు అదృశ్యం కూడా అవుతూ ఉంటుంది. అయినా నా యందనుగ్రహించి; ఈ

మహాతేజోరాశి నా హృదయాన్ని స్పృశించి అనంత ప్రకాశంతో నింపినందుకు నేను ధన్యురాలనే.

## సత్కారాలు - ఎవార్డులు

1. 1953 లో ఆంధ్ర కవయిత్రుల గోష్ఠిలో తెలుగు భాషా సమితి వారి సత్కారము.
2. 1954 లో గృహలక్ష్మి కంకణ సమ్మానము
3. కవిత్రయ వైజయంతి సమ్మానము-నెల్లూరు.
4. మొల్ల జయంతి సమ్మానము.
5. 1971 అఖిల భారత తెలుగు రచయితల మహాసభల సమ్మానము,
6. 1975 ప్రపంచ తెలుగు మహాసభల సమ్మానం.
7. 1975 తమిళనాడు వైశ్యమహాసభ సన్మానం.
8. 1977 మద్రాసు ఆంధ్ర మహాసభ సమ్మానం.
   1) ఆత్మూరి లక్ష్మినరసింహసోమయాజి సంఘమువారి బంగారు కుంకుమ భరిణి, బంగారు మెడల్-ఇటీవల ఇంకొక సమ్మానము మొత్తం మూడుమార్లు.
   4) మచిలీపట్నం మహిళాసభ సమ్మానం
   5) వీణావాదనానికి, వక్తృత్వానికి, ఉభయ భాషా ప్రవీణ పరీక్షలో యూనివర్సిటీ ప్రథమత్వానికి, మొత్తం 4 బంగారు మెడల్స్
9. 1983 బెంగుళూరులో వైశ్యమహిళాసభ సత్కారము.
10. 1983 తిక్కవరపు సుదర్శనమ్మ ఎవార్డు.
11. 1984 సుశీలా నారాయణరెడ్డి ఎవార్డు
12. 1986 తెలుగు విశ్వవిద్యాలయం వారి రెండు సత్కారాలు,
    1) నా తెలుగు మాంచాల కావ్యానికి
    2) ఉత్తమ రచయిత్రి సమ్మానాలు
13. 1986 కవిప్రభా ఎవార్డు (విశ్వనాథ సత్యనారాయణగారి జ్ఞాపకార్థం,

బాలా సుందరీ ప్రతిష్ఠాన్ వారు (మచిలీపట్నం) ప్రథమంగా మహిళకిచ్చినది త్రిశావ రాజా నరసింహారావుగారి అధ్వర్యంలో

14. కోరుకొండ లింగమూర్తిగారి ఎవార్డు

15 1988 అనంతపురంలో శ్రీ కాసంసెట్టి రాధాకృష్ణయ్య శకుంతలమ్మా ఫౌండేషన్ వారిచే కనకాభిషేకం లలిత కళాపరిషత్తువారి సన్మానం. కూడా.

16. 1989 ఒంగోలులో ఎఱ్ఱన్నపీఠం విశిష్ట సన్మానం.

17. 1990 జూలై 14 (కెనడా) టోరెంటో తెలుగు సంఘమువారిచే సన్మానం.

18. 1991 ఏలూరు సాహిత్యమండలి ఉత్సవాలలో సన్మానం.

19. ఢిల్లీలో ఆవోపావారి సన్మానం.

20. విజయనగరంలో విజయ భావనవారి సన్మానం.

21. విజయనగరంలో కౌముదీ పరిషత్తు సన్మానం.

22. విజయనగరంలో మహిళాసంఘం వారి సన్మానం.

23. హైదరాబాదు ఆంధ్ర యువతీమండలివారి స్వర్ణోత్సవాలలో ముఖ్య అతిథిగా సన్మానం.

24. 1990 విజయవాడ రేడియోలో సరస్వతీ సామ్రాజ్యవైభవ ప్రదర్శనం.

25. 1991 లో దూరదర్శన్ వారి ఇంటర్వ్యూ

26. 1991 లో దూరదర్శన్‌వారి కవిసమ్మేళనంలో పాల్గొనుట.

27. 1959లో అప్పికట్లలో సన్మానం కుప్పరాసుబ్బారావుగారు, కాకొరపర్తి వేంకటేశ్వర్లుగారి నిర్వహణ-శ్రీ కె. రోశయ్యగారు ముఖ్య అతిథి.

28 1993 జనవరి శ్రీ టి. సుబ్బరామిరెడ్డిగారి కళాసంస్థ పక్షాన సరోజిని స్మారకంగా తెలుగు వెలుగుల ఎవార్డు.

విశేషమైన, విశిష్టమైన ఇంకొక మహత్తర సంఘటనను నవాబుగా ఎదు ర్కొని పరిష్కరించే శుభావకాశం నాకు లభించింది.

## భారతీయ లేఖికా సంఘ్‌వారికి తెలుగురచయిత్రుల చరిత్రను హిందీలో అందించడం

అది 1986 వ సంవత్సరం న్యూఢిల్లీ ( మాయాపురినుండి భారతీయ లేఖికా సంఘ సభ్యురాలైన "శ్రీ ఆశారాణివోరా"గారు "భారతీయ లేఖికాయే" అనే సేకరణ గ్రంథంలో ముద్రించడానికి తెలుగు రచయిత్రుల చరిత్ర కావాలి. దయచేసి పంపండి" అని ఒకలేఖ వచ్చింది. అప్పుడు చాలాచాలా ప్రయత్నంచేసి, సుమారు 3-4 వందల మంది (పద్య, గేయ, కథానికా. నవలా) రచయిత్రుల పేర్లు, రచనలను సేకరించి, ఒక వ్యాసంగా రూపొందించాను. ఆ వ్యాసాన్ని స్థానిక ఆర్ట్సుకాలేజి హిందీ లెక్చరరు, శ్రీయుత వెంకటేశ్వరరావుగారు చాలా చక్కని, సరళ హిందీ భాషలో అనువదించియియ్యగా దానిని ఆశారాణీ వోరాకు పంపాను. ఈ విధంగా తెలుగు రచయిత్రుల, కవయిత్రుల చరిత్రను, అఖిల భారతస్థాయిలో అన్నిభాషల వారూ తెలుసుకొనే, స్వర్ణావకాశం నాకు లభించింది!

ఇంకో విశేష సంఘటన ఆంధ్ర రచయిత్రులను గూర్చి సంగ్రహ వివరణతో కూడిన"Who is who" గ్రంథాన్ని నా ప్రేరణపై, ఆం-ప్ర-సాహిత్య ఎకాడమీ చేపట్టింది. ఆ సంకలనమును, సోదరి సౌభాగ్యవతి కె రామలక్ష్మి నిర్వహించింది. కొన్నాళ్ళకా గ్రంథము రచయిత్రుల సంఖ్య పెరుగుటచే, ఆ గ్రంథము అసమగ్రమై పోవుటవలన, నేను ఆం-ప్ర-సాహిత్య ఎకాడమీ వారిని మరల అభ్యర్థించగా, ఆ కార్యక్రమాన్ని నాకే అప్పగించగా 300 కవయిత్రుల, రచయిత్రుల వివరణతో( నేను సంకలనము చేసినాను—కాని అది అచ్చుపడలేదు.

### నా రచనలపై PHD–M–Phil–

విజయనగరం మహారాణీ కాలేజి తెలుగు లెక్చరరు శ్రీమతికె. శారద గారు M phil చేయడానికి, పూనుకొన్నారు. అది పూర్తియైనట్లు లేదు.

మరల కొన్నాళ్ళకు- శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ విద్యార్థిని శ్రీ హేమగారు ప్రొఫె—శ్రీ సర్వేశ్వరరావుగారి, నేతృత్వంలో ఆ ప్రయత్నం చేస్తూన్నట్లున్నారు. అదీ కూడా పూర్తికాలేదు.

నేను 1988 లో రచించిన సరస్వతీ సామ్రాజ్య వైభవ రూపకాన్ని ఆ తరగతికి చెందిన భువనవిజయం మొదలైన రూపకాలపై P-HD చెయ్యడానికి అద్దంకి, గవ–కళాశాల తెలుగు లెక్చరరుగారు శ్రీ భూసురపల్లి వేంకటేశ్వర్లుగారు సంకల్పించి, అందులో సరస్వతీ సామ్రాజ్య వైభవాన్ని కూడా చేర్చడానికి 1991 డిసెంబరు 27 వ తేదీనాడు తీసికొని వెళ్ళారు.

## సరస్వతీ సామ్రాజ్య వైభవ ప్రదర్శనం

నా రచనయైన సరస్వతీ సామ్రాజ్య వైభవాన్ని రాజమహేంద్రి ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలా విద్యార్థినులు ప్రదర్శించారు. 1990 సెప్టెంబరు 23–30 తేదీలలో రెండు భాగములుగా హై-బా-ఆలిండియా రేడియోవారు ప్రదర్శించారు.

ఏలూరు సెయింట్ థెరిస్సాస్ కళాశాలా విద్యార్థినులు ప్రదర్శించారు.

ప్రస్తుతం నాగార్జున విశ్వవిద్యాలయానికి చెందిన గుంటూరులోని T–J–P కాలేజీ తెలుగు లెక్చరరు శ్రీమతి సూర్యకుమారిగారు నా రచనలపై P-HD చేస్తూ ఉన్నారని తెలుపడానికి సంతోషిస్తూ ఉన్నాను. దీనికి [illegible] ప్రేరకురాలని చెప్పడానికి సంతోషిస్తూ ఉన్నాను.

## శ్రీ కృష్ణదేవరాయల పట్టాభిషేకోత్సవాలు

చెప్పుకోదగిన ఇంకొక ఉదంతమేమంటే, బెంగుళూరుకు దగ్గరలో తమిళనాడుకు చెంది, తమిళనాడు సరిహద్దుల్లో ఉన్న ధర్మపురి హోసూరులో కోదండరామయ్యగారనే తెలుగు అభిమాని ఉన్నారు. ఆ గ్రామం యొక్క ఉనికి చాలా వింతైనది. ఉండడానికి బెంగుళూరుకు సమీపంలో—కాని ఆ గ్రామం తమిళనాడుకు చెందింది. ఊరంతా తెలుగు వారి స్వజనం, అక్కడి జనుల అభిమానాలు రాగాలన్నీ తెలుగు దేశంపైన అక్కడని వసిస్తూ ఉన్న శ్రీ కోదండ రామయ్యగారు, నూటికి వెయ్యిపాళ్ల తెలుగు అభిమాని.

ఆయన, శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకోత్సవాలను తరితప్పకుండా ఏటేటా నిర్వహిస్తారు.

నన్ను రెండు మూడు సంవత్సరాలు వరుసగా ఆహ్వానించారు. అంతదూరం వెళ్ళలేక, నేను వెళ్ళలేకపోయాను. కాని వారు నన్ను ఆ ఊరికి రప్పించాలనే ఆయన పట్టుదల ఏ మాత్రం సడలిపోలేదు.

నరే ఒక సంవత్సరం వెళ్ళాను. ఒకరోజను కొన్న నా కార్యక్రమం మూడు రోజులు నర్వహించారు. ఇరుగు పొరుగు ఊళ్ళనుండి అసంఖ్యాకంగా తెలుగు ప్రజలు తిరణాలకు వచ్చినట్లు వచ్చారు.

ఒకరోజు సభలో శ్రీ కోదండ రామయ్యగారిపై, నేను ఆశువుగా ఈ క్రింది పద్యం చెప్పాను.

మెడ వంకరాయె, పో, పద
పడి శ్రీ కోదండరామ పండిత మణికిన్
నుడిగొని చదువుల రాణిని
పుడమిన్ మెడపై నిరతము మోయుటకాదే!

అక్కడ నా తెలుగుమాల వాలా కావ్యాన్ని ఆసాంతము పఠింప జేశారు. వాళ్ళకెందుకో నాపై యెంతో అభిమానం కల్గింది గొప్పగా సన్మానించారు.

## మోదసుధా బిందువు—ఖేదవ్యధాసింధువాయె

1988 వ సంవత్సరం మోద, ఖేద సమ్మిశ్రితమైన ఒక ఘటన ఒక విధంగా నా జీవితగతినీ, జీవనసంతినీ మార్చి వేసింది. మా వారు చాలాకాలం నుండి చక్కెర వ్యాధిగ్రస్తులై, బాధపడ్తూ ఉన్నారు. చక్కెరవ్యాధి ముదిరిపోయి ఒక విధంగా మంచం పట్టినారు. అయినా; తనపని తాను చేసుకొంటూనే ఉన్నారు. వారి అనారోగ్య దృష్ట్యా నా అనారోగ్య దృష్ట్యా నేను ప్రసంగ కార్యక్రమాలు మానుకొన్నాను.

అదీ అట్లా ఉండగా, మా నాన్నగారి శతజయంతి జరిపినప్పటి నుండీ వారి పేరున ఒక పీఠాన్ని నెలకొల్పాలనే సంకల్పం కలిగి అది క్రమంగా హృదయంలో వేరూని బలపడింది.

## మధురకవి నాళము కృష్ణరాయ విజ్ఞానపీఠం స్థాపన

మా నాయనగారు గురువుగా దైవముగా భావించిన శ్రీ కందుకూరి వీరేశ

లింగం పంతులుగారు మా నాన్నగారిని తన కుడిభుజంవలె ఆదరించి తనకు అంత రంగిక శిష్యుడై తన నాయకత్వంలో సంఘ సంస్కారోద్యమాన్ని, వితంతు వివాహోద్యమాన్ని దృఢసంకల్పంతో దృఢదీక్షతో నిర్వహిస్తూ సేవకంకితమై పోయిన తన అంతేవాసి, అంతరంగిక శిష్యుడు అయిన నాళం; కృష్ణారావును గూర్చి సరిగా ఉల్లేఖించకపోవడం ఆంధ్రసాహిత్యంలో శ్రీకృష్ణరాయల సేవ మరుగున పడిపోయిన మాట వాస్తవమేనని పలువురు భావించడం జరిగింది. ఆకారణంగా ఆ బాలవాఙ్మయ పితామహుని, అనుష్ఠానిక బ్రాహ్మమతావలంబిని, ఆంధ్ర దేశంలో మొదటి దైన గౌతమీ గ్రంథాలయ వ్యవస్థాపకుని, ముఖ్యంగా సరళమైన భాషలో బాలవాఙ్మయంగా చేసి పొదులైన బాలలకు హితముపదేశించడానికి: పూనుకొని. రచనలు సాగించిన ఆ అకలంక సేవామూర్తి మానాయనగారి జీవితానికి పునశ్చరణగా ఒక పీఠాన్ని స్థాపించవలెననే, సంకల్పంతో 1988 జనవరి 16వ తేదీనాడు. పీఠం పేరున ప్రారంభ సమావేశం జరిపి, శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని (తెనాలి) సమ్మానించడంతో పీఠం ప్రతిష్ఠ ప్రారంభమైనది. ఆ మహాసభకు మహాకవి మహాత్ముని ఆస్థానకవి, తెలుగు లెంక శ్రీతుమ్మలపల్లి సీతారామమూర్తిగారు ముఖ్య అతిథిగా శ్రీడా. బొడ్డుపల్లి పురుషోత్తం (నాగార్జున యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా రిటైరైన)గారు సభాధ్యక్షులుగా పాల్గొన్నారు. ఆ సభలో శ్రీ మావారు హయగ్రీవ గుప్త అడ్వొకేట్. శ్రీతుమ్మలసీతారామమూర్తిగారిని సత్కరించారు. చాలా సంవత్సరాలుగా, అనారోగ్యంతో ఉన్న మావారు, ఆ వేళ, అన్ని బాధలూ మరిచి, పీఠం ప్రతిష్ఠా మహా సభలో పాల్గొని, శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారిని సత్కరించారు. మధురకవి విజ్ఞాన పీఠ ప్రతిష్ఠాపనం అయిన వెనుక ఒక ఘనమైన సమ్మానం జరిగింది. జీవితాన్ని సౌభాగ్యభవనంగా తీర్చిదిద్దుకోవాలి అనుకొనే ప్రతివారూ, సత్ప్రవర్తన, సత్ఫలము అనే నిశ్రేణికను మెట్టుమెట్టుగా ఆరోహణ చేసి, ఫలప్రదమైన పరిస్థితిని సాధించి, సౌభాగ్యవంతమైన ఆ భవనాన్ని అధిరోహించి సుఖజీవనాన్ని కైవసం చేసుకో గలిగారు. ఈ విధంగా ఫలవంతమైన జీవితాన్ని ప్రసాదించే మార్గాలు అనంతం! ఆ పరాకాష్ఠ కూడా భిన్న భిన్న రూపాల్లో ఉంటుంది.

ముఖ్యంగా సారస్వతేయులు అనగా కవి పండిత శేఖరులు, గాయక సార్వ భౌములు, చిత్రలేఖక శిరోమణులు, తమ జీవితంలో ఒక ఉన్నత పదవి నలంకరిం

చాలనే ఆకాంక్షకు 'కనకాభిషేకం' అనే రూపకల్పనమైన ఒక మహాసీయ, సంఘటన। ఒక మహైశ్వర్యసంవిధానం! ఒక అద్భుత రూపకల్పన! ఒక విశిష్ట గౌరవ పదం!

ఈ స్వర్ణావకాశం నాకు నా జీవితంలో అమృతభాండంలా లభించింది!

కనకాభిషేకం

అదే 1988 సంవత్సరంలో ఏప్రియల్ 10వ తేదీనాడు, అనంతపురంలో, శ్రీకాస్యంసెట్టి రాధాకృష్ణయ్య, శకుంతలా పొందేషను వారు లలితకళాపరిషత్తు వారి సహకారంతో అత్యంత వైభవంగా నాకు జరిపిన కనకాభిషేకం! శ్రీ టి హయగ్రీవాచారిగారు మంత్రిగా, బాలల పరిషత్తు అధ్యక్షులుగా ఉన్న సమయంలో, సాహిత్య ఎకాడమీ ప్రాతినిధ్యంతో నేను బాలల ఎకాడమీ సభ్యురాలుగా ఉన్నాను. ఒకమారు బాలల ఎకాడమీ ఉత్సవాలు జరుగుతూ ఉన్న సమయంలో వక్తృత్వ పోటీలు, వ్యాస రచనా పోటీలు సంగీతం పోటీలు. చిత్రలేఖనాది పోటీలలో, నేను ఏదో పోటీకి న్యాయాధిపురాలుగా ఉన్నాను. అంతేకాక, ప్రతి పోటీలను పరిశీలిస్తూ కొన్ని కొన్ని సూచనలందజేశాను. అనేక కళలలో పోటీలలో పాల్గొనడానికి వచ్చిన ఒక బాలానంద సంఘం కార్యకర్తలు నన్ను చాలా సన్నిహితంగా, పరిశీలన చేసి, ఒక సమయంలో, నా దగ్గరకు వచ్చి 'అమ్మా మూడు రోజులనుండి పరిశీలిస్తూ ఉన్నాము. మీరు చాలా గొప్పమేధావులు, మీకు అనేక కళలలో ప్రవేశమున్నది. మేము మీకు 'కనకాభిషేకం చేస్తాము. మీరు ఆమోదించాలి. అని చాలా బలవంతపెట్టారు.

నేనుసరే కోరనిదే, నాకు అంతస్వర్ణపూజావకాశం లభిస్తూంటే, వద్దనడమెందుకు? అని వారి ప్రతిపాదన కంగీకరించాను! సిరిరా మోకాలడ్డు పెట్టేటంత మూర్ఖులెవరూ ఉండరుకదా! అనుకొన్నాను.

తరువాత వారి ప్రోత్సాహంతో అనంతపురం లలితకళా పరిషత్తు వారు ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీ అధ్యక్షత క్రింద జరపాలను కొన్ని సన్నాహాలు చేసుకోవడం జరిగింది. శ్రీమతి శారదాముఖర్జీగారికి వీలుకాక

ఆ కార్యక్రమం రెండేళ్ళు, మూడేళ్ళు వాయిదా పడింది. కడకు 1977లో ఆంధ్ర ప్రదేశ్, పెనుతుఫాను భీభత్సంలో అల్లకల్లోలమైపోతూ ఉన్న సమయంలోనే అనంతపురం, లలితకళా పరిషత్తు వారు పెట్టిన ముహూర్తం సంఘటిల్లింది. నేను అంతకు క్రితమే బయలుదేరాను ఇంతలో శారదాముఖర్జీ రావడంలేదు. సమ్మానంవాయిదా పడిందని టెలిగ్రాం వచ్చింది. ఇట్లా అటంకం వచ్చిన తర్వాత మళ్ళీ చాలాకాలం వరకు ఈ ప్రస్తావనే రాలేదు.

ఢిల్లీలో అవోపా వారు కొందరు ప్రముఖుల నాహ్వానించి సమ్మానం చేసిన సమయంలో, అనంతపురం నుండి శ్రీ కాట్యంపెట్టి రాధాకృష్ణయ్య మహనీయులు వచ్చారు. నేను కూడా వెళ్ళాను అక్కడ పూజ్యులు శ్రీ రాధాకృష్ణయ్యగారు తాము నాకు "కనకాభిషేకం చేయనున్నట్లు తెల్పారు.

శ్రీ రాధాకృష్ణయ్యగారు కార్యదీక్షాపరులు అవితథ సంకల్పులు కూడా! ఆయన నోటితో ఒక మాట చెప్పి, చేతలలో వేరే విధంగా ప్రవర్తించేవారు కారు! త్రికరణ శుద్ధికల అంతరంగంతో, దైవభక్తి కల సంస్కారంతో, అకుంఠదీక్షతో మానవ సేవా పరంగా మాధవుని భావించి కొలిచేవారు! వారు కొన్నాళ్ళు ఆం ప్ర ఆ. వైశ్య మహాసభకు అధ్యక్షులు। ఆ ఉత్తమాశయ సంపన్నుడు, ఆ మహనీయ వ్యక్తి ఆ మాననీయ కీర్తి, మానసిక వీధిలో స్థిరంగా సంకల్పించే ఢిల్లీలో నాతో అన్నారు. అట్లాగే 1988 ఏప్రిల్ 10వ తేదీనాడు, అనంతపురంలో, లలితకళాపరిషత్తు వారి సహకారంతో శ్రీ K. రోశయ్యగారు ముఖ్యఅతిధిగా, తూమాటిద్రోణప్పగారు అధ్యక్షతన నాకు కనకాభిషేకం చేశారు! ఆ పుణ్యదంపతులు, శ్రీమతి శకుంతలమ్మా రాధాకృష్ణయ్యగార్లు కళ్యాణమయమైన వారి కరకమలాలతో, నా శిరస్సున స్వర్ణ పుష్పములుంచి అభిషేకముచేశారు. ఆ సభలో ప్రధానవక్త శ్రీ V.V.L. నరసింహారావుగారు, ఆ ఉదయం కవి పండిత సమ్మేళనం జరిగింది ఆ సమ్మేళనంలో నా పెద్దకుమార్తె సౌభాగ్యవతి సుహాసిని నాపై కవిత రచించి; చదివింది. సాయంకాలం సభలో నా మనుమడు సుహాసినీ హరనాధుల కుమారుడు చిరంజీవి పోలేపల్లి రాజీవ కుమార్ కూడా నన్ను ప్రశంసిస్తూ వచనకవితాహారం కూర్చాడు. నాప్రియ సహోదరియైన, సౌభాగ్యవతి కృష్ణకుమారి నాయందసమానభక్తి గౌరవములు కల, బాపట్ల ఎయిర్ ఫోర్స్ సార్జెంటు శ్రీ మద్దాళి సత్యనారాయణగారు కథా పద్య ప్రసూనాలతో

నన్ను ప్రశంసించారు. కొన్ని సంవత్సరాలుగా అందుకోలేని ఆకాశకుసుమంగా ఆశలు రేకెత్తించిన హేమకుసుమాభిషేకోత్సవం, శ్రీ రాధాకృష్ణయ్యగారి సిద్ధ సంకల్పబలం వలన మహా వైభవంగా నెరవేరింది

ఆ సమయంలో ఇటీవలనే రచించిన 'సరస్వతీ సామ్రాజ్య వైభవ రూపక మును, సోదరులు శ్రీ రాధాకృష్ణయ్యగారు తమ కరకమలములతో ఆవిష్కరించారు.

ఆ సభలో నేను నా ప్రస్తుతిని పద్యరూపమున కూర్చి సభకు సమర్పించాను.

ఆ వైభవోత్సవానికి నా పెద్ద కుమార్తె పోలేపల్లి సుహాసిని, అల్లుడుగారు పోలేపల్లి హరనాధ్‌గారు, వారి పిల్లలు పెద్దకుమారుడు ప్రతాపచంద్ర, వారి కుమా రుడు రంజన్ కుమార్తె, వీణామది, నా చిన్నకుమార్తె మైథిలీ బాలాజీ, చిన్నఅల్లుడు బొగ్గు సురేశ్ బాబు, వారి కుమార్తె అంజనావాసవీమనోజ్ఞ వచ్చి వారు కూడా నాకు పుష్పాభిషేకమొనర్చి వారి గౌరవాదరాలను, భక్తిప్రపత్తులతో ప్రదర్శించారు. ఇంకా స్థానికమైన ఆర్యవైశ్య సంఘాలవారు కూడా శాలువలతో సన్మానించారు. ఆనాడు. నా సంతోషాన్ని తెల్పుతూ సమర్పించిన పద్య కుసుమాలు!

ఇంత వరకు నా జీవనస్రవంతి, మోదసుధాబలధి బిందు సందోహమై, కిలకిల నవ్వులతో త్రుళ్ళిపడే సెలయేరై –

కలకలా రావములతో మధురమధురస్వరములను నల్దిశల వెదజల్లే ఆనందకధా మరందములు చిలికించు మురళీరవళియై సుందరస్రవంతియై అనంత సుఖస్వప్న దోలికల నుయ్యేల లూగు అమృతఝురియై విలసిల్లింది.

ఆతంకములు లేని రాచబాటపై తీవి మెయి సాగిన నా జీవిత చక్ర పరిభ్రమ ణానికి ముళ్ళపొదలు, కఠినశిలలు అడ్డమై, జీవితరథచక్రగమనం సౌఖ్యప్రదాయిగా సాగిపోవడానికి, ఆతంక మేర్పడింది.

మోదసుధా బిందువు

ఖేదవ్యథా సింధువై పోయినది.

కొన్నేళ్ళనుండి నిరంతర వ్యాధి పీడితులై, దుర్భరబాధను భవిస్తూన్న శ్రీమా గుప్తగారు వ్యాధి తీవ్రతచే 1988 ఆగస్టు 15వ తేదీనాడు వినాయక చవితినాడు హిన్నూర్ మిషన్‌హాస్పటలులో చేర్చబడినారు. అప్పుడూ అప్పుడు వ్యాధి తిరుగు

ముఖం పట్టినట్లు కనిపించినా, చక్కెర వ్యాధి ముదిరిపోయి నవంబరులో కార్తీక శుద్ధత్రయోదశినాడు. ఆయన ప్రాణవాయువులనంతవాయుపథంలో లీనమైపోయాయి. యముని మహిషపులోహ ఘంటల భీకరధ్వనిని, విని ఆయన ఆఖరుసారిగా కళ్ళు తెరిచారు. ఇంతలో నిర్దయకు మారు పేరైన ఆ యమవాహనం ఆయన గుండెలను తుమ్మపొడి చేసింది!

పాషాణ గుండెపైన
పలుగురాయి ముక్కచెక్కి
వేడితారు సిరాముంచి
విధివ్రాసెను కఠిన శిలా శాసనమ్ము
విధివ్రాతకు తలవంచక
తప్పలేదు, తప్పలేము, తప్పరేదు.
అయినను మరల తలనెత్తితి
దొరా! నీ మహనీయ చరిత

నభోవీధిని వ్రాయుకొఱకు అని వ్రాసుకొన్నాను. ఇంతలో నా గాథలో మేల్మిబంగరుపుటలను, నిర్దయగా నిఖిల నియామకుడైన నిరంజనుడు నలిపి నలిపి ఉండచేసి విసిరివేసినాడు! ఉవ్వెత్తుగా ఎగసిన సుఖానందసాగర తరంగ సింహపీఠిపై, ఆసీననై, వసుధాస్థలి నల్దిశల వైభవ ప్రభాసామ్రాజ్యమేలిన, నేను అమాంతము, దుఃఖసాగర నిమగ్ననై అధఃపాతాళమున కూరుకొని వలవంతలకు గురిచేయబడితిని, ఆ ఉదార పురుషుని సాహచర్యము గోల్పోయిన అభాగ్యనై, ఆల మటించుచు మిగిలిపోయాను. అఖండమై అనంతమైన యశోమయ దీపికా తేజః ప్రసారములకు ఆలంబనమై ప్రోదియిడిన, ఆ ఆశామయజ్యోతి ఆరిపోయి అంధకార గర్భమున పడి అవయుచున్నాను.

ఇది విధి సంకల్పము! తిరుగులేని ఈశ్వరనిర్దేశము వలన భాగ్యవంతమైన నా సుందరస్వప్నము కరిగిపోయినది, మధురోహల ఈ సువర్ణాధ్యాయమునకు తెర పడినది.

## ఆ తెర చీల్చుకొని

ఈ దౌర్భాగ్య సంఘటనం జరిగిన వెనుక వికలమైపోయిన మనస్సుతో,

నేను ఏమీ చేయలేక, జీవచ్ఛవములాగ ఇంటిలోనే ఉంటూ కాలక్షేపం చేస్తూ ఉండి పోయాను. నా కొలకుకాలం అగదు కదా! ఆ విషాద నిశాంధకారంలో ఒక చిన్న కాంతిరేఖా ప్రసారాన్ని కూడా నేను ఆలోకించలేక పోయినాను.

మధురకవి నాళం కృష్ణరాయ విజ్ఞాన పీఠం రెండవ సమావేశం. జనవరి 16వ తేదీనాడే జరుగవలసి ఉన్నది. కాని నన్నావేశించిన నిర్లిప్తత వలన ఏ విష యంలోనూ తూష్ణీ భావమే తప్ప దేనిపట్ల ఉత్సాహం లేకపోయింది. ఆ సంద ర్భంలో జనవరి దాటి పోయింది. ఇంక ఏప్రియల్ 17వ తేదీనాడైనా శ్రీ కృష్ణ రావుగారి పీఠం ఉత్సవాలు నిర్వహించడమెట్లా అనుకొంటుంటే గుంటూరుజిల్లా గ్రంథా లయ సంఘంవారు ఆ సంఘం యొక్క ఉత్సవాలను కృష్ణరావుగారి వర్ధంత్యుత్స వాలతో కలిపి చేయవలసినదిగా అభ్యర్థిస్తూ, తీర్మానించారు. ఆ తీర్మానాన్ని తీసి కొని, శ్రీచిట్టిసాయిబాబుగారు, నా దగ్గరకు వచ్చారు ఇక వారి సాయంతో, 1989లో శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి నాహ్వానించి పీఠం రెండవ సమావేశం జరిపాము.

## మూడవ విదేశీ పర్యటన

1990లో కెనడా, టొరేంటో నగరంలో ఉంటూ ఉన్న నా రెండవ కుమా రుడు రాజరాజ నరేంద్ర నన్ను కెనడాకు ఆహ్వానించాడు. జూన్ మాసంలో బయలుదేరి టొరేంటోకి వెళ్ళాను. అక్కడ బలవత్తరమైన తెలుగు సంఘం ఉన్నది ఒకప్పుడు బాపట్ల అగ్రికల్చరల్ కాలేజీలో లెక్చరరుగా పని చేసిన శ్రీమతి యశోద గారు టొరేంటోలో ఉన్నారు. నన్ను అక్కడకు పిలిపించడంలో ఆమె ప్రేరణ చాలా ఉన్నది. జూలైలో, నా కుమారుడు, తన స్నేహితులందరనూ, నారాక సందర్భంగా పిలిచి విందు చేశాడు.

టొరేంటో యూనివర్సిటీలో సంస్కృతాచార్యులుగా పనిచేస్తూ ఉన్న మహా పండితులు శ్రీవేంకటాచార్యులుగారు, వారి భార్య కుటుంబంతో వచ్చారు. వారికింకొ కరి యింట్లో పని ఉన్నా, ఆ పని మానుకొని, ఆ వేళ నా ప్రసంగం వింటూ ఉండి పోయారు. ఆనాటి నా ప్రసంగానికి టొరేంటోలో చాలా ప్రశంస లభించింది.

జూలై 14వ తేదీనాడు అక్కడి తెలుగు సంఘంవారు, మళ్ళీ ప్రసంగం

ఏర్పాటుచేసి 115 డాలర్లు, దీనారను చీరెతో సత్కరించారు. అక్కడ చాలా భారతీయ సంఘాలు ఉన్నాయి అనేక హిందూ దేవాలయాలు ఉన్నాయి హరేకృష్ణ మందిరం ఉన్నది T. V.లో భారతీయ కార్యక్రమాల ప్రసారానికు అవకాశం ఉన్నదీ, జేసుదాసు, బాలమురళీ కృష్ణ మొదలైన మహాగాయకుల పాటకచ్చేరీలు, వేదాంతం సత్యనారాయణగారి నాట్యప్రదర్శనలు మొదలైన అనేక కార్యక్రమాలు జరుగుతూ ఉంటాయి. సత్యసాయి భజనలు జరుగుతూ ఉంటాయి. తెలుగు సంఘాల ఎక్సకర్షన్లు మొదలైన కార్యక్రమాలెన్నో జరుగుతుంటాయి. మొత్తం మీద టోరెంటోలో భారతీయ వాతావరణం చాలా హెచ్చుగా ఉన్నది. హోటళ్ళు భారతీయ షాపింగ్ సెంటర్లూ చాలా ఉన్నాయి.

కెనడా యందలి మహానగరాల్లో ఒకటైన టొరేంటోలో తెలుగు కుటుంబాలు నిర్వహించే సంఘాలకు ఒకప్పుడు శ్రీ ఘండి కోటమూర్తిగారు అధ్యక్షులు, నా రెండవ కుమారుడు రాజరాజనరేంద్ర కార్యదర్శిగాను, వ్యవహరించి సంస్థను నడిపారు. ఘండి కోటమూర్తి గారు ఆ మహానగరంలోని తెలుగువారికి చాలా సహాయ సహకారాలు అందజేస్తూ ఉంటారు. తెలుగు కుటుంబాలవాళ్ళ సాంఘిక, సాంస్కృతిక సంబంధమైన అన్ని కార్యక్రమాలలోను శ్రీ మూర్తిగారి సహాయం లేకుండా ఉండదు. శ్రీ మూర్తి కెనడా ప్రభుత్వ రంగంలో, హానరరీ మేజిస్ట్రేటుగా కూడా ఉన్నారు.

## టొరేంటో ప్రభుత్వ గ్రంథాలయంలో నారచనలు

శ్రీ ఘండికోట మూర్తి ప్రయత్న ఫలితంగా నారచనలను ప్రభుత్వ గ్రంథాలయానికి తీసుకొన్నారు. ఆ గ్రంథాలయంలో భారత భాషలలో (దక్షిణాది) తమిళ, ఆంధ్ర హిందీ మొదలైన భాషలలోని గ్రంథాలు కూడా ఉండడం విశేషం!

కెనడా రాజధానియైన ఆట్టావా నగరంలో నివసిస్తూన్న శ్రీరామచంద్రమూర్తి గారు విష్ణునామ సహస్రానికి తెలుగులో కీర్తనలను రచించారు. ఆట్టావా నగరంలోని దేవాలయాల్లో అర్చకుడుగా పనిచేస్తూ ఉన్న శ్రీ పరీక్షిత్తు శర్మగారు, భారతదేశంలో బొంబాయి మహా నగరంలో ఉన్న తెలుగు సంఘంవారి పాఠశాలల్లో తెలుగు

సంస్కృతాచార్యులుగా పనిచేసి, కెనడాకు వచ్చారు. ఆ మహాకవి సంస్కృతంలో 70 కావ్యాలు రచించారు. నాకు వారి దర్శనం లభించడం, నా అదృష్టం! వారికి మధ్య భారతదేశమందలి కేంద్ర సాహిత్య ఎకాడమీ వారి సత్కారం లభించింది. సెప్టెంబరు మధ్యకాలంలో నేను తిరిగి భారతదేశానికి వచ్చాను.

## హైదరాబాదు ఆకాశవాణిలో సరస్వతీ సామ్రాజ్య వైభవరూపక ప్రసారం

కెనడా నుండి నేను బాపట్ల చేరేటప్పటికి, వచ్చియున్న తపాలాలో హైదరాబాదు రేడియోవారు, సెప్టెంబరు 23వ తేదీనాడు, సెప్టెంబరు 30వ తేదీనాడు. రెండు భాగాలుగా "సరస్వతీ సామ్రాజ్య వైభవాన్ని ప్రసారంచేస్తూ ఉన్నట్లు తెల్పుతూ పంపిన Agreement పడి ఉన్నది. అట్లాగే 1990 సెప్టెం. 23, 30 తేదీలలో హైదరాబాద్ రేడియోలో వారు నా రచనమైన సరస్వతీ సామ్రాజ్యరూపకం ప్రసారం చేయబడినది.

## టి. వి. లో ఇంటర్వ్యూ!

1991 జూలైలో హైదరాబాద్ ఆర్యవైశ్యమహిళా సంఘం వారి సహకారంతో, శ్రీ జి. సి. గుప్త (AVOPA) గారి ప్రోద్బలంతో టి. వి. లో ఇంటర్వ్యూకి ఆహ్వానం వచ్చింది. ఆనాడు ఆ. వై. మహిళా సంఘం వారు టి. వి. స్టేషనుకు నన్ను తీసికొని వెళ్ళారు.

తర్వాత 1991 ఆగస్టు కవి సమ్మేళనానికి కూడా నాకు టి. వి. లో అవకాశం లభించింది.

## హిందీ కేంద్రీయ సంస్థానం వారు నా రచనలను హిందీలో అనువాదం చేయడం

1991 లో హైదరాబాద్‌లోని హిందీ కేంద్రీయ సంస్థానం యొక్క ప్రాంతీయ డైరెక్టరు శ్రీ బొల్లి వీరరాఘవరెడ్డిగారు "హిందీ కేంద్రీయ సంస్థానం వారు భారతదేశ

భాషల యందలి, కవుల, కవయిత్రుల రచనలను, హిందీ భాషలోని కనువదించే కార్యక్రమం చేపట్టారనీ ఆ సంకలన గ్రంథంలో చేర్చడానికి, నా రచనలను చేర్చ దలచినారనీ, తెల్పుతూ ఆ సంకలన గ్రంథంలో చేర్చడానికి ఒక మకుటం క్రింద పద్యాలు పంపగోర్తూ ఉత్తరం వ్రాశారు. 'లజ్జాకిరీట ధారణి' ఖండకావ్యం నుండి 'మాతృశ్రీకస్తురిగా 'రణసూక్తం' అనే కావ్యఖండాలను పంపాను.

## వెయ్యేళ్ళ తెలుగు పద్యం సంకలన గ్రంథంలో

## నా రచన

డా. నండూరి రామకృష్ణమాచార్యులగారు, తాను సంకలనం చేస్తూ ఉన్న గ్రంథానికి, నా రచనలను మధురకవి నాళము కృష్ణారావుగారు రచనను పంపమని కోరారు. వారికి కూడా నా రచనలను పంపాను ఈ సంకలనం, తెలుగు ఎకా డమీ అధ్వర్యంలో చేపట్టబడినది.

## రచనలు

బాల్యం నుండి అంశమేదైనా సరే వేదిక నెక్కి అప్పటికప్పుడు అనర్గళంగా ప్రసంగించడానికి అత్యధికోత్సాహంతో ప్రసంగాలు నిర్వహించే నేను గ్రంథ రచన చేస్తాననీ, చేయగలనని కలలోనైనా తలంపని, నేను, "ఆంధ్ర కవయిత్రులు ఏ పరి స్థితులలో వ్రాసిందీ తెలిసినదేకదా, ఇక రెండవ రచనమైన 'అఖిల భారత కవ యిత్రుల విషయమూ ఇది వరలోనే ప్రస్తావించి యున్నాను.

పశ్చిమ గోదావరి జిల్లా రచయితల మహాసభ కాహ్వానింపబడి, కవి సమ్మే ళనంలో పాల్గొన బోతూ చేతిసంచిలో ఉన్న డైరీని తీసి "మన సాహితీ మధు భారతి" అనే మకుటంతో అప్పటి కప్పుడు రచించి కవి సమ్మేళనంలో ఆ కవితను చదివాను. ఆ కావ్యం 1978లో ప్రచురింపబడింది. ఆ తర్వాత ఆర్యవైశ్య మహా సభవారి పిలుపుపై 1968లో "శ్రీ కన్యకా సుప్రభాత కావ్యాన్ని సంస్కృత భాషలో రచిం చడం జరిగింది.

అప్పుడప్పుడూ రేడియోలో చదివిన కవితలను, లజ్జా కిరీట ధారిణి, అనే ఛందోమయ ఖండకావ్యాన్ని 'కాంతి శిఖరాలు' అనే భక్తి గీతావళిని, ఒక్క చిన్న

దివ్వె' అనే గేయకవితా ఖండకావ్యాన్ని (8) విజయవాడ యందలి కనక దుర్గ దేవాల యానికి ఆహ్వానంపై వెళ్ళి, ఆ సందర్భంగా వ్రాసిన 'దుర్గాస్తవతారావళీ' అనే సంస్కృత కావ్యాన్ని తర్వాత సంస్కృతమందే జాతిపిత అనే కావ్యాన్ని రచిం చాను. తెలుగు భాషా సమితి వారి పిలుపుపైననే "ఆంధ్రుల కీర్తన వాఙ్మయ కళాసేవ' అనే విమర్శగ్రంథాన్ని రచించి ప్రచురించాను. ఒకనాడు బాపట్లలో మా యింటికి కొందరు మహిళలు నన్ను చూడటానికి వచ్చి 'లక్ష్మీకాంతమ్మగారూ మహిళలపై మీరేమి రచించినట్టు లేదే, చూడండి ఇప్పటి కిప్పుడు మీరు మహిళలపై ఏదైనా ఒక కావ్యానికి అంకురార్పణగా చేయండి' అని అడిగారు వెంటనే

"మహిళాసర్గమె, మహికి సమస్తము,

మహిని గ్రహించెడు మహతీ తత్త్వము

మహిళయె కాదే, మహిళయకాదె

కావ్యారంభం చేశాను. అది మహిళా విక్రమసూక్తము అనేపేరుతో కాలాంతరంలో ప్రచురణ పొందింది.

తిరుపతి దేవస్థానం వారి అభ్యర్థనపై బాలవాఙ్మయ రంగానికి చెందిన 'చంద్రమతి' అనే గ్రంథాన్ని రచించి దేవస్థానం ప్రచురణకు ఇచ్చివేశాను.

ఒకమారు విజయవాడ రేడియోవారు నిర్వహించిన సంక్రాంతి పర్వ సందర్భంగా నిర్వహించిన కవిసమ్మేళనానికి పాల్గొనడానికి వెళ్తూ మాంచాల మనసులో నిలిచి వెన్నుదట్టగా గేయకవితలో చిన్న రచన చదివాను కాలాంతరంలో ఆ మాననీయ మహితస్మృతిచే ఒడలు పులకింపగా ఆ వీరచూడమణి యొక్క త్యాగ మయ సాహస గాధను 'నా తెలుగు మాంచాల' అనే కావ్యంగా రచించి 19:1 వ వత్సరంలో ప్రచురించాను. ఆకావ్యాన్ని చెన్నపురిలో శ్రీ రాజాలక్ష్మి ఫౌండేషను అధిపతి శ్రీ రాజారమణయ్యగారి ఆదరణతో మద్రాసులో జరిపిన సమావేశంలో మాన్యులు సరససౌభాగ్య సౌహృదయ సంపన్నులు సర్వకళా సౌందర్య భావిత హృదయ సంస్కారము అయిన సోదరులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి అంకిత మిచ్చాను. ఈ కావ్య ప్రచురణకు హైదరాబాదు వాస్తవ్యులు శ్రీ కలిళవాయి రాధా కృష్ణరావుగారు కలవల కణ్ణన్‌చెట్టి ఛారిటీస్‌వారు ఆర్థిక సాహాయ మందించినారు

కృతజ్ఞతతో సంస్మరిస్తూ ఉన్నాను. లజ్జాకిరీట ధారణి కావ్యాన్ని సాహితీబంధువై కృతిస్వీకారానికి ఆమోదించిన సోదరులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నాధన్య వాదాలు! కాంతి శిఖరాలు అనే భక్తిగీతికావ్యాన్ని మధుర మంజులమైన ఆంధ్రకవితా సరస్వతీ కనుంగుపుత్రులైన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కంకిత మిచ్చాను. హిందీ భాషా భూషణములైన సంతకవితలను 'సదుక్తి మంజరి' అనే మకుటంతో అనువదించి మా సోదరుడు నాళముదాదారావుగారి కంకితమిచ్చాను. కావ్యాన్ని కాస్యంసెట్టి రాధాకృష్ణయ్య సోదరుల కంకిత మిచ్చాను.

ఇంక సరస్వతీ సామ్రాజ్య వైభవరూపకాన్ని 1988 ఏప్రిల్ 10 వ తేదీ నాడు అనంతపురంలో శ్రీ సోదరులు కాస్యంసెట్టి రాధాకృష్ణ దంపతులు కనకాభి షేకము చేసినపుడు శ్రీ రాధాకృష్ణయ్యగారు ఆవిష్కరించారని తెలుపడానికి సంతో షిస్తూ ఉన్నాను. ఇవేకాక 'కన్యకమ్మ' నివాళి అనే వ్యంగ్య పదకావ్యాన్ని కూడా రచించాను.

1) మంత్రి లంచము సీతి
మారణా ప్రముఖ్యాతి
సామాన్యుదే కోతి
ఓ కన్యకమ్మా

2) పన్నులా పీక్లాను
లంచమా హైక్లాను
పదవులా లోక్లాను
ఓ కన్యకమ్మా

3) బిడికి ఒకచే పలాం
పంతులకును రాం రాం
ఫస్టుక్లాసులు ఠాం ఠాం
ఓ కన్యకమ్మా

4) సీట్ల కోసం కుస్తీ
ఓట్లకోసం గస్తీ
సేవకై తే సుస్తీ
ఓ కన్యకమ్మా

ఈ కావ్యం ఇట్లా నడిచింది

నా కావ్యరచనోద్యమాన్ని గూర్చి సంగ్రహంగా ప్రస్తావించాను. మొత్తం మీద 1953 నుండి 1988 వరకు నాచే రచింపబడిన ఇరవై కావ్యాల ప్రచురణ జరిగింది.

ఇంకా ఇటీవలి రచన 'ఋతంభరి' అనే అభ్యుదయ వచనకావ్యం అచ్చు కావలసి ఉన్నది.

అంతేకాక రేడియోలో ప్రసారం చేయబడిన పత్రికలలో ప్రచురింపబడిన అనేక సాహిత్య వ్యాసాలు ముద్రణకు నోచుకోలేదు.

కేంద్ర సాహిత్య ఎకాడమీవారి "కావ్యమాల"ను ఎడిట్ చేస్తూ సోదరులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు నా రచనను తీసుకొన్నారు. గాంధీ సాహిత్య సంకలనంలో శ్రీ కోదాటి నారాయణరావుగారు నా రచనను తీసుకొన్నారు.

అట్లాగే ఎఱ్ఱన్న పీఠం వారూ ఇంకా చాలా ప్రచురణలవారు ఆయా సంకలన గ్రంథాల్లో నా రచనలు తీసుకొన్నారు.

## గజాధిరోహణోత్సవం

ఇంతకుముందే పేర్కొనదగిన ప్రధానాంశమైనా జ్ఞాపకములేక వ్రాయజాలక పోయిన ఈ గజాధి రోహణోత్సవాంశాన్ని ఇప్పుడు వ్రాస్తూ ఉన్నాను. నా జీవితమే ఒక తెఱచిన పుస్తకం! ఈ తెఱచిన పుస్తకంలో ఏపుటను తెఱచి సమవలోడనం చేసినా ఏదో ఒక అంశం ప్రత్యక్షమౌతూనే ఉంటుంది. గంగకిద్దఱి మేలను ఆద్దరి కీడునుంగలవె? అన్నట్లు ఏదో ఒక విశేషాంశాలను ఉటంకించే సంఘటనలు కనబడు తూనే ఉండవచ్చును! ఇది అతిశయోక్తికాదు. ఈ విషయాన్ని అహంభావంతో కాక ఆత్మ స్థైర్యంతో ఆంధ్ర సోదరీ సోదరులకు తెలియ జేయగల భాగ్యాన్ని పరమేశ్వరి నాకు జీవితంగా ప్రసాదించినందుకు ఆ తల్లికి జోహేక్లు!

ఆంధ్రకవయిత్రులు గ్రంథం, తెలుగు భాషాసమితి వారి ఆశీస్సుల నందుకొన్న తర్వాత ఆంధ్ర దేశమంతటా జరిగిన జైత్రయాత్రలో అప్పికట్ల సమ్మానమొకటి. ఆ సమ్మానమునకు ఒక విశిష్టత విలక్షణత ఉన్నాయని తెలుపక తప్పదు. అప్పికట్ల మహాత్మాగాంధీ ఆస్థాన కవీశ్వరుడైన తెలుగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి మహా కవీశ్వరుల ఆవాసభూమి, ఆంధ్ర కవితా సరస్వతికాస్థాన వేదిక.

వారి ఆశీస్సులతో సోదరులు శ్రీ కుర్రా సుబ్బారావుగారు శ్రీ కాకరపర్తి వేంకటేశ్వర్లుగారు సమ్మానం చేశారు.

ప్రస్తుతము వైద్యఆరోగ్యశాఖామాత్యులైన శ్రీ కొణిజేటి రోశయ్యగారు ముఖ్య అతిథిగా విచ్చేసినారని చెప్పడానికి సంతోషిస్తూ ఉన్నాను.

ఆ సమ్మాన సందర్భంలో శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు నాకు పితృతుల్యులు! నాకు గజాధిరోహణోత్సవ భాగ్య వైభవాన్ని కల్పింపజేసినారు! వారికి ఆ మహానుభావునకు నాపై ఎనలేని వాత్సల్యాతిశయం!

వారి ఆశీస్సులతో జరిగిన ఆగజాధి రోహణోత్సవ విషయాన్ని నేను మఱచే పోయినాను! ఇది యెంతో కూడనిపని! అయినా ఇటీవల శ్రీ కాకరపర్తి వేంకటేశ్వర్లుగారు గుర్తుచేయుటచే, ఆ అమూల్యావకాశానికి ఈ గ్రంథంలో ప్రస్తావించుకొనే భాగ్యం నాకు కల్గింది! దీనికి సోదరులు కాకరపర్తి వారికి కృతజ్ఞతాంజలి!

## వెయ్యేళ్ల తెలుగు పద్యసేకరణలో నా రచనకవకాశం

సహృదయులు మొన్నటి వఱకూ అధికార భాషా సంఘం ధ్యక్షులుగా పని చేసినవారు సోదరులు శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులుగారు తెలుగు ఎకాడమీ వారి అధ్వర్యంలో వెయ్యేండ్ల తెలుగు పద్యము అనే మకుటంతో తెలుగు భాషా యోషకొరకు అమూల్యమైన అపూర్వాలంకారమైన సేకరణ గ్రంథమునకు ఆకృతిని మలచుటకు ద్యమించినారు. వారు తమ ఆ సేకరణ గ్రంథమునందు చేర్చుటకు నా రచనను కూడా స్వీకరించి యున్నారని శ్రీమా నాన్నగారి రచనను కూడా స్వీకరించి యున్నారని తెల్పుటకు సంతసించు చున్నాను.

విశేషముగా పేర్కొనదగిన అంశమింకొకటి హిందీ విద్యాసంస్థావారు, అన్ని భాషల నుండి కొన్ని కొన్ని రచనలను తీసికొని హిందీలోనికి అనువాదం చేసే కార్యక్రమంలో హైదరాబాదులోని హిందీ విద్యాసంస్థాన్ ప్రాంతీయ సంచాలకులు శ్రీ విజయ రాఘవ రెడ్డిగారు, ఆ అనువాద సేకరణకు నా రచనలను కూడా తీసికొని యున్నారు.

## డాక్యుమెంటరీ ఫిల్ము తీయుట

ఇవి యన్నియు ఒక యెత్తు, తెలుగు విశ్వవిద్యాలయం వారు నాపై డాక్యుమెంటరీ ఫిల్మ తీయడం, ఒక యెత్తు అని పేర్కొన వచ్చును.

డెబ్బదియేండ్లుపై బడిన వారికి, తెలుగు విశ్వవిద్యాలయం వారు, అనేక రంగాల్లో పరిశ్రమించి, పరిశ్రమించిన, ప్రముఖులపై డాక్యుమెంటరీ ఫిల్ము తీసే కార్యం చేపట్టినారు.

ఆ కార్యక్రమాను సారం 199౩—మార్చి 3వ తేదీనాడు బాపట్లలో నాపై డాక్యుమెంటరీ ఫిల్మ్ తీసి యున్నారని వ్రానుకొనే అవకాశాన్ని తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులైన. డా. సి. నారాయణరెడ్డిగారు ఉదార భావనతో, నాకు కల్గించి యున్నారని పేర్కొంటూ, వారికి బహుధా నా కృతజ్ఞతాంజలిని సమర్పిస్తూ ఉన్నాను.

ఈ డాక్యుమెంటరీ ఫిల్మ్ నాపై తీయుట అనేది ఏమీ సామాన్యమైన విషయం కాదు. శ్రీ డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీపద్మ విభూషణ వావిలాల గోపాల కృష్ణయ్యగారు మహాకవి శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు, ప్రముఖ దేశభక్తులు, శ్రీ జి ఆచార్యరంగా గారిని బోలిన, ప్రజ్ఞానిధులకు, కళాభిమానులకు మహాకవులకు, మహాపండితులకు, దేశాభిమానులకు, దేశసేవకులకు, మహా నాయకులకు జరుగవలసిన ఈ అపూర్వ సమ్మానమును, సోదరులు డా. సి నారాయణరెడ్డిగారు నాకును లభింప జేసినారు! ఈ సమ్మానము సోదరులు శ్రీ నారాయణ రెడ్డిగారికి నా పట్లగల ఆదరాభిమానములకు వారి సన్నిశాదర్శమునకు, ఉదారహృదయమునకును చిహ్నము అంతే తప్ప, నా అర్హతకాదని సవినయముగా మనవి చేసుకొనుచు ఈ తీరని ఋణము మీగుటకు ఒక్క నమస్కారమును సమర్పించు కొనుచున్నాను.

ఈ కార్యక్రమములో, బాపట్లలో ఉన్న ప్రభుత్వ సంక్షేమ శాఖ బాలికల హాస్టల్ సూపరింటెండెంటు శ్రీమతి దాసరి శారద M.A గారు పరిచయకర్తగా వ్యవహరించినారు.

డెబ్బదినాల్గు వసంతములను, డెబ్బదినాల్గు శరజ్జ్యోత్స్నలను, డెబ్బదినాల్గు గ్రీష్మాతపములను, డెబ్బదినాల్గు వర్షామృతధారలను, ఏకరీతిగా అనుభవించిన జీవితము నాది!

ఉద్విగ్న మానసిక భావముతో ఉవ్వెత్తుగా ఆనంద సాగర తరంగములపై ఎంతగా ఓలలాడితినో గాఢతిమిరాంధకారమును గ్రుమ్మరించి అమవసనిసిలోని అగాధ అను అంతే అనుభవముతో స్పృశించి, అంతులేని విషాదస్మృతులతో అంతరంగము శోషిల్లి, మూగవేదనలు, మానసముపైముసిరి, త్రిప్పి త్రిప్పి కొట్టి పడవేయగా నిస్సహాయురాలనై, దైవమా ఇది యంతయు నీలీలయేకదా! అని ఈశ్వరుని పాద పంకజముల కడ దోయిలించితిని

ఎట్టిసంఘర్షణలు తటస్థించినను ఎట్టి సంకటములు సంభవించినను ఎన్ని కష్ట సమయములు నన్ను చుట్టుముట్టినను భిన్న విభిన్న పరిస్థితులలో ఎంత మంది నన్ను పడగొట్టి నాపై రెచ్చ గొట్టవలెనని ప్రయత్నించినా నేను ఏ రంగమునందు నను ఏ సమయంలోనూ ఓడిపోలేదు. ఓటమియే యెఱుంగని విష్కర్షగా కార్యక్రమములనేర్పఱచుకొని జయపతాక నెగురవేస్తూ ముందుకు మునుముందుకు సాగిపోతూ ఉండే నేను నా సమకాలీనవర్గం వారి ఈర్ష్యాద్వేషాలను పూర్తిగా గుర్తై చాలా కష్ట సాధ్యమైన ప్రతిఘటన రంగకల్పనలను వ్యూహములను నిర్మించుకొంటూ వారితో పట్టుదలతో పోరాడి తుదకు వారే నా మార్గము నా ఆశయములు నా కార్యక్రమములు దోషరహితములనేఅభిప్రాయమునకు వచ్చి మరల నాతో తమ చేతులు కలిపి మనసులు కలిపి నాతో తమ అభిప్రాయములను కలబోసి నాతోబాటు కార్యసాధనకు నాకు సహకరించడమే నా జీవితానుభవము.

అంతేకాని ఎవరికీ నేను తలవంచలేదు ఎట్టిపరిస్థితియందైన దైన్యభావమును ప్రదర్శించలేదు.

అయితే నేను ఖడ్గవాదిని-అయినా నేను తలపెట్టిన కార్యములన్నీ విజయ పంథయందే పయనము సాగించినవి అసంఖ్యాకముగా నా సహాయము కోరినవారికి ఎన్నికష్టముల నెదిరించియైన సహాయముచేసి ఆయా సమయములలో విజయమునే సాధించినాను. సహాయ కార్యక్రమాల్లో ఏ మంత్రుల దగ్గరకు వెళ్ళినా ఏ ఆఫీసులకు వెళ్లినా నేను వచ్చిన పనిని నాకు చేసిపెట్టి సహాయపడేవారు! ఇంతకూ లెక్కకు మించిన ఆ సహాయ కార్యక్రమాలలో ఏ ఒక్కటీ నా కొఱకు కాదు. ఇతరులకు సహాయ పడటానికే నని సవినయంగా మనవి చేసుకొంటూ ఉన్నాను. వేళకాని వేళల్లో ఇల్లు విడిచి వెళ్ళటానికి వీలుకాని సందర్భాలలో కూడా నేను ఇల్లు విడిచి వెళ్ళిపోయేదాన్ని! అయినా ఉదాత్తులైన నా భర్తగారు శ్రీ హయగ్రీవ గుప్తగారు అడ్డపడేవారు కాకపోవడమే కాక నేనులేని సమయాలలో పిల్లలతో నౌకర్లతో మా యింటికి సహాయార్థము వచ్చే శ్రీమతి మా అత్తగారు (మహాలక్ష్మమ్మ) నా దగ్గర చదువుకొన్న చేపూరి గుడువర్తనమ్మ మున్నగువారితో ఇంటిపనులు సరిదిద్దు కొనేవారు!

ఎంత ఖడ్గవాదమైనా నిష్కర్షస్వభావమైనా తలపెట్టిన కార్యాలలో విజయం సాధించడ మనేది, నిజంగా ఈశ్వరానుగ్రహ మేనని చెప్పాలి!

ఏదియేమైనా అమనోనిబ్బరము ఆ ఖడ్గవాదిశీలము సేవా పరతంత్రత అన్యాయాన్ని సహించక పోవడమనేది, ముఖ్యంగా మా నాన్నగారి జీవిత పద్ధతి నుండి దీక్షా దీక్షత నా మాతృదేవి సుశీలమ్మగారినుండి నాకు సంక్రమించిన పారం పర్య సౌభాగ్యమంటే అతిశయోక్తికాదు.

## ఖడ్గవాదమువలన కృష్ణరావుగారు పొందిన దుష్ఫలితము

ఉద్యమములలో శ్రీవీరేశలింగం పంతులుగారికి ఆర్థికముగా హార్దికముగా తోడ్పాటునిచ్చి యున్నారు. "కృష్ణరావు పంతులుగారి కుడిభుజమనే పేరును పొందిన సంగతి, ఆంధ్ర ప్రజలకేకాదు బ్రహ్మ సమాజ సిద్ధాంతపరమైన సేవా కార్యక్రమాల పరంగా అఖిలభారత స్థాయిలో కూడా విశ్రుతమైన విశేషమే.

అయినా శ్రీ పంతులుగారి అంతటి మహావ్యక్తిని పంతులుగారి భార్య శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారు మరణించిన వెనుక శ్రీ పంతులుగారికి శీల విషయముగా అపఖ్యాతి తెచ్చిన సంఘటనలను వెలికి తీసికొని వచ్చినది. పంతులగారి అంత రంగిక శిష్యులనే ఖ్యాతిపొందిన శ్రీ కృష్ణరావుగారే. వితంతు వివాహ సంస్కార బ్రహ్మసమాజ సంస్కారముల పట్లకాని కులమత విచక్షణను రూపుమాపను నిర్వ హించిన సర్వమత వర్ణ రహిత భోజనాదులను స్వయముగా తన యింటిలో తన భార్య ఇష్టపడక పోయినను ఏర్పాటు గావించి కులబహిష్కారమునకు సైతము పాల్పడినను ఎదురొడ్డి వెలువక పంతులుగారి కంటె తానేముందు ఆ నాటి సనాతన సమాజమునెదిరించి సంస్కారమును నెలువుటయందుకాని పిలువీకు చూపక అతి ధైర్యసాహసములు ప్రదర్శించి ఆ సాహస కార్యములను ఆసేవా పద్ధతులను గురువుగారైన పంతులుగారి ఖాతాకే జమకట్టి గాదెలునింపిన సంస్కార కార్యా చరణ యశస్సును సహితము తాను స్వీకరింపక పంతులుగారి పతాకముగానే ఎగుర వైచి నిస్వార్థ సేవాపరతంత్రుడై పంతులుగారి అడుగు జాడలలో తన రూపకల్ప నగా సంస్కార సంఘాల ఏలూరు మొదలైన నగరాల్లో స్థాపించి, పాటుపడి

సంఘము నుండి వెలివేసినా జంకు గొంకు లేకుండా కష్టనష్టాలను భరించి ముక్కుకు సూటిగా సంఘ సేవయే లక్ష్యంగా ముందుకురికిన నాళము కృష్ణరావును సంఘసేవలో సర్వస్వము కోల్పోయిన జమీందారును గౌతమీ గ్రంథాలయాన్ని స్థాపించి మానవ సేవ సచిత్ర ప్రథమ మాసపత్రికకు జన్మనిచ్చి మహిళాభ్యుదయ కార్యక్రమాలకు ఓంకారము చుట్టిన మహోన్నత సేవాశీలిని ఘనమైన వ్యక్తిత్వ గౌరవంతో సంఘంలో ఎనలేని ఉన్నత స్థానాన్ని ఆక్రమించి. బాలవాఙ్మయ ప్రథమా చార్యుడుగా, అనేకకావ్యాలు తన మధుర లేఖినీ విన్యాసాలుగా బాలల నిజాయితీ వీర విక్రమ శీల సౌభాగ్యములే ప్రధాన లక్ష్యములుగా గోరుముద్దలు తేనె చినుకులు విరిదండ 'ఇత్యాది సార్థక నామాలతో బాలవాఙ్మ సుగంధ కుసుమహారాలతో చదువుల తల్లి గీర్వాణికి అవి దంపూర్ణమైన అలంకార రమణీయకతను చేకూర్చిన మహాశయుని అసంఖ్యాకముగా కవులకు పండితులకాశ్రయము కల్పించి సంగీత సాహిత్యభారతివందల మెక్కించి, తన భుజస్కంధములపై తెలుగునేల నాల్గు చెరగుల ఊరేగింపు ఉత్సవములు చేసిన కళాశీలిని తెలుగువారి సేవాభరణమై నాళము కృష్ణరావును తన తప్పును బయట పెట్టినాడనే ద్వేషముతో గొంతు నులిమి వేయడానికి పంతులుగారు ఎంతో ప్రయత్నించారు. తనస్వీయచరిత్ర తొలి రచనలో తన అంతరంగిక శిష్యునకు ఉచితస్థానమిచ్చి కృష్ణరావు సేవల కుచితగౌరవము కల్పించిన ధైర్యము చాలక ఆ పరమసాహసి సేవలను సంస్మరించు భాగ్యావకాశమును చేతులారా చెరిపివేసి కృష్ణరావు భవిష్యత్తునకే ఎసరు పెట్టినాడు పంతులుగారు!

ఇంత ఘోరకృత్యమునకు పాల్పడినను కృష్ణరావుగారి ధైర్యముద్ర ఏ మాత్రము వన్నెవాసి చెడలేదు.

ఈ నడుమ ఈ యథార్థగాథను చీమకుర్తి శేషగిరిరావుగారు 'మిసిమి' అను సాహిత్య పత్రికలో సమీచీనముగా ప్రచురించి పంతులుగారి అసభ్య ప్రవర్తనను కల్మష భావమును తూర్పారబట్టి తూలనాడుట గమనార్హము! నిజమెప్పటికైనను తన నిజస్వరూపముతో బయటపడకమానదు కదా!

ఇంతకూ చెప్పవచ్చినదేమంటే కృష్ణరావుగారి ఖడ్గవాదియైనను కార్యసాధనయందు అత్యంత ప్రతిభా సామర్థ్యములతో ప్రకాశించి సమాజమునందు యథార్థ

వాదిగా నైష్ఠికపరతంత్రుడుగా కార్యదక్షుడుగా సేవా ధ్వజమును భుజములపై నిరంతరము మోచి సర్వస్వమును కోల్పోయిన త్యాగశీలిగా పేరు బడసినాడు. పంతులుగారి మరణావసరము అనుతపముటించినను జరిగిన విషయమును మాత్రము కాదన కుండుట గమనార్హము.

అంతేకాదు పంతులుగారు స్థాపించిన హితకారిణీ సమాజమునకు పంతులుగారి చేతనే శాశ్వతాధ్యక్షులుగా శ్రీకృష్ణరావుగారే నియమితులైనారు! ఎంతవిచిత్రము! కృష్ణరావుపై కేసులు పెట్టి ఉపసంహరించుకొనుటయు తన సేవా సంస్థకు కృష్ణరావు గారినే తన వారసునిగా నిర్ణయించుట యందే కృష్ణరావుగారి నిజాయితీ ధైర్య సాహసములకు మన నీరాజనము. మా నాయనగారి వంశపారం పర్యముగా నాకును ఈ ఖడ్గవాదమే సంక్రమించి నా రక్తమునందును సంపూర్ణ వ్యక్తిత్వ గౌరవరూపమున ప్రవహించిన దంటే అది ఆత్మస్తుతి కానేరదు.

బాపట్లకు వచ్చిన తర్వాత శ్రీమతికవవర్తి వరలక్ష్మమ్మగారితో నీవా నేనా అనునంత వరకు పోరు జరిగినది. అయినా మరల ఆమె నన్ను పిలిపించేటంత వరకు నేను ఆమె వద్దకు వెళ్ళలేదు.

తర్వాత హితైషిణీమండలి యాజమాన్యాన్ని నేనే తీసుకోవలసి వచ్చింది.

## హితైషిణీ మండలి

హితైషిణీ మండలిని నేను తీసికొని నాలుగైదేండ్లు నేను నడిపియున్నాను. కానీ తర్వాత తర్వాత బాపట్ల మహిళా సంఘమువారికా మహిళా సంఘముపై ఆదరణ తగ్గిపోవుట చేత ఆ మండలి కార్యక్రమాలకు స్వస్తి పలకడమైనది. నేను ఆ మండలి అధ్యక్షురాలుగా నడిపిన సమయంలో మహాకవి శ్రీ తుమ్మల సీతారామ మూర్తిగారికి సమ్మానము జరిపినాను సుప్రసిద్ధ కవయిత్రి శ్రీమతి వాణీ రంగారావు గారు మొదలైన కవయిత్రులకు సమ్మానములు జరిపియున్నాను.

భావపురి రచయితల సంఘాన్ని గూర్చి వెనుక ముచ్చటించి యున్నాను. క్రమక్రమముగా ఆ సంస్థ ఆగిపోయినది. ఆ సంస్థ ఆగిపోయిన తర్వాత బాపట్లలో సాహిత్య సమావేశములు సక్రమముగా నిర్వహింపబడక పోవుట చూచి కొన్నా

క్యకు స్థానిక న్యాయవాది సాహిత్యాభిమాని శ్రీకోటంరాజు సత్యనారాయణ శర్మగారు నా ప్రోత్సాహంపై 'కళాభారతి' అనే సాహిత్య సంస్థకు రూపకల్పన చేశారు,

## విజయం పొందలేకపోయిన రచన

1) శ్రీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాతం.
2) విజయవాడ కనకదుర్గా స్తోత్రముగా రచించిన దేవీ స్తవతారావళి.
3) అర్ధశతిగా రచించిన జాతిపిత ఈ మూడూ సంస్కృత లఘుకావ్యాలు.
4) అజ్ఞాకిరీట ధారిణి ఖండకావ్యసంపుటి.
5) ఒక్క-చిన్న దివ్వె (పద్యకావ్యం)
6) మన సాహితి మధుభారతి వచన, గేయ కావ్యాలు.
7) కాంతి శిఖరాలు - భక్తి కీర్తనలు.
8) చంద్రమతి - బాల సాహిత్యం-తిరుపతి దేవస్థానం వారికి ఇచ్చినది.
9) పదుక్తిమంజరి-హిందీ అనువాదం
10) మహిళా విక్రమ సూక్తం మాత్రాఛందస్సు
11) విదేశపర్యటనానుభవాలు
12) నా తెలుగు మాంవాల మాత్రాఛందస్సు (కావ్యం) తెలుగు విశ్వ విద్యాలయం వారి ఎవార్డు పొందినది,
13) కన్యకమ్మ వివాహ-భావపురి రచయితల సంఘంలో చదువబడి. కావ్య రూపముగా ప్రచురింపబడిన వ్యంగ్యకావ్యం.
14) భారతదేశము కొన్ని గుణపాఠములు హుమయూన్ కబీరు ఆంగ్లో పన్యాసాలకు తెలుగు అనువాదం.
15) తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వాలలో అష్టాదశపురాణములలో పదమూడు పురాణాలకు సంగ్రహ వివరణ. ఇంకా కవయిత్రులు.
16) సంగ్రహాంధ్ర విజ్ఞాన సర్వస్వంలో చిలకమర్తివారి డొక్కా సీతమ్మ గారి జీవిత సంగ్రహ చరిత్రలు జాతీయ క్రీడలు
17) కేంద్ర సాహిత్య ఎకాడమీ గాంధీ సాహిత్యం ఎట్టిన, పీఠం కవిత్రయ వైజయంతి వారి ప్రచురణలలో నా పద్యాలు వ్యాసాలు.

ఇవి రెండూ కథలో ఆంధ్ర సాహిత్య ఎకాడమి రచయిత్రుల శాఖవారి ప్రచురణలైన 'కథామందారం' కథాసంకలన గ్రంథంలో 'సుకాంచన' అనుపేరుతో నేను రచించి ప్రచురించినవి. నా రచనలో చాలా భాగం రేడియోలో రిలే చేయబడినవే.

## ఇంకా అముద్రిత గ్రంథాలు

1) రేడియోలో రిలే చేయబడిన ఎన్నో వ్యాసాలు భారతిలో ప్రచురింపబడిన సాహిత్య వ్యాసాలు.

2) ఋతంభరి అనే మకుటంతో ప్రచురింపవలసిన వచనకవితలు.

ఇదీ స్థూలంగా నా సాహిత్య వ్యవసాయం ఆంధ్ర కవయిత్రులు గ్రంథ రచనకు గృహలక్ష్మి పత్రికాధిపతులు శ్రీ కేసరిగారు స్వర్ణ కంకణ బహూకరణము నల్పియున్నారను విషయమందరకు తెలిసినదే.

ఇంతవరకూ సుమారు నా అరవైరెండేండ్ల నుండి సేవాపరముగా సాంస్కృతిక పరముగా ఆరంభమైన కార్యక్రమాలను జ్ఞాపకం తెచ్చుకొని నేను రచించిన ఈ సాహితీ రుద్రమ అనే జీవిత చరిత్రోల్లేఖనం ఇంచుమించుగా పూర్తి యైనట్లే. ఇపుడే అందినవార్త ఏలూరు సెంట్ తెరెసా కాలేజీవరు నా తెలుగు మాంచాలను B. A. స్పెషల్ తెలుగు కోర్సుకు పాఠ్యాంశముగా ఎంచుకొన్నారు.

## తేహినోదివసాగతాః

నాకు పంద్రేండు సంవత్సరాల నుండి నిండుపటుత్వంతో ఉత్సాహంతో ఆంధ్ర ప్రజానీకం నాపై చూపిన ఆదరంతోస్ఫూర్తితో, విశ్రాంతి ఎఱుగని నిరంతర కార్యక్రమాలతో సంసార నిర్వహణంతో నేను యథాశక్తిని దేశంకొఱకు పరిశ్రమించాను.

ఇంక ఇప్పుడు సుమారు రెండేండ్లనుండీ నాకు జవ సత్వములు తగ్గి అనారోగ్యం అనగా చక్కెరవ్యాధి ముఖ్యముగా కీళ్లనొప్పులతో బాధపడ్తూ సేవా కార్యక్రమాలు తగ్గించివేశాను. అపూర్వపు ఉత్సాహదినములు గతించినవి ఇంక నా కుటుంబ విషయాలు పరిచయ పత్రమాలను గూర్చి వ్రాయవలసి యున్నది.

## నా కుటుంబం

నా తండ్రిగారైన మధురకవి నాళము కృష్ణరావుగారిని గూర్చి నేను ఇదివర లోనే ప్రస్తావించియున్నాను. శ్రీ కృష్ణరావుగారు: అంతర్జాతీయ నౌకా వ్యాపార దక్షుడై కలకత్తా నుండి మద్రాసు వరకు సత్ర నిర్మాణముగావించి మండపేట నాళంవారి వంశమునకే వన్నె వాసికాంచిన శ్రీ నాళము కామరాజుగారి కనిష్ఠపుత్రుడు, శ్రీ కృష్ణరావుగారు ఆంధ్రదేశమునకే పేరుతెచ్చిన గౌతమీ గ్రంథాలయ స్థాపకుల, బాలల కవి, ప్రఖ్యాత సంఘసేవకులు అను విషయములన్నీ ఆంధ్రులెరిగినదే.

ఇక మా అమ్మ నాళము (వెంకటసుబ్బమ్మ) సుశీలమ్మ చాళుక్యుల రాజధాని యైన హేలాపురి ప్రస్తుతము ఏలూరు నగరమందలి జమీందార్లు మోతేవారి ఆడపడుచు మోతే వెంకట కృష్ణయ్యగారు ఆమె తండ్రి. రామమ్మగారు ఆమె తల్లి. రాయబహా దూర్ మోతే గంగరాజుగారు ఆమె పినతండ్రి. ఏలూరు మునిసిపల్ ఛైర్మన్‌గా జూటుమిల్లు సెక్రటరీగా పెక్కేండ్లు కళారంగ సేవా జీవితముతో ప్రఖ్యాతినందిన మోతే కృష్ణరావుగారు ఆమె తమ్ముడు. సత్యాగ్రహోద్యమములో చేరి నిష్కళంక దేశభక్తునిగా సీతారామ విలాస నాటకరంగ సంస్థకు వెన్నుదన్ను పేరు ప్రఖ్యాతులు పొందిన శ్రీమోతే నారాయణరావుగారు ఆమెకు వేలువిడిచిన మేనల్లుడే.

ఆమె ఎనిదవయేట అనగా ఇంచుమించుగా 1948 వ సంవత్సరమున ఆమెకు నాళము కృష్ణరావుగారితో పెండ్లియైనది ఆమె పెండ్లికి రాజమహేంద్ర వరమున గోదావరిపై ఇంకా సర్ ఆర్థర్ కాటన్‌బ్రిడ్జి నిర్మాణము చేయలేదనుకుంటాను మా నాన్నగారి పెద్దన్నగారైన నాళము వీరయ్యగారు లాంచీపై కొవ్వూరువెళ్ళి అక్కడ రైలెక్కి ఏలూరువెళ్ళి మా అమ్మను చూచి వచ్చినారట. అప్పట్లో రైలుబండ్లు ఎట్లా ఉండేవో మరి! వీరయ్యగారు చాలా లావుపాటి మనిషి అగుటచే ఆయన రైలు గేటులో పట్టకపోవుటచే కూలీలు ఆయనను అడ్డంగా త్రిప్పి రైలులోనికి త్రోసి రైలెక్కించారు.

మా నాన్నగారికి, మా అమ్మకు ఎనిమిదేండ్లు వయస్సులో తేడా ఉన్నదట!

మా నాన్నగారెంత సంఘ సంస్కారులో అమ్మ అంత సనాతనవాదులంటి ఆమెకు 14 ఏండ్ల వయస్సునుండి మొదలుకొని ముగ్గురాడపిల్లలుపుట్టి చనిపోయి

నారు తర్వాత మా అన్నయ్య నాగేశ్వరరావు పుట్టుకకుముందు మా అమ్మ అంజనేయ ప్రదక్షిణాలు చేసి రామేశ్వరంలో నాగప్రతిష్ఠ చేసింది. ఈ కారణంగా అన్నయ్యకు అంజనాగేశ్వరరావు అని పేరుపెట్టినారు. మా అన్నయ్య 1915 అక్టోబరులో జన్మించారు. తరువాత నేను 19.7 డిసెంబరులో పుట్టినాను. నాకు మానాయనమ్మ పేరుగా లక్ష్మీకాన్తమ్మ అనిపేరు పెట్టినారు. నా తరువాత పుట్టిన మగ బిడ్డకు మా తాతయ్యపేరుగా కామరాజు అని పేరు పెట్టినారు. అతడు రేండ్లకే చనిపోయినాడు. ఆ పిల్లవాని అద్భుత చరిత్రను, లీలలను తలచు కొనుచు శ్రీ మానాన్నగారు పాపాయి అనే స్మృతి కావ్యాన్ని వ్రాశారు. ఆ కావ్యం స్మృతి కావ్య రంగంలో అద్వితీయ ప్రశస్తిని పొందింది. తరువాత పుట్టిన రామకృష్ణ ఇంటర్మీడియేట్ పరీక్ష Ist Classలో ప్యాసైనాడు. మా అమ్మ సంతానంలో మణి పూస లాంటి వాడు. కాని భగవదిచ్ఛ వేరుగా ఉండుటచే రామకృష్ణ తన పరీక్షా ఫలి తాలు తెలుసుకోకుండానే విధి శాసనాను సారము ఇహలోకమును విడిచినాడు. ఇంక కడసారి సంతానమునకు మళ్ళీ తాతయ్యగారి పేరు నిల్పుటకే కామేశ్వరరావు అని పేరు పెట్టినారు. ఇక అన్నయ్య నాగేశ్వరరావు వర్ణాంతర వివాహము చేసు కొన్నాడు. అతడు బొంబాయిలో వీణా వాదనమున అతి సమర్థత సంపాదించి చలన చిత్రరంగంలో బొంబాయిలో ఏకైక నిపుణ వైణికునిగా ప్రఖ్యాతి పొందినాడు. అతడు వర్ణాంతర వివాహము చేసికొని మా నాన్నగారి సంకల్పాన్ని ఫలింప జేసి నాడు. ఆయనకు ముగ్గురాడ పిల్లలు ఒక మగపిల్ల వాడు! ప్రథమ పుత్రిక శోభా రాణి గొప్ప సంగీతజ్ఞురాలు! ప్రస్తుతము హై. బా. లో ఆకాశవాణిలో హిందూస్థానీ సంగీత ప్రొడ్యూసరుగా ఉన్నది. ఆమె మామగారు శ్రీ బొటుసాని దేవేంద్రగారు మావారికి Law తరగతులో సహవిద్యార్థి వారి కుటుంబమునకు మాకుటుంబము నకు సాన్నిహిత్యము చాలా మెండు. ఇంక మా తమ్ముడు కామేశ్వరరావు నాగయ్య గారి పోతన సినిమాలో పోతనకుమార్తె లక్ష్మిగా నటించిన వనజా గుప్తను పెండ్లి యాడినాడు. వారికి ముగ్గురు కుమారులు.

మా మామగారు చీరాల వాస్తవ్యులు శ్రీరామయ్యగారి కుమారుడు శ్రీ వేంకటే శ్వరశ్రేష్ఠిగారు. వారికి రెండవ భార్యయైన శ్రీమతి రంగనాయకమ్మగారికి పదముగ్గురు

సంతానము మొదట నల్గురు కుమార్తెలు, తరువాత నల్గురు కుమారులు. తరువాత నల్గురు కుమార్తెలు, కడపటి సంతానము కుమారుడు. మామగారి ప్రథమ కుమారుడైన ఉపేంద్ర గుప్తగారు సాంఘిక, రాజకీయ రంగములలో ఎనలేని ఖ్యాతి నార్జించినారు. వారు గుంటూరు వాస్తవ్యులు. వంకాయల శివయ్యగారి ఏకైక పుత్రిక రంగనాయకమ్మను వివాహమాడిరి. వారికి 14 మంది సంతానము కల్గెను.

రెండవ కుమారుడు శ్రీమావారు హయగ్రీవగుప్తగారు.

మూడవ కుమారుడు హరి ప్రసాద గుప్త. తర్వాత ఆయనకు ఐదుగురు కుమార్తెలు ఒక్క కుమారుడు. భార్య అనసూయమ్మ సావిత్రి సత్యవతి, శారదాంబ అను ముగ్గురు కుమార్తెలు. సావిత్రిగారిని గుంటూరులో ప్లీడరుగా ప్రాక్టీసు చేసి ప్రఖ్యాతినొందిన శ్రీనూకలకృష్ణమూర్తిగారికిచ్చి పెండ్లిచేసిరి. సత్యవతిగారు ప్రసిద్ధ న్యాయవాదియైన శ్రీ కొంకిమళ్ళ నాగభూషణముగారి భార్య. శారదాంబగారు చీరాలకు సమీపమునందలి కడవకుదురు గ్రామమునందలి శ్రీ పొట్టి అమ్మిసెట్టిగారి కుమారుడు బ్రహ్మయ్యగారి సతీమణి.

నా మొదటి ఆడపడుచైన శ్రీమతి తూనుగుంట రామాంబగారి ఏకైక పుత్రుడైన చంద్రమౌళి తూర్పు గోదావరి జిల్లా ఆలమూరు దగ్గర గోదావరిపై ఇదివరకు ముగ్గురు ఇంజనీర్లు కట్టినా నిలువక పడిపోయిన వంతెనను పునర్నిర్మించి గట్టి ఇంజనీరుగా ప్రఖ్యాతి పొందినాడు.

కడపటి కుమారుడు ఊటుకూరి హృషీకేశగుప్త. హృషీకేశుని భార్య విజయనగరమునందలి సుప్రసిద్ధులైన మోటమర్రి పాపారావుగారి కుమార్తె సౌదామిని. వీరికి అర్గురు కుమారులు. ఇర్వురు కుమార్తెలు హృషీకేశగుప్త చీరాలయందు ప్రజానాయకుడుగా ప్రఖ్యాతి పొందినాడు. నిరంతర సేవాసేవి శ్రీమా గుప్తగారికి, నాకు 11 మంది సంతానము. మొదట ఆడ పిల్ల ఆమెకు ప్రమీల అని పేరు పెట్టినాము ఆమెను తీసికొని నేను ప్రప్రథమముగా బాపట్లలో కాపురము పెట్టినాము. ఆమె ఆరు నెలలకే చనిపోయినది. రెండవ సంతానము సుహాసిని, ఆమెకు 1991 అక్టో. 3వ తేదీ నాటికి 55 ఏండ్లు నిండినవి. చిత్తూరు జిల్లా చదుము గ్రామస్థులు శ్రీ పోలేపల్లి గోపాలకృష్ణమూర్తిగారి ప్రథమ కుమారుడు శ్రీహరనాథగుప్తగారితో వివాహమైనది. శ్రీహరనాథ్‌గారు ఏలూరులో అగ్రికల్చరల్ డిపార్టుమెంటులో Asst. డైరక్టరుగా

పనిచేసి 1992 ఫిబ్రవరిలో రిటైరైనారు. వారికిరువురు కుమారులు రాజీవ్ కుమార్, పంకజ్‌కుమార్ రాజీవుడు బాపట్లలో ఇంజనీరింగ్ కళాశాలలో మొదటి సం॥రము చదువుచున్నాడు. రెండవ వాడు పంకజ్ 10 తరగతి. తర్వాత ప్రథమకుమార్డు ప్రతాప్ చంద్ర. అతడు నందూరు గ్రామ వాస్తవ్యులు శ్రీ పల్లి పోతు వేంకటేశ్వర్లుగారి ప్రథమ పుత్రిక ఆదిలక్ష్మిని వివాహమాడినాడు వారికి రంజన్ కుమార్ అనే కుమారుడు కంప్యూటర్ సైన్సు చదువుతూ ఉన్నాడు. కుమార్తె పీణామయి ఇంటర్ చదువుతూ ఉన్నది. ప్రతాపచంద్రుడు పొన్నూరులో ఎలెక్ట్రిక్ రిపేర్ కార్ఖానా నడుపుచున్నాడు.

రెండవ కుమారుడు నరేంద్ర M.E. (మైక్రోవేవ్స్ చేసి కెనడాలో వాటర్లూ యూనివర్శిటీలో P.H D చేసి ప్రస్తుతము కెనడా యందలి టొరేంటోలో ఇంజనీరుగా చేస్తూ ఉన్నాడు. అతని భార్య శ్రీముత్తా వేంకటేశ్వర్లు మహాలక్ష్మమ్మగార్ల కడ పటి సంతానము సౌ. మాలతి. మాలతి మూడవ అన్నగారు శ్రీగోపాలకృష్ణగారు తెలుగుదేశం పార్టీలో పౌర సప్లై శాఖకు మంత్రిగా పనిచేసి యున్నారు. మాలతీ నరేంద్రులకు కొడుకు, కొమరిత. కొడుకు అవనీచంద్ర అత్యధిక ప్రతిభాశాలి. కర్ణా టక శాస్త్రీయ సంగీతము నందత్యంత (కెనడాలో) ప్రావీణ్యము సంపాదించినాడు. చక్కని చిత్రకారుడు. ప్రస్తుతము టొరేంటో విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించు చున్నాడు. కుమార్తె సుస్మితకూడా ప్రతిభావంతురాలే.

మూడవ కుమారుడు విజ్ఞానేశ్వర కుమారుడు ఈతడు కూడ ఫిజిక్సులో P. H D. పట్టము గైకొని భారతదేశములో 2, 3 పెద్ద పెద్ద సంస్థలలో పనిచేసి ప్రస్తుతము అమెరికాలో పని చేయుచున్నాడు.

వైశ్యసంఘమున సుప్రసిద్ధులైన తూనుగుంట్ల రతస్వామి ఎడ్వొకేటుగారి కడపటి కుమారుడు నిరంతర సేవా పరాయణుడు, వైద్య విద్యానిపుణులు, శ్రీ తూను గుంట్ల బాలగంగాధర తిలక్‌గారి కనిష్ఠపుత్రిక అరుణజ్యోతి M S. విజ్ఞానేశ్వరు నకు వివాహమైనది. వారికి ఇద్దరు కుమార్తెలు పెద్దకుమార్తె పల్లవి విద్యాభ్యాసంలో ప్రతి భావంతురాలు! అమెరికాలోని విద్యా సంస్థలలో కూడా గణనీయమైన మార్కులు సంపాదించి తనతోటి విద్యార్థినులలో మేటి అనిపించుకొంటూ ఉన్నది రెండవ కుమార్తె జాహ్నవి.

నా పెద్ద కుమార్తె సుహాసిని తెలుగు M. A. లో విశ్వవిద్యాలయ తృతీయ స్థానము పొందినది. వీణా వాదనమున కడునిపుణురాలు ఏలూరులో సెయింట్ తెరిస్సా కాలేజీలో తెలుగు Head of the D.P.T గేను నాటక రచనలో అందె వేసినచేయి సాహిత్యోపన్యాసములు సాంఘికోపన్యాసములు ఇచ్చుటయందు ప్రజ్ఞా వంతురాలు.

ఇక నా కడపటి సంతానము మైథిలీ బాలాజీ M. Com చదివినది. ఏలూరు వాస్తవ్యులు ప్రసిద్ధకవి వరేణ్యులు శ్రీ బొడ్డు బాపిరాజుగారి అన్నగారి కుమారుడైన బొడ్డు వెంకటసుబ్బారాయుడుగారి రెండవ కుమారుడు శ్రీ బొడ్డు సురేశ్ బాబుతో వివాహము జరిగినది.

వారిద్దరు ప్రస్తుతము తెనాలిలో వైశ్య బ్యాంకులో మైధిలియు స్టేట్ బ్యాంకులో శ్రీ సురేశ్ బాబుగారును పనిచేయుచున్నారు. తెలివితేటలయందును నిజముగా మనోజ్ఞమైన అంజనా వాసవీ మనోజ్ఞయు ప్రశాంతపవన కుమారుడును వారి సంతానము ఇంతటితో చాలావరకు నా కుటుంబ విషయము సంగ్రహించినట్లే.

## మధురేణచ మంగళేనచ సమాపయేత్

ఇక ఈ జీవిచరిత్రోదాంతపు లేఖనోద్యోగము. ముగిసినట్లే.

ఇంతవరకు నేను ఈ యీ కావ్యములను రచించినానని యుల్లేఖించుటయే కాని ఏ ఒక్క రచనమునుండియు ఒక్క యుదాహరణమును ఈయలేక పోయితిని.

'లజ్జాకిరీట ధారిణి' యను ఖండకావ్యము నందలి మొల్ల ఆత్మనివేదనము నందలి కొన్ని పద్యములను ఈ క్రింద నిచ్చుచున్నాను.

"పతిత పావనగుణధామ! భవ్యనామ!
కలుష భారమ్ముతో ధాత్రి కలగిక్రుంగ
నెన్ని విధముల బోధ గావించినాడవో
సృష్టికిని ప్రేమ మరసియు సిరివిభుండ
అయిననే మాయె తంత్రి నేడవనిలోన
పెరిగి, యసుర భావమ్ము పిచ్చటిల్లి

వికృత కర్కశనిరశదంష్ట్రికలు సాచి
నగ్ననృత్యమ్ము సల్పుచు నవ్వుచుండె
నరులు మానవభావమ్ము మఱచి, దాన
వత్వమునె కోరి స్వార్థులై పరగుచుండ్రి
ధనమునకు దాసులై తాము పెనగుచుండ్రి
నటనయే జీవనపథమగుచు నడచుచుండ్రి
వేగిపోయి పరస్పర ద్వేషవహ్ని
తప్పిసుఖశాంతులకును, సోదరజిఘాంస
మతము పేరిటి ఛత్రమ్ము మాటుకొనుచు
మాకళంకములెల్ల నీ మతమటంచు
కళలవెనుక దుర్వృత్తిని కప్పుకొనుచు
మృగముల విధాన, సంఘాన మెలగుచుండి
స్వార్థవృత్తిని, నొండొరు చంపుకొనుచు
నిలను పీనుగుపెంట గావించినాము
అఘము చేసియు శాస్త్రోక్త మనుటనదె
పావనము, రామరాజ్యమన్ ప్రథితమగుచు
నీదురాజ్యము ప్రాజ్యమై వెగడెనయ్య
మాది రామరాజ్యము చూడు మనుచు మేము
మురియుచుంటిమి, అవినీతి పరులమగుచు
ఇట్లు చూచుచు కిమ్మన వేమిస్వామి!
నాకు మీరిన దిదియని ఊకొనదవా!
ఏలయీ మౌనముద్ర! మమ్మేలుకొనగు
ఒక్కసారి విచ్చేసి మమ్ముద్ధరింపు

ఈ విధముగా సుమారు ముప్పది వర్షములక్రితమే మన దేశమునందలి అస్తవ్యస్తస్థితిని గూర్చి నేను ప్రస్తావించి యుంటిని.

ఆదేశజ్ఞాకిరీట ధారిణి కావ్యమునందలి 'మాతృశ్రీ కస్తూరిబా' అను మకుటము నందలి రెండు పద్యములు.

భారత నారీగర్వము
ధీరంబై పురులు విప్పి దిక్కులు మెఱసెన్
సారం బౌనీయునికిని
గౌరవమింతులకు నీవు కస్తురిమాతా॥
కల్లోల సాగరగర్భాన పయనించు
చల్లని నౌక నీసాధువృత్తి!
పాషాణమయ శైలవంక్తిని ప్రవహించు
చిఱుసెలయేరు నీ చిత్తకాంతి!
ప్రళయ ఝంఝూరటత్స్వనాన వినిపించు
మంజుల గీతి నీ మాన్యచరిత!
కఠినశిలా తతిన్ గరువాన వికసించు
సన్నజాజియగు నీచలువమనసు
నియమ పరతంత్రుడౌ పతి నీడనీదు
మనికి, మధుర గంభీరమై వినుతికెక్కె
అమ్మ కస్తూరి నుతియింపనలవియౌనె
తల్లి భరతాంబ నిన్గని ధన్యయయ్యె

ఇక నా తెలుగు మాంచాల కావ్యమునుండి మాంచాల బాల చంద్రునకు పౌరుషము కల్గించు సందర్భమునందలి పద్యములు.

"కొంగు విడువుము ధూర్తుడా కొంగువిడుము
అంగనలజేరి సంగ్రామ భంగిమలచి
మదనపూజలు దేర్చెడి ఆదవిదియని
చౌరవ మాంచాల సదనమ్ము చొరబడితివొ
కొంగు విడువుము ధూర్తుడా (బాలుడా) కొంగు విడుము"

## న వ చా మ ర ము

అవక్రవీర విక్రముండవై అనన్య జన్యనాయకుండవై
పవిత్ర భారతీయ పుత్త్రికుండవై పరాక్రమోజ్జ్వలుండవై

భవాంబురాశిదాటు యోచనన్ బలంబుగా దలంపదేమిరా
అవాంఛనీయమౌ హవల్లి ద్రెంచి ఆహవమ్ము కేగరాదొరా

ఇక మాంచాల సతియైనట్లు వర్ణించిన వర్ణన

సతియయ్యె మాంచాల ! వీరసతియయ్యెనే
నా తెలుగు మాంచాల ! నీతి యుతపతిశీల
నవరాగ మణిమాల ! స్తవనీయగుణలోల
సతియయ్యె మాంచాల సతియయ్యెనే
నా తెలుగు మాంచాల ! నాటెంపు పతిశీల !
మందారసుమమాల! అందాల ఆధిహేల
మా మగువ మాంచాల ! మహనీయ రణకేళి
సతియయ్యె మాంచాల ! వీరసతియయ్యెనే !
మాంచాల దేహమ్ము మంటలోపల పొగిలి
కుమిలి బూదియయ్యె ! రగిలిర క్తమదాల్చె !
మాంచాల ఘనకీర్తి ! మంటతో తా గలిసి
మింటికెగసెనుగాదె ! మంటికిని మింటికిని
మణిదీపమై వెలిగె ! అవనిలోమగనాంధ్ర
ధ్రువతారగా మిగిలి ! అపుణ్యసతి బూది
ఈ భువిని వెలదులకు । వెలుగుల ప్రోదియయ్యె
తెలుగు జాతికిమించు ! వెలుగు పతాకయయ్యె
వెలలేని తులలేని ! కీర్తినికి పాదయ్యె॥

భక్తి గేయ కావ్యమైన 'కాంతి శిఖర' కావ్యము నుండి :-

ఎందుకో నా మనస్సెందుకో
నిను తలచి పులకించు॥ ఎం॥
ఎందుకో నా మనస్సెందుకో
నిను తలచి పులకించు॥
నీ గుణము మాధనము
నీ చరితమాకవిత

నీ త్యాగమే గానమై
ఎదల సుహ్వాగించు ॥ ఎం॥

నీ ప్రకృతి మానుకృతి
నీ వినుతి మా ప్రగతి
నీ నుతియె సుగతియై
బ్రమకు పండించేను ॥ ఎ॥

ఇంకొక గీతము :

కరుణ లేక మనగలనో। ప్రభూ, నీ
కరుణ లేక మనగలనో॥

అరుణారుణమౌ హస్త పల్లవము నీదడగాక మనగలనో! ప్రభూ: నీ కరుణలే
జాతి యెద జీవములు చిలికి
నా తిని జేసిన నీ కృపకై
ప్రీతిని పాతరలాడక, ఏ
బ్రాతిని నేనిక మనగలనో॥ క॥

ఇంకొక భక్తి గీతం

ఏలికవు నీవు ప్రభూ

ఈ నిఱుపేద జీవికకు ఏలికవు నీవు ప్రభూ
ఈ చిఱు గుండె వలచు ప్రణయ మాలికవు ప్రభూ॥
నీ మృదు పాదవరి వస్యవరవశింపగ నీవె ప్రభూ॥
నీ ప్రేమ సన్నిధి నొడలు పులకరింపగనీవె ప్రభూ॥
ఈ కమల కోరకము వెలుగు కిరణ మాలికవు నీవు ప్రభూ॥
ఈ శీర్ణ జీవిత రేఖ దిద్దు వర్షతూలికవు నీవు ప్రభూ॥

'మన సాహితి మధుభారతి' అనే ఖండకావ్యంలో 'అది ఒక గడ్డి పువ్వు' అనే మకుటంలోని గేయం :—

అది ఒక గడ్డి పువ్వు। అందానికిపై వడ్డీగ
ఆనందాన్ని రువ్వు। అది ఒక గడ్డి పువ్వు

జనపథంలో, ఘనపదంలో
తల ఎత్తుక నవ్వు!
మనసు గల్గు మానవాళి
గుండెలపై కొన గోటిని రివ్వు
అది యొక గడ్డీపువ్వు

ఇక దేశ భాషాగేయం ఒకటి

'మ సాహితి-మధుభారతి' అనే ఖండ కావ్యం నుండి

మన సాహితి, మధుభారతి
తెలుగు జాతి ఘనకీరితి
తెలుగన్నను, వెలుగన్నను ఒకజేయని
ప్రకటించిరి, మనవారలు, పెరవారలు.
తెలుగన్నను, తేనెయనిన, తియ్యదనము, తియ్యదనము
తెలుగన్నను తెలివియనిన, తిన్నదనము, మిన్నదనము
తెలుగన్నను దీప్తియనెదు, తృప్తి గనిరి ఘనులందఱు
మధురాంధ్రము మహనీయము,
మాధుర్యపు సారధ్యము మనభాషకె
మాధుర్యపుటాధ్వర్యము
మనవాణిదె. మనవాణిదె

ఈ విధమైన గేయ వచన ఛందోబద్ధ కవితలతో సంస్కృత కవితా సుమములతో నాయోపిన కొలదీ తెలుగు సరస్వతి కొలువున నిలిచి, ఆ మహావాణికి అర్చన అర్పించితిని

మంగళ వాచకముగా 1998 ఏప్రియల్‌లో కనకాభిషేక సమయమున నా కుమార్తె సౌభాగ్యవతి సుహాసిని వ్రాసిన గేయముతో సాహితీ రుద్రమ అను పేరున నేను వ్రాసిన ఈ స్వీయ చరిత్ర ముగిసినట్లే.

సర్వేశ్వరుడు, సర్వమయుడు నైన పరమేశ్వరుని సృష్టియందు మానవసృష్టి సర్వశ్రేష్ఠమైనది అతిసుదుర్లభమైన మానవజన్మ లభించుటయే ఒక వరప్రసాదము అట్టి జన్మ లభించిన మానవజాతి, సత్యాహింసానియమము, అస్తేయమూ పరహింసా ప్రపూర్ణమైన పాపాచరణ త్యాగము, సృష్టికి శ్రేయో విధాయకమైన పుణ్యాచరణము, అమృతత్వమును ప్రసాదించు త్యాగపూర్ణమైన కర్మాచరణమును, నీతి, నియమ పాలనము, సర్వసృష్టికి అవశ్యకమై, సర్వజాతి మత వర్గములను సమానత్వముతో సంరక్షింపగల ధర్మపాలనములతోపై సుగుణ సంపత్తితో కూడిన ప్రవృత్తిని ప్రసాదించు దైవభక్తితో శాంతిమయమైన సుఖజీవనమును గడుపుట, అత్యంతావశ్యకమ్ము

సృష్టి సంకల్పము కలుగగనే తన అంశమునే సనాతనమైన, జీవవిభూతిగా జీవలోకమున ప్రవర్తింపజేయుటకై సృష్టికార్యమునకు పూనుకొనిన భగవదుద్దేశమును, మానవ జాతి, తన జీవితము నందు, అనువర్తింపజేయుచు గడుపుటయే మానవులజాతికి బాధ్యతాయుతమైన కర్తవ్యము!

శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీత యందు "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనం" అని కొనుటలోని పరమార్ధమిదియే "త్యాగేనైకే నామృత మశ్నుతే అను మహావాక్యము శ్రీరామావతార సర్వలక్షణ మగుటయు త్యాగపూర్ణమైన ధర్మాచరణమే మానవజీవన కర్తవ్యమును మానవజాతికు పదేశించుటకే ఆవర్శవంతమైన మానవజాతిలో జన్మించి మానవసేవయే మాధవసేవ అను తారక మంత్రానుసారము సేవా జీవితమును తన కర్తవ్యముగ స్వీకరించి, జీవితమును గడపలేక పోయినచో నదియే పాపాచరణము! పుణ్యము నాచరింపలేక పోయినను పాపాచరణము నుండి యైనను తప్పించుకొని చేతనైనంత వరకు ఈశ్వర సంకల్పానుసారము ధర్మ ప్రవృత్తితో జీవితము గడుపవలెనను పరమోద్దేశమే నా జీవిత ధ్యేయమై ఆయా సంఘటనల పట్ల నన్ను ప్రేరేపించి నడపినవి, అంతేతప్ప నా జీవితగనమందు నా ఘనత ఏమియు లేదు. ఆ ఉద్దేశముతోడనే ఈ నా

స్వీయ చరిత్రను నా యిష్టదైవమగు శ్రీరామ చంద్రుని పాదారవిందముల కడపూజా పుష్పముగ వినమ్రాంజితో నర్పించుకొనుచున్నాను.

# కళాభారతికి, కళాప్రపూర్ణకు కనకాక్షరాభిషేకము

రచన : కుమార్తె పోలేపల్లి సుహాసిని, ఏం. ఏ
ఆంధ్ర శాఖాధ్యక్షురాలు
సెయింట్ థెరిసా మహిళా కళాశాల ఏలూరు

వేదిక అనంతపురం - లలితకళా పరిషత్తు 10-4 1988

సరస సంగీత సాహిత్య సాంస్కృతిక తోరణం.
రాజమహేంద్రపుర కృష్ణరావ్కవి ప్రాంగణం.
అది యొక సరస్వతీ సామ్రాజ్య హేల,
అది యొక ధనలక్ష్మి సామ్రాజ్యలీల.
ఆయింట విరిసిందొక అపూర్వకుసుమం;
సుశీలా కృష్ణరావుల పూర్వజన్మఫలం.
పుట్టినది మొదలు వ్యాపించింది అనుపమ పరిమళం.
అపురూప విజ్ఞాన విలసితం ఆమె జన్మం.
సకలకళా నిష్ణాతృత్వం ఆమె స్వంతం
సర్వశాస్త్ర సారం ఆమె జీవనసారం.
కరతలామలకం ఆయమకు గీతాసారం
సరస వాగ్ఝరీ ప్రవాహం ఆమె భాషణం
మధుర గంభీరయుతం ఆమె శారీరం
ఆమెయే ఆలనాటి కృష్ణకుమారి
ఆమెమే ఈనాటి లక్ష్మికాన్తం
ఆమె కామెయే సాటి ఉపన్యాస కళలోన
ఉత్తమ మహిళయామె మహిళాలోకాన
ఉవిద నడిపింది ఉద్యమాల నెన్నో

ఋజువు చేసింది అబల సబలయౌనని
స్వర్ణ కంకణ గ్రహీత స్వర్ణ మణియామె
దేవీ సాక్షాత్కార పునీత వరదేవియామె.
బిరుదుల నెన్నో పొందింది విదుషీమణియై
కావ్యముల నెన్నో వ్రాసింది మధురకవి పుత్రికయై
కవితల్లింది ఉభయ భాషలలోన ఉభయ భాషా ప్రవీణయై,
ఘన సమ్మానముల నెన్నో పొందింది మానవతియై
ఎన్నెన్ని జన్మల పుణ్యమో ఎన్నెన్ని జన్మల తపఃఫలమో
లభించింది ఈనాడు లక్ష్మీకాంతమ్మకు
సమ్మానాలకే తలమానికం కనకాభిషేకం.
అలనాడు జరిగెలే కనకాభిషేకమ్ము
రంగారు బంగారు కవితల రంగాజీకి
ఈనాడె జరిగెలే కనకాభిషేకమ్ము కళా ప్రపూర్ణ కును.
ఇలలోన ఈ శతాబ్దిలోన,
అపూర్వం, అద్భుతం, ఒక కాంతకీ సత్కారం
కళాభారతికి కళారాధనం
లసత్కాంతుల లక్ష్మీకాంతమ్మకు అక్షరార్చనం.
దీనార టంకాల తానమాడును తెలుగు మొలక
ఉన్నతంబుగ వెలుగు ఉభయ భారతి యామె
సరసవాక్పటిను చెలువొందు ఆంధ్ర సరస్వతి యామె
కవిసార్వభౌము ప్రౌఢ వాక్పటిమయు,
అల్లిక జిగిబిగుల అల్లసాని పెద్దనయు.
ముద్దులొలుకు పలుకుల ముక్కు తిమ్మనయు,
అతులిత మాధురీ మహిమల ధూర్జటియు,
సరసవాక్చాతుర్య ధుర్య రంగాజీయు,
రామకథా కావ్యగాన ధురీణ మొల్లయు,

సాహితీ రుద్రమ

తేనెలూరు తేట తెలుగుల కృష్ణరాట్కవియు
కలబోసి రూపొందె లక్ష్మికాంతముగను.
తగునులే ఈ సమ్మానమ్ము లలనా శిరోమణికి
హైందవ ధర్మ ప్రచారిణికి, బ్రాహ్మిభూషణికి
సాహితీ రుద్రమ్మకు, సంగీత కళానిధికి
ధన్యమాయెనుగా నేడు ఆమె చారిత్రమ్ము
కనకాక్షరాల లిఖియింతురుగా ఆమె నామమ్ము
అందుకొందువుగాక సరస్వతీ సామ్రాజ్య సామ్రాజ్ఞీ పదమ్ము
దివినుండి కురిపింతురీరోజు పుత్రిపై
పన్నీటి జల్లుల్లు నీ తల్లి దండ్రుల్లు
నీదు ఉన్నతికి కారకుడు నీదు పతి దేవుడు
ఇచ్చుగాక ఆశీస్సులు నీ కెప్పుడు.
తరియింతుమ్మ మేము నీదు సంతానమ్ము
కన్నులార కాంచితిమి కనకాభిషేకమ్ము
దక్కనదిలే యీ ఘన గౌరవమ్ము
అనంతపుర సాహితీ రసికులకు
పరమ ధార్మికులు, పరమపూజితులు రాధాకృష్ణ దంపతులు.
ఇలను వెలసిన పార్వతీ పరమేశ్వరులు
జగమెల్ల మెత్తురులే ఆదిదంపతులను
భగవాను డిచ్చుగాక దీర్ఘాయువులు వారికిని
సర్వేశుడిచ్చుగాక పూర్ణాయువును లక్షీకాంతమ్మకును.

వినమ్రతతో
భవత్పుత్రి
సుహాసిని

10-4-1988

సాహితి రుద్రమ

## ఇంతుల శౌర్యసేష్టి

రుద్రమ్మ దిద్దినరుధి రాక్షరపు పంక్తి

  కాల వాహినలోన గలసిపోయె!

చాంద్బీ త్రిప్పిన చండఖడ్గపు ధార

  త్రుప్పు పట్టుచు తునాతునకలయ్యె!

రాణి యహల్య దౌ రమ్య పాలనమ్మును

  ధారుణిందలచెదు వారు లేరు!

గంగమ్మ మలచిన ఘనయుద్ధ పాండితి

  మధుర వీధులలోనె విధురమయ్యె!

జీజిబా గుడిపిన చేవలు దీర్చెదు

  వీర్యం పుటుగుబాలు విఱిగిపోయె!

మాంచాల యిడినట్టి మగువ ఖడ్గమునేడు

  మొక్క వోయయు పెనుముక్కలయ్యె

తల్లి వాసవి యొక్క త్యాగవై భవమిల

  పొల్లు వోవుచు నెంతో పుల్లవడియె

కానమ్మ నెఱపిన సాహస వృత్తమ్ము

  మట్టిలో పొర్లాడి మాగువడియె

తజ్జిగి సౌశీల్య ఘనశక్తి తీవ్రత

  మెత్త మెత్తగ నా చ జిత్తవోయె!

కస్తూరి యిడిన యా రక్త తిలక

  పూజ్యతన్ వాసనల్ పులుముకొనియె

సాహితీ ధ్రువ

కవి సరోజినిదైన భువ దేశభక్తిలో
రమ్యగుణ స్ఫూర్తి రాలిపోయె

ఇందిరింతుల శౌర్యరవేష్టినేడు
భరత మహిళల నా వేళ పలిచెనేవి

మాతృ భారతి దుఃఖమ్ము మా యునిజము
ప్రజల క్షోభలు బాయుట నిజము నిజము

మంగళా చరణ శ్లోకంగా :-

"కుసుమ శ్రేష్ఠి పుత్రికాయై శుభాత్మనే శుభాత్మనే
విద్యామయ్యై వికాసాయై విశ్వాయై జయమంగళం॥

ఓం-తత్సత్

సర్వేజనా స్సుఖినోభవంతు
సమస్తసన్మంగళానిభవంతు

....0....

## UTUKURI LAKSHMIKANTHAMMA

Vijaya Lakshmi Puram
Bapatla, A.P. 522 101
Phone: (86232) 4105

Date of Birth 21st Dec. 1917

Parents Madhurakavi Sri Nalam Krishna Rao (Founder - Gowthami Grandhalaya)

Smt. Nalam Suseelamma (Founder President of Andhra Mahila Ganasabha)

Education Ubhaya Basha Praveena

Husband **Sri Utukuri Hayagreeva Gupta**, Advocate

## WORKS:

| | | |
|---|---|---|
| 01. | Andhra Kavayitrulu | Awarded FIRST PRIZE by the Telugu Bhasha Samiti, 1953 |
| 02. | Akhila Bharatha Rachayitrulu | Published by the Sahitya Academy, 1963 |
| 03. | Andhrula Keertana Kala Seva | |
| 04. | Sri Kanyaka Parameshwari Suprabhatam | Sanskrit Kavyam |
| 05. | Devi Stava Taravali | Sanskrit Kavyam |
| 06. | Jathi Pitha | Sanskrit Kavyam |
| 07. | Sadukti Manjar | Versatile translation of Hindi Dohas written by Kabir, Tulasi Binda Rahim. |
| 08. | Bharatha Desa Charitra, Konni Gunapathamulu | Translation of Humayun Kabir's English Essays |
| 09. | Kanti Sikharalu | Devotional Songs |

| | | |
|---|---|---|
| 10. | Mahila Vikrama Suktam | |
| 11. | Mana Sahiti Madhu Bharathi | GeyaKavyam |
| 12. | Kanyakamma Nivali | Satirical Pada Kavyam |
| 13. | Mahila Vikrama Suktam | Geya Kavyam |
| 14. | Okka Chinna Divve | Geya Kavyam |
| 15. | Na Telugu Manchala | Geya Kavyam |
| 16. | Lajja Kireety Dharini | Kanda Kavyam |
| 17. | Na Videsa Paryatana Anubhavalu | Experiences of Foreign Tours |
| 18. | Essays on Variety of Topics in Vignana Sarwaswam | Edited by Telugu Bhasha Samiti |
| 19. | Essays on Variety of Topics in Sangraha Andhra Vignana Sarwaswam | |
| 20. | Saraswati Samrajya Vybhavam | One Act Play |
| 21. | Sahiti Rudramma | Life History |

## FICTION

22. Korala Madhdyana Koti Swaragalu
23. Chikati Rajyam

## UNPUBLISHED BOOKS

01. Story of Chandramati
    (for Children, to be published by Tirupati Devastanam)

02. Sahitya Vyasa Manjari

03. Rutambari — Vachana Geya Kavyam

## BOOKS EDITED

01. Molla Ramayanam
02. Vishnu Parijata Yaksha Ganam

## BOOKS COMPLETED

01. Krishna Rayandhara Sahitya Vignana Sarwaswam

02. Mana Andhra Rachayitrulu
Complete set of works taken by Toronto Central Library, 1990.

## PREFACE CONTRIBUTIONS

In over 1000 books of different authors

## TEXT BOOK SELECTIONS:

01. Poetry piece taken by Bangalore University for B.A. Telugu Text Book.

02. Poetry Piece, "Rana Suktam" taken by Andhra University for B.A. Telugu Text Book.

03. Sri Nanduri Ramakrishnamacharya selected my poems in his collection work "Veyyendla Telugu Pandyam" (a project of Telugu Academy)

04. Sri Poli Veera Raghava Reddy, Director of A.P. Branch of Kendra Hindi Vidya Samsthan selected my poems to translate from Telugu to Hindi.

05. A piece from Na Telugu Manchala was taken by "Telugu Paluku" published from Loss Angeles.

## RESEARCH WORK ON MY LITERARY CONTRIBUTIONS

Recently Smt. T. Surya Kumari, Telugu Lecturer of T.J.P.S. College of Guntur is started Ph.D. work on my works at Nagarjuna University.

## PUBLIC SPEAKING

Well over 3,000 speeches delivered on various subjects covering Telugu literature and Hindu Religion.

## FOREIGN TOURS

01. As a delegate of Cultural Department of Government of India on the eve of Jubilee Celebrations: visiting Germany, Czechoslovakia and U.S.S.R.

02. As delegate of Andhra Pradesh Government - Second Telugu World Conference, Malaysia.

03. Canada Tour, June 1990.

## AWARDS AND FELICITATIONS

| | | |
|---|---|---|
| 01. | 1953 | Awarded by Telugu Bhasha Samiti for the book Andhra Kavayitrulu |
| 02. | 1953 | Grihalakshmi Kankanam |
| 03. | Felicitation | By Kavitraya Jayanti |
| 04. | Felicitation | By Molla Jayanti Committee |
| 05. | 1971 | Felicitation by All India Telugu Writer's Association |
| 06. | 1974 | Felicitation by First World Telugu Conference |
| 07. | 1975 | Felicitation by Chennapuri Andhra Maha Sabha |
| 08. | Gift | Gold Box given by Atmuri Lakshmi Narasimham Somayaji Vysya Sangham, Masula. |
| 09. | 5 Gold Medals | Veena Playing & Debating Competitions |
| 10. | 1975 | A.P.Sahitya Academy Fellow Membership |
| 11. | 1976 | Andhra University KALA PRAPOORNA Title |
| 12. | 1981 | Sannad awarded by Tamil Nadu Vysya Sangham |
| 13. | 1983 | Tikkavarapu Sudarsanamma Award |
| 14. | 1984 | Sussela Narayana Reddy Award |
| 15. | 1986 | Two Awards by Telugu Viswa Vidyalayam: one for the Best Book Na Telugu Manchala |
| 16. | 1986 | KAVI PRABHA Viswanatha Satyanarayana Award |
| 17. | 1987 | Korukonda Lingamurty Award |
| 18. | 1988 | Kanakabhishekam - held at Anantapuram by K. Radhakrishna and Sakuntalamma Foundation. |
| 19. | 1989 (May) | Erranna Peetham Award (Visistha Sanmanam) |
| 20. | Felicitation | Felicitation by Sanskrit Prof. Venkatachary of University of Toronto, Canada, July 1990. |
| 21. | 6th March 1993 | Telugu Velugula Award in memory of Sarojini Naidu by Kala Bandu Sri T. Subba Rami Reddy on behalf of Kalashetram. |

## TITLES

01. Andhra Saraswati
02. Vidwat Kavayitri
03. Andhra Vidushe Kumari
04. Telugu Molaka
05. Dharma Prachara Bharati
06. Brahmee Bhushana
07. Sahiti Rudrama
08. Kala Prapoorna
09. Kala Bharati
10. Sangita Sahitya Kalanidhi
11. Pandita Bharati
12. Apara Vagdevi

## SPECIAL RECOGNITIONS

| | | |
|---|---|---|
| 01. | 1982 | Life sketch taken for publication by Institute of National Historical Studies, Calcutta, branch of India. |
| 02. | 1985 | Life sketch taken for publication by Cultural Affairs Department, Andhra Pradesh Government. |
| 03. | | State Government of Kerala has recently taken my bio-data to publish in the History of World Literature. |
| 04. | 1969 | Gajarohana Mahotsavam held at Appikatla - Organised by Mahakavi Sarva Sri Tummala Sitarama Murty and Kakaraparti Venkateswarlu, with Sri K. Rosaiah as the Chief Guest. |
| 05. | 1992 | On March 3rd Telugu Viswa Vidyalayam made a documentary about my life. |

## SPECIAL SERVICES

## CONFERENCES

01. Secretary - Akhila Bharata Rachayitrula First Conference, sponsored by A.P. Sahitya Academy
02. Convenor: 1966 - 1976, conducted Akhila Bharata Rachayitrula Conferences in different districts of Andhra Pradesh for a period of 10 years.

## SPECIAL CEREMONEIS

01. 1948 - Conducted the 60th Birth Day (Sasthipurti) function of Smt. Battula Kamakshamma, Principal of Andhra Women's Sanskrit College, Rajahmundry.

## FUNDS COLLECTION

01. Rs.35,000/- collected for Andhra Women's Sanskrit College of Rajahmundry.
02. Collected Rs.25,000/-for Akhila Bharata Rachayitrula First Conference in the capacity of Secretary.
03. Fund collection for Vishwa Hindu Parishad.

## LITERARY TOUR

Nationwide tour - 1963: toured India for contacting Akhila Bharata Rachayitrulu.

## COLLEGES

1969 - '71: Conducted Sanskrit College for women in Bapatla for two years.

## ENDOWMENT AND SPECIAL AWARDS:

01. Established Madhurakavi Nalam Krishnarao Vignana Pitham, January 1988.
02. Rs.5,000/- Endowment award given to Telugu Viswa Vidyalayam in the name of Madhurakavi Nalam Krishna Rao.

## MEMBERSHIPS

| | | |
|---|---|---|
| 01. | Fellow Member | Andhra Pradesh Sahitya Academy |
| 02. | Member | A.P. Balala Academy |
| 03. | Member | Telugu Bhasha Samiti |
| 04. | Regional Working Committee Member | Vishwa Hindu Parishad |

| | | |
|---|---|---|
| 05. | President | Kala Bharati, Bapatla |
| 06. | President | Bhavapuri Sangitha Sabha |
| 07. | Member | Gorantla Venkanna Trust Board, Andhra Mahila Gana Sabha, Sanskrit Advisory Board, Guild of Service, Bapatla, Bapatla Taluk Tufan Relief Committee. |
| 08. | Working Committee Member | A.P. Arya Vysya Maha Sabha, Andhra Yuvati Sanskrita Kalasala, Rajahmundry. |
| 09. | Permanent Member | Gowtami Grandhalayam, Rajahmundry A.P. Arya Vysya Maha Sabha. |
| 10. | Patron | Saraswata Niketanam, Vetapalem. |
| 11. | President | Sthree Hitishini Mandali, Bapatla |
| 12. | Vice President | A.P. Mahila Mandalula Samakhya |

## EX-MEMBER

01. Andhra University Senate, Waltair
02. All India Radio Advisory Committee
03. A.P. Sangeeta Academy
04. A.P. Social Welfare Advisory Committee
05. President, Bapatla Women's Co-op Cottage Industries
06. President, Andhra Rachayitrula Advisory Committee
07. Central Sahitya Academy

## SPECIAL FEATURES

01. "Na Telugu Manchala" written by me, has taken as Text Book to Special Telugu B.A., by St. Theressa's College of Eluru.

## MAIN SPEECHES

01. 11, Speeches at Andhra University, Waltair.
02. 6, Speeches at Vijaya Nagaram Colleges, and Public Functions.
03. 10, Speeches at Anakapalli in Sarada Grandhalayam, and Mahila Mandals etc.
04. 20, Speeches at Rajahmundry in Andhra Yuvathi Sanskrit College and in Public.

05. 15, Speeches at Eluru in St. Theressa's College and Public.

06. 6, Speeches at Vijayawada - in High Schools and Public.

07. 10, Speeches at Bhimavaram - Colleges, and Mahila Mandals.

08. 10, Speeches at Machilipatnam in Colleges, Mahila Mandals and Public.

09. 20, Speeches at Guntur, in Hindu College, A.C. Colleges, High Schools and in Public.

10. 12, Speeches at Narasaraopeta in Colleges and Public.

11. 25, Speeches at Rajahmundry in Andhra Yuvathi Samskruta Kalasala and Public.

12. 10, Speeches at Kakinada in P.R. College and in Public.

13. 10, Speeches at Nellore.

14. 40, Speeches at Tirupathi arranged by T.T.D. in Colleges, High Schools.

15. 6, Speeches at Bangalore.

16. 6, Speeches at Madras.

17. 5, Speeches at Mysore.

18. Speeches at - Dhavanagere, Chikkamangalore in Karnataka.

19. 8, Speeches at Vetapalem in Grandhalayam.

20. Nearly 3 Hundred or 4 Hundred Speeches at Bapatla.

## OCCUPATIONS AT BAPATLA

| | | |
|---|---|---|
| 01. | President | Stree Hithaishini Mandali |
| 02. | President | Kala Bharathi |
| 03. | President | Bhavapuri Sangeeta Sabha |
| 04. | President | 'Madhura Kavi' Nalam Krishnaraya Vignapeetham |
| 05. | Member | Mahila Kala Sala |
| 06. | Member | Guild of Service |
| 07. | Life Member | Ramakrishna Misson |
| 08. | Life Member | Kanyaka Parameswari Devasthanam |
| 09. | Life Member | Arya Vysya Kalyana Mandapam, Bapatla |
| 10. | Life Member | Rotary Kalyana Mandapam, Bapatla. |



VISWATYPE